# మహాత్మాజీ

డెబ్బదియవ జన్మదిన ప్రచురణ.

అనువాదకుడు :

ముదిగంటి జగ్గన్నశాస్త్రి, బి. ఏ.,

పల్లెటూరు గ్రంథ మండలి,

తణుకు.

ది ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ (రిజిష్టర్డు)

బ్రాంచి : రాజమండ్రి

మొదటికూర్పు 1000 ప్రతులు.

౧౯౪౧

 [వెల రు 1—8—0




# పీఠిక

మహాత్ముని గురించియు నతని యుద్యమమును గురించియు తెనుగున ననేక గ్రంథములు బయల్వెడలినవి. పద్యములు, గీతములు, ద్విపదలు, నాటకములు, హరికథలు, పురాణములు, బొబ్బిలిపాటలు, వచనములు, తర్జుమాలు—ఇక నెన్నియో కలవు. కాని యీ యుగపురుషుని జీవితమును చిత్రింప నెన్ని గ్రంథములైనను చాలవు. మహాత్ముని వార్షికోత్సవములాసేతు హిమాచలపర్యంతమే కాక ఖండ ఖండాంతరములలోగూడ కోటానుకోట్ల ప్రజలచే కన్నుల వైభవముగ, ప్రపంచ పర్వదినముగ జరుపబడుచుండును. ఇక నతని డెబ్బదియవ జన్మదినోత్సవమును గురించి వేరుగ చెప్పనవసరము లేదు.

ఆచార్య సర్. యస్. రాధాకృష్ణనుగారు ప్రపంచ విఖ్యాతే పురుషులచే నీ యమూల్య వ్యాసావళిని వ్రాయించి గాంధీజీ సప్తసతి వార్షికోత్సవ సందర్భమున వారికి కానుకగ సమర్పించి ప్రపంచమున కమూల్యసేవ చేసిరి.

దానిని తెనుగున ననువాదము చేయుటకు నా కనుజ్ఞ యిచ్చిన యాచార్య సర్. యస్. రాధాకృష్ణనుగారికిని, నాయందవ్యాజకరుణ యాయనుజ్ఞను నాకిప్పించిన డాక్టరు పట్టాభి శీతారామయ్యగారికిని నా కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను.

ఇందు దొరలిన యచ్చుతప్పులను, ఇతర దోషము లను పాఠకులు మన్నింప గోరెదను. కొద్ది వ్యాసములు తగ్గింప బడినవి. ఆంధ్రపాఠకుల ప్రోత్సాహముతో వీనిని రెండవ ముద్రణములో సవరించుకొనగలనని యాశించుచున్నాను.

అనువాదకుడు

**ముదిగంటి జగ్గన్నశాస్త్రి.**

# వి షయ సూ చి క



# పరిచయము.

## గాంధీజీమతము, రాజకీయములు—

సర్వేపల్లి రాధాకృష్ణను - ఆక్సుఫర్డు-విశ్వవిద్యాలయము.

మానవునిచే సాధింపబడు ధనకనకవస్తు వాహనములు, త్రుటిలో సృజింపబడి త్రుటిలో కూలద్రోయబడు సామ్రాజ్యములును, ఉత్కృష్టమానవగాధ కాజాలవు. సత్యమును, కళ్యాణమును అన్వేషించుటలో నతని యాత్మపొందు యుగయుగాభివృద్ధియే ప్రధానము. ఇట్టి యాత్మోపలబ్ధి ప్రదములగు సాహసకార్యములలో పాల్గొనువారు మానవ విజ్ఞానచరిత్రలో శాశ్వతస్థానమును బడయగలరు. కాలము ప్రతివానిని విస్మరించు నట్లే వీరులనుకూడ పరిహాసించును. కాని ఋషులు స్థిరులు; గాంధీజీ గొప్పతనము అతని వీరసంగ్రామరంగములలో గాక యతనిపవిత్ర జీవితములోనెక్కువగ ద్యోతకమగును. నాశన దేవతహద్దు మీరి నృత్యముచేయుచున్న యీకాలములో నతడు ప్రాణవంతమును, సృజనశక్తియుతమునగు ఆత్మశక్తిని విజృంభింపజేసెను.

### 1. రాజకీయములకు మతము పునాది

భారతదేశపు సంకెలల నొక్కపెట్టున విదల్చి, సడలించిన యపూర్వ భారతాభ్యుదయమున కితరులకంటె నితడొక్కడే బాధ్యుడని లోకమంతయు గుర్తించినది; రాజకీయవేత్తలకు

సాధారణముగ మతమనిన రుచింపదు. కాని గాంధీజీకి జీవిత మంతయు నొక సమగ్రవిషయము: "సర్వవ్యాప్తమైన సత్యమును ముఖాముఖి చూడగలుగుటకు అతి నికృష్టమైన జీవిని కూడ తనవలెనే ప్రేమింపగలిగి యుండవలెను; దానిని సాధించ గోరువాడు జీవితములో నేరంగమును బహిష్కరింపజాలడు. సత్యముపట్ల నాకుగల భక్తియే నన్ను రాజకీయములలోనికి దింపెను. మతమునకు రాజకీయములతో సంబంధములేదను వారికి మతమన నేదియో తెలియదని నేను నిస్సందేహముగ చెప్పగలను". మరియు "నశ్యమగు నీభౌతిక సామ్రాజ్యము నాకక్కరలేదు. నేను స్వర్గధామమును, అనగా ఆత్మమోక్షమును సాధించుటకే యత్నించుచున్నాను. నా దేశమునకును, మానవలోకమునకును నిరంతర సేవచేయుటలోనే నామోక్ష మార్గముకలదు. ప్రతిప్రాణిలోను నన్ను చూచుకొనుటయే నా యాశయము; గీతాకారుడు చెప్పినట్లు శత్రు, మిత్రులయందు సమబుద్ధితో మెలగకోరెదను. కనుక శాశ్వతశాంతిని, మోక్షమునుపొందు నాప్రస్థానములో నా దేశభక్తియొక మజిలీ. నాకు మతములేని రాజకీయములు అర్థశూన్యములు. మతమున కవి యుపాంగములు. మతములేని రాజకీయములు ఉరికుచ్చులు. అవియాత్మవినాశకాసులు". మానవుడు కేవలరాజకీయజీవియై యంతగా సాధింపగలుగనది లేకపోవుట కతడుమతమును రాజకీయములను విడదీసి రెంటినిసరిగా అర్థముచేసికొనక పోవుటయే

కారణము; భారతదేశ ప్రస్తుతపరిస్థితులనుబట్టి గాంధీజీరాజకీయ విప్లవబ్రహ్మయయ్యెను. అతడు నిరంకుశత్వము నంగీకరింపడు, దానిసతనమునకొడిగట్టడు. అయినను అతడు అస్వాభావికములు, అమానుషములునగు పొంతలకు తీసికొనిపోవు భావోద్రేకము గలట్టి విప్లవఘటకుడుకాడు. అనుభవమును పరీక్షలో నతడు కేవలరాజకీయవేత్త లేక సంస్కర్త, కేవలవేదాంతి లేక సూత్రకారుడుకాడు. అతడీయన్నింటియొక్కయు మూర్తి; సర్వోత్తమ మానవలక్షణ లక్షితుడైన యాధ్యాత్మిక పురుషుడు; తనహద్దులనుగుర్తెరిగి, యప్రతిహతమైన హాస్యరసమునొలికించుచుండువాడటగుచే నతడు మనకు మరింత ప్రేమపాత్రుడైనాడు.

## 2. భగవంతునియందు జీవించుటయే మతము

భగవంతుడనిన మనకెట్టి యభిప్రాయములున్నను గాంధీజీ దృష్టికతడత్యంత ప్రధానుడు; పరమసత్యము. ఎవని శక్తిని, ప్రేమసందేశములను మనము జుఱ్ఱుకొనుచున్నామో యట్టి నూతనపురుషునిగ గాంధీజీనిసృజంచినదీభగవద్విశ్వాసమే. ఏదియొ అతని సమీపముననుండు, ఒక సంచలించునాధ్యాత్మిక శక్తి అతనిని దిగ్భ్రమపరచి వశపరచుకొని సత్యమునేగోచరింపజేయును. సందేహములతని మనస్సును చీకాకుపరచునపుడతడు వానినిభగవంతునికివిడిచివేయును. వానికిభగవంతుడుప్రత్యుత్తరమిచ్చునా? ఇచ్చుటయు నివ్వకపోవుటయుకలదు. అంతర్వాణి

పలికినట్లు వినపడును. అట్లు వినపడకపోవుటయుకలదు. దానిని బట్టి యతడు నిర్ణయములను చేసికొనుచుండును. "సర్వత్ర వ్యాపించియుండునట్టి యనిర్వాచ్యమగు నద్భుతశక్తియొకటి కలదు. బాహ్యచక్షువులతో దానిని చూడకపోయినను నేను దానిని గుర్తింతును. అవ్యక్తమగు నాశక్తి గుర్తింపబడి నప్పటికి నదిరుజువుకు సాధ్యముకాదు. ఏలయన నిదినేనుయింద్రియములతో చూచునట్టి అన్నియితరవస్తువుల వంటిదికాదు. బాహ్యసాక్ష్యమేమియు దీనిని రుజువుపరచజాలదు. అంతరంగమునసున్న భగవంతుని నిజసాక్షాత్కారము ననుభవించిన వారి ప్రవర్తనములోనిమార్పే దీనికి తార్కాణము. అన్ని దేశముల లోని ప్రవక్తలయొక్కయు, ఋషిసత్తములయొక్కయు అనుభవములీసాక్ష్యమునే యిచ్చుచున్నవి. ఈసాక్ష్యమును తిరస్కరించుట తన్నుతాను తిరస్కరించుటయేయగును". "ఇదితర్కమునకు సాధువగు విషయముకాదు. ఇతరులను తర్కవాదముచే నొప్పించుమందువేని యదినాచేతకాదు. కాని మనమిరువురము నీగదిలోకూర్చుండుట కంటెకూడ నాకతనియునికి ధ్రువమని నేనుచెప్పగలను; గాలి, నీరు లేకుండ నేను జీవింపగలను. కానియతడు లేకుండ నేనొకనిముసమైనను జీవింపజాలనని చెప్పగలను. నీవు నాగుండ్లను పెరికివేయవచ్చును. కాని దానివలన నేను నాశమొందను. నీవు నాముక్కును కోసివేయవచ్చును. అదికూడ నన్నుచంపివేయదు. కానిభగవంతుని యెడల నా

విశ్వాసము నశింపచేయబడినచో నాకది మృత్యువేయగును. నికృష్టములగు విషయములనుగాక స్వతంత్రమగుఆత్మవాయువులనుప్రసరింపజేయు శిఖరాగ్రమునుండి చూచునపుడు అందరకు నొకేదృశ్యముగోచరమగును. మనముందు తావులనుబట్టి మన మీశిఖరమునకు వివిధమార్గములనుండి పోవలెను. కాని మన మన్వేషించునదియొకటే. "ఇస్లామునకు చెందినఅల్లా, క్రైస్తవుల జీసను, హిందువుల యీశ్వరుడు - అందరును ఒకటియే ! హిందూమతములో దేవున కనేకనామములున్నట్లే ఇస్లాంలోను కలవు. ఈపేరులు వ్యక్తిత్వమునుగాక లక్షణములనుమాత్రమే సూచించును. అతడులక్షణముల కతీతుడైనను, అనిర్వాచ్యుడైనను, అప్రమేయుడైనను అల్పుడైనమానవుడతనికి లక్షణములనుకల్పించి తనయల్పబుద్ధిచే నతనినిరూపింప బ్రయత్నించును. అన్నిమతములపట్ల సమానగౌరవమును చూపుటయే ఇట్టి భగవంతునియందు సార్థకమగు విశ్వాసమునకు తార్కాణము. అన్నిమతములకంటెను నీమతము గొప్పదనియు, నితరులను నీమతములోనికి కలుపుకొనవలెనని చూచుట న్యాయమే యనిభావించుటయు దుర్భర అసహనము. అసహనమొకవిధమగు దౌర్జన్యము". ఇతర మతములపట్ల వట్టి సహనము కలిగి యుండుటతో నతడు తృప్తిపడక వానిమంచిని గుర్తింపగోరును.

జీససుయొక్క జీవితము, కార్యములు దౌర్జన్యరాహిత్య సూత్రమునకుత్కృష్టమగు తార్కాణముగ నతడంగీకరించును. "నాజీవితము నెక్కుడుగ మార్చివేసిన యాదేశికులలో జీసను ఒక స్థానము నాక్రమించును." మహమ్మదు ప్రవక్తయొక్క శీలమును, సునిశితవిశ్వాసమును, కార్యశూరతను అతడు మెచ్చుకొనును; ఆలీయొక్క మృదుతరకరుణారసము, దుర్భర క్లేశము అతనిని ముగ్ధునిగా జేయును. ఇస్లాము సర్వపరిపాలకుడగు భగవంతుని ప్రభుతయందు పరమవిశ్వాసమును, సాధుజీవితమును, అకుంఠితభ్రాతృభావమునుబీదలయెడల ఉదాత్తానుకంపను ప్రధానములుగచేసెను. ఇవి యన్నిమతములకును ముఖ్యములేయని యతడంగీకరించును; కాని హిందూ మతము, అది బోధించు సత్యము, ఆత్మ, అహింసలే యతని జీవితచైతన్యశక్తి.

అన్నిమతములును నిజమతమునకు సాధనములు. "మతమన నేదియో నేను వివరించెదను. అది నేను అన్నిమతములకంటెను నెక్కువగ నాదరించు హిందూమతముకాదు; అది హిందూమతమునుమించి, మన ప్రకృతినే మార్పుచెందించి, మన యాంతరంగిక సత్యమునకు మనలను బంధించి మనల నెల్లప్పుడును పునీతులను చేయు మతము; తన్ను తానుకనుగొనువరకును, తనకర్తను గ్రహించువరకును, తనకును అతనికిని గల యదార్థసంబంధమును గుర్తించువరకును ఆత్మకు శాంతిలేకుండ

చేయునట్టియు తన సంపూర్ణత్వమును సాధించుట కెంతటి త్యాగమునైనను సరకుచేయనట్టియు మానవ ప్రకృతిలోని యొక శాశ్వతస్వభావము".

సత్యముకన్న వేరు దేవుడులేడు. సత్యమును గ్రహించుటకు ప్రేమ లేక అహింసకన్న వేరుసాధనలేదు. పునీతాత్మునకు గాని సత్యగ్రహణము, ప్రేమను సాధించుట సాధ్యపడదు. హృదయ పవిత్రతకలవారుమాత్రమే భగవంతుని చూడగలరు. హృదయపవిత్రత, రాగద్వేషములనువీడుట, మనోవాక్కాయ కర్మభిః సంగరహితుడగుట, భయము, దంభము మొదలగునవి నశించుట, ఇవి శరీరవాంఛలను, సంకల్ప వికల్పప్రాయమగు మనస్సును దాటినవారికిగాని లభ్యముకావు. యమనియమములు సాధన, తపస్సు-ఇవియే దీనికి మార్గములు. తపస్సు ఆత్మను శోధించును. సముద్రమథనమునాడు బయలుదేరిన హాలాహలమును శివుడు తానే మ్రింగివేయ నిశ్చయించెను. మానవలోకము నుద్ధరించుటకై క్రైస్తవులకు భగవంతుడు తనకుమారుని సమర్పించెను; ఇవి పుక్కిటి పురాణములేయనుకొన్నను మానవుల యంతర్గర్భిత భావముల నివి వ్యక్తముచేయనిచో నీకథ లేల పుట్టును? నీవు ప్రేమించినకొలది బాధపడవలెను. అనంతప్రేమ అనంతబాధయే యగును. "తనజీవితమును రక్షించుకొనగోరువాడు దానిని పోగొట్టుకొనవలెను." భగవంతునికొరకు పనిచేయుటకే మన మిచ్చటనున్నాము. అతని యుద్దేశ్యములను

నెరవేర్చుటకే మనజీవితములుద్దేశింపబడెను. మనము దీనిని తిరస్కరించి మనజీవితములనుపయోగింపక దాచుకొనగోరితి మేని మన నిజప్రకృతినిమరచి మనజీవితములను పోగొట్టుకొనిన వారమగుదుము.

దూషణ భూషణములను సరకుగొనక స్వేచ్ఛగ న్యాయ మును చెప్పుటకును, చేయుటకును స్వేచ్ఛగ అందరను ప్రేమించు టకును, క్షమించుటకును సంగము లేకుండుటత్యవసరము. తృషితమైనను లేనివాడై యీ ప్రపంచమునంతను అనుభవించు సంగరహితునకుమాత్రమే స్వేచ్ఛకలదు. ఈ విషయములో గాంధీజీ అనికేతనస్థితియందుండు ఉత్కృష్ట సన్యాసాదర్శమును వరించెను.

కాని సన్యాసులకుమాత్రమేగాక మానవలోకముకంత కును పూర్తియైన సన్యాసధర్మములనే శాశించుట అతిశయము. సంభోగనియమము అందరకును ముఖ్యమే. కాని బ్రహ్మచర్యము కొద్దిమందికిమాత్రమే సాధ్యము. సంభోగము కేవలము శరీరా నందము నిచ్చు క్రియకాదు. అది ప్రేమను వెలిబుచ్చుటకును, జీవితమును నిరంతరాయము చేసికొనుటకును సాధనము; ఇతరు లకు హానికలిగించినపుడు, తన యాధ్యాత్మికాభివృద్ధికి భంగము కలిగించునపుడు నదిచేటుగా పరిణమించును. కాని దానియందే యీ రెండును ఇమిడియుండలేదు. ప్రేమను వెలిబుచ్చునట్టియు, జాతిని సాగించునట్టియు క్రియ సిగ్గు చేటుకాదు, పాపముకాదు.

కాని శరీరవాంఛలు చిత్తైకాగ్రతను నశింపుచేయుచుండుటకే యాధ్యాత్మిక గురువులు బ్రహ్మచర్యము ముఖ్యమందురు. గాంధీజీ స్వీయశిక్షణ కెన్నికష్టములనైనను భరించెను. "స్వజనము, పరజనము, దేశీయులు విదేశీయులు, శ్వేతజాతులు రంగుజాతులు, హిందువులు ముస్లిము, పార్సీ, క్రైస్తవాద్యన్య మతస్థులు అను భేదము నాకులేదు" అను నతనివాక్కు సత్య వాక్కు అని యతని నెరింగిన వారందరును అంగీకరింతురు. మరియు "ఇందు నా ప్రత్యేకఘనత యేమియునులేదు. ఇది నా ప్రకృతి; ఇది నాప్రయత్న ఫలితముగ సాధింపబడినదికాదు. అట్లుగాక దౌర్జన్యరాహిత్యము, బ్రహ్మచర్యము మొదలగు గుణములను నేను నిరంతరమగు పోరాటమువలన సాధించితిని" అని యతడు చెప్పెను. పవిత్రహృదయులుమాత్రమే భగవంతుని, మానవుని ప్రేమింపగలరు. ప్రేమ, యెంతటిబాధనైనను ఓర్పుట, ఆత్మ యొక్క విశేషము. ఇతరుల దోషములను మనపై వేసికొనినను కేవల స్వార్థ విషయభోగములిచ్చు సుఖముకంటె నది యెక్కువ గంభీరము, యదార్థమగు ఆనందమును ప్రసాదించును. మన మితరులకు నిమిషానందమునైనను ప్రసాదింప గలిగితిమను జ్ఞానమునుమించిన మధురభావమీప్రపంచమున వేరొకటిలేదు; ఇతరుల దుఃఖములో పాల్గొంటిమనుభావము అమూల్యము. గర్వలేశము లేక, మంచిచేసితినను గర్వముకూడ

లేక యహంకారశూన్యముగ చూపబడు పవిత్రదయయే యుత్కృష్టమతము.

## 3. మానవతత్వము

ఆధ్యాత్మికలక్షణము సహజప్రపంచమునకు దూరమైన విషయముకాదు. కాని మనమందు నందరియెడలను ప్రేమతో పనిచేయవలెను. సర్వభూతములను తనవలెనే చూచుకొనవలెను. దీనికెట్టి షరతులునులేవు. అందరకును సమానిస్వేచ్ఛ, సమానస్థితియుండవలెను. ఇట్టికోరిక స్వతంత్రవ్యక్తులతోకూడిన యొక విశ్వసంఘమును సృష్టించును. అట్టివారు కృత్రిమములైన జాతి, మత, కులభేదములను, ధన, అధికార, తరగతిభేదములను తరించవలెను. ఒకజాతి మరియొకజాతిని - జర్మనులు, జెక్కులను, భూస్వాములు సేద్యగాండ్రను, పెట్టుబడిదారులు కూలీలను కొట్టి తమపొట్టనింపుకొనుట ప్రజాస్వామిక పద్ధతికాదు. వారిట్టి అన్యాయమును దౌర్జన్యబలముతో మాత్రమే సమర్థించుకొనగలరు. అధికారము చెలాయించువారికి పదచ్యుతియగుననుభయముండును; పీడింపబడువారిలో న్యాయమైన ఆగ్రహము పేరుకొనును; మానవు లందరియొక్కయు, సమానమైనహక్కులను గుర్తించు న్యాయదేవతయే యీయస్వాభావిక పరిస్థితుల నంతమొందింపగలదు. ఈయన్నిశతాబ్దములనుండియు మానవలోకము మానవసౌభ్రాతృత్వమునే యన్వేషించుచున్నది. సామాన్య మానవుని అణచివేయుటకు, దిగద్రొక్కుటకును

నిరంతముజరుగు బలవంత, అక్రమ, అధర్మముల పాపఫలితమే ప్రపంచ వివిధప్రాంతములలోని మహోద్యమములుగ పరిణమించినవి. స్వతంత్రతను గుర్తించుటలో నొందిన యభివృద్ధియే మానవచరిత్రయొక్క సారము.

సమగ్రదృష్టి లేకపోవుటచే మన మసామాన్యసంభవముల కెక్కువ ప్రాముఖ్యత నిచ్చుచుందుము. మధ్యమధ్య వచ్చుచుండు అవాంతరములు, 'విశ్వామిత్రములు', దారి తెన్ను దొరకకపోవుట -- ఇవియన్నియు శతాబ్దములనుండియు త్రోసికొనువచ్చుచున్న అభ్యుదయ ప్రవాహములో నొకభాగము మాత్రమేయని గుర్తింపవలెను. మానవలోకము నిరంతరాయముగ చేయుప్రయత్నమును నిష్పక్షపాతముగ చూడగలిగినచో మనము నివ్వెరపడుదుము ; ఆశ్చర్యచకితుల మగుదుము. బానిసలు స్వతంత్రులగుచున్నారు. మతాంతరులు నిప్పులలో కూలద్రోయబడుటలేదు. ప్రభువులు తమహక్కులను వదలుకొనుచున్నారు. ధనవంతులు తమసంపదకు క్షమార్పణచెప్పుకొనుచున్నారు. పొగరుబోతు సామ్రాజ్యములు శాంతి యవసరమనిచాటుచున్నవి. మానవలోకము నేకముచేయవలెనను కలలుకూడ లేకపోలేదు. నేడుకూడ బలవంతుల ఔద్ధత్యము, దుర్మార్గుల దౌష్ట్యము, వంచకులమృషావచనములు, అహంకారపూరితమగు కులజాతి తత్త్వములు లేకపోలేదు. కాని విశ్వమంతటను వ్యాపించుచున్న ప్రజాస్వామిక సాంప్రదాయ

మును గుర్తింపవేని మన మంధులమే యెుగుదుము. కటికదరిద్రు నకుగూడ చాలినంత యన్నము, గాలి, వెలుతురు, స్వగృహ సుఖము, జీవితాశ, గౌరవపరిపత్తులు చేకూడనట్టి ప్రపంచమును నిర్మింపబూనినవారి కృషినిరంతరము సాగుచున్నది. మానవ సేవకులలో గాంధీజీ ప్రప్రథముడు. దృఢవిశ్వాసముగల వారిని చేకూర్చుకొని దౌష్ట్యమును చక్కబరచుటకును, ఉపద్రవములను వారించుటకును అతడు దుష్టశక్తుల నవక్రసాధనములతో నెదుర్కొనును. అతనికి పరిజాస్వామిక మన వాగాడంబరపద జాలముకాదు; అదిసంఘములో కార్యరూపమునుదాల్చవలెను. సామాన్యమానవుని యెడల నతనికిగల ప్రేమను గ్రహించిననాడే దక్షిణాఫ్రికా, హిందూదేశములలోని యతనికార్యకలాపమును మనము గ్రహించగలము. నాజీలు జ్యూమతస్థుల యెడల చూపిన దుర్మార్గమునకు నాగరికపరిపంచము నిర్ఘాంతపడెను. మత జాత్యహంకారములు తిరిగి తలయెత్తుట నుదారరాజకీయ వేత్తలునిరసించిరి; దుఃఖమును వెలిబుచ్చిరి. కాని ప్రజా స్వామ్యము పేరిట పాలింపబడుచున్న అమెరికా, బ్రిటీష్ సామ్రాజ్యములలో ననేకసంఘములీ జాతితారతమ్యములచే నసంఖ్యాకములగు కష్టములను పొందుచున్నవి. భారతీయులు పేరుకు బ్రిటిషుసామ్రాజ్యములో స్వతంత్రులైనను అనేకకష్టము లనుపొందుచుండుట గాంధీజీ దక్షిణాఫ్రికాలోనున్నపుడు కను గొనెను. ప్రభుత్వము, మతాధికారులుకూడ శ్వేతజాతులు కాని

వారిహక్కులను నిరోధించిరి. గాంధీజీ దీనికొరకే సత్యాగ్రహ మును లేవదీసెను; మానవులందరు వస్తుతఃసమానులేయను సూత్రము నతడుసమర్థించెను. వర్ణ, జాతి, కులములనుబట్టి సృజింపబడిన కృత్రిమభేదము లక్రమములు; అవినీతికరములు. భారతీయులెట్టి యవమానములకు పాలగుచున్నరో తెలిపి వారిలో నాత్మగౌరవప్రతిష్టల నతడుపురిగొల్పెను. అతడొక్క భారతీయులకొరకే పోరాడలేదు. ఆఫ్రికనుజాతులను కొల్ల గొనుటకుగాని చరిత్రసిద్ధమగు నాగరికతగలవారని భారతీయుల నెక్కువగ జూచుటకుగాని యతడంగీకరింపలేదు. భారతీయుల యెడనతిహేయములగు చట్టములు రద్దుచేయబడినను అవమాన కరములగు నిర్బంధములు నేటికిని నిలిచియేయుండెను. ఇవి వీనికి మోకరించువారి పరపతినిగాని వీనిని ప్రజలపై బలవంతముగ రుద్దుప్రభుత్వపు ఘనతనుగాని తెలుపజాలవు.

మతవిద్వేషములను రూపుమాపి, నైకమత్యమును చెండాడి, అసామరస్యమును పోద్రోలి పల్లెజలకు స్వశక్తిపై నాధారపడునట్టి శిక్షనొసంగి, స్త్రీలను పురుషులతోపాటు సాంఘిక, ఆర్థిక రాజకీయసమస్థితికి తెచ్చి, హిందూమతమును అస్పృశ్యతాకళంకమునుండి శుద్ధిపరచి భారతదేశమునుద్ధరించ వలెననిగాంధీజీయాశయము. హిందూమతమునుండి యీకళంక మును తీసివేయుటలో నతడుపొందిన జయమే మానవాభివృద్ధి కతడుచేసిన మహత్తరకార్యము. అస్పృశ్యజాతియున్నంతకాల

మతడు దానికే చెందును. "నాకు పునర్జన్మయే తప్పనియెడల నేను అస్పృశ్యజాతిలో జన్మించి వారి దుఃఖములను, బాధలను, అవమానములనుసహించి వారిని నన్నుకూడ రక్షించుకొన గోరెదను." అవ్యక్తుడగు భగవంతుని ప్రేమించుచున్నామని చెప్పుచు నతని సృష్టియేయగు ప్రజలపట్ల నిర్దాక్షిణ్యముగ ప్రవర్తించుట స్వవచోవ్యాఘాతము. సనాతన హిందువుడనని గాంధీజీచెప్పుకొనును. కాని వర్ణము పేరిట జరుగునత్యాచారములను, అక్రమములను, అస్పృశ్యతాపిశాచమును, దేవాలయములలో జరుగుదుర్మార్గమును, పశువులకును జంతుకోటికిని జరుగుచున్న క్రౌర్యమును నతనివలె విమర్శించు ఘటికుడు వేరొకడులేడు. "నేను పదియారణాల సంస్కారవాదినే. కాని నాయాత్మతృష్ణ హిందూమత ప్రధానసూత్రములను త్రోసివేయు నన్ను ప్రోత్సహింపజాలదు. నేటి హిందూదేశములోని సంస్థానాధిపతుల నిరంకుశత్వమున కతడు ప్రతికూలుడు. వారిచేపీడింపబడుచున్న కోట్లకొలది ప్రజలయెడల నతనికిగల ప్రేమాతిశయమే దీనికి కారణము. సంస్థానములలోనంతయు సౌష్టవముగ నున్నదని యెంతటి యుదారప్రేక్షకుడును చెప్పజాలడు. కలకత్తాలోని స్టేట్స్మన్ పత్రికలోని యీ వాక్యములను చూడుడు. "అనేక సంస్థానములలో విపరీతపరిస్థితులుకలవు. అవిష్యక్తులకుగాక మానవ ప్రకృతికేమచ్చ. మంచి సంస్థానాధిపతులుగాని చెడ్డవారుగాని చట్టములకు బద్ధులుకారు.

ప్రజల మానప్రాణములు వారిచేతులలోనున్నవి. వారు దుష్టులు క్రూరులు దురాశాపరులునైనచో వారి క్రౌర్యమును దురాశను వారించువారేలేరు. ఈ ఛోటానిరంకుశులను రక్షించు సంధి పత్రములను సంస్కరించుట కెన్నటికిని వీలులేక, సమర్థనీయులు కాని వారిని సమర్థించుటే బ్రిటిషుప్రభుత్వ గౌరవచిహ్నమైనచో ననివార్యమగు నొకశక్తి యీజడత్వముపై కురికి యిట్టి సమస్యను ప్రకృతియే పరిష్కరించును." విప్లవములు అభివృద్ధిపొందని పాపఫలితములు. సంస్థానాధిపతులయెడగల సుహృద్భావము చేతనే తమ్ము సంస్కరించుకొనవలసినదని గాంధీజీ వారికి హిత వొసగుచున్నాడు. రవి యస్తమించని బ్రిటిషుప్రభుత్వమే రాష్ట్ర ములలో బాధ్యతాయుతపరిపాలన నొసంగకతప్ప నపుడు సంస్థానాధిపతులు చేయిజారకమునుపే యిల్లు చక్కబెట్టుకొని తమప్రాణములను దక్కించుకొందురని భావించెదను. బీదలను నలిపివేయుచుండుటే బ్రిటిషుప్రభుత్వపు ప్రధానమగు నేరమని గాంధీజీ ఘోషించును. చరిత్ర ప్రారంభమైనది మొదలు భారత దేశమైశ్వర్యముతోను భోగభాగ్యములతోను తులతూగెను. మన కతిఫలవంతమైన విశాలభూములుకలవు; ఎన్నటికిని తరుగనినిధులు గనులు ఖనిజములుకలవు. తగినశ్రద్ధ 'జావాబు దారీ' తీసికొనినచో భారతదేశములో ఆబాలగోపాలము సుఖముగ మృష్టాన్నముననుభవింపవచ్చును. అయినను తినతిండి, కట్టబట్ట, తలదాచుకొనగుడిసె లేక అల్లాడుచు, పుట్టినది

మొదలు నిరంతరకష్టముల ననుభవించుచు చివరకు మృత్యువే వారిబాధలన్నింటికిని శరణ్యమగుచుండు కోటానుకోట్ల ప్రజలీ దేశములోకలరు. నిర్దాక్షిణ్యమగు ప్రకృతికాక అమానుషమైన ప్రభుత్వ విధానమే దీనికి కారణము. ఈవిధానమంతరించుట భారతదేశమునకేగాక మానవలోకముకంతకును శ్రేయోదాయకము.

1931 లో లండనునుండి మహాత్ముడు అమెరికాప్రజల కిట్టి సందేశముపంపెను. "1900 మైళ్లపొడవు 1500 మైళ్ల వెడల్పుగల కోస్తాలో 750000 గ్రామములలో లక్షలకొలది ప్రజలు అన్నాతురులై దిక్కు-మొక్కు-లేక యల్లాడుచున్నారు. ఈపల్లెలలోని ప్రజాగణము సంవత్సరమునకు సుమారు ఆరు మాసములు పనిలేని సోమరులగుట వారి దోషముకాదు. మొన్నటివరకును అన్నవస్త్రములకు సంబంధించినంతవరకీ గ్రామములు కొదువలేక సుఖజీవనము చేయుచుండెడివి. 'కుంఫినీ బావుటా' వారు నేను వర్ణింపనిచ్ఛగింపని మార్గములద్వారా యీగ్రామవాసుల సహాయ పరిశ్రమను నాశనమొనరించిరి. కోట్లకొలది వడకువారు, ఆధునికయంత్రములుకూడ తీయజాలనంతటి సన్నినూలు తీయుహస్తనైపుణ్యముగలవారు, పరిశ్రమశూన్యులైరి. కాదని యెవరెంతగా వాదించినను భారతదేశములోదారిద్ర్యమునాటినుండియే దినదినప్రవర్థమానమయ్యెను."

భారతీయులు గ్రామవాసులు. భారతనాగరికత వ్యవసాయిక నాగరికత. ఇప్పుడది నానాటికి యంత్రమయమగుచున్నది. గాంధీజీ ప్రపంచమునకంతకును అన్నమును కల్పించు 'వ్యవసాయకు'ని ప్రతినిధి; 'వ్యవసాయకుడు' సంఘమునకు మూలవిరాటు. భారతనాగరికతలోని యీమూలసాంప్రదాయమును కాపాడి బలపరచవలెనని గాంధీజీయాశయము. బ్రిటిషు ఆధిపత్యముక్రింద యంత్రజ్ఞానము, సాహసము, చొరవ, క్రొత్తక్రొత్తవానిని కనిపెట్టుశక్తి, మొదలగు మంచి మెంతలబ్బినను ప్రజలు తమ ప్రాచీన ప్రమాణములను విడిచివేయుచున్నారని యతడు విచారించును. వారు ప్రాపంచిక ప్రమాణములను తలదాల్చుచున్నారు. ఆర్థికలాభములకంగలార్చుచున్నారు. భౌతిక విజయములను ఆరాధించుచున్నారు. మన పారిశ్రామిక నగరములకును తమవృద్ధికి మూలములైన గ్రామసీమలకును సంబంధముపోయినది. అవి యర్థములేకుండ పెరుగుచున్నవి. అందలి ప్రజలు యంత్ర, ధనములను వలలలో చిక్కుకొని దౌర్జన్యము, అశాంతి, అనాలోచన, అవినీతి, శిక్షలేమి మొదలగువానిచే బాధపడుచున్నారు. పారిశ్రామికలోకమనగా గాంధీజీ దృష్టిలో కర్కుర్తికూలికొరకు నిర్భాగ్యజీవితములను గడుపుస్త్రీలు; పని చేయుతల్లుల పనిచెడగొట్టకుండుటకు నల్లమందుప్రయోగింపబడిన శిశువులు; బాల్యమువమ్ముచేయబడి పారిశ్రామికపు బానిసతనమునను భవించు కసుగందులు; మఱుగుజ్జులు, వ్యాధిగ్రస్తులు

నయిన లక్షోపలక్షలగు వృత్తిహీనులు, విత్తహీనులు, పొట్ట కొరకు ఆత్మలను కోల్పోయిన మందభాగ్యులు, బానిసలు అని యతనిభావము. ఉపనిషత్తులనాటి ఋషులు, బౌద్ధభిక్షువులు, హిందూసన్యాసులు, ముస్లీము ఫకీరులుపొందిన యాత్మోపలబ్ధి విజ్ఞానము, మోటారులు, రేడియోలు, ధనకాంక్ష మొదలగు వానితో తృప్తిపడజాలదు. మనదృష్టి మందగించెను; మనగతిని కోల్పోతిమి. మనము తప్పుదారిత్రొక్కుటచే మన వ్యవసాయ దారులు దరిద్రులు, భాగ్యహీనులు, ఈర్ష్యాళువులునైరి; కార్మికులు అవినీతి, మొద్దుతనము అంధత్వములపాలైరి; కళావిహీనమైన ముఖములు, తేజోరహితమైనకండ్లు, బిక్క మొగములుగల కోట్లకొలది బిడ్డలు ప్రసాదింపబడిరి. ఈ యపజయము, నిరాశ మన నుదుటకాన్పించుచున్నను ప్రజాగణము మాత్రము నిజస్వాతంత్ర్యము, నిజాత్మగౌరవముల కొరకువ్విళ లూరుచున్నారు; దరిద్రులు భాగ్యవంతులులేనట్టియు అతి భోగము, అతివిశ్రాంతిలేనట్టియు పరిశ్రమ, వర్తకము సరళ రూపమును దాల్చునట్టియు జీవితమునే వారు కోరుచున్నారు.

యంత్రలాభములను కోల్పోవునట్టి వ్యవసాయసంఘ ముండవలెనని గాంధీజీకోరికకాదు. యంత్రములద్వారా విరివిగా జరుగు యుత్పత్తికతడు వ్యతిరేకికాడు. గృహపరిశ్రమలను, యంత్రపరిశ్రమలను సమన్వయము చేయవచ్చుననియే యతడు చెప్పెను. "గ్రామములకు సహకారిగానుండునట్లు వానినేర్పరచ

వలెను. జాతికి కావలసిన ఆయువుపట్టులవంటి పరిశ్రమలను కేంద్రీకరింపవచ్చును. నాప్రణాళికలో గ్రామములో చక్కగా నుత్పత్తికాగలవేవియు పట్టణములలో నుత్పత్తిచేయబడరాదు. గ్రామములలో తయారైనవస్తువులను ఖర్చుచేయుటయే పట్టణముల ధర్మము." . . .

గ్రామములను ప్రాణవంతములు చేయుటకే యితడు ఖద్దరు, వడుకునూలు చేతిపరిశ్రమల నాధారముచేసికొను విద్యావిధానమును దోహదముచేయుచున్నాడు. వ్రేళ్లమీద లెక్కింపదగు పట్టణములలోగాక అసంఖ్యాకములగు గ్రామసీమలలోనే హిందూదేశమును చూడవలెనని యతడు విసుగులేకుండ చెప్పుచుండును. భారతప్రజలు గ్రామసీమలకు పోవలెను. అచ్చటనే స్థిరనివాస మేర్పరచుకొనవలెను. ఆగడ్డమీదపండు పదార్థముల మీదనే జీవింపవలెను. వారికుటుంబములు స్వగృహములు, సొంతపరికరములు, సొంతభూమి కలిగి స్వయంపోషకములుగ నుండవలెను. దిక్కుమొక్కులేని, లెక్కార్చుకొనుటకు వీలులేని ఫ్యాక్టరీబానిసలు, అర్థములేని, యన్యాయమైన, అంగుడులేని వడ్డీవ్యాపారముచేయు వర్తకసంఘములుకాక బాధ్యతగలవ్యవసాయప్రజ; స్థిరులు, తొట్రుపాటులేనివారునగు వ్యవసాయ పదార్థములనమ్మడు చేయు చిన్నచిన్న పట్టణవాసులే దేశము యొక్క సాంఘిక, ఆర్థిక, వైజ్ఞానిక జీవితములను నడుపవలెను; నీతిని, పవిత్రతను, ఉదారలక్ష్యములను సూచించుచుండవలెను.

ఇది దేశమును పూర్వయుగమునకు తీసికొనిపోవుటకాజాలదు. ఇది భారతదేశమునకు సహజమును, దానికొక లక్ష్యమును, విశ్వాసమును, సార్థకతను ప్రసాదించిన యొక జీవితవిధానము. మనజాతి నాగరికతను రక్షించు విధాన మిదియొక్కటియే. మోటుజీవితము, వ్యవసాయికజీవితము, గ్రామసంఘములు అరణ్యాఋషివాటికలు, ఆశ్రమపదములుగల భారతదేశము ప్రపంచమున కనేక గుణపాఠములను బోధించెనేగాని అది యే వ్యక్తికి నపకారముచేయలేదు; ఏదేశమును బాధించలేదు; ఇతరులపై నధికారమును చెలాయింప ప్రయత్నింపలేదు. నేడు జీవితపరమార్థము వక్రించెను. ఈపంకిలమునుండి హిందూదేశము తరించుటెట్లు? శతాబ్దములుగ ననుభవించుచున్న దాస్యజీవితమునుండి బయటపడవలెననుయిచ్ఛ, కోరిక ప్రజలు కోల్పోయినట్లు కాన్పించును. వారినెదుర్కొనుశక్తులు చాలబలవత్తరములుగనున్నట్లు కాన్పించును; వారిలో విశ్వాసమును, ఆత్మగౌరవమును, ఋజువర్తనమును కలిగించుట సులభమైన విషయము కాదు. అయిననుగాంధీజీ తనయాత్మలోదహించుచున్నజ్వాలచే, స్వాతంత్ర్యపిపాసచే మందబుద్ధులగు ప్రజకుత్తేజమును కలిగింప బ్రయత్నించెను. స్త్రీపురుషులు స్వతంత్రులైననాడు తమశక్తి సంపదలను ప్రదర్శింపగలరు; దాస్యమున వారు అవినీతికి పాల్పడుదురు. సామాన్యమానవుని బంధించు అంతరంగ, బహిరంగ పాశములనుండి యతనిని విముక్తుని చేయుటయే స్వాతంత్ర్య

లక్ష్యము. అసమానమానవ స్వాతంత్ర్యరక్షకుడై యతడు దేశ
మును పరదాస్యశృంఖలములనుండి విముక్తిచేయ పోరాడు
చున్నాడు. అంతపవిత్రమైన దేశభక్తి నేరముకాని, చెడుప్రవర్తన
కాని కానేరదు. ప్రస్తుత అసహజపరిస్థితులపై ధ్వజమెత్తుట మన
పవిత్రధర్మము. అతడు భయంకరాస్త్రములను విసర్జించి
యాధ్యాత్మికాయుధముల నుపయోగించును. ఈ విధానములో
నతడు ప్రజలను స్వాతంత్రతకొరకు సుశిక్షితులనుచేసి దానిని
సాధించి నిలుపుకొనునట్టి యోధులుగ తయారుచేయుచున్నాడు.
బొంబాయి గవర్నరైన సర్ జార్జిలాయిడ్ "ప్రపంచచరిత్రలో
గాంధీజీ యత్నమత్యద్భుతమైనది. దాని విజయము దాదాపు
కరతలామలకమయ్యెను." అనివచించెను. బ్రిటిషుప్రభుత్వ
లింగదేహమింకను చలింపకపోయినను ఎప్పటికిని నిద్రాణము
నొందనిశక్తుల నతడు దేశములో నుద్భవింపజేసెను. అతడు
ప్రజలను నిద్రనుండి మేల్కొలిపెను; వారిలోనొక యపూర్వాత్మ
విశ్వాసమును, బాధ్యతను పురికొల్పెను; వారిని స్వాతంత్ర్యసము
పార్జనాదీక్షితులనుజేసెను. ఇప్పుడు దేశములోకలిగిన నూతన
పరిబోధము, నూతన జాతీయ సాంఘికజీవితముకొరకు సంసిద్ధత,
అస్పృశ్యుల నాదరించుటలో నూతన సాంఘికదృష్టి-దీనికంతకును
గాంధీజీ యుద్యమములోని యాధ్యాత్మికశక్తి, కార్యశూర
త్వము చాలవరకు కారణములు.

గాంధీజీ దృక్పథములో సంకుచితకుల, రాష్ట్రచిహ్నము లేవియును లేవు. భారతసాంప్రదాయములు ప్రపంచసంస్కారమునకు తోడ్పడగలవని యతని విశ్వాసము. పతిత భారతము మానవలోకమున కాశను కల్పింపజాలదు. ప్రబుద్ధభారతము, స్వతంత్రభారతముమాత్రమే దుఃఖభాజనమైన ప్రపంచము నుద్ధరింపగలదు. ప్రపంచమున శాంతి, న్యాయము, క్రమము విరాజిల్లవలెనని నేడు బ్రిటిషువారి ప్రల్లదములు నిజములేయైన యెడల ఆతతాయులను అణచివేసి ప్రపంచమును యథాస్థితిలో నుంచెదమనుటచాలదు. న్యాయస్వాతంత్ర్యములపై మనకు నిజమైన ప్రేమయేయున్నచో మనము ప్రపంచమునకు వెల్లడి చేయు ఆదర్శములకు వ్యతిరేకమైన పరిస్థితులనుముందు సంస్కరింపవలెను. దురాశ, క్రౌర్యము మానవద్వేషము సామ్రాజ్య స్థాపనకు కారణమైనపుడు న్యాయస్వాతంత్ర్యశక్తులచుట్టు చేరుడని ప్రపంచము నాహ్వానించుటకు ముందు మనము వానికి స్వస్తిచెప్పవలెను. దౌర్జన్యము రజోరూపములేక స్వాతిక రూపము దాల్చవచ్చును. ఉద్ధతప్రభుత్వములిపుడు దౌర్జన్యమున కుదుకుచున్నవి. గత దౌర్జన్యముద్వారా సంక్రమించిన అక్రమ లాభములను విడిచిపెట్టనొల్లని సామ్రాజ్యములుకూడ దౌర్జన్య దోషమునుండి విముక్తినొందజాలవు. ఇవికూడ స్వాతంత్ర్య, ప్రజాస్వామికములకు శత్రుకూటములోనివే. ఈ సందర్భములో మనలో నిజాయితీలేనియెడల మనమొక శ్రేష్ఠప్రపంచమును

స్థాపింపజాలము; ప్రపంచములో అస్థైర్యము, యుద్ధము, యుద్ధ భయముతప్పవు. భారత దేశమునకు స్వరాజ్యమునిచ్చుటయే బ్రిటిషు 'నిజాయితీకి' పరమపరీక్ష. స్వరాజ్యమింకను స్థాపింప బడలేదని తెలుపుటకే మహాత్ముడు ప్రతిసోమవారము ఉప వసించుచున్నాడు. ఓపికను కోల్పోవుచున్న భారతమునతడే నిరోధించుచున్నాడు. హిందూ దేశములో శాంతిని నిలుపుట కతడే కారకుడు.

దక్షిణాఫ్రికారంగమునువీడి యతడు యింగ్లండు చేరు సరికి జర్మనీలో యుద్ధము ప్రారంభమయ్యెను. యుద్ధము ఆఖరగు వరకు యుద్ధభూమిలో క్షతగాత్రుల సేవచేయుటకతడెట్టి షర తులులేకుండ వాగ్దానముచేసెను. అతని సేవ యంగీకరింపబడెను. భారత సైన్యనివహములో నతనికొక బాధ్యతగలపదవి ప్రసా దింపబడెను. నిరంతరకృషిచే నతని యారోగ్యముచెడుటచే డాక్టరులతనిని హిందూ దేశములో విశ్రాంతితీసికొన పంపివేసిరి. యుద్ధములోచేరుట కతడు చాలమందిని ప్రోత్సహించెను. ఇది యతనిస్నేహితులనే చాలమందిని కలవరపరచెను. చివరకు యుద్ధానంతరము యావత్తుభారతము ఘోషించుచున్నను రౌలటుచట్టము ప్రసాదింపబడెను. సైనికచట్టము పేరిట దేశము నంతను ఘూర్ణింపచేసిన క్రియలు పంజాబులో జరుపబడెను. పంజాబు దురంతములను విచారణచేసిన కమిటీలో గాంధీజీకూడ

నుండెను. ఇంతజరిగినప్పటికిని 1919 అమృతసరు కాంగ్రెసులో సంస్కరణముల నంగీకరించి 'చట్ట' సమ్మతముగ పనిచేయవలె ననియే గాంధీజీ సిఫార్సుచేసెను. 1920 లో హంటరుకమిషను నివేదిక, అధికార చేష్టలను విమర్శించుటకు వెనుకాడిననాడు, జనరలుడయరును గర్హించుటకు ప్రభువులసభ వారు తిరస్కరించిననాడు అతడు బ్రిటిషు ప్రభుత్వముతో సహాయ నిరాకరణము చేయనిశ్చయించెను. 1920 సెప్టెంబరులో కాంగ్రెసు దౌర్జన్యరహిత సహాయ నిరాకరణము నామోదించెను.

1920 ఆగష్టు 1వ తేదీని వైస్రాయికి అతడిట్లువ్రాసెను. "అధికారపు నేరములను మీ'రతిచులకనగ' పరిగణించుట, సర్ మైకేలు ఓడ్వాయరును మీరు మందలింపక విడిచివేయుట, మాంటాగ్యుగారి సందేశము-ఈ యన్నింటిని తలదన్నిన లజ్జాస్పదమగు పంజాబు దురంతములను సరకుగొనకుండుట, భారతీయుల యాక్రోశములపట్ల ప్రభువుల సభవారుచూపిన ఘోర నిరాదరణ—ఇవియన్నియు సామ్రాజ్య భవిష్యత్తును గురించి నాలో నపారదురభిప్రాయములను కలిగించి ప్రస్తుత ప్రభుత్వము నుండి నన్నుపూర్తిగ విముఖునిచేసెను; నేనింతవరకును మన స్ఫూర్తిగచేసిన సహకారము నిక చేయజాలకుండచేసెను."

ఇండియాప్రభుత్వము తనరక్షణక్రిందనున్న భారత ప్రజల కళ్యాణముపట్లచూపు యుదాసీనతకు పశ్చాత్తాపము కలిగించుటకు అర్జీలు, మహజర్లు, రాయబారములు, మొదలగు

సామాన్యాందోళనావిధాన మెంతమాత్రమును చాలదని నాయభిప్రాయము. యూరపు దేశములోని ప్రజలు పంజాబు హత్యలను, ఖిలాఫతు అక్రమములను రక్తపాత సహితమగు విప్లవముచే ఖండించియుండెడివారు; జాతీయ నిర్వీర్యతను వారన్నివిధముల నిరోధించియుండెడివారు. భారతదేశములో సగముమంది దౌర్జన్యమార్గమును తొక్కుటకశక్తులు; తక్కిన సగము దానికంగీకరింపరు. కనుక నేను అసహాయపద్ధతిని సూచించితిని. ప్రభుత్వముతో సంపర్కమును తెంచుకొన నిచ్ఛగించువారు దీని నవలంబించి దౌర్జన్యమునువీడి క్రమపద్ధతిని త్రొక్కుచో ప్రభుత్వము తన తప్పుటడుగులను వీడి తన దోషములను సవరించుకొనునట్లు చేయవచ్చును. కాని నేను సహాయ నిరాకరణమును నడుపునంతకాలము ప్రజలు నాయదు పాజ్ఞలలోనుండునంతకాలము మీరు న్యాయమును చేతురను విశ్వాసమును నేనింకను కలిగియేయుందును."

ప్రస్తుత రూపములోనున్న బ్రిటిషుప్రభుత్వము "హిందూదేశప్రజలను ఐశ్వర్యహీనులను, నిర్వీర్యులను, దైవదూరులను, దేశరక్షణకశక్తులను" చేసెననియు నైనను ధానిసి మార్చవచ్చుననియు నీతడాశించుచున్నాడు. బ్రిటిషుప్రభుత్వము నతడెదుర్కొనుచున్నను బ్రిటిషుసంబంధమున కతడు వ్యతిరేకికాడు. బ్రిటిషుప్రభుత్వ సంబంధమును పూర్తిగ తెగకొట్టుకొనవలె

వనెడు యుద్యమమునతడు అసహాయోద్యమము ముమ్మరముగ నున్నపుడుకూడ నెదిరించెను.

బ్రిటిషువారితో స్నేహితులుగను, సమానులుగను పని చేయుట కతడిచ్ఛగించినను బ్రిటిషువారు అధికులనుదృష్టిని, ప్రజలు వారి దయాధర్మములకు పాల్గావలసినవారనుదృష్టిని వీడనంతకాలము భారతదేశము బాగుపడదని యతడు విశ్వ సించును. ఎంతటి యుద్రేకసమయములోకూడ అతడు బ్రిటిషు వారియెడ ద్వేషమునెరుగడు. "హిందూదేశమును సేవించుటకు నేను ఇంగ్లండుకుగాని జర్మనీకిగాని హానిచేయను." అమృతసరు హత్యలచేతను, సైమనుకమిషనువంటి బుద్ధిమాలిన క్రియలచే తను హిందూదేశమంతయు కోపానలముచే భగ్గుమనినపుడు గాంధీజీ యీ క్రోధానలమును, అసంతృప్తిని ప్రేమ, సమా ధానములను భద్రప్రవాహములద్వారా నడిపించెను. రౌండు టేబిలుసభలలో నతడు బ్రిటిషువారియెడల నప్రతిహతమగు ప్రేమను (దౌర్జన్యమునుగాక న్యాయమును,మానవకళ్యాణమును సంపాందించుట యను సూత్రములను ఆధారముగచేసికొను బ్రిటిషుకామన్‌వెల్తుపై) విశ్వాసమును వెల్లడించెను. రౌండు టేబిలుసభల ఫలితముగ రాష్ట్రములలో 'స్వర్థకుశి' పరిపాలన ప్రసాదింపబడెను. ఈ చట్టమునకు ప్రజాబాహుళ్యమంతయు వ్యతిరేకముగనున్నపుడు తిరిగి గాంధీజీయే పనికి వచ్చునంతవరకే సంస్కరణల నుపయోగించుకొనమని కాంగ్రెసును హెచ్చ

రించెను. బ్రిటనుతో సఖ్యముగనుండవలెననియే యతని తాప త్రయము. కాని యీసఖ్యత స్వేచ్ఛ, మిత్రత్వములపై నాధార పడవలెను. ఎట్టిజాతి దురభిమానము, వ్యక్తిగత ద్వేషములేని నాయకుడే నేడు హిందూదేశప్రతినిధి. అతనికి దౌర్జన్యమునందు విశ్వాసములేదు; తనప్రజలు దౌర్జన్యమునకు దిగకుండ నతడు నిరోధించుచున్నాడు. స్వతంత్రజాతుల సమాఖ్యయైనప్పుడే యతడు హిందూదేశమును బ్రిటిషుకామెన్వెల్తునుండి విడవడ నొల్లడు. మే 19 వ తేదీని చక్రవర్తి కెనడాపార్లమెంటులో మాట్లాడుచు "బ్రిటిషుసామ్రాజ్యైక్యత ఒకసమానభక్తిచే ప్రభుత్వముతో సమ్యగ్బద్ధమై, శాంతి, స్వాతంత్ర్య ఆదర్శముల పట్లసమానానురాగములుగలిగి, సమానపరిపాలనా సూత్రముల ననుభవించుచున్నజాతుల స్వతంత్రసంపర్కములద్వారా నేడు వ్యక్తమగుచున్నది" అనియనెను. ఈ "సమానపరిపాలనా సూత్రములనే" హిందూదేశమునకు వర్తింపచేయవలసినదని మహాత్ముడు కోరుచున్నాడు. భారతీయులు తమయింటికితాము యజమానులు కావలెననియే యతనికోరిక; ఇందులో నన్యాయముకాని, యవినీతికాని యేమియులేదు.

కాని యతని యాక్రోశము అరణ్యరోదనమగుట విషాద కరము; శ్రమనెరుగక వత్సరములతరబడి యతడు సలిపినకృషి, అసమానవీర సమరము సఫలత నొందలేదు. అయినను వాని విశ్వాసము, దృష్టి చెక్కుచెదరలేదు. సంశయము, ఆలస్యము

లేకుండ, బేరసారములులేకుండ, కొంతసాహసమనిపించినను, హిందూ దేశమునకు స్వాతంత్ర్యమునిచ్చి స్వతంత్రభారతమును స్థాపించునట్లు బ్రిటిషుప్రజాభిప్రాయముతమప్రభుత్వమును నిర్బంధించుగాక యని నేనాశించుచున్నాను. న్యాయ, సత్యముల పేరిట గాంధీజీ కోరుకోరిక ప్రకారమట్లు జరగనిచో మన రెండు దేశముల సంబంధము మరింత యధ్వాన్నమగుననియు, రెంటి మధ్య ద్వేషము, వైరముపెరిగి రెంటికిని ముప్పు తెచ్చుననియు నేను విశ్వసించుచున్నాను.

గాంధీజీ దక్షిణాఫ్రికాప్రభుత్వమును లేక బ్రిటిషుప్రభుత్వమును, భారతమిల్లు యజమానులను లేక హిందూమత పురోహితులను, సంస్థానాధిపతులను లేక మరెవరిని విమర్శించినను, ఎవరి నెదుర్కొనినను—వానినిప్రేరేపించు మూలసూత్ర మొక్కటియే! "నోరువాయిలేని ప్రజాహృదయములలోనున్న భగవంతునితప్ప నేను వేరు భగవంతుని గుర్తింపజాలను. వారు అతని యునికిని గ్రహింపరు; నేను గ్రహించుచున్నాను. ఈకోట్ల కొలది ప్రజలసేవద్వారా నేను సత్యమను దేవుని లేక దేవుడను సత్యమును ఆరాధించుచున్నాను."

## 4 సత్యాగ్రహము.

"అహింసాపరమోధర్మః" అని భారతము ఘోషించుచున్నది. సత్యాగ్రహములేక ఆత్మశక్తియే జీవితములో దాని కార్యరూపము "ప్రపంచము సత్యముపై నాధారపడియున్నది.

అసత్యమనగా అసత్తు; అనగాలేనిది. "సత్యమనగా 'ఉన్నది' అసత్యము ఉనికిలేనిదేమైనచో దాని విజయమునకు తావేలేదు. సత్యము 'ఉనికి' గలదేమైనచో నెప్పటికిని నాశమునొంద జాలదు" అను సూత్రము దీనికాధారము. భగవంతుడు సత్య స్వరూపుడు. ప్రేమ, స్వతంత్రసంకల్పము సత్యముయొక్క స్వరూపములు. మానవుడు తన ప్రయోజనముల నుద్ధరించు సంకల్పమునే తిరస్కరించిననాడు తన్ను తానే తిరస్కరించుకొను చున్నాడు. ఈ వ్యర్థ వ్యాపారమువలన నతడు సత్యమునకువిరోధి యగుచున్నాడు; దూరుడగుచున్నాడు. అనగా తనకుతానే దూరుడగుచున్నాడు; తన్నుగురించిన సత్యమునకు తానే విరోధి యైనాడు. కాని యిది యింతటితో సమాప్తినొందదు. నిజ సంకల్పమును నిది నాశముచేయజాలదు. సత్యము తన్నుతాను వమ్ముచేసికొనజాలదు. "అధర్మము, అన్యాయము, రాజ్యము చేయజాలదు." భగవంతుడు అజేయుడు. సాధుపురుషులే ప్రపంచముననుభవింపగలరు. తమ్ము రక్షించుకొనవలెనను యత్నములో నుద్ధతులు ఆత్మవినాశము తెచ్చిపెట్టుకొందురు; ఏలన వారసత్యములు, అనాధ్యాత్మికములునగు ధనము, మారణాస్త్రములు మొదలగువానిని విశ్వసింతురు. తుట్టతుదకు మానవులు దౌర్జన్యమును, ద్వేషమును, నాస్తికతను విశ్వసించువారిచేగాక జ్ఞానమును, ప్రేమను, బాహ్యాభ్యంతర శాంతిని విశ్వసించువారిచేతనే పాలింపబడుదురు.

ఆత్మయొక్క ఆంతరంగిక బలముమీదను, సత్యబలము మీదను సత్యాగ్రహమాధారపడియున్నది. దౌర్జన్యము చేయకున్నమాత్రాన చాలదు; దానికి బదులు మంచినే చేయుచుండవలెను. "నా శత్రువునుకొట్టుట దౌర్జన్యము; అతడు నన్నుకొట్టినను నేనతనిని ప్రేమించి యతనికొరకు ప్రార్థించుట నిజమైన దౌర్జన్యరాహిత్యము" ప్రేమ యేకత్వమును సూచించును; చెడ్డ భేదభావమును, ద్వేషమును, అపకృతిని, ప్రాణహానిని సమర్థించును. కనుక నాకెండింటికిని పొందుకుదరదు. ప్రేమ చెడ్డను, తప్పుడుపనులను, అన్యాయమును, కొల్లగొట్టుటను ప్రోత్సహింపదు. అవి 'నాకెందుకని' తప్పించుకొనక చెడ్డచేసినవానిని ప్రేమ, కష్టములనోర్చుకొనుటయును దివ్యశక్తిచే నెదుర్కొనును. దౌర్జన్యముతో దౌర్జన్యము నెదుర్కొనుట మానవప్రకృతికి విరుద్ధము. మన పోరాటములన్నియు మానవసాధనములగు బుద్ధి, సత్సంకల్పము, ప్రేమ, సేవామార్గములద్వారా పరిష్కరింపబడవలెను. ఈగందరగోళప్రపంచములో మానవత్వమింకను మిగిలియుండుటయే శుభచిహ్నము. ఒకప్రక్క యముడు నృత్యముచేయుచుండ సృజనశక్తి తేజరిల్లుచుండును. ఇంతభయము, అంధకారము, దుఃఖము తాండవించుచుండ వ్యవసాయదారు, నేతగాడు, కళాప్రవీణుడు, వేదాంతి, మఠములోనుండుమహాని, రసాయనాగారములో పనిచేయు శాస్త్రవేత్త, బాలురు, వృద్ధులు మొదలగువారందరును తమ ప్రేమద్వారా

బాధద్వారా మానవత్వమును ప్రకటించుచునేయున్నారు. 'ప్రాణోవిరాట్' ప్రాణము అవిచ్ఛిన్నము.

జీవితముకొరకు పోరాటముతప్పదను డార్విను సిద్ధాంతమును దౌర్జన్యవాదులు ప్రయోగించుచుందురు; జంతు, మానవ ప్రపంచములకుగల ప్రధాన తారతమ్యమునే వారుత్రోసి రాజనుచున్నారు. మానవప్రపంచమునకు చెందని దౌర్జన్యమును మనము ప్రయోగించిననాడు మానవజీవితము పశుసాంప్రదాయమునకు దిగజారకతప్పదు. యుద్ధముచేయుచున్న మానవ ప్రపంచమును మహాభారతములో కుక్కలకాట్లాటతో పోల్చినాడు. "మొదటతోకలు తిరుగుట ప్రారంభమగును. తరువాత 'భొయ్యిభొయ్యి'లు దానికి జావాబులు; అటుపై నొకదాని చుట్టునొకటి తిరుగుట, అనంతరము కోరలుప్రచారములోనికి వచ్చుట; ఆపై నిగర్జనలు; తరువాత యుద్ధప్రారంభము. మానవుల విషయములోకూడ తూచాతప్పకుండనిదియే జరుగును." యుద్ధమును కుక్కలకును, కోతులకును విడిచిపెట్టి మనుష్యులవలె ప్రవర్తించుడనియు బాధనుసహించి న్యాయమును కాపాడుడనియు గాంధీజీ మనలను కోరుచున్నాడు. ప్రేమ శత్రువును సాధింపగలదు. అది వానిని నాశముచేయక మార్చివేయును; ఇంతకును నతడుకూడ మనవలె రాగద్వేషములు కలవాడే.

అచ్చటచ్చట కొలదిమందివ్యక్తులుమాత్రమే తమవ్యక్తి జీవితములలో ప్రేమతత్త్వమును ప్రయోగింప ప్రయత్నించిరి;

దీనిని సాంఘిక రాజకీయమోక్షమున కొకప్రణాళికగ గాంధీజీ సాధింపగలిగెను. దక్షిణాఫ్రికాలోను, హిందూ దేశములోను అతని నాయకత్వముక్రింద వేలకొలదిప్రజలు తమదుఃఖములను నివారించుకొనుటకు దీని నుపయోగించిరి. దౌర్జన్యమిసుమంతయు లేని యీ నూతనవిధానము నితడు రాజకీయ విప్లవచరిత్రలో ప్రవేశపెట్టెను. ఇది భారత ఆధ్యాత్మిక సాంప్రదాయమునకు విరుద్ధముకాకపోగా దానినుండియే యుత్పన్నమగుచున్నది.

ఇది సాత్వికనిరోధము, దౌర్జన్యరహిత సహాయనిరాకరణము, శాసనోల్లంఘనము మొదలగు రూపాంతరముల నొందెను. ఇవియన్నియు దోషమునుమాత్రమే ద్వేషించి దోషినిప్రేమించు సూత్రముపై నాధారపడెను. సత్యాగహి శత్రువులయెడ ధీరోదారుడు; శాసనధిక్కారమెప్పుడును శాంతయుతముగ నుండవలెను. "శాంతమనగా సమయానుకూలముగ భాషలోమాత్రమే శాంతమును కనపరచుటకాదు; అది యంతరంగజన్యమైన సాధుత్వము, శత్రువుకు మంచిచేయవలెననెడు కోరిక.'' శత్రువుకష్టములో నున్నపుడెల్ల గాంధీజీ తనయుద్యమమును విరమించి వానికి సహాయముచేసెను. శత్రువుకష్టములనే అదనుగా తీసికొను యత్నములనతడు నిరసించును. బ్రిటను కష్టకాలములో నున్నపుడు మనము బేరములాడరాదు. యుద్ధసమయములోనతడు వైస్రాయికి "వెనుకకుతగ్గునట్లు నాప్రజలను నేను చేయగలిగినచో యుద్ధము జరుగునంతకాలము కాంగ్రెసు

తీర్మానములనన్నింటిని యుపసంహరించుకొనునట్లు 'బాధ్యతా యుత ప్రభుత్వము' 'హోమురూలు' అనుపదములనుకూడ నుచ్చరింపకుండునట్లు చేయగలను." అని వ్రాసెను. స్మట్సు సేనానికూడ గాంధీజీపద్ధతివలన నాకర్షింపబడెను. "నీ ప్రజలనిన నాకుగిట్టదు; నేనువారికెంతమాత్రమును సాయపడనిచ్ఛగింపను. కాని నేనేమిచేతును? మాకష్టములలో నీవు మాకు సాయపడు దువు. మేము నీపైనెట్లు చేయివేయగలము? 'ఆంగ్లసమ్మె దారులవలె' నీవును దౌర్జన్యము నవలంభించిన బాగుండునని నేననుకొనుచుందును; అప్పుడునిన్నెట్లు కడతేర్చవలెనో మేమెరు గుదుము. కాని నీవు శత్రువునకుకూడ నపకారముచేయవు. నీబాధవలననే విజయము నొందవలెనని నీవు కోరుదువు; నీయంతట నీవే యేర్పరచుకొనిన మర్యాదలను ధీరోదారతను నీవెన్నడును ఉల్లంఘింపవు. అదియే మమ్ము అసహాయులను చేయుచున్నది.', అని యతనికార్యదర్శి వాపోయెను. యుద్ధముల నంతరింపచేయుటకు చేయబడిన యుద్ధముజరిగిన యిరువదియేండ్ల లోనే లక్షలకొలది జనులు ఆయుధపాణులు కావింపబడిరి; శాంతిసమయములో సైన్యముల కోలాహలము, నావికాబల సముద్రసంచలనము, ఆకాశమున విమానధ్వనులు, ఇంకేమి కావలెను? యుద్ధము ఏసమస్యను పరిష్కరింపజాలదనియు దానిని మరింత క్లిష్టతరముచేయుననియు మన మెరుగుదుము. యుద్ధముకూడునా కూడదాయను రాద్ధాంతసిద్ధాంతములచే

చాలమంది క్రైస్తవస్త్రీ పురుషులు ఖిన్నులగుచున్నారు. యుద్ధవ్యతిరేకులు యుద్ధము నేరమనియు నాగరికతను క్రూర పరికరములద్వారా రక్షింపబూనుట న్యాయముకాదనియు ఘోషించుచున్నారు. మనతో నెట్టివివాదములేని ప్రజలపై దుఃఖపరంపరలను కురిపించుటకు మనకెట్టి యధికారమునులేదు. యుద్ధమున కురుకుజాతి శత్రువునోడించి నాశముచేయవలెనను దృఢసంకల్పముతోనుండును. భయద్వేషములు దాని నావరించి యుండును. ప్రేమ, క్షమాగుణములతో జనాకీర్ణమైన పట్టణము లను మనమెట్లు యముని కొప్పచెప్పగలము? యుద్ధప్రక్రియ యంతయు సైతానును సైతానుతో నంతమొందింపవలెనను నడియూసకాని వేరొండుకాదు. అది జీససుతత్త్వముకు, బోధ లకు, సాదృశ్యముకు విరోధము. హననకర్మకు క్రైస్తవమతముకు సమన్వయము కుదురదు.

యుద్ధము చెడుగేయైనను ఒక్కొక్కప్పుడది రెండు చెడుగులమధ్య గుడ్డిలోమెల్లయగునని యుద్ధప్రియులవాదన. పరిస్థితులనుబట్టి యేర్పడు విలువను గుర్తించుటే బుద్ధిలక్షణము. సంఘముపట్ల, దానియంగమేయైన ప్రభుత్వముపట్ల మనము కొన్నిధర్మములను నెరవేర్చవలెను. ఒకసంఘములోసభ్యులమగు టచే మనకువ్యక్తి, ఆస్తులరక్షణ, విద్య మొదలగు సౌకర్యములు కలుగుచున్నవి. కనుక ప్రభుత్వమహాయములోనున్నపుడు

సహజముగ దానినిరక్షించి మన వారసత్వమును నిలుపుకొనుట మనవిధి.

ఎట్టి పాపపుణ్యముల నెరుగని ప్రజలను వికలాంగులను, క్షతగాత్రులనుచేసి, చంపినాశముచేయుడని మన మిట్టివాదనలచే పురికొల్పబడుచుందుము. తన ప్రభుత్వములో సభ్యుడుగనుండుట ప్రధాన మానవధర్మమని ఆ ప్రభుత్వలక్ష్యమును సాధించుటే కళ్యాణము, నిజస్వేచ్ఛయనియు నాజీజర్మనీవాదన. వ్యక్తుల భోగభాగ్యములను ప్రభుత్వము తన ఘనతకొరకు బలివేయ వచ్చును. శరీరదుర్బలత్వముచే మానవుడు స్వీయసౌఖ్యమును కోరును; యుద్ధప్రక్రియలోనున్న గొప్పసుగుణమేమన నది యిట్టి కోరికను నిర్మూలించును. ఫ్యాసిస్టుపార్టీయొక్క 20 వ వార్షికోత్సవములో ముసోలినీ యిట్లుచెప్పెను. "పౌరజీవితమును పూర్తిగ నాశముచేయవలసివచ్చినను, ఎంతఖర్చు, ఎట్టి సాధనముల నుపయోగింపవలసినను నేడు మనకు కావలసినవియెక్కువ ఓడలు, యెక్కువ తుపాకులు, యెక్కువ విమానములు." "నిరాయుధులకు నరకమే శరణ్యము" అను వాక్కుచరిత్ర యుగముకు పూర్వమునుండియు వినవచ్చుచున్నది." "అన్నలు, తమ్ములు, అక్కలు చెల్లెండ్రు, సంబంధులు, తల్లిదండ్రులు అను నిర్భాగ్యపు పదజాలము నిక మనము వినకుందుముగాక! ఏలయన ప్రభుత్వములమధ్యగల సంబంధము దౌర్జన్యమొక్కటియే. ఈ దౌర్జన్యసంబంధమే మననీతికి మూలసూత్రములు"

మరియు "నీసమస్యను ధర్మాధర్మపరీక్షకు గురిచేతుమేని దీని కాగగల వాడొక్కడునులేడు." స్వాతంత్ర్య నిర్మాణము పేకాట వంటిది. కొంతమంది శుభసమయమును కనిపెట్టి యితరులను మాడ్చివేయునంతటి చాకచక్యముతోనాడుదురు. లాభము నంతను జేబులలో కుక్కుకొనినతరువాత వారు దేవతలవలె నెదురుతిరిగి జూదముఅరిష్టమని చాటుదురు. తాము త్రొక్కిన త్రోవనే, యితరులుకూడ త్రొక్కినపుడాశ్చర్యచకితులగుదురు. ఒక్కమాధ్య చమూరపులోనే యీ దౌర్జన్యారాధన జరుగుచున్న దనుకొనుట పొరపాటు.

పరిభువులసభలో మార్చి 20 వ తేదీని మాట్లాడుచు క్యాంటరర్బీ ఆర్చిబిషప్పుదొరవారు "న్యాయముపేర ఆయుధబల మును విరివిచేయవలెను." "శాంతినిమించిన పవిత్రవస్తువులు కొన్నికలవు; అవి రక్షింపబడవలెనని మేము విశ్వసించు చున్నాము" అని శెలవిచ్చిరి. "నాగరికతకును మానవకళ్యాణ మునకును నమూల్యములగు వస్తువులను రక్షించుకొనుట దైవ విరుద్ధములని నేననుకొనను." గాంధీజీ దేశభక్తి పూరితమగు సభలోనిలిచి అవసరమైనచో సత్యముకొరకు హిందూదేశమునే బలిచేసెదననునట్టి యసమానమతోన్మాది. "నేను కలిసికొనిన మతపురుషులలో చాలమంది మతవేషధారులైన రాజకీయ వేత్తలు; రాజకీయవేషమును వేసిన నేను నాహృదయమందు మతపురుషుడను" అని గాంధీజీచెప్పెను.

మన కోరికలననుసరించి ఆదర్శమును తగ్గించుటకు మత పురుషులొప్పుకొనరు. వారు మనలనే ఆదర్శప్రాంతముకు లేవ నెత్తచూతురు. మన దేశభక్తి మానవకుటుంబముయొక్క ఆధ్యాత్మిక ఐక్యతను చెడగొట్టును. యుద్ధములో పాల్గొనుటకు నిరాకరించి మా విశ్వకుటుంబభక్తిని నిలుపుకొందుము; మతము ద్వారా, మానవపద్ధతులద్వారా మన ప్రభుత్వభక్తిని నిలుపు కొందుము. అధమముమతపురుషులైనను (క్రైస్తవ దేవదూతల వలె) "మానవునివీడి భగవంతుని శిరసావహించవలెను." సంఘము అన్ని దేశములలోకూడ యుద్ధమునే నీతిగానమ్మకొను వారిచేతులలోనుండుటయే మనకిపుడు తటస్థించిన యనర్థము. జయమే అభివృద్ధియని వారిభావన.

'కుల్లుకుంక' తప్ప మానవుడు శాంతి, కరుణామయుడై నపుడే సుఖమననుభవించుచున్నాడు. సృష్టిలో ఆనందమును, వినాశములో దుఃఖమునుకలవు. సామాన్యయుద్ధభటులకు తమ శతృవులయెడల ద్వేషమేమియునుండదు. కాని పాలకవర్గము వారు వారిభయ, స్వార్థదురభిమానముల నుద్రేకపరచి వారి మానవత్వమును పెడదారిని పట్టింతురు. క్రోధద్వేషములతో దట్టింపబడిన మనుష్యుల లొకరినొకరు నఱుకుకొందురు; ఏల యనవారు ఆజ్ఞలను శిరసావహించవలసిన మానవయంత్రములు. అప్పుడుకూడ వారికాచంపుటలో వ్యక్తిద్వేషముండదు. వారు చేయనొల్లనిపనిని శిక్షకుబద్ధులై చేయుచున్నారు. దీనికి తుది

బాధ్యతయంతయు దయాధర్మశూన్యమైన ప్రభుత్వములదే యని చెప్పకతప్పదు. వారు పాపపుణ్యములెరుగని ప్రజలను బంధించి వారిమానసస్వాన్యమును రూపిమాపిరి. ఐశ్వర్యమును సృజింపగలవారిచే సైనికబలము, నావికాబలము వాయువిమాన దళము మొదలగు విధ్వంసకాగారమున కదము త్రొక్కించు చున్నారు. మనము హత్యలను కీర్తించుచు దయ సిగ్గుచేటగు పనియని హేళన చేయుచున్నాము; సత్యబోధలను నిషేధించుచు నసత్యప్రచారమును సాగించుచున్నాము; మనప్రజలయొక్కయు నితరులయొక్కయు, ప్రాణ, మాన, ధన, సౌఖ్యముల నప హరించుచు ప్రజాహత్యలకును, ఆధ్యాత్మిక వినాశముకును నుత్తర వాదులమగుచున్నాము. పవిత్రమగు సాంఘికజీవితము పట్ల నూతనభావములనుకలిగి అన్నిజాతులును స్నేహ, స్వాతంత్రభావములతో సంచరిచనంతవరకు శాంతియుండనేరదు. న్యాయము, స్వేచ్ఛ, ఆత్మ, మానవునియెడల ప్రేమ—ఇవి గాంధీజీ ప్రాణమనదగును. వీనియెడల చూపబడు విశ్వగౌరవ భావముమీదనే యీ ప్రపంచ నాగరికత మానవత్వము ఆధారపడియున్నవి. దౌర్జన్యపూరితము, దుఃఖభాజనమునగు నీప్రపంచమున గాంధీజీ దౌర్జన్యరాహిత్యమొకకలవలె కాన్పిం చును. అతనికి సత్య, ప్రేమలేభగవంతుడు; ఫలితములను సరకు గొనక సత్యప్రేమల నారాధించుడనియే భగవంతుడు మనలను శాసించుచున్నాడు. 'లాభసాటి' బేరమును కనిపెట్టుటకు బుద్ధి

మంతుడెంతకష్టపడునో ధర్మము నారయుటకు యదార్థమైన మతపురుషుడును అంతకష్టపడును; అవసరమైనచో దానికొరకు తనసర్వస్వమును, తనవ్యక్తిని, తనజాతిని ధారపోయును. "నీ యిచ్ఛనెరవేరుటకునాసర్వస్వము నాశమగుగాక!" అనిస్వార్థము పూర్తిగ నశించినవాడుమాత్రమే చెప్పగలడు. భగవద్భక్తులు ప్రేమపూరితులు, ధర్మపరులునగు వారెవరికిని అపకారము చేయజాలరని గాంధీజీచెప్పెను. ప్రపంచవిజేతలును, దోపిడి కారులును "నైతికచట్టము"ను పర్వతముపై తుదకు తమకు తామే ముక్కలగుదురు. అవినీతిగానుండుట శ్రేయోదాయ కముకాదు. ఏలయన నధికారేచ్ఛయాత్మవంచనయేయగును. "జాతీయకళ్యాణము" అని మనము మాట్లాడునపుడు కొన్ని రాష్ట్రములపై మనకు చలనములేని శాశ్వతాధికారముకలదను ధ్వనికలదు; ఇక "నాగరికత" చూతమనిన యుగధూళిచే కప్పబడిన యనేక నాగరికతలను ప్రపంచము చవిజూచెను. వాని నగరము లిప్పుడరణ్యములు; అచ్చట నిపుడు సృగాల ములు రాత్రిందివములు రోదనము చేయుచున్నవి.

విశ్వాసికి "నాగరికత" "జాతీయకళ్యాణము" అను వ్యాజములక్కరలేదు. ప్రేమకు ఎత్తుపైయెత్తులతోను లెక్కల తోను పనిలేదు. ఆధునిక ప్రపంచదార్జన్యమునుండి తప్పించు కొనుటలేక వినాశముచేయుటతప్ప వేరుమార్గములేదని నిస్పృహ చెందువారి కనేక నిరంకుశత్వములధాటికి నిలిచినట్టియు, నెప్పు

డును నిలుచునట్టియు, సందరకును అంకుబాటులోనుండునట్టియు ప్రేమతత్త్వమను మరియొకమార్గమును మహాత్ముడు చూపినాడు. ఇప్పటి బ్రహ్మాండమైన వివిధపశుబల ప్రదర్శనముల ముందర సత్యాగ్రహము చప్పిడికార్యకలాపమువలె కాన్పించవచ్చును. కాని చప్పుళ్లకును, సంఖ్యల గజిబిజికినిలొంగని యమృతమైన మానవాత్మయొకటికలదు. నిరంకుశులు కల్పించు శృంఖలములనది తుత్తినియలుచేయును. మార్చిలో సంభవించిన విషమసమయమున ప్రపంచముకొక సందేశము నీయవలసినదని న్యూయార్కు పత్రికాప్రతినిధి యడిగినపుడు ప్రజ్వామిక ప్రభుత్వములన్నియు నేకకాలమందు ఆయుధవిసర్జన చేయవలెనని యతడుచెప్పెను. "నేనిచ్చట కూర్చుండుట యెంతసత్యమో దీనివలన హిట్లరు కనులువిడి నిరాయుధడగుటయు నంతసత్యమే యగును" "అది కేవలమొక విచిత్రముకాదా ?" అని ప్రాశ్నికుడు మరల పృచ్ఛించెను. "కావచ్చును కాని యది ప్రపంచమునకు దాపరింపనున్న నరహత్యాకాండకు స్వస్తిచెప్పును." "ఎంతటికఠినలోహమైనను అగ్నిహోత్రములో కరుగకతప్పదు; అట్లే సత్యాగ్రహతాపము ముందర నెంతటి కఠినహృదయమైనను కరుగును. సత్యాగ్రహముత్పన్నముచేయు తాపమునకు మేర లేదు...నా అర్థశతాబ్దానుభవములోను సత్యాగ్రహముద్వారా పరిష్కరింపబడని పరిస్థితి యేదియు నేర్పడలేదు." అని యతడు చెప్పెను. ప్రేమమానవజీవితధర్మము; దాని సహజావసరము.

ఈ యవసరము ప్రకటనకావలసినస్థితి యాసన్నమైనది. మానవులీసూత్రమును నిరాకరించినను, ఉల్లంఘించినను మానవజీవితమే దుస్సాధ్యమగు దినములువచ్చెను. యుద్ధమవసరములేని జీవితముకు కావలసినంతటి స్వార్థత్యాగము లేక పోవుటచేతనే మనకు యుద్ధములు సంప్రాప్తమగుచున్నవి. వ్యక్తి తనహృదయములోనే శాంతినిచూఱగొనవలెను. దురభిమానము, స్వార్థము, దురాశ, భయము అనువాని యధికారముల నతనిలోనున్న యాత్మనాశముచేయవలెను. అన్నివర్గములయొక్కయు, కులములయొక్కయు, జాతులయొక్కయు నిజప్రయోజనములను రక్షించిపోషించు జీవితవిధానము కావలెను; జాతీయజీవితముకును, ప్రపంచక్రమమునకును పునాదియగు ఒకనూతన జీవితవిధానము కావలెను. స్వార్థపూరితము, అజ్ఞానమయమునగు అవిద్యనుండి ముక్తినొందిన ముక్తపురుషులే శాంతికొరకు పనిచేసి దానిని స్థాపింపగలరు.

గాంధీజీకీర్తి ప్రపంచవిఖ్యాతిపొందిన జాతీయనాయకుల యొక్కయు రాజకీయవేత్తలయొక్కయు కీర్తినిమించుటయు, నతనివ్యక్తి పరింత ప్రేమ పాత్రమగుటయు నాప్రపంచయాత్రలో నేనుకనుగొంటిని. అతడుమానవలోకమున కాప్తుడని భావింపని 'వ్యవసాయదారు'కాని, ఫ్యాక్టరీకూలీకానిలేడు. అతడు కృత

యుగమును పునః ప్రతిష్ఠించునని వారు భావింతురు. కాని మనము దానినంత సుళువుగ సృజింపజాలము. ఏమన యేజాతి కినిలేనంతటిశక్తి కలిగియు అవమానకరమగుఅజ్ఞానమునకుమనము దాసులమైతిమి. జీవితముకొఱకే మనకన్నిశక్తులును ప్రసాదింప బడియుండగ మనము వానిని మృత్యుగహ్వరమున కొప్ప చెప్పితిమి. సుఖించుటకే స్పష్టముగ మానవసృష్టి యుద్దేశింప బడియుండగ మనమాహక్కును నిర్లక్ష్యముచేసి, సందేహాస్ప దమగు కొంతమంది సౌఖ్యముకొరకనేకుల సౌఖ్యముల నప హరించు ధనాధికారాన్వేషణములో మనశక్తులను వమ్ము చేసితిమి. మనమేప్రమాదములకు దాసులమైతిమో ప్రపంచము కూడ దానికేదాస్యముచేయుచున్నది. మనము ధనాధికారముల కొఱకుగాక ప్రేమను, మానవత్వమును స్థాపించుటకే ప్రయ త్నించవలెను. ప్రమాదమునుండి విముక్తినొందుటొక్కటియే యదార్థమైనస్వేచ్ఛ.

గాంధీజీమోక్షజీవితప్రవక్త. అతని ప్రత్యేక పవిత్రత వలనను, వీరత్వమువలనను లక్షలకొలది ప్రజలతనికి బాసటగ నుందురు. ఆధునికదేశికులు అనిర్దిష్టమగు సాధారణమంచిని ఆచారబద్ధమగు శ్రీరంగనీతులను, సరసమగునటనలను బోధింప గలరేకాని యిట్టి యసమానపవిత్ర సాదృశ్యములలోని దివ్య శక్తిని, సత్యస్వరూపమును చూపజాలరు. సత్యవ్రతము సరళత,

పవిత్రత, సాధుహృదయము, దుఃఖోపద్రవములందు సంతోషోత్సాహములు, జీవితమును ప్రేమించుట మృత్యువును ధిక్కరించుట, ఆత్మను సేవించుట గతముకు స్వస్తిచెప్పుట:— సృష్టి ప్రారంభమైనదిమొదలు యింతకంటె గొప్పవిషయములు బోధింపబడలేదు; ఎవరును జీవింపనులేదు.



# మహాత్మాగాంధీ -- ఒకయంచనా.

**హొరేసు జి. అలెగ్జాండరు** యం. యె.

గొప్పవానిని వాని జీవితములోనే గ్రహింపబూనుట సులభము కాదు. అతనిని స్వయముగ నెరిగియుండినచో నది యొకవిధముగ మరింత కష్టతరమైన విషయము. మనమొకనిని నిజరూపములో తెలిసికొనుటకు కొంతదూరములో నుండవలెను. కాని మహాత్మాగాంధీ కావంతదూరములో నుండుటకును నే నిచ్ఛగింపను. అతడు జీవించియున్నంతకాలము హరిజన పత్రికద్వారా యతని భావములను గ్రహించుచు వీలైనంతవర కతనికిసన్నిహితముగ నుండవలెననియే నా కోరిక.

అయినను ప్రపంచమతనినిగురించి యప్పుడప్పుడు వేయు ప్రశ్నలకు సమాధానము చెప్పవలసియుండును. అతని సమకాలికులలో కొంతమంది యతనినిగురించి యెట్లు భావించుచున్నారో గ్రహించుటయే యీపుస్తకముయొక్క ప్రయోజనమని నేను భావించుచున్నాను.

ఈక్షమాపణతో మన యాధునిక ప్రపంచమును దృష్టియందుంచుకొని నే నతని నెట్లు గ్రహింతునో చెప్పబూనెదను.

అనేక దేశములలో ననేకరూపములలో తలయెత్తిన విప్లవముల నీయుగముచూచెను. ట్రేడులయూనియను ఉద్యమ

మములు, వివిధరూపములు తాల్చిన సామ్యవాదము పాశ్చాత్య లోకమందటను పారిశ్రామిక కార్మికుల హక్కులనుచాటెను. అంతర్జాతీయకార్మిక వ్యవస్థ యీపోరాటముయొక్క ప్రథమ ఫలముకావచ్చును. కాని రష్యాదేశములో నిదిమరికొంత ముందంజవేసెను. అచ్చట పారిశ్రామిక కార్మికునకు ప్రత్యేకమైన యున్నతస్థానములభించెను. సామ్యవాద ప్రభుత్వము, రాత్రింబవళ్లు పనిచేయుచు కాణనాకరును, బీదరయితును, బెస్తలు మొదలగు నితరులను కేవలము మరచిపోలేదు; కాని వీరందరికిని వర్ధన చిట్టచివరజరిగెను.

జర్మనీలో శాస్త్రీయమైన సామ్యవాదులుగాని, పారిశ్రామిక కార్మికులుగాని గొప్పవిప్లవమును సాధించలేదు; యుక్తిపరులులేక అల్పనీతిపరులునగువారు గలమరియొకపార్టీ ప్రజాబాహుళ్యములోని ఛోటాబూర్జువాల (పిల్లజమీందార్లు) సహాయమును బడసెను. చెలామణిపెంపుదలలో వారును తమ లాభములను కోల్పోయి నిస్పృహులైరి. కారల్‌మార్క్సు శిష్యులచేనిందింపబడి లేక మరచిపోబడిన యీతరగతి సహాయమువలననే హిట్లరు జయమునుబడసెను.

కాని హిందూదేశమునుండి గాంధీజీ యీపాశ్చాత్య విప్లవములనన్నింటిని సవాలుచేయుచున్నాడు. పాశ్చాత్యదేశములలో నధికారముకొరకు ప్రాకులాడుచున్న పారిశ్రామిక కార్మికులు, పిల్లజమీందార్లు, ఆస్తిపాస్తులుకలవారు, విద్యార్థి

కులు - వీరందరును మానవుడు తిండితినవలెనను ప్రధానవిషయ మును మరచిపోవుచున్నారు. అతడు యంత్రములను, వర్తకమును, పాఠ్యపుస్తకమును, లాభములను తినజాలడు. ఇవేవియు లేకుండ మానవుడు జీవింపగలడు. కాని నిత్యము తిండితినకుండ నతడుండలేడు. ఈతిండికొరకు (ఇదిదానంతటదియే యుత్పన్న మగుచున్నట్లు నాగరికుడు, పట్టణవాసి యనుకొనును) అతడు హిందూదేశము, చీనా, తూర్పుయూరపు, కనడా, అర్జంటైను, ఆఫ్రికాలలో తరచు ఆకలిబాధచే మలమలమాడు లక్షలకొలది నోరువాయిలేని వ్యవసాయదారులపై నాధారపడుచున్నాడు. ఈ యన్ని దేశములలోను వ్యవసాయదారు మానవజీవితమును నిలుపు ఆహారమును తయారుచేయుటకు కొండనక, యెండనక, వానసక, చలియనక, పిడుగనక, పిశాచమనక, తేలనక, పాము నక, రాత్రియనక, పగలనక యేమేట చెప్పరాని కష్టముల నింకను పడుచునే యున్నాడు. వేలకొలది వత్సరములనుండి, పురుష పురుషాంతరము వారిట్లు పాట్లుపడుచునే యున్నారు. ఈలోపున యుద్ధములు, విప్లవములు వచ్చి యతివృష్టి యనా వృష్టులవలెనే వారి కాయకష్టఫలితమునంతను తుడిచివేయుచు న్నవి. నేటికి వారు మహాత్మాగాంధీని, తమ ప్రతినిధిని కను గొనిరి.

భారతదేశములోని కోటానుకోట్ల ప్రజలలో గాంధీజీ నామము నెరుగనివా డొక్కడునుండడు. కొండజాతులు,

కోయజాతులు ఆటవికులు కూడ నీదరిద్ర కల్పవృక్షము నెఱుగుదురు, ప్రేమింతురు.

అతడు ప్లీడరు పర్భీదు పొందినను తిరిగి వ్యవసాయదారుగ మారెను; వ్యవసాయదారు నిరాడంబర బాహ్యవేషమే గాక, మహాత్ముని దివ్యహస్తములచే నిర్మాలిన్యము గావింప నొల్లనంతటి ఛాందసకుగ్రామములో నతడు వసించును. అతడు వ్యవసాయదారుదృష్టితోనే అనగా వివేకము, నిర్మొగమాటము, సరళత, అప్పుడప్పుడు కొద్ది మోటుతనము, హాస్యము, దయ, ఓర్పు, గాఢ మతాభినివేశము, మనకు తెలియకుండ కొన్ని శక్తులు పనిచేయుచుండునను జ్ఞానము, జీవితమును సమగ్రముగ చూచుట—ప్రపంచమును వీక్షించును.

1928 లో హిందూదేశములో ఆరు నెలలు సంచారము చేసినతరువాత నతనిని కలుసుకొనినపు డతడు చెప్పినమాటలన్ను నేనెన్నటికిని మరువజాలను. "నేను యింగ్లండు వెళ్ళినపుడు నా పరిజలకేమి చెప్పను?" అని యడిగితిని. "ఇంగ్లీషుప్రజల మాభుజస్కంధములనుండి తొలగుడని మీరుచెప్పవలెను" అని యతడు చెప్పెను. దీని భావమేమియో గ్రహింపుడు! ఇది సాధింపవలసిన విషయమునేగాక, దాని విధానమునుగూడ సూచించుచున్నది. గమ్యములోను విధానములోను గూడ మన యుగములోని యితర విప్లవనాయకులకును మహాత్మునకును భేదము కలదు. భారత రాజకీయములలో నెట్టి జోక్యమును కలిగించు

కొనకపూర్వము 1908 లో హింద్ స్వరాజ్ అను పుస్తకములో నత డిట్లు వ్రాసెను. "రాజులెప్పుడును తమ కులోచితములగు నాయుధములనే ప్రయోగింతురు. దౌర్జన్యము వారి కుగ్గుపాలతో నేర్పబడెను............ కత్తి యెన్నడును వ్యవసాయదారును జయింపలేదు. ఇకముందును జయింపజాలదు. అతడు కత్తి నుపయోగించుట నెరుగడు. ఇతరులు దాని నుపయోగించినను భయపడడు." కనుక గాంధీజీ లక్ష్యమైన వ్యవసాయదారు స్వరాజ్యము, వ్యవసాయదారు పరిపాలన, వ్యవసాయదారు స్వేచ్ఛ—దీనికి తగిన సాధనముల ద్వారముననే సాధింపబడవలెను. మానవులను పాలించవలెనను లక్ష్యము కలవారు కత్తిని ఘుళిపింతురు. ప్రతి పాలకజాతియు నీయాయుధమునే చేబట్టును. "పాలక జాతిని" సామ్యవాదులు, కమ్యూనిస్టులు, నాజీలు లేక ఫేసిస్టులు తమ ఆయుధములద్వారా నాశముచేయ కోరినపుడు వారి విజయ మొక పాలకజాతిని మాత్రమే స్థాపించును. భూఖామందులు, ఫ్యాక్టరీ ఖామందులు లేక బ్యాంకు యజమానులు మొదలగువారి చేతులలో నుండుటకు బదులు కత్తి నాజీపార్టీ, కమ్యూనిస్టుపార్టీ లేక ఫేసిస్టుపార్టీ యజమానుల చేతులలోనికి మారుచున్నది. సామాన్య పౌరుడు యథాప్రకారముగ నలిపివేయబడుచున్నాడు. మరియొక పాలకవర్గము ప్రజల భుజములపై కెక్కుచున్నది.

గాంధీజీ ప్రస్తుత పరిపాలకులను త్రోసివేసి తన మిత్రుల నెక్కించవలెనని కోరక వ్యవసాయదారుల భుజములపై నొక పాలకజాతియొక్క భార మెప్పటికిని లేకుండ చేయవలెననియే కోరుచున్నాడు. కనుక నతడు భుజబలము కలవాడును లేనివా డునుకూడ నుపయోగించదగిన ఆయుధమును కనిపెట్టుటకే తన జీవితమునంతను వినియోగించెను. అతనిదగ్గర శిక్షనొందినవారు అక్రమ భారములచే కృంగిపోక తమ నిజబలమును గుర్తించి ధీరులవలె నిలువగలరు.

ఉన్నవానిని తరిమి నీవే ప్రజల వీపులపై నెక్కి కూర్చుం డక వాడచ్చట నున్నంతవరకు వాని కెట్టిసహాయమును చేయ రాదని గాంధీజీ చెప్పెను; వాడు చివరకు క్రిందకు దిగిరావలెను. అతని యండ, అతని బలము నిర్వీర్యము కావలెను. అతనికి నీవు సహాయము చేయనిచో నిన్ను అనేకబాధల పెట్టెదనని బెదిరింపవచ్చును; ఆ బెదిరింపుల నాచరణలో పెట్టవచ్చును. కాని ఖయిదులను చావును కూడి నీవు పరిహసించిననా డతని బెదిరిం పులు బెదిరిపోవును; అతని కత్తి మొక్కవోవును. దోషమని నీయంతరాత్మ నీకు బోధించుపని నతడు నీచేత చేయింపజాలడు.

ఈ దౌర్జన్యరాహిత్య విధానము సఫలమగుటకుపూర్వ మనేకకష్టములను తరింపవలెను. దెబ్బకు దెబ్బతీయుట కవకాశ మున్నను మరఫిరంగిజ్వాలల నెదుర్కొను సిపాయిలను తయారు చేయుట కష్టము; అట్టిచో తమ్ము రక్షించుకొనకుండ నెట్టిదార్ఢ్య

స్యమునైనను సహించు సిపాయిలను తయారుచేయుట సులభ సాధ్యము కాదు. సత్యాగ్రహులు "నిర్దుష్టమైన బ్రహ్మచర్య మును, దారిద్ర్యమును, సత్యమును, నిర్భయత్వమును వరింపవ లెను" అని గాంధీజీ ముప్పదిసంవత్సరముల క్రితమే చాటెను. అజేయమైన యీసత్యాగ్రహ జీవితరహస్యమును గ్రహించిన స్త్రీ పురుషు లన్నియుగములలో నున్నారు. ఖయిదులలోను, క్యాంపులలోను బంధింపబడిన జర్మను మతాచార్యులు కొందరీ మధ్య వ్రాసినయుత్తరములనుబట్టి యిట్టిశీలమిప్పుడును తూర్పు పశ్చిమ దేశములలో సాధింపబడవచ్చునని స్పష్టమగుచున్నది. ప్రజాసామాన్యము కిది సాధ్యమైననాడు నిజమైన మానవస్వా తంత్ర్యము, నిజమైన మానవసంఘము సంప్రాప్తమగును. తన శాంతిసైనికుల, స్వాతంత్ర్యసైనికుల అపారయాత్మశిక్షణముపై నాధారపడు గాంధీజీ "గుంపు, మూక"నుగురించి బాధపడడు. సామ్రాజ్యమును నిర్మించుటకుగాని, విప్లవముకుగాని కావలసిన ఫిరంగిమేతనుగురించి యోజించునపుడు నీవు సహజముగ మాన వులను అమానుష "నిర్జీవపు, ముద్ద"గ చేయుచున్నావు. కాని గాంధీజీకి "ప్రాణములతో నుట్టిపడు ప్రజాకోటి"లో ప్రతియొక్క డును (స్త్రీకాని పురుషుడుగాని) తా నెంతపవిత్రుడో యంతపవి త్రివ్యక్తి. అతడు తనతో సమానమగు విద్యగలవానితో నెంత నిష్కాపట్యమైన స్నేహము చేసికొనునో విద్యాగంధములేని వ్యవసాయదారుతోకూడ నట్టి స్నేహమునే చేసికొనగలడు.

అతని దృష్టిలో సామాన్యుడు లేక మలినభూయిష్టుడు అగు వ్యక్తియే లేడు. ఇది యతడు బోధించు మెట్టవేదాంతముకాదు; ఇది యతని నిత్య సాధన.

దార్ఢ్యమే శరణ్యమని భావింపబడు యీయుగములో, నెంతటి యుద్ధతుడైనను తయారుచేయజాలనంతటి సైన్య"నికాయము లిచ్చు భద్రత" యొక్కటే శరణ్యమని పశ్చిమ దేశములలో మానవుడు భావించు యీయుగములో, శాశ్వతశాంతిని స్థాపించుటకు ప్రథమసోపానముగ "ధర్మపక్షమున దార్ఢ్యము కేంద్రీకరింపబడవలెను" అని పెద్ద క్రైస్తవ మతాచార్యుడంతటివాడు సూచించుట తప్ప వేరుగతిలేని యీయుగములో, కంట్లుండి చూడగలిగినచో మన యెదుట నొక దుర్బలశరీరుడు (విశేషారోగ్యము లేనివాడు) అసామాన్య బుద్ధి సంపత్తు లేనివాడు, దివ్య తేజోదీప్తమైన మానవాత్మ బలవత్తర సైన్యముకంటెకూడ బలవత్తరమైనదని ప్రదర్శించుచున్నాడు. తమ సాధుత్వమునందు విశ్వాసమున్నచో సాధుజనులే సదా ప్రపంచమును పాలింపగలరు. వారు హిట్లరు, స్టాలినుల భయమును వీడి మన యుగములోని పురుషోత్తముని యడుగుజాడల ననుసరించిన చాలును.

—§—

# ఒక మిత్రుని పొగడ్త

## సి. యిఫ్. ఆంద్రూసు.

మూడు ఉద్దేశ్యములతో నేనీవ్యాసమును వ్రాయుచున్నాను. ఒకటి; గాంధీజీ శీలములోనున్న గంభీరమైన మతాభినివేశమును స్థాలీపులాకన్యాయముగ వివరించుట. రెండు; ఆవ్యక్తిలోని మానవహృదయమును వెల్లడిచేయుట. మూడు; ఆధునిక యుగమున మానవాభ్యుదయమునకు నాదృష్టిలో నతడొనర్చిన నవీన కార్యములు.

I

మహాత్మాగాంధీ మతసంబంధమైన కొన్ని ప్రధానగుణముల నెక్కువగ పరిగణించును. వానిద్వారా భగవంతునియెడల భయభక్తులు గలిగి మర్త్యుడు శాశ్వతకార్యములను చేయగలడు.

మొదటిది-సత్యము. అతని దృష్టిలో నిదియొక దివ్యగుణము. దీనిని వాచా పలుకుట కర్మణా ఆచరించుటయేగాక గుహ్యాతిగుహ్యమైన యంతరాత్మలోకూడ బూనవలెను. అబద్ధమాడకుండుట సత్యపథములో నొక ప్రధానభాగమేయైనను నంతమాత్రమునచాలదు. హృదయమే సత్యప్రాదమని యతడు భావించును. భగవంతుని యవ్యక్తనామము నతడు 'సత్యము'

అని పిలుచునప్పుడు సత్యమెంత గంభీరమైనదో ద్యోతకమగుచు న్నది. అతడెప్పుడును "సత్యమే భగవంతుడు, భగవంతుడే సత్యము" అని చాటుచుండును. సత్యము నతడెంత యూప్యాయ ముగ నారాధించునో యతని నిత్యజీవితమే స్పష్టము చేయ గలదు. సత్యపథమునుండి యావంత చలించినను దైవదూరు డగును; ఆధ్యాత్మిక శోష కలుగును. వెలుతురులో నడచుటకు బదులు అంధకారములో నడచుటయగును.

అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ

అను నిత్య ప్రార్థన దీనిని మూడువిధముల స్పష్టము చేయుచున్నది. జ్యోతి అంధకారము, అమరత్వము ఆధ్యాత్మిక మరణము-సత్యాసత్యముల మధ్యగల ప్రధాన వ్యత్యాసము యొక్క రూపాంతరములే యని గుర్తింపవలెను.

రెండవ గుణము భగవంతుని యందే పీఠము నేర్పరచు కొనిన యహింస. "హింస చేయకుండుట" అని దీనిని తర్జుమా చేయవచ్చును. కాని మహాత్ముడు దీనికింతకంటె గొప్పయర్థము నిచ్చుచున్నాడు. మంచిని చేయవలెననియే దీని భావము. రక్తపూరితమగు యుద్ధముతో మనమెట్టిసంబంధమును కల్పిం చుకొనరాదు; ఇంతేకాదు; మనకపకారముచేసినవారిని సంస్క రించుట కెట్టిబాధలనైనను సహించు నిచ్ఛాశక్తికూడ నిందులో

నిమిడియున్నది. సత్యమువలె నిదియును భగవంతుని నిజస్వభావమే. "అహింసా పరమో ధర్మః" అను నార్యోక్తి కలదు. కనుక మహాత్ముడీధర్మమును సత్యముతో సంపూర్ణముగ సమన్వయపరచి, దీని మహత్తరశక్తిని శోధించుటకు తన జీవితమునంతను ధారవోయుచున్నాడు. అహింస అసత్యముతో కేవల సాత్వికనిరోధమునుగాక క్రోధ, ద్వేష, దౌర్జన్యములులేకుండ దానిని తీవ్రముగ నిరోధించుటే యగును.

మూడవది; బ్రహ్మచర్యము; పవిత్రత. ఈపేరు సంస్కృతమున "బ్రిహ్మ" అనగా భగవంతుడు అను పదమునుండి యుత్పన్నమైనది అని యతడు సూచించుచున్నాడు. మిథునకర్మను కట్టిపెట్టి, దాని నుత్కృష్టవిషయములపై మరలలించిన యెడల నద్భుతపటుత్వమును, దివ్యబలమును గల ఆధ్యాత్మికశక్తి యుత్పన్నమగునని చెప్పుచున్నాడు. సత్య, అహింసలను నిజముగ నారాధింపగోరువాడు బ్రహ్మచారి కావలెను. వివాహముకూడ మానవ దుర్బలత్వముచే నేర్పడిన రాజీవిధానమని యతడు భావించును; అనగా మిథునకర్మను పూర్తిగ విసర్జించుటేకాక, ఆతలంపులనుకూడ రానీయకుండుటే ఈప్రపంచములో మానవుడు సాధించగలిగిన అత్యుత్తమాధ్యాత్మిక జీవితమని యతడు భావించును. సన్యాసతత్వ్య మతనిలో బలవత్తరమగుటచే నతడీవిషయమున కెక్కువ ప్రాముఖ్యత నిచ్చుచున్నాడని నా యభిప్రాయము. అట్లే తన కోరిక యీడేరువరకు

నతడు చేయు నుపవాసములును నా కర్థము కాలేదు. ఈవిష యము నా కేవగింపుగ నుండునని నేనతనితో ననేకసారులు చెప్పియుంటిని.

గాంధీమహాత్ముఁడు ప్రథమతః మతపురుషుఁడు. దైవకృప లేనిచే దుర్మార్గము పూర్తిగ నశింపదని యతని తలంపు. కనుక నతని కన్నిపనులకంటెను ప్రార్థన అతిముఖ్యము. సత్యా గ్రహియైనవాని కన్నిటికంటెను సత్య, ప్రేమస్వరూపుఁడైన భగవంతునియందు విశ్వాసము ప్రధానము. అతఁడు మౌనముగ చేయు ప్రార్థనాఫలితముగ నంతర్వాణి యాజ్ఞానుసారముగ కొద్ది నిముషములలో నతని జీవితపద్ధతి యంతయు మాఱిపోవుట నేనెఱుఁగుదును. అతి విషమపరిస్థితులలో సంశయవిచ్ఛేదమగు నొక వాణి యతనికి వినవచ్చును; ఈదివ్యసందేశము వినిపించి నపుడతని విశ్వాసము నీప్రపంచములో నెట్టిశక్తియు చలింప చేయజాలదు. అతఁడు బహిరంగ ప్రార్థనలలో నిత్యము భగవ ద్గీతను పఠించును. ఆధ్యాత్మిక జీవితపథమని యతఁడు భావించు దానినే యీభగవద్గీత మఱింత దృఢపఱచుచున్నది.

నా చిరకాల, సన్నిహితానుభవమునుబట్టి నేనుగ్రహిం చినంతవరకు భగవంతుని గురించిన యతని భావములలో నొక వింత శ్రోత్రియత్వము కానసగును.

## II

ఇక నతని మానవసంస్కారము గమనింపదగినది. ఇందులో నతిమార్దవములు, ప్రేమాస్పదములునగు ఛాయ లనేకములుగలవు. ఇవి పై నివర్ణింపబడిన తాపసకర్మలతో సమానముగ నెప్పుడును. తులదూగగలవు.

మహాత్మాగాంధి "ఇప్పటి పాల్ ఋషిసత్తముడు" అని రోమనురోలాండు వర్ణించిన వర్ణన నన్ననేక వత్సరములక్రితమే యాకర్షించెను. దీనిలో నెంతయో సత్యముకలదు. పాల్ వలెనే గాంధీజీకూడ మతపురుషులలో ద్విజులలెక్కలోచేరును. అతడు తనజీవితములో నొక ప్రత్యేక సమయమున "మార్పులేక సంస్కారము" అని మనము పిలుచునట్టి మానవాత్మయొక్క విపరీతమగు మార్పునుపొందెను. అతడు మొట్టమొదట ప్లీడరు వృత్తినవలంబించెను. అతడెప్పుడును విజయపతాకధారి. తన వృత్తిలోను, మానవజీవితములోను, (తన హృదంతరాళమున) జాతీయనాయకత్వములోను అతడు జయభేరి మ్రోగించెను.

ఇద్దఱు భారతవర్తకులకు సంబంధించిన యొక కేసులో నతడు లాయరుగ దక్షిణాఫ్రికాకువెళ్లెను. ఇంతవరకు వర్ణము వలనకలుగు నడ్డంకులనతడు దూరమునుండి చూచాయగావినెనే గాని తన కేయట్టి యవమానము జరిగినపుడేమగునో గుర్తింప లేదు. అతడు డర్బనునుండి మారిట్జ్బర్గు వెళ్లులోపల నతి భయంకరమైన యనుభవమతనికి గలిగెను. అతడు మొదటి

తరగతిటిక్కెట్టు కలిగియున్నను రైల్వేయధికారులతనిని బండిలో నుండి బయటకు గెంటివేసిరి. ఎట్టిపరిచయులునులేని యొక క్రొత్తరైల్వేస్టేషనులో నర్ధరాత్రివేళ నతడేకాకిగా విడువబడెను. ఈ పరాభవ మయిన తరువాత నతడారాత్రియంతయు చలిలో వడవడవణుకుచు నచ్చటనేకూర్చుని తిరుగు స్టీమరులో హిందూ దేశమునకు పోవుటయాలేక తన దేశీయులనుభవించుచున్న దుఃఖములన్నింటిని తుదివరకును తానుకూడ ననుభవించుటయా యను యాలోచనలో నిమగ్నుడయ్యెను. తెల్లవాఱులోపల నతనికాత్మజ్యోతి ద్యోతకమయ్యెను. దైవానుగ్రహముతో పురుషోచితధర్మమును నెఱవేర్చుటకే యతడు నిశ్చయించెను. వెంటనే పరాభవముతరువాతపరాభవము అతనినెదుర్కొనెను. దక్షిణాఫ్రికాలో నివిలేని రోజే యతడెఱుగడు. కాని యతడు ప్రమాణధురంధరుడు కనుక వెనుకచూపు నెఱుఁగడు.

ఆరాత్రి కథను గత నవంబరులో డాక్టరు మాట్ కతడు చెప్పుచుండగా నేనువింటిని. అతని నూతన నిజజీవితము ప్రారంభ మగుట కిదియేకీలకము. మోటరూపుకల పాల్‌బుషిలో ద్యోతక మగు కొన్నిగుణములు మహాత్మునిలో కానవగును. మానవున కెన్నడును లొంగని భగవద్విశ్వాసము; పాపమునకు ముఖ్య ముగ విషయ సంబంధముకలవానికి, భయవిహ్వలతనొందుట; తానెక్కువగ ప్రేమించువారు పొందవలెనని యతడు కోరు స్థితినుండి పడిపోకుండ వారియెడల కారిస్యతవహించుట; అయి

నను తన నపార్థముచేసికొనినపుడు మానవ హృదయమార్దవమును చూపుట.

ఫ్రాన్సిస్ ఋషితో పోల్చతగిన విశేషాంశమతనిలో కలదు. అతడుకూడ దారిద్ర్యమునే వరించెను. నేడతనిని "సైగానులోవసించు బక్కచిక్కిన బీదమనిషి" అని యదార్థముగ పిలువవచ్చును. ఏలన అతడచ్చట నణచివేయబడిన పేదలగు గ్రామవాసులతో వారి కష్టములను తానుకూడ భరించుచు నివసించుచున్నాడు. ఫ్రాన్సిస్‌తో పోల్చదగిన రెండు సందర్భములు నాకింకనుకండ్లకుకట్టినట్లు స్పష్టముగాకాన్పించును.

మొదటిది డర్బనుదగ్గరనున్న ఫొనిక్సు ఆశ్రమవద్ద నొక నాటి సంధ్యాకాలమున జరిగినవిషయము. ఎడతెరపిలేకుండ రోజంతయు బీదప్రజల సేవలోగడిపి మహాత్ముడు మానవుడు సహింపజాలనంతటి శ్రమనోర్చి వినీలాకాశము ఛాయలనేద తీర్చుకొనుచుండ నొకవ్యాధిగ్రస్త శిశువుకనిపించెను. అతడామెను తొడపైనిడుకొని చికిత్సచేసెను; జాలిపుట్టించు ననురాగముతో నామె యతని నాశ్లేషించుకొనెను. ఆశ్రమము వెనుక నున్న గిరికన్యకయొకతెకూడ నచ్చటకూరుచుండెను. చీకటి అంధకారబంధురమగుచుండ నతడు 'జ్యోతీ! దిక్కుచూపుము' అనుగీతము నన్నుపాడుమనెను. అతడతి పిన్నవాడైనను ఒక్క నిముసమైనను తెరపిలేని సేవచే నతని బక్కశరీరము శుష్కించి యుండెను. అయినను ఈగీతము ప్రారంభమగుటతోడనే యతని

యంత్మరాత్మ పరిఫుల్లమయ్యెను. రెండవరంగము ఒరిస్సాలో సంభవించెను. అతడకస్మాత్తుగ శోషించిపోయెను. రక్తపు పోటు ఉపద్రవస్థితికివచ్చెను; మృత్యువే యాసన్నమైనట్లయ్యెను. నాకు తంతివచ్చుటతోడనే యతని ప్రక్కనుండవలెనని రాత్రి యంతయు పయనించితిని. నేనిచ్చటకు చేరుసరికతడు రాత్రి యంతయు విశ్రాంతిలేక సూర్యోదయమున కెదురుగపడుకొని యుండెను. మేము సంభాషణ ప్రారంభించుటతోడనే యొక నిమ్నజాతివాడతిదీనముగ ప్రార్థించుచు నతనిని సమీపించెను. క్రూరాతిక్రూరమగు నవమానములచే మానవత్వమును కోల్పోయిన యాదీనుడు సాష్టాంగపడుటతోడనే మహాత్ముని హృదయము దుఃఖముచే వ్రక్కలయ్యెను; తోడనే యతనివ్యాధియే మాయమైనట్లయ్యెను.

## III

మహాత్ముని (1) ఖద్దరుప్రచారము (2) సత్యాగ్రహము- ఈ రెండుకార్యములచే నతనిపేరు వందలకొలది వత్సరములు నిలిచియుండును.

(1) ఈ యాధునిక యంత్రయుగములో ప్రపంచరైతు లోకమునకు గ్రామపరిశ్రమల యుత్పత్తిని బోధించినవారిలో మహాత్ముడగ్రేసరుడు. కొన్నిఋతువులలో లక్షలకొలది వ్యవసాయదారులు పనిలేకుండ మాడిపోవుచున్నారు. హిందూదేశములో సంవత్సరమునకు నాలుగైదుమాసము లిట్లేయుండును.

పూర్వకాలమున యంత్రములులేని దినములలో వడుకునూలు, చేనేత, యితరగృహపరిశ్రమలు ఇంటిలోని పసిపాపలు మొదలుకొని ప్రతివ్యక్తికి పనికల్పించెడివి; నిమిషము వృథాపోయెడిది కాదు. చాలకాలమున్నట్టియు, నిత్యము వాడుకొనునట్టియు బట్టకావలసినంత తయారయ్యెడిది.

యంత్రములమీద తయారగు బట్టవచ్చిన తరువాత, దాని చౌకదనమునుబట్టి క్రమముగ గ్రామములోని పరిశ్రమలన్నియు నాశనమగుటచేత నధమము మానవలోకములో సగముమందికైనను నిరుద్యోగస్థితి సంభవించెను.

ఇప్పుడైనను అన్నివిధములైన గృహపరిశ్రమలను పునరుద్ధరింపవచ్చుననియు, గ్రామప్రజలందఱును నైతికముగను, ఆర్థికముగను, ననుభవించుచున్న క్షుద్బాధను తద్వారా రూపుమాపవచ్చుననియు పరమవిశ్వాసముకలవారిలో గాంధీజీ ప్రప్రథముడు. అతని యీ సందేశమువలన లక్షలకొలది ప్రజలలో నూతన ఆశాంకురములు పొడసూపెను. అతని సందేశ మొక్క హిందూదేశముతో నాగిపోలేదు. యుద్ధపుటొత్తిడి వలన చీనాలో వ్యవసాయదారులందఱును తిరిగి ప్రత్తిపండించుకొని తమ యిండ్లలోనే నూలుతీయుట, నేతనేయుట ప్రారంభించిరి. కనడా మొదలగు ఆర్కిటిక్ ప్రాంతములలోకూడ

దీర్ఘశీతకాల సంధ్యలందు గృహపరిశ్రమలభివృద్ధిగాంచు సూచనలు కాన్పించుచున్నవి.

(2) అతడు తన జీవితములో నహింసను అనేక నూతన మార్గముల స్వాయముగ నాచరించుచు నీ రోజులలోకూడ యుద్ధదార్జన్యమునైనను కేవల సత్యాగ్రహముద్వారా నిరోధింపవచ్చునని ప్రపంచమునకు చాటుచున్నాడు. దక్షిణాఫ్రికాలో నతడీమార్గమున విజయముగాంచెను. డ్రేకన్సుబర్గు కొండలద్వారా ట్రాన్సువాలులోనికి తన "చింపిరిగుడ్డల సత్యాగ్రహసైన్యమును" నడిపినతరువాత స్మట్సు సేనానియతడు కోరిన కోరికలన్నింటిని నెరవేర్చెను; మారణాస్త్రములులేకుండచేయునట్టి నైతికయుద్ధ మప్రతిహతమని యతడంగీకరించెను.

ఫ్రాన్సిసుఋషితో నేనిదివరకితనిని పోల్చితిని. అతడుకూడ గ్రామస్థులువడికిన ముతకనూలునే ధరించెను. ఆ కాలములోనతడు వడుకునూలుకు గౌరవమును, ప్రతిష్ఠను తెచ్చిపెట్టెను; అతడుకూడ యుద్ధముచేయుచున్న సేరసెను సైన్యములమధ్య శస్త్రశస్త్రములులేకుండ ప్రవేశించి తనప్రేమసందేశముద్వారా శాంతిని స్థాపింపబూనెను. కనుక మహాత్మునకున్నభావములే ఫ్రాన్సిసుకుండెను. కనుక వారుభయులును నేకాశయులే. మహాత్ముడు మఱింత ముందుకువెళ్లెను. అతని

ఖద్దరు, సత్యాగ్రహములు రెండు ఉత్కృష్ట "సత్యపరిశోధనములు." ఏనిని మానవలోకము తనసంఘజీవితమున చేర్చుకొనెను. మానవచరిత్రలో నిదివరకెఱుగనంతటి విరివిగ నివి యాచరణకువచ్చెను. జీవించియున్న వారిలో మానవలోకమునకు కళ్యాణమును, శాంతినికోరు వ్యక్తులలో నతడగ్రేసరుడని చెప్పకతప్పదు.



# గాంధీజీ సారము.

## జార్జి ఆరండేలు.

గాంధీజీయొక్క డెబ్బదియవ జన్మదినమును కీర్తించు పుస్తకములో నన్ను పాల్గొననిచ్చుట నాభాగ్యమని నేనుతలంతును. అతడు భారతదేశమునకు చేసిన యసమాన సేవ నెట్టి పుస్తకమును కీర్తింపజాలదు. భారతప్రజలుకూడ నేడట్లుచేయజాలరు; గాంధీజ్ జీవించుకాలమునాటి దురభిమానగ్రస్తపూర్వ హములులేని ముందుసంతతివారే యట్లు చేయగలరు. అయినను, అతని సమకాలికులు వ్రాసినను ఇట్టి పుస్తక మతని విశ్వాసములోని వివిధ దృక్పథములను గుర్తింపగలదు.

అతని జీవితములో మూడు విశేషములు గమనింపదగినవి. అన్నిటికంటె ముఖ్యమైనది అతని నిరాడంబరత్వము; రెండు తనయొక్క నిజ మూలసూత్రములను ఖచితముగను, నిర్దుష్టముగను గుర్తించుట; మూడు ఎట్టి జంకుగొంకులు లేని నిర్భయత్వము. ఎట్టిపరిస్థితులలోనున్నను, ఎచ్చోటనున్నను అతడు నిరాడంబరమైన క్రమజీవితమును గడుపును; సదాప్రకాశమానమగు కీర్తి యతని నావహించియుండును. ఎట్టిమర్మము లేకుండ నతనియాత్మ ప్రపంచమునకు విదితమగుచుండును. మన కసాధ్యమగు మానశక్తి నతడు వినియోగించును.

అతని జీవితము ప్రతి నిత్యవివరములోను మనమనుసరిం పవలసిన యాదర్శజీవితము. అది యీప్రపంచార్భాటము నంతను భగవద్దత్తమైన నిరాడంబరస్థితికి తెచ్చును. మానవ కుటుంబమునకును తదితర జీవరాశికిని సౌఖ్యము, ఐశ్వర్యము, శాంతి చేకూరుట కిది యొక్కటే మార్గము.

'తూచా' తప్పకుండ నతని జీవితమును మన మనుకరిం పవలసినదని నేను సూచించుటలేదు. కాని మన మతని జీవిత సారమును మాత్రము గ్రహించి యాచరింపక తప్పదు.

ఆర్భాటములేని యతని నిర్భయత్వము గమనింపదగినది. అది యప్రయత్నము, అట్టహాసరహితము; పెద్దపెద్ద యత్నము లతో నతని కవసరములేదు. కాసెకోకలు బిగించుట, వివిధ తంతులతో గూడిన అనేకవిధములగు జాగ్రతలు, అనేకవిధము లైన తమాషాలు-ఇవేవియు నతని కవసరములేదు. నిర్భయత్వ మును చూపవలసిన అవసర మొకటి తటస్థించును; తోడనే యతనిలో నిర్భయత్వ ముట్టిపడును.

మఱియొకవిశేష మేమన అందఱును తన్ననుసరింపవలె నని యతడు బొబ్బలిడడు; ప్రజాబాహుళ్యమును, మూకలను చేరదీయడు. నిర్భయత్వ మీరూపమును దాల్పవలెనని యత డొకప్రకటన చేయవచ్చును. మార్టినులూథరువలె నతడు "ఇప్పుడు చేయవలసిన పని యిది; ఇంతకంటె నేనేమియు చేయ జాలను." అని చెప్పి ముందంజ వేయును. పదిమంది తనవెనుక

వత్తురా సంతోషము! రారా! మఱెంత సంతోషము. ఒక ధర్మమును స్థాపించుటకు పెద్ద యుద్యమమును లేవదీసి యట్ట హాసము చేయువానికంటె నితరులనుసరింపకపోయినను నేకాకిగ నడువనేర్చినవానికే విజయము సత్యమను నార్యోక్తి యితనిపట్ల రుజువయ్యెను.

నిర్భయత్వ మతని స్వభావము. కనుక నతని నిర్భయ త్వము సహజము; అది సహజము కనుక నుదారభూయిష్టము; తన యనుచరులపట్ల ధీరోదారత ప్రతిసిమిషము ద్యోతకమగు చుండును. అది స్నేహితులనే సృజించునుగాని శత్రువులను సృజించనేరదు; శాంతినేగాని సమరమును పురికొల్పజాలదు.

అతని రాజకీయ సిద్ధాంతములు, కార్యకలాపములు నాకంతగ రుచింపవు. అవి యెట్టివో నేనంతగా శ్రద్ధచేయను. ఇంతకును అవి లక్ష్యములుగాక సాధనములు మాత్రమే యగు చున్నవి. నా విశ్వాసము ననుసరించి వాని కార్యకలాపము లలో నొకటి రెంటి నెదిరించుట నాధర్మమని నేను తలంచితిని. నేనితరుల విశ్వాసమును, భక్తిని, ధైర్యసాహసములను, స్వార్థ త్యాగమును, దూషణభూషణలయందు సమదృష్టిని, హింసా రాహిత్యమును, భ్రాతృభావమును నెక్కువగ భావింతును. ప్రపంచమునకు శాసనములను, ప్రణాళికలను, సిద్ధాంతము లను, నీతులను ప్రసాదించువానికంటె వీనిని ప్రదర్శించువాడే యనేకరెట్లు మేలు చేసినవాడగును.

నేడు ప్రపంచమునకు విశ్వసౌభ్రాతృత్వమును వెదజల్లు స్త్రీ పురుషులు కావలెను; సరళస్వభావముచే నుత్పన్నమగు నుదారహృదయులు కావలెను; జీవితముకన్న మిన్నగచూచు కొను నాశయములచే చోదితులగు పురుషోత్తములు కావలెను. వారిలో తప్పులుండవచ్చును, ఒప్పులుండవచ్చును. కాని వారి హృదయము లెప్పుడును ఆర్తత్రాణపరాయణశక్తితో స్పందించుచుండును.

గాంధీజీ యిట్టి యుగపురుషుడు. ఇంతకంటె నెక్కువ చెప్పవలసిన దేమున్నది?

—౬—

# భారత సేవకుడు

డోర్నకలు బిషపు–**వి. యస్. అజరయ్య.**

గాంధీజీ డెబ్బదియవ జన్మదినమున నితరులతో పాటు నా యభివందనముల నర్పించుట కపరిమితానందభరితుడ నగుచున్నాను. భారతప్రజాజీవితమున గాంధీజీవలె ప్రధానపాత్రను ధరించినవాడు మరియొకడీకాలమున కానరాడు. యదార్థమునకు భారతదేశము "గాంధీజీదేశము" అని యూరపులో సామాన్యముగ భావింపబడుచున్నది. వాటికను హార్మ్యద్వారమున నొక ఇటలీ ద్వారపాలకునితో జరిగిన సంభాషణను నేనెన్నటికిని మఱువజాలను. నేను నా సంతకముచేసి నా చిరునామా యిచ్చినతరువాత "హిందూదేశమా?" అని యతడు ప్రశ్నించెను; "అవును" అంటిని. చిఱునవ్వుతో "గాంధీ కాదూ!" అని యతడడిగెను. గాంధీజీదేశమా యని యతని భావమని గ్రహించి నేను అవునంటిని. తొమ్మిది సంవత్సరముల క్రిందటి నీయనుభవము నాకు ఇటలీలో ననేకసారులు తటస్థించెను. రెండువత్సరముల క్రిందట అమెరికాలో నొక పాఠశాలను హఠాత్తుగ దర్శించుట సంభవించెను. హిందూదేశమును గుఱించి కొద్దిగ ఆబాలురకు చెప్పవలసినదని హెడ్మాష్టరు నన్ను కోరెను. నేనెచ్చటనుండి వచ్చినదియు చెప్పి అయిదునిముషములలో చెప్పవలసినది ముగించితిని. హిందూదేశమునుగురించి నన్నే

దైనను ప్రశ్నింపవచ్చునని హెడ్మాష్టరు సూచించెను. పైతరగతిలోనున్న యొకపిల్ల చటాలున లేచి "గాంధీజీని గురించి చెప్పుడు" అని యడిగెను. భారతదేశమునకంతదూరములోనున్న, అట్టి వర్గమునుండి వచ్చిన ప్రశ్నకు నేనెంత యాశ్చర్యపడితినో మీరూహించుకొనవచ్చును. భారతపురుషులలో నుత్తమోత్తముడనియు, భారత స్వాతంత్ర్యముకొరకు పోరిన యప్రతిహత వీరుడనియు, భారత బుద్ధిసూక్ష్మత, భారతాత్మ యతనిలో మూర్తీభవించెననియు ప్రపంచ మంతటను గుర్తింపబడెను. ఈ యాత్మశక్తి యెట్టిదో హిందూదేశములోనున్న మనకు తెలియును. ప్రకృతిని మించిన శక్తిని గుర్తించుట; తన జీవితముయొక్క అన్నివివరములలోను మానవుడు భగవంతునిపై నాధారపడియున్నాడని గుర్తించుట; ప్రాపంచికవిషయములకంటె నైతిక, యాధ్యాత్మిక విషయముల ప్రాముఖ్యతను గుర్తించుట; నైతిక యాధ్యాత్మిక శక్తుల నన్వేషించుటకును సాధించుటకును శారీర విషయసౌఖ్యములను తిరస్కరించుట; ఈయాశయముల యుత్కృష్టతలోనె గాంధీజీ గొప్పతనము కలదనువిషయమును హిందూదేశము నెరిగినవారెవరును శంకింపరు.

ఈ యాశయములు సర్వత్ర దూషింపబడుచున్న యీరోజులలో భారతపుత్రులలో వీనిని పునఃప్రతిష్ఠించి ప్రపంచమునకు ప్రసాదించుచున్న మహాత్మునకు యావద్భారతము ఋణపడియున్నదని చెప్పక తప్పదు. విషయోపభోగపరమైన

యుగమున గాంధీజీ (ఆత్మీజమును) ఆత్మతత్త్వము నుద్ధరించి యనుకరింపగోరుచున్నాడు.

అతడస్పృశ్యతానివారణద్వారా భారతదేశమునకు మరియొక యమూల్యసేవ చేసెను. భారతదేశమును ప్రేమించు వారందరును యీవిషయమున నతని శాశ్వతకృతజ్ఞతకు పాత్రు లగుచున్నారు. ఇతఃపూర్వ మనేకమంది మతసంస్కర్తలు వర్ణ వ్యవస్థను విమర్శించియుండినను గాంధీజీవలె భారతస్త్రీపురుషుల యస్పృస్యతాభావములలో నింత జయప్రదమైన విప్లవమును మరెవరును కలిగింపలేదు. భారతకళంకమింకను పోలేదని మన మొప్పుకొనక తప్పదు. ఇది సాంప్రదాయబద్ధమైన హిందూ మతముతో గుదిగుచ్చబడుటయే దీనికి కారణము. కాని భార తాత్మ మేల్కొనినది. ప్రధాన శిలదుర్గములు పునాదులవరకు చలించినవి. అవి కూలుటకిక కాలముకొరకు వేచియున్నవి. ఈ కళంకమును రూపుమాపుటలో గాంధీజీ పద్ధతులను గురించి భేదాభిప్రాయములుండవచ్చును. పొందిన ఫలితములను గురించి (యీలబ్ధిని పొందినవారుకూడ) యేకాభిప్రాయులు కాకపోవ చ్చును. ఏమయినప్పటికిని గత యిరవై సంవత్సరములలో అస్పృ శ్యతను గురించి భారతదేశదృష్టి చిత్రముగ మారిపోయె ననుట నిస్సందేహము. ఇది యంతయు మహాత్ముని ప్రభావమే.

నేడు మన మతని యభినందించుచున్నాము. అతని నాయకత్వము, సేవ మన పుణ్యభరతమాత కింకను అనేకవత్స రములు లభించును గాత!

# గాంధీజీ-వారధి, సంధానకరణి

## ఎర్నెస్టు బార్కరు.

నేను గాంధీజీని రెండుసార్లు కలసికొంటిని. మొదట 1931 లో నతడు రౌండు టేబిలు సమావేశమునకు వచ్చినపుడు మాయింట బసచేసెను. రెండవసారి 1937 లో నేను హిందూదేశమునకు వెళ్ళినపు డతడు సముద్రప్రాంతమున జుహూలో చికిత్సపొందు చుండెను.

అతడు కేంబ్రిడ్జి సందర్శించినప్పటి విషయము లింకను నాకళ్ళకు కట్టినట్లగపడును. నేను ప్రార్థనాకాలమున గ్లేడు కన్యతో నతని గదిలో నుంటిని. సాయంకాల భోజనమయిన తరువాత నతడు మాగదికి వచ్చి రాటమును త్రిప్పుచు కాలి బంతియాట, రగ్బీయాట మొదలగు సామాన్య విషయములను గురించి చర్చించెను. కాని మేము ముఖ్యముగ గొప్పవిషయములను గూడ చర్చించితిమి. ప్లేటోమహాశయుడు మాదృష్టి నాకర్షించెను. పరిపాలకులు, రాజులు అష్టైశ్వర్యములను వాంఛింపక సేవాధర్మము లభించెనను తృప్తిలో కొద్ది వేతనములతో జీవింపవలెనను ప్లేటో భావముల నతడు వెలిబుచ్చెను. ప్రభుత్వము అధికారమును, హోదాను కలిగియుండవలెననియు దానికొరకు కొంతయాడంబరము, అట్టహాసము, వేషభాషలు

యుండవలెననియు నేను వాదించితిని. ఈవిషయమున మాకంగీకారము కుదరలేదు. కాని నేను అల్పాశయగ్రస్తుడనై వాదించితినని గుర్తించితిని. తరువాత హిందూదేశ రక్షణను గురించి చర్చించితిమి. శాంతిని కాపాడవలెననియు, దండయాత్రల భయము, దోపిడిగాండ్ర భయము నెదుర్కొనుటకు రక్షణ సైన్యముండవలెననియు, నీరక్షణాసైన్యమునకగు ఖర్చు మాటిమాటికి మారుచుండు వోట్ల బలముపై నాధారపడరాదనియు దీనికి పూచీ యవసరమనియు, భారత అసెంబ్లీ పెత్తనము పనికిరాదనియు నేను వాదించితిని. జవాబుగ గాంధీజీ యొకసాదృశ్యమును తెచ్చెను. "అడవి జంతువులు ఒకగ్రామములోపడి నిత్యము ప్రజాక్షోభ కలుగచేయుచున్నవనుకొనుము. గ్రామస్థుల ఆస్తులను జీవితములను రక్షించుటకొకయుదారప్రభుత్వము గ్రామముచుట్టు నొకరక్షణాప్రాకారమును నిర్మించుననుకొనుము. కాని యాగోడకగు ఖర్చు భరింపరాని పన్నులభారమును ప్రజలపై వేయునపుడాభారముచే కృంగిపోయినవారి జీవితములే దుస్సహములగును. 'మేము సహింపలేని జీవితప్రమాణమునకు గురియగుటకంటె మాకు చిరపరిచితమైన యీజంతువుల దాడి వలన కలుగు నుపద్రవమే మేలు' అని వారనరా?" అని యుత్తరనెను.

మేము మాట్లాడిన రెండు విషయములును గాంధీజీ బోధించు ప్రేమ, ప్రేమతో కూడిన సేవాతత్త్వము అను రెండు

గుణపాఠములను నాకు జ్ఞప్తికి తెచ్చెను. నే నొక ప్రవక్తతో మాట్లాడుచుంటినని యెఱుగుదును. కాని నేను నా యింగ్లీషు జాతిలక్షణమును విడువజాలకపోతిని; మంచి సేవకు మంచి జీతముండవలెను; జీతమువల్లనే యది వృద్ధికావలెను; శాంతి, క్రమము లేర్పడవలెనన్న యుద్ధము, అక్రమము, అరాజకముతో పోరు సలుపవలెను; వాటి రక్షణకొఱకు గొప్ప ప్రయత్నములు గావింపబడవలెను. ఈ భావములు, నా జాతిలక్షణములు; ఇవి నన్నావరించెను. నా స్వభావమును అడచుకొనజాలకపోయినను అంతకంటె నుత్కృష్టశక్తి యేదియో యున్నట్లు నేను గుర్తించితిని.

గాంధీజీ వెళ్ళినతరువాడ నతనియందు సంగమించిన వివిధశక్తులనుగురించి నేనాలోచింప మొదలిడితిని. సృష్టియంతటిలోను సామరస్యము ననుభవించుచు, జీవరాశి నంతను ప్రేమించుచు, సరళదారిద్ర్యజీవితమును వరించిన ఫ్రాన్సిసుఋషి యొకవంక; యోజనాపరుడు, వేదాంతి, యెంతటి తర్కమునైనను సమర్థించుచు నతినిశితమైన భావములను ఛేదించుకొనిపోవు థామసు ఆక్వినాస్ ఒకవంక; వ్యవహారదక్షత, దానిని బలపఱచు న్యాయశాస్త్రప్రవీణత గలిగి పర్వతాగ్రములనుండి దిగివచ్చి లోయలలోని వ్యాపారములను నడుపగలదక్షత యొకవంక; ఇన్ని యతనిలో మూర్తీభవించెను. మన మందఱము సుళువుగ మహాత్ము నర్థముచేసికోజాలము. అతడు మనలో

చాలమంది కగ్రాహ్యుడు; అతడు పరిపూర్ణుడు; అతడు కేవల మొక ఫ్రాన్సిసేయైన గ్రహించుట కష్టము కాదు. కాని యది ప్రపంచమునకును, అతని దేశీయులకును నంత యుపయోగక రము కాదు; సేవ కనుకూలమును కాదు. ఆ మిశ్రమములోనే శక్తి యిమిడియున్నది. అతడు సర్వతోముఖుడు; కనుకనే ప్రపంచమునకంత చేయగలిగెను; ప్రపంచమున నంతటివాడ య్యెను. నేనిక నొకప్రధానమైన తుది విషయమును చెప్పలద చితిని. ఫ్రాన్సిసు, థామసుబుషు లిరువురతో వ్యవహారదక్షత, న్యాయశాస్త్రనిపుణత యితనిలో కలిసెనని చెప్పితిని. భారత సాంప్రదాయిక భక్తి, వైదికమతము; పాశ్చాత్య సాంప్రదా యిక పౌర, రాజకీయస్వాతంత్ర్యపిపాస,—ఈరెండును మిశ్రమమ యినవని చెప్పుట మఱింత యుక్తము, న్యాయము అని నాయ భిప్రాయము. ఈమిశ్రమమువలననే యతడొక వారధియైనాడు. తన దేశీయులలో రాజకీయముల నీయప్రాపంచికరూపమున ప్రవేశపెట్టినాడు; దానితో మతసాంప్రదాయమును ముడిపెట్టి నాడు; తనది కేవల రాజకీయాందోళన కాదనియు, తాను కేవల ఆందోళనపరుడను కాననియు తనదేశముయొక్క యుద్య మము రాజకీయ మోక్షమును మించిన యుత్తమజాతిదనియు, బ్రిటిషు ప్రజలచే మెప్పించినాడు. అతడు ఒక్క తన దేశీయు లను, బ్రిటిషు ప్రజలనుమాత్రమేగాక పాశ్చాత్య ప్రజల నంద అను ఆకర్షించినాడు. ఐహిక ఆముష్మికములను క్షీరనీరముల

వలె మేళవింపజేసి, వానికన్యోన్యాశ్రయమును కల్పించినవాడీ యుగమున యుగపురుషుడు కాకుండ నెట్లుండగలడు?

కనుక నాముష్మికమును ఐహికముతో కలిపి రెంటికిని సమానాదరణమును చూపగలిగిన గాంధీజీని నేను కీర్తించుచున్నాను. ప్రాచ్య, పాశ్చాత్యులమధ్య వారధియై అంతర్జాతీయ సమన్వయమున కపార సేవచేసిన యోగీంద్రుని నేను కీర్తించుచున్నాను. తన దేశజీవితమున ప్రతియింటికిని కావలసిన ప్రాణావసరములను గుర్తించి చాటగలిగిన వ్యక్తిని నేను కీర్తించుచున్నాను. అతని రాట్నచక్రమే దీనికి నిదర్శనము. హిందూదేశము గ్రామసీమ; భారతగ్రామమును చూచునపుడు వృథయగుచున్న మానవశక్తికి విశాల సావకాశములను కల్పించి నిండుజీవితమును ప్రసాదింపవలసినదను ప్రజాక్రందన వినిపించును. గ్రామములలోనికీపరిశ్రమ వచ్చినపుడే వాటి కార్థికమోక్షము వచ్చును. గ్రామార్థికమోక్షమే భారతమోక్షము. దీనికొఱకు గాంధీజీ సలిపిన సేవ యసమానసేవగ పరిగణింపబడును.

నేను కని, విని, చదివినవానినిబట్టి నాలో నీభావములుప్పతిల్లినవి. ఇంతకుమించి నాకు తెలియకపోవుట నాదురదృష్టము. నాకు తెలిసినంతలో గాంధీజీ తన దేశమునకును, ప్రపంచమునకును మూడు ముఖ్యవిషయములను బోధించినాడు— ప్రేమకొఱకు ప్రేమతోపనిచేయుట; దౌర్జన్యములేకుండ పనిచేయుట; అన్ని శక్తులను పూర్తిగ వినియోగించునట్టి నిండుజీవితమును నిర్మించుటకొక్కబుద్ధినేగాక చేతులనుగూడ వినియోగింపవలెననుట.

# అతని నామము నొక జ్యోతి యావరించెను

**లారెన్సు బినియను.**

నాకు హిందూదేశ రాజకీయములు తెలియవు; అచ్చటి కళలద్వారా నేను దాని నెఱుగుదును. నేను గాంధీజీ రాజకీయజీవితమును గుఱించి చెప్ప సాహసింపను. అతని విధానములోనున్న వివరములు నాకగ్రాహ్యములని నేను చెప్పగలను. కాని యీకాలము అనేకవిధముల మానవలోకమున కొకమచ్చ యని చరిత్ర వ్రాయకమానదు. క్షుభితమై, దుఃఖపూరితమైన యీప్రపంచమును ఆత్మయు, దానివలన నుజ్జాతమై జీవిత కార్యకలాపమున ప్రవేశించు విషయములు మాత్రమే యుద్ధరింపగలవనుభావము నాలో దినదినప్రవర్ధమానమగుచున్నది. గాంధీజీ యిట్టి శాశ్వత, ఆత్మవిషయములకొఱకే జీవించుచున్నాడని నేను భావింతును. దీనివలననే యతని నొక తేజమావరించియున్నది.

# ఒక జీవిత విధానము.

## పెరల్ యస్. బక్ సతి.

ఘూర్ణిల్లుచున్న ఆధునిక ప్రపంచమున తన జీవితకాలములోనే గాంధీజీనామ మొక వ్యక్తినామముగ గాక యొకజీవిత విధానముయొక్క పేరుగ పరిణమించెను. ఒకవంక దౌర్జన్యము హద్దులుమీఱి పెచ్చుపెరుగుచుండ నీజీవితవిధానము పునరుద్ధరింపబడుటలో విశేషార్థము గలదు. గాంధీజీ వెనుతిరుగక తన మార్గమున చొరుచుకొనిపోవుచుంటవలన లక్షలకొలది ప్రజల వలెనే నాకును ఈప్రపంచమున పెచ్చుపెరుగుచున్న నిరంకుశత్వము నెదిరించు ధైర్యసాహసము లలవడుటచే నేను నాకృతజ్ఞతను, అభివందనములను ఇందుమూలముగ తెలియబఱచుకొనుచున్నాను.

# గాంధీజీ - రెండు సమావేశములు.

**లయొనల్ కర్టిసు**

గాంధీజీని మొదటిసారి నేను 1903 లో సందర్శించితిని. నేనప్పుడు భారతయిమిగ్రేషను శాఖకు చెందిన యొకయుద్యోగిని అప్పటినుండి నాకనేకమంది భారతీయులు, చీనావారు స్నేహితులైరి. కాని నేను కలిసికొనిన ప్రాచ్యదేశస్థులలో గాంధీజీ మొదటివాడు. ఒక్కశలపాగమినహా అతడప్పుడు పాశ్చాత్య దుస్తులలోనుండెను. అతడు చాల తెలివైన లాయరుగ కాన్పించెను. అతడు తన దేశస్థుల పరిశ్రమ, పొదుపు, ఓర్పు మొదలగు గుణగణములను గుఱించి నన్ను మెప్పింపయత్నించెను. అతడు చెప్పినదంతయువిని "గాంధీజీ! నీవు తెలిసినవానికి తెలియ జెప్పుచున్నావు. ఈ దేశములోని యూరపియనులు భారతీయుల దురభ్యాసములకుగాక వారి గుణగణములకే భయపడుదురు" అని నేను చెప్పితిని. తరువాత మా యుభయులమధ్య జరిగిన వ్యవహారములలో నతనిపట్టుదల నన్నెక్కువగ నాకర్షించెను. ఈ ప్రపంచములో పట్టుదలనుమించిన గుణములేదని నేనప్పటి నుండియు భావింపనారంభించితిని.

పుష్కరమైనతరువాత నేనతనిని తిరిగి 1916 లో లక్నో కాంగ్రెసులో కలిసికొంటిని. ట్రాన్సువాలులో నేనుచూచిన యువక జాన్సుబర్గువకీలుకును ఇతనికినిగల భేదమును నేనెన్నటి

కిని మఱువజాలను. అతడిప్పుడు చింపిరిగుడ్డలుగల భారతదుస్తులతోనుండెను; ముఖము ముదిమి తేఱి తాపస చిహ్నములతో నుండెను. ఆనాడు అతి శీతలముగనుండెను. అతడు వెచ్చదనము కొఱకు చేతులుకాచుకొనుచు భారతీయులెట్టి దృష్టితో వర్ణవ్యవస్థ యంతరార్థమును గ్రహింతురో నాకు బోధింపసాగెను.

నాకాలమున గాంధీజీకున్నంతమంది యనుచరులును మఱెవరికిని లేరు; అతనివలె పరిస్థితులను తాఱుమాఱుచేయ గలిగినవారు లేరు; ఒక ఖండములోనేగాక యనేకఖండములలో నతనివలె భావప్రపంచమును మార్చగలిగినవారు లేరు. 1903 లో నేను కలిసికొనిన యువకలాయరులో నింతటి యాధ్యాత్మికశక్తి దాగియున్నదని నేనూహింపజాలనైతిని.

---

# గాంధీజీ — కాంగ్రెసు

**బాబూ భగవాన్‌దాసు.**

ఇప్పుడు ముగియవచ్చుచున్న యిరువదియవ శతాబ్దము లోని మొదటి నాలుగుశతాబ్దముల క్షుభితమానవచరిత్ర కొద్దిమంది పేరుమీదుగ వ్రాయబడును. వీరిలో సగమునకు లోపుమాత్రమే నేడు సజీవులైయున్నారు. వీరిలో గాంధీజీ యొకడు. ఇంతేకాదు; అతడు వీరిలో నసమానుడు. ఏలన ఆర్థిక, రాజకీయములలో దౌర్జన్యరహిత ఆధ్యాత్మిక తత్త్వ మును సృష్టించిన బ్రహ్మయితడొక్కడే! బుద్ధునితరువాత హిందూదేశచరిత్రలో నింత నైతికశక్తిని మనము కనివిని యెఱుగము. "వర్తమానము" "భూతకాలము" లోనికిమాఱి "వర్తమానము"న కెప్పుడునునుండు అసమాన ప్రాముఖ్యత నశించికాలములో కలిసిపోయినపుడు భవిష్యచ్చరిత్రకారు డతనిని ఇతరులతోపోల్చి వ్రాయవచ్చును. కాని నేడు గాంధీ మహాత్మునివ్యక్తి యద్వితీయమైనది.

కనుక సహజముగ నాకతనియందపార గౌరవముకలి గెను. అతని తాపసస్వభావము, ఆంతరంగికాగ్ని, పట్టుదల, తాపసులకుండునట్టి పవిత్రత, గాఢాశయశక్తి, శరీరమును దగ్ధముచేసి వశపరచుకొనుట:— ఇవి నాకతనిపై విశేషభక్తిని కూడ కలుగచేసెను.

కనుక మహాత్మాగాంధీయొక్క యద్భుత భారతరాజకీయ నాయకత్వమును నేనెక్కువగ కీర్తింతును; అతని తపస్సులోనున్న పవిత్రత, సర్వభూతదయాళుత్వము, జితేంద్రియత్వము, ధీరత సాటిలేనివి; ఎట్టి "విపరీత" పరిస్థితులలోనైనను, ఎట్టి సంకటావస్థలోనైనను (అతని నెప్పుడును ఇవి యెదుర్కొనుచునే యుండెను) అతని నడవడికనుగురించి "ఎట్టి రంగములోను అల్పబుద్ధినిచూపి యెఱుగడు; అల్పకార్యమునుచేసి యెఱుగడు" అని చాటకతప్పదు. శత్రువులుకూడ నతని యుదారతను మర్యాదను చిత్తస్థైర్యమును భారతసేవకొఱకు విశ్రాంతిలేకుండ తన మనస్సును, బుద్ధిని చివరకు కాయమును సమర్పించుటను ఒప్పుకొనక తప్పినదికాదు; తఱచువారతనికోరికల నంగీకరింపవలసి వచ్చెడిది.

ఇట్టి భావములచే ప్రేరితుడనై నేనీసమయమున నతనిని భట్టువలెపొగడి తృప్తినొందజాలను. మహాత్ముడు పొగడికలతో నిదివరకే విసుగుచెందినాడు. కనుక గతపదిహేనువత్సరముల నుండియు నతని యుత్కృష్టకార్యములనుగుఱించి నేను చేయుచున్న విమర్శనలను నేడు (కొన్నిసూచనలతో) చేయదలంచితిని. మహాత్ముని భారతపునరుద్ధరణ ప్రయత్నములనుగుఱించి నేనుచేయు విమర్శలు నాయధికమైన తెలివితేటలవలన కలిగినవికావు; అవి ప్రాచీన విజ్ఞానసాంప్రదాయముపై నాధారపడినవి.

## ప్రపంచపరిస్థితి — ముఖ్యముగ భారతపరిస్థితి.

మానవప్రపంచము 1918 లో నాలుగేండ్ల నరకము నుండి బయటపడినది. కాని యదియెట్టి సంస్కారమును పొందక తిరిగి యుద్ధజ్వాలలతో నిండియున్నది. స్పైను అంతఃకలహములతో నేలమట్టమయ్యెను; చివరకు ఫ్రాంకోకు, ఫ్యాసిజముకు విజయముచేకూరెను. మృత్యుగహ్వరమునుండి బయటపడుటకు చీనా జపానుతో యుద్ధముచేయుచున్నది. శృంఖలాబద్ధమై, నిర్ధనమై, నిర్వీర్యమై, ఆధ్యాత్మికతను కోల్పోయిన భారతదేశము దౌర్జన్యరహిత, ఆర్థికరాజకీయ పోరాటమున మునిగియున్నది; కాని దౌర్జన్యముతోకూడిన మతకలహములచే నిది తరుచు బాధపడుచున్నది. భారతదేశములో మతముపేరిట నూరేగు దుర్మార్గప్రవృత్తిగల రాజకీయ "నాయకులును," బ్రిటనుయొక్క రాజ్యతంత్రమును దీనికి కారణము. మతమును లాభసాటి వృత్తిగచేసికొనినవారివలన రెండుమతములును తమ నిజప్రయోజనములనుకోల్పోయి వక్రగతిని అవినీతిని చెడు మార్గములనుపట్టెను. బ్రిటిషు "రాజనీతికోవిదులు" యీ సాకును తమ లాభముకొరకు వినియోగించుకొనుచున్నారు. ఒకదేశము ఒకజాతి లేక కులము మఱియొకజాతిని దేశమును లేక కులమును వశపఱచుకొని దాస్యమునందుంచుకొనినగాని యభివృద్ధినొందజాలదు అను పాశ్చాత్యభావమే యీ రెండు సంఘములకును సమానప్రయోజనములు లేవనియు నొకదాని

యనర్థముమీాదనే రెండవదాని యభివృద్ధి యాధారపడియున్న దనియు బోధించుచున్నది. బ్రతుకుకొఱకు పోరుతప్పదను న్యాయమును కనిపెట్టితిమని బడాయికొట్టెదరు. పై భావము దానిఫలితమే! జీవితము మైత్రిమీాదను సహకారముమీాదను ఆధారపడియున్నదను. కళ్యాణదాయకమైన ప్రధానచట్టము నిది మఱచిపోయెను; నిర్లక్ష్యముచేసెను. దీని ఫలితముగ హిందూదేశమంతయు పరస్పరము అనుమాన ద్వేషములతో నిండిపోయెను. గౌరవమును, మర్యాదను, శాంతినికోరు ప్రతి హిందువునకు, మహమ్మదీయునకు జీవితము భయపూరిత మయ్యెను. "హిందూమహమ్మదీయ, బ్రిటిషుశక్తులు మూడింటి లోను ఏ రెండుశక్తులు కలిసినను మూడవదానికంటె బలవత్తర మగునని" గోకేలు చాలకాలముక్రితమే వచించెను. తదనుసర ముగ 1930—33 లలో లండనులో జరిగిన మూడు రౌండు టేబిలు సమావేశముల ఫలితముగ రెండుసంఘములను శాశ్వ తముగ వేఱుచేయు ప్రత్యేక నియోజకవర్గములు స్థాపింపబడి నవి. దీని ఫలితముగ ప్రతియుద్యోగశాఖలోను, డఫేదారు లగాయితు పెద్దయుద్యోగమువరకు, కులములవారీ పంపకమును కులతత్త్వము రేకెత్తినది. సహజముగ ప్రజాసామాన్యమున కందుబాటులోలేని తెలివి యీ యుద్యోగములలో నుండును; అధికార ప్రాపకమంతయు వీరిచేతులలోనుండును. ఈరోజులలో సాధారణముగ నధికారమనగా దుర్బలులకు మంచివారికి

నిజాయితీగలవారికి సాయపడుటకుబదులు హానిచేయుట, అడ్డములు కల్పించుటయనియే గుర్తింపవలెను.

బ్రిటిషు రాజనీతి ప్రత్యేక నియోజకవర్గముల నేర్పాటు చేసినతరువాత హిందూదేశములో కులసమస్య మరింత తీవ్రరూపముదాల్చెను.

"హిందూదేశమున నీకు సంతృప్తికరమైన యభివృద్ధి కలదా?" అని 1930 లో ఢిల్లీలో నొకపత్రికాధిపతి మహాత్ముని ప్రశ్నించెను. కొంచెముసేపుఆగి మహాత్ముడు "కలదు. కాని నేనొక్కొక్కప్పుడు భయపడుచుందును. అడుగునుండి యభివృద్ధికలుగుచున్నది; అది యుక్తమే. కాని హిందూమహమ్మదీయభేదములే పెద్దయడ్డంకి. ఈవిషయమున నాకంత యభివృద్ధి కాన్పించదు. కాని యిది కలకాలముండదు. స్వార్థరహితముగ నున్నది కనుక ప్రజాహృదయము నిర్దుష్టముగనున్నది. ఉభయసంఘముల ఆర్థికరాజకీయకష్టములు సమములే" అని యతడనెను.

ఈకష్టములు ఉభయులకును సమములేయనుట నిశ్చయము. అయినను దీనినిగురించి వారికి నచ్చచెప్పి వారిలో నైకమత్యము నేల యతడు చేకూర్చలేదు? "ఆకష్టము దానంతటదియే విడిపోవును." నిజమే! శాంతియుతముగనా లేక స్పెయినుదేశములోవలెనా? మొదటిదానికేమైన నాస్కారమున్నదా? "స్వార్థరహితముగనున్నదికనుక ప్రజాహృదయము

నిర్దుష్టముగ నున్నది" అని యతడనెను. ఇది యతిశయోక్తి కాదా? చీనా జపాను మొదలగు ఆసియాఖండములలోవలెనే హిందూ దేశములో వ్యవసాయదారులే "ప్రజ"యగుచున్నారు. అది ప్రతిచోటను అతి "వ్యక్తిపరము" "స్వార్థమయము" అది "నిర్దుష్టము" "స్వార్థరహితము" అని యొప్పుకొనినను మతము యొక్క ప్రధానాంశములను గురించియు న్యాయమైన సాంఘిక వ్యవస్థకు కావలసిన మూలసూత్రములను గురించియు తగిన జ్ఞానము విద్య దానికి కలదా? ఈ చిక్కు దానంతటదియే శాంతముగ విడిపోవునది కాదు. అన్ని మతములకును సమాన ములగు ప్రధానవిషయములను గురించియు, న్యాయమైన సాంఘికవ్యవస్థకు కావలసిన ప్రధానసూత్రములను గురించియు సరియైన ప్రబోధ మవిరళముగ జరిగినమీదటనే యిది సాధ్యమ గునని మాబోంట్లు కొందరు భావింతురు.

## కాంగ్రెసుయొక్క స్థితి.

కాంగ్రెసు సలుపు ఆర్థిక రాజకీయపోరాటము చాలవ రకు స్థూలముగ దౌర్జన్యరహితమేయైనను మానసికముగ నట్లుండుటలేదు. కాంగ్రెసులోనే కుళ్లు బయలుదేరినది. కాంగ్రెసు పదవులకొరకు జరిగిన యెన్నికలలోనే వోట్లపెట్టె లను కొట్టివేసిరి; దొంగిలించిరి; తగులబెట్టిరి. లాఠీల నుపయో గించిరి; అనేకమంది క్షతగాత్రులైరి. ఒకడు అమాంతముగ చంపివేయబడెను. గాంధీజీ హరిజనపత్రికయే దీనికికావలసినంత

సాక్ష్యము నీయగలను. ఇంకను కావలసినచో 1938 లో త్రిపురీకాంగ్రెలో గావింపబడిన "అవినీతి నెదిరించు" తీర్మానమే సాక్ష్యము. అయినను ఎన్నుకొనువారిసంఖ్యనుబట్టియు, ఎన్నిక ప్రాంతముల విశాలతనుబట్టియు, నివి "తొలిప్రయత్నములు" అను విషయమునుబట్టియు నిట్టి విషాదసంభవము లింకను అనేకములు లేకుండుటయే ముదావహమగు విషయము.

## వ్యాధి కారణము.

మహాత్ముడవలంబించిన యమూల్యపద్ధతులు మొత్తముమీదను, ప్రస్తుత పరిస్థితులనుబట్టియు నసమానమైనవనుట నిస్సందేహము; అవి ప్రజాహృదయములో నద్భుత ప్రబోధమును గావించెను. కాని యవి పొందవలసిన జయము నేలపొందలేదు? నాయకత్వములోనున్న గొప్ప దోషమే దీనికి కారణము. భారతదేశ ప్రస్తుత పరిస్థితులనుబట్టి దౌర్జన్యరహిత సహాయనిరాకరణమే శరణ్యమని మరల చెప్పకతప్పదు. ఈపద్ధతివలన గాంధీమహాత్ముడు భారతప్రజలకొక యిచ్ఛాశక్తిని, అమూల్య ఆయుధమును ప్రసాదించెను. ఈపద్ధతి ప్రజలయొక్క ప్రాచీన సాంప్రదాయమునకును, తత్త్వమునకును అనుగుణ్యముగ నున్నది. ధర్నాకూర్చొనుట, ప్రాయోపవేశము, ఉపవాసము, ఆజ్ఞాభంగము, దేశత్యాగము, రాజత్యాగము, 'రాజా తత్ర విగ్రాహ్యతే' (రాజుపై యవిశ్వాసమును ప్రకటించుట):- అధికారదుర్వినియోగము జరిగినపుడు ప్రాచీనగ్రంధములిట్టి సత్యా

గ్రహ పద్ధతులను బోధించెను. శాంతిమార్గము లన్నియు నిష్ఫలములైనతరువాత, ప్రత్యేక పరిస్థితులలో, సాయుధయుద్ధము కూడ నంగీకరింపబడుటయేగాక ధర్మముగకూడ విధింపబడెను.

ఈ గొప్పప్రయత్నములన్నియు ఫలించకపోవుటకు విశేషలోప మొకటి యుండవలెను. ఔషధములలో ప్రధానమైన మూలిక లోపించుటచే వ్యాధికుదరదు. గాంధీజీయు, కాంగ్రెసు "ఉత్తమాధికారులు"ను సర్వజనసౌభాగ్యము నభివృద్ధిచేయుటకు మంత్రివర్గము చేయవలసిన చట్టములకు సంబంధించిన యెట్టి పథకమును స్థాలీపులాకన్యాయముగ సూచించియుండలేదు. రాబోవు ప్రజాపరిషత్తుసభవారీపని చేయవలెనని వారు వేచియుండిరి. "తమ నిజ" మంత్రివర్గములపై నిట్టియసంతృప్తి కొద్దిగనో గొప్పగనో యన్నిరాష్ట్రములలోను గలదు. చాల కాలమునుండి మాబోంట్లు చాలమంది యీదోషమునుగుఱించి కాంగ్రెసు "ఉన్నత మధ్యమాధికారులకు" తెలుపుచు దాని నివారణమార్గమును కూడ సూచించితిమి; కాని లాభములేక పోయెను. బహుశః కాంగ్రెసులో నిప్పుడు బయలుదేరిన యంతఃకలహములు "నాయకుల"యొక్కయు ప్రజలయొక్కయు దృష్టి నీదోషముపైకి త్రిప్పవచ్చును. ఈ లోపమును భర్తీచే యుని-చో నీయిరువది వత్సరముల కాంగ్రెసు త్యాగము వృథ యగును.

పై దోషమును చూపించునపుడు కాంగ్రెసు మంత్రివర్గములు చాల కష్టపడి పనిచేయుచున్న సంగతి మరువరాదు. తాగుడును మాన్పుటకు, అక్షరాస్యతను విస్తరింపచేయుటకు, వ్యవసాయ ఋణగ్రస్తతను తగ్గించుటకు, స్థానిక పరిశ్రమలను ప్రోత్సహించుటకు, పారిశుధ్యమును పెంపొందించుటకు, వ్యాధులనెదుర్కొనుటకు వారు చాల గొప్పప్రయత్నములను చేయుచున్నారు; కాంగ్రెసులోనున్న దుర్బలత్వముచే వారికి సివిలు సర్వీసు శాఖవారు పూర్తిసహకారము చేయకుండుటచే కలుగవలసినంత జయము కలుగుటలేదు. స్వరాజ్యము, "స్వీయప్రభుత్వము" అను పదమునకు సరియైన యర్థమును ప్రజలకు బోధించని దోషమే యన్నిటికంటెను గొప్పది.

గాంధీజీ, జవహర్లాలు, సుభాసుబోసులు గాని తదితర కాంగ్రెసుపెద్దలుగాని "స్వరాజ్య" పదమునకు సరియైన వ్యాఖ్యానమును చేయరైరి. 1936, 37 వరకు అవకాశము వచ్చినపుడు గాంధీజీ "స్వరాజ్యము" అనగా డొమినియనుస్టేటసు అని చెప్పుచుండెను. తన తుదిసంభాషణలో నతడు "ఈవిషయమై నేను యిదమిత్థమని స్పష్టముగ చెప్పజాలను" అని చెప్పెను. డొమినియనుస్టేటసు అనగా బ్రిటిషుప్రభుత్వ మాద్రిరిని కాపీచేయుట; ఇది పైకి ప్రజాస్వామికమే కాని నిజముకు కొద్దిమందియొక్క పాలన. భారతముకు కేవల ప్రభుత్వయంత్రముకంటె భిన్నమైన సాంఘికనిర్మాణమునుగురించి గాంధీజీ తన యభిప్రాయ

మును వెలిబుచ్చలేదు; 1934 లో పూనాలో నతడొకసందర్భ
ములో నది "అందరాని సమస్య" యని వ్రాసివేసెను; అతడనే
కసారులు "నాకు ముందుదృష్టిలేదు," "నాకంతయు నంధకార
బంధురముగనున్నది," "నాకు మునుపటి యాత్మవిశ్వాసము
లేదు," "నాకొకస్వరాజ్యపరిణాళిక యున్నచో నేను దానిని
పరిజ్ఞాపరము చేతును," "ప్రజలచే నెన్నుకొనబడు భవిష్యత్ప్ర
జాపరిష త్తే దానిని నిర్ణయింపవలెను" అని నిర్మొగమాటముగ
చెప్పుచుండును. హిందూదేశముకు స్వరాజ్యము కావలసినదీ
లేనిదీ యీపరిష త్తే నిర్ణయించుకొనవచ్చునేమొ! అతని
'హింద్ స్వరాజ్'లో నివి కూలంకషముగ చర్చింపబడెను. దాని
సారాంశమేమన; ఆధునిక నాగరికచిహ్నములైన యంత్రములు,
రైల్వేలు, ఆవిరిమోడలు, విమానయులు, విద్యుద్దీపములు,
మోటారులు, తపాలా, తంతి, ముద్రణాలయములు, గడియా
రములు, ఆస్పత్రులు, విద్యావిధానములు, సంస్థలు, వైద్యప
ద్ధతులు మొదలైన వన్నియు చెడ్డవి; వీనిని సంస్కరింపక సరి
చేయక నియమింపక పూర్తిగ విసర్జింపవలెను. ప్రాచీన భారత
నాగరికతకు కూడ నతడు చాలవరకు స్వస్తి చెప్పెను; గొప్ప
గొప్ప దేవాలయములు, రాతిచెక్కడములతో కూర్చబడిన
సొగసైన ఘట్టములు, ప్రాసాదములు, చిత్రకళలు, దుశ్శాలు
వలు, చీనిచీనాంబరములు, ఛప్పన్న శాస్త్రములు, విద్యలు—
జీవితమును "దేదీప్యమానము" చేయున వన్నియు పోవలెను.

తాతలనాటి వ్యవసాయిక జీవితము తిరిగి రావలెను; ప్రకృతి, భగవంతుడు మానవలోకమున కొక్క దీనినే యుద్దేశించెను. కాని "నాగరికత" దాని కళలు, శాస్త్రములు కూడ ప్రకృతి జన్యములే! దురదృష్టమేమన గాంధీజీయే యనేకసారు లొప్పు కొనినట్లు అతడు "సత్యమునకు మార్గమును మాత్రమే చూప గలడుకాని సత్యమును చూపజాలడు." అతడు సత్యమునంతను స్వయముగ చూడలేదు. ప్రాచీన భారత ఋషులు దానిని, దానికి మార్గమును చూపుచున్నారు; వారి వ్యక్తిత్వ సామ్య వాదపద్ధతిలోని గొప్పతనము నతడు చూడలేదు. అనంతమైన యాత్మను రక్త, మాంస మేదోపూరితమైన శరీరముగ భావించుటవలన అనగా నవిద్యవలన ప్రత్యేక వ్యక్తిత్వము, ఈజీవిత కలాపము వచ్చుచున్నవి; ఈప్రథమ 'తప్పిదమువలన' "అహంకారము, స్వార్థము, ఇష్టానిష్టములు, ప్రేమద్వేషములు" కలుగుచున్నవి. దీనినుండి "సర్వసమత్వము, స్వార్థత్యాగము, మానవకరుణ క్రమశః వృద్ధియగు నవకాశములు విషయములు కలవు. ఉపనిషత్తులు, గీత, మనుస్మృతి యీవిషయమును స్పష్టీకరించెను. ఇదియే హింద్‌స్వరాజ్‌లో నస్పష్టముగనున్నది. చివరకు నీవు మానవ సుఃఖదుఃఖముల నన్నింటిని తరించి తిరిగి యనంతములో మగ్నము కావలెను. వ్యవసాయ జీవితమును తిరిగి నవలంబించినంతమాత్రిన చాలదు; నీవింకను వెనుకకు పోవలెను. ఈవిధముగ జాతులు, వ్యక్తులు వెనుకకుపోవలెను.

కాని "అన్నిటిని రుచిచూచి పరీక్షించిన తరువాత, మంచిని గ్రహించిన తరువాత" కాలపక్వమయిన తరువాత, మమత్వ పరత్వములు రెంటికిని చెందిన ధర్మములు సరసముగ నెరవేరిన తరువాత నీపని జరుగవలెను. గాంధీజీ ఖచితమైన నిర్వాచన మొకటి లేకుండ స్వరాజ్యమనగ 'రామరాజ్య'మని చెప్పుచుం డెడివాడు. కాని వాల్మీకియొక్క రామరాజ్యము కేవలము వ్యవసాయిక రాజ్యము కాదు; అది చాలవరకు వ్యవసాయ మయము; అచ్చట నొక్క గ్రామములు మాత్రమేగాక గొప్ప నగరములు కూడ కలవు. వాల్మీకి రాముని అయోధ్య నెంత ఘనముగ వర్ణించెనో రావణుని స్వర్ణమయమైన లంకను కూడ నట్లే వర్ణించెను. అప్పుడప్పుడు జరుగు రక్తపాతముతో గూడిన 'క్షాళనలకు' భయపడుచున్నను రష్యా, అచ్చటి బోల్షివిజము, సోషలిజము లేక కమ్యూనిజము హిందూదేశములోనున్న యువక విద్యార్థికుల నాకర్షించుచున్నవి. ఇక కాంగ్రెసులోను బయటనున్న పెద్దలు బ్రిటను దానివలసలు, అమెరికా, ఫ్రాన్సు లలోనున్న ప్రజాస్వామికమును (మరేపేరు పెట్టిననుసరే) వరిం చుచున్నారు. హిందూదేశములో నెవరును నాజీజము, ఫ్యాసిజము "తత్త్వము"ను కోరుటలేదు. కాన తమ "అతివాదము"ను తగ్గించుకొని దానిస్థానే కొద్దిపాటి నిజమైన యాధ్యాత్మిక మతమును, మన స్తత్త్వసూత్రములను ఆమోదించినచో సీ'యిజము'లన్నియు వెంటనే కరస్పర్శన మొనరింపవచ్చును. ఈ "ఐడియా

లజీలు" "ఇజములు" గొప్పపనులు చేసెననుటకు సందేహము లేదు; కాని యివి చేసిన దోషములు కూడ మరిన్ని కలవు. వీనిలోనున్న యొడిదుడుకు అతివాదములే పరస్పర శత్రు వీక్షణకు కారణములై యాయా దేశములలో "శాంతిస్థాపన చేయుటకు" బదులు "యుద్ధసంభారములను" చేయించి ప్రజాశక్తిని నాశము చేయుచున్నవి.

దుర్బలజాతులపై పాశ్చాత్యనాగరికత గావించిన మహాపాపఫలితముగ నేడీనాగరికతకు "ప్రాయ్యకాలము" దాపురించినది; ఇప్పటికైనను మన "ప్రజాస్వామిక," "సామ్యవాద" నాయకులకు పాశ్చాత్య "ఐడియాలజీల" యందలి విశ్వాసము పూర్తిగ పోకపోయినను సన్నగిలియుండవలెను. పేరెన్నికగాంచిన పాశ్చాత్యశాస్త్రవేత్తలే యిప్పుడు వీనిని తీవ్రముగ నిరసించుచున్నారు. కాలపరీక్షకునిలిచిన ప్రాచీనసాంఘిక నిర్మాణముపై వారిదృష్టి పోకతప్పదు. ఆ సూత్రము లంత మంచివేయైనచో హిందూదేశ మేలపతనము కావలెను? అని కొందరడుగవచ్చును. "ఈ సూత్రముల నమలపరచవలసిన పెద్దల 'బుద్ధిమందమయ్యెను' "తత్త్వము" మారిపోయెను, ప్రవర్తన చెడిపోయెను; మంచిసూత్రములు అవలంబింపబడలేదు; అవి నిర్లక్ష్యము చేయబడుటేకాక చెడ్డసూత్రముల కాస్పదమిచ్చెను" అని జవాబు చెప్పకతప్పదు. భారతదేశములోని "న్యాయ" ధర్మకర్తలు ఆత్మత్యాగశక్తిని జ్ఞానమును కోల్పో

యిరి. ఏదేశము, యేప్రజ, యేనాగరికతయైనను భూతదయ, స్వార్థత్యాగము, బుద్ధిబలముగలిగి హృదయమును బుద్ధిని మేళవింపచేసిన యోగిబృందమును కలిగియుండిననగాని వృద్ధి చెందజాలదు; అట్టివారిని సృష్టించి పోషింపజాలని ప్రజ, జాతి యకాలకౌణ్యతనొంది నశించును; లేదా హఠాత్సంభవమో, యుద్ధమో మరేదియో వారిని బానిసలనుచేయును. భారత దేశము కిట్టి దయాధర్మజీవితమే ప్రాప్తించెను; కాని యది యింకను సజీవముగనుండి తిరిగి విజృంభింపగల చిహ్నములు కలవు. కాని మహాత్మాగాంధీయొక్క తపస్సుకు 'విద్య' జత కావలెను; మహాత్ముడు నేడు మనకున్న తపశ్శక్తి, నైతికశక్తి; దీనికితోడు అతడు సాంఘిక వ్యవస్థనుగురించి ప్రాచీన 'విద్య' బోధించు 'బుద్ధివైశద్యమును' జతకూర్చుకొనవలెను. అప్పు డతడు భారత దేశమును రక్షింపగలడు; అప్పుడు పాశ్చాత్య పోకడలను మనమనుకరించుటగాక (అవియును అసమగ్రముగను) పాశ్చాత్యలోకమే భారతము ననుకరింపదగిన దివ్యసాదృశ్యము కాగలదు.

గాంధీజీయు, కాంగ్రెసునాయకులును మొదట భారత ప్రజకర్హమగు సాంఘిక నిర్మాణమునుగురించి యిదమిద్ధమను నొకనిర్ణయమునకు వచ్చినచో నీపని జరుగగలదు. తరువాత స్వార్థత్యాగము, వాగ్ధాటి, తగినబుద్ధి సంపద, యాత్మశక్తి, కార్యశక్తిగల (హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు

గల) యైచ్ఛికసేవాబృందమును చేకూర్చవలెను. వీరు అందరును కలసి ప్రాచీనపెద్దలచే భారతప్రజలకేగాక జాతి, మత, కుల, వర్ణ, స్త్రీపురుషు భేదములేకుండ మానవజాతికంతకును యేర్ప రచబడిన శాస్త్రసమ్మతమగు సామ్యవాదపద్ధతిని గురించిన శుభసందేశమును భారతదేశ మూలమూలకు గొంపోవలెను; మరియు ప్రధానవిషయములలో అన్నిమతములును ఒక్కటే యని విశ్వమతమును పునరుద్ధరించిన ప్రవక్తల సందేశమును కూడ వీరు వెదజల్లవలెను. ప్రతిపట్టణములోను, గ్రామము లోను, సంస్థానములలోనుకూడ నున్న కాంగ్రెసు సంఘములు వీరికి కావలసిన సదుపాయములను చేయగలవు. వీరు ప్రజాభి ప్రాయమును మేల్కొలిపెదరు; "స్వేచ్ఛ" యనగా నధికారము లను చెలాయించుటేగాక సంఘనిర్మాణముచే వివిధ వృత్తుల కేర్పర్చబడిన పద్ధతిప్రకారము ధర్మములను నిర్వర్తించుటయని ప్రజలకు బోధించెదరు.

—o—

# గాంధీజీ నీతి

## ఆల్బర్టు ఈన్‌స్టీన్

రాజకీయచరిత్రలో గాంధీజీయసమానుడు. పరదాస్యము ననుభవించుచున్న ప్రజలకు మోక్షమునిచ్చు అసమానము, సరిక్రొత్తది, కరుణాపూరితమునగు శాస్త్రము నతడుకనిపెట్టెను; అతడు దాని నత్యంతభక్తితోను పటుత్వముతోను నిర్వహించెను. ప్రస్తుతయుగము పశుబలము నారాధించుచున్నది; అది గుర్తింపకపోయినను నాగరికప్రపంచములోని బుద్ధిమంతులందరును అతని నైతికశక్తిని గుర్తించినారు. తమ సాదృశ్యముచేతను, ప్రబోధశక్తిచేతను తమ ప్రజలలోని నైతికశక్తిని మేల్కొలిపి దానిని బలపరచిన రాజకీయవేత్తయొక్క కృషి యే శాశ్వతముగ నుండగలదు.

మన మదృష్టవంతులము; తరతరములకును జ్యోతివలె నుండగల దేదీప్యమానుడగు సమకాలికుని సమర్పించిన విధికి మనమెంతయు కృతజ్ఞులము.

—0—

# గాంధీజీ సాంఘికశాస్త్రవేత్త—సంఘనిర్మాత

**రిచర్డు గ్రెగ్.**

గాంధీజీ యంత్రములకు కేవలము వ్యతిరేకియను దుర్భ్రమచే పాశ్చాత్యదేశములతనిని కొంచెమించుమించు శాస్త్రదూరుడని భావించును; కాని యిది పొరపాటు.

అతడు సాంఘిక శాస్త్రవేత్త; ఏలననతడు ఆత్మప్రేరణ, పరీక్షబుద్ధి, పరిశోధనయను శాస్త్రపద్ధతులద్వారా సాంఘిక సత్యము ననుసంరించును. పాశ్చాత్యశాస్త్రవేత్తలు తమ సిద్ధాంతములను తమపై ప్రయోగించి పరీక్షింపనొల్లరు. కనుక వారంతసిద్ధులుకారని యతడు నాతో నొకసారిచెప్పెను.

అతడు మొట్టమొదట పరీక్ష తనమీాద నేచేసికొన్ని మొట్టి సిద్ధాంతమునైనను యితరులనుసరింపగోరును; ఆ సిద్ధాంతము-- ఆహారపదార్థములు, పారిశుధ్యము, రాటము, కులసంస్కారము సత్యాగ్రహము:-- దేనికి చెందినదైనను అతడట్లేచేయును. తన యాత్మకథకతడు 'నాసత్యపరిశోధనలు' అను పేరిడెను. అతడు కేవల శాస్త్రిమాత్రుడేకాడు; సాంఘిక సత్యశాఖలోకూడ నతడు గొప్పశాస్త్రి, ఘనుడు; అతడు చేబట్టిన సమస్యలచేతను, వాని పరిష్కారమున కతడవలంబించు విధానముచేతను, అతని పరిశోధనలయందలి పట్టుదల సిద్ధిచేతను, మానవహృదయ

జ్ఞానమంద పారుడగుటచేతను— ఈ యన్నింటను గొప్పవాడు. ప్రజల విజ్ఞానమునకు, భావములకు, ఊహాపోహలకు, ఆర్థిక, హస్తనిపుణతాశక్తులకు నెంతయు తగినపద్ధతులను కనిపెట్టుటలోనే యతని సాంఘిక నిర్మాణదీక్షతకలదు. దేనిని విసర్జింపవలెనో దేనిని రక్షింపవలెనో కనిపెట్టు నతని వివేచనశక్తిలో కూడ నీగొప్పతనము కలదని భావించెదను. మరియు నతడు చేపట్టిన సంస్కరణలనాచరణకు తెచ్చుటలోను, దాని వేగములోను కూడ నతని గొప్పతనము కలదు. ప్రతి సంఘము తన స్థితిననుసరించి మార్పుచెందునని యతడెరుగును. కొన్ని పద్ధతులు చాలకాలము గర్భములోనుండి హఠాత్తుగ పైకుబుకుననియు మరికొన్ని మార్పులకు అధమము మూడు పురుషాంతరములైనను పట్టుననియు నతడెరుగును. సంఘనిర్మాణములో మరియొకచోట నతని గొప్పదనము కాన్పించును. అతడొక సంస్కరణను తలపెట్టినపుడు దానిని సాధించుటకు కట్టుదిట్టమైన యంగనిర్మాణమును చేయును. అతడు నిర్మాణ, పాలన వివరములన్నింట గొప్ప దక్షుడు; వివిధరంగములలో నతడు పొందిన ఫలితము లతని గొప్పతనము నిదివరకే వెల్లడి చేసెను. ఇప్పుడే పుష్పించుచున్న యతని కృషియొక్క గొప్పతనమును గురించి చరిత్ర తెలుపగలదని నేను విశ్వసించెదను.

అతడీక్రింది క్లిష్ట సాంఘికసమస్యలను గురించి ప్రత్యేకముగ పనిచేసెను. (1) దారిద్ర్యము (2) నిరుద్యోగము.

(3) వ్యక్తులకు వర్గములకు జాతులకు మధ్యనున్న దౌర్జన్యము (4) సంఘములో వర్గముల మధ్యనున్న అనైకమత్యము, స్పర్థ (5) విద్య (6) పారిశుధ్యము, ప్రజారోగ్యము, ఆహారము, వ్యవసాయ సంస్కరణలు. ఇవి యన్నియు గొప్పసమస్యలని యందరును ఒప్పుకొనెదరు. చివరనుండి మనము హానిని చర్చించెదము.

పారిశుధ్యమును ప్రజారోగ్యమును ప్రజల దారిద్ర్యము తగ్గనంతవరకు పరిష్కరించుటకు వీలులేదని గాంధీజీ యెరుగును. అయినను వ్యవసాయదారులకు (ప్రజలలో నెక్కువమంది వీరే) అందుబాటులోనుండు ననేక పారిశుధ్యవిషయముల నితడు తన యాశ్రమములో నాచరణకు తెచ్చెను. ఈమార్గములలో నతడనేకమందికి శిక్ష నిచ్చెను; క్రమముగ నివి యనేకస్థలములకు పాకుచున్నవి.

సంఘములోనున్న ప్రత్యేకతను, భేదభావములను పోగొట్టుట కతడు విశ్వప్రయత్నములను చేసెను. హరిజన సంస్కారమీజాతిలోనిది. సాంఘిక మైకమత్యమును సాధించుటకై చ్ఛికముగ నింతటి యుద్యమము బయలుదేరిన దేశమును నే నెరుగను. హిందూ మహమ్మదీయ సమస్య గాంధీజీచేతిలోగాని మరేభారతీయునిచేతిలోగాని లేని బాహ్య రాజకీయములపై చాలవరకాధారపడియున్నది. అయినను భారత దేశము స్వాతంత్ర్యమును పొందినపుడది పరిష్కరింపబడగలదు; దాని పరిష్కారముకు చాలవరకు గాంధీజీ పద్ధతి సాయపడును.

ప్రజలకు కావలసిన విద్యావిషయములో నత డిటీవలనే మేదోయొక చేతిపనిద్వారా విద్యార్థికి కావలసిన విద్య నేర్ప బడు పద్ధతిని కనిపెట్టెను. మన మందరము నికముందు గురికా వలసిన ఆర్థికయొత్తిడి వచ్చినపు డీపద్ధతి దివ్యౌషధము కాగ లదు. దీనివలన విద్యార్థులు ముందుకు పోయినకొలది తమరీయ వలసిన జీతములను తామే సంపాదించుకొనుచు కొద్ది ప్రభుత్వ సహాయముతో విద్య ప్రజల కందుబాటులో నుండునట్లు చేయ గలరు. ఇంతేకాక దీనివలన అనవసరచెత్త తగ్గి విద్య జీవిత ముకు సంబంధించి యుండును. మనస్సు చేతిమీదను, కంటి మీదను యెక్కువగ ఆధారపడియున్నట్లు మానవజాతియొక్క పరిణామము ఋజువు చేయుచున్నది; ఈవిధానము దానికి అను గుణ్యముగ నున్నది.

"దౌర్జన్యరాహిత్యముయొక్క శక్తి" అను నాపుస్తక ములో దౌర్జన్యమునుగురించియు మహాత్ముని విధానమునుగురిం చియు చర్చించియుంటిని. అతని పద్ధతివలన భారతదేశము కింకను స్వరాజ్యము రాకపోయినను దానివలన చాలయభివృద్ధి కలిగెను; అదిమూవత్తుప్రజయొక్క రాజకీయ, సాంఘిక భావము లనుమార్చివేసెను. 'అల్పులము' అనుపూర్వపున్యూనభావమును చాలమందిపోగొట్టుకొని దానిస్థానే ఆశను, ఆత్మవిశ్వాసమును, రాజకీయశక్తిని కలిగి నూతనశక్తిని ప్రదర్శించిరి. గాంధీజీ పద్ధ

తివలన భారత దేశమునకు స్వరాజ్యము వచ్చునని నాకు విశ్వాసముకలదు. ఇంతేకాకనది ప్రపంచమునంతను మార్చివేయును.

దారిద్ర్యమును, నిరుద్యోగమును పోగొట్టుటకు గాంధీజీ వడుకునూలు, చేనేత, చేతితో నేయుట, యితరగృహపరిశ్రమలను పునరుద్ధరించుట మొదలగు కార్యక్రమమును సూచించెను. పాశ్చాత్యులీసూచనను నిరాకరింతురు; హూణవిద్య నభ్యసించి నగరములలోను, పాశ్చాత్యభావములలోను పెరిగిన భారతీయులకు కూడ నిదే జబ్బు. కనుక దీనిలోనున్న విశేషమును గురించి పాశ్చాత్యసరళిలోనే నేను చర్చింతును.

శీతోష్ణస్థితినిబట్టి—కొన్ని నెలలు విడువకుండ వర్షము కురియుట, యెక్కువకాలము యెండలు, తేమలేకపోవుట—ఈకారణములచే సంవత్సరముకు మూడులగాయితు ఆరునెలలవరకు రైతులందరును పనిలేకుండ సోమరులై యున్నారనుసంగతి భారత దేశము గ్రహించెను. ఇతరులు దీనిని గ్రహింపలేదు. మండువేసవిలో కఠిన భూములను దున్నుట, విత్తుట, కోయుట మొదలగునవి యసంభవము. భారతఖండములో పొలములలోను, అడవులలోను పనిచేయువారు 12 కోట్లమంది కలరు. ప్రతివత్సరము నుండు యీగాప్రిమ నిరుద్యోగము మొత్తము ప్రజలనుబట్టి చూచినను వస్తుతః గ్రహించినను భరింపరానిదని వేరుగ చెప్పనక్కరలేదు. ఈ యార్థికనష్టమా యపారము! దీనివలన సంభవించు మానసిక నైతిక పతనమా తీరనిది!

పాశ్చాత్య యంత్ర వస్త్రములు రాకపూర్వ మీవ్యవసాయదారులు తమ తీరికకాలము నంతను—వడుకుట, నేయుట, యితర చేతిపరిశ్రమల నభివృద్ధిచేయుట — ఇట్లు గడుపుచుండెడివారు. నేటికిని భారతదేశములో తయారగు గుడ్డలో మూడవవంతు చేమగ్గములమీదనే వేయబడుచున్నది. భారతదేశములో నన్ని రాష్ట్రములలోను ప్రత్తి పండును. ఈపనికి కావలసిన చేతిపని ముట్లు బీదరైతు కందుబాటులోనుండు ధరలో నున్నవి. చేతిపని సాంప్రదాయ మింకను నశించలేదు. మిల్లుబట్టధరకంటె చేనేతబట్టధర విశేషము కాదు; తమ నూలును తామే వడుకు కొనువారికి మరింతచౌక; ఇంటిఖర్చులో సాధారణముగ బట్టకు ఆరవవంతు లేక అయిదవవంతువరకగును. చాలీచాలని జీవితములను గడుపువారు కష్టములేకుండ నీవిధముగ తమఖర్చులో నారవవంతు మిగిల్చుకొనుట ప్రాణపోషకము కాదా? అట్టిచేతిపని యార్థికముగ లాభదాయకమే కాకుండ తెలియకుండ జీవితాశను, ఉత్సాహమును, ఆత్మగౌరవమును, ఆత్మవిశ్వాసమును పెంపొందించును; చిరకాల నిరుద్యోగమువలనను, దారిద్ర్యమువలనను యివి భారతదేశములో నాశనమైనవి. చేతిపనులలోనున్న యిట్టి చికిత్సాశక్తిని ఆధునిక మనోవ్యాధి చికిత్సకులు గ్రహించిరి. "వృత్తిద్వారా చికిత్స" యనుపేరిట మనోవ్యాధులను కుదుర్చుటకు, ముఖ్యముగ నిరాశను కలిగించు పిచ్చిని పోగొట్టుటకు చేతిపనుల నెక్కువగ నుపయోగించుచు

న్నారు. చూచుటకు పైకి విపరీతముగ కనిపించు యీసూచన పై కారణములచే హేళన చేయతగ్గదికాదు. అయినను చాల మంది "యుద్ధంములు" ఇది తాతలనాటి పంచాంగమని, గడియారమును వెనుకకు త్రిప్పుట యని పరిశ్రమను విభాగము చేయవలెనను మహత్తరసూత్రమును గంగపాలు చేయుటయని, యంత్రములను శాస్త్రమును నిరసించుటయని హేళనచేయుదురు.

ఏపరిశ్రమ పద్ధతియైనను ప్రజలందరి లాభముకొరకు నుద్దేశింపబడవలెను; ఒకపద్ధతి కొందిమందికి లాభములేనిచో వారు తమకు లాభించు దాని నవలంబించుటలో దోషములేదు; లక్షలకొలది ప్రజలకు జీవితావసరములనైనను గడుపనపుడది 'చాటపెయ్య' వంటిది; అప్పుడు వారు నిజమైనతోవ దొరుకు వరకు వెనుకకు మళ్లకపోవుట మూర్ఖత్వము; నిజమునకు వారి యార్థిక గడియారమాగిపోయెను. కనుక వారి ముఖ్యావసరముల నెంత నెమ్మదిగనైనను ప్రసాదించు నెట్టి పరిశ్రమ పద్ధతియైనను గడియారమును తిరిగి ప్రారంభించుటేయగును గాని ఆపివేయుటెట్లగును ? చేతియంత్రములకంటె నాధునికయుద్ధము ప్రపంచగడియారమును నిరాఘాటముగ వెనుకకు త్రిప్పగలదు. అయినను రాజనీతి ధురంధరులు ఇంజనీరు 'సోదరుల' యొక్కయు "విద్యాధికబ్రువుల" యొక్కయు నామోదముతో కోట్లకొలది ధనమును యుద్ధప్రయత్నములకొరకు వెదజిమ్ముచున్నారు.

చేతిపరిశ్రమలనాటికంటె నాధునిక పారిశ్రామిక విధానము సాంఘిక కృత్యములను మరింత పురాతనస్థితికే తీసికొని వెళ్లెను. చేతిపరిశ్రమలనాటి నీతికంటె నిప్పుడెక్కువనీతి 'పొడిచి వేయుట' లేదు. మానవసంఘమంతయు నొక్కటి; అట్టి యేకత్వమును వెల్లడిచేయు పద్ధతులను, పరికరములను, మారక సౌకర్యములను నిత్యకృత్యములలోను, వ్యాపారములలోను కలిగియుండవలెనను విశ్వాసము లేనంతటి మూర్ఖులుగ మన తాతలు, మనము నున్నపుడే "వెనుకకుపోవుట" తటస్థించును.

చేతిపరిశ్రమలను చేబట్టుట పరిశ్రమ విభాగమునువీడుట కాజాలదు. వాటంతటవియే పూర్తిగగాని కొంతవరకుగాని పని చేయు యంత్రములచేతనే కొన్ని సందర్భములలో నీసూత్రము భంగమగుచున్నది. మరికొన్ని సందర్భములలో వెనుక నీసూత్రము పనిచేసినంత తీవ్రముగ నిప్పుడు పనిచేయుటలేదు. దీనికి రెండు కారణములుకలవు. పూర్వపు పెద్దపెద్ద సంతలా తగ్గి పోయెను! పారిశ్రామికులకు పెట్టుబడిదారులకు నిర్వాహకులకు మధ్యనుండవలసిన పరస్పర సహకారము సమాశ్రయము సామరస్యము సన్నగిలెను. లాభదాయకముగ పనిచేయుటకు పరిశ్రమ విభాగమునకు కొన్నిహద్దులుకలవు. ఇప్పుడీ హద్దులు నాశమయ్యెను.

గాంధీజీయొక్క సూచనయంత్రములనుగాని శాస్త్రమునుగాని త్యజించుటలేదు. సోమరిగా నిరుద్యోగముగనున్న

మానవశక్తికది సరళయంత్రశక్తిని చేకూర్చుచున్నది. అది ప్రత్యేకముగ కొన్నియంత్రములను — అవియాప్రజలయొక్క— సాంఘిక, ఆర్థికపరిస్థితులకు తగియుండుటచేతను, కష్టము లిదివరకే పెక్కులుగనున్నచోట నవి క్రొత్తసాంఘిక, ఆర్థిక సమస్యలను సృష్టింపవు కనుకను—మాత్రమే సమర్థించును.

ఇప్పుడన్ని దేశములలోను ప్రభుత్వధనము హెచ్చుగ యుద్ధసంభారములకును, యుద్ధకార్యములకును వినియోగింపబడుచున్నది. కనుక సామాన్యజీవిత వ్యయప్రమాణము తగ్గుచున్నది; విద్య, ప్రజారోగ్యము మొదలగు వానిపై ఖర్చులు కోసివేయబడుచున్నవి. ఆర్థికవిధాన మధ్వాన్నమైనది. పాశ్చాత్యదేశములలో సంఘమునీతి తప్పిపోవుచున్నది; విచ్ఛిత్తు అగుచున్నది; పిచ్చి, ఆత్మహత్యలు, నేరములు హెచ్చగుచున్నవి. మరియొక ప్రపంచయుద్ధమువచ్చుచో మానవప్రపంచమునకు పెద్దమొత్తున వృత్తివైద్యము తప్పనిసరియగును. ఆర్థికముగను, వైద్యరీత్యాఖద్దరు, అన్నివిధముల చేతిపరిశ్రమలు మరింత యమూల్యములగును.

మరియొకవిషయమును మనము మరువరాదు. పారిశ్రామిక దేశములన్నింటిలోను జనాభా వేగముగ తగ్గిపోవుచున్నది. అనేకమంది పాశ్చాత్యాధికారులు వివరముగ నీసాక్ష్యము నేయిచ్చిరి. ఈ ప్రజాక్షయమువలన (ముఖ్యముగ పశ్చిమదేశములలో) కలుగు సాంఘిక ఆర్థికఫలితము లతిదారుణముగనుండి

ప్రపంచమునంతను చుట్టబెట్టును. ఈ కారణముచేతకూడ చేతి పనులు, ముఖ్యముగ ఖద్దరు, చాల సహాయకారిగానుండును.

గాంధీజీ గొప్పసాంఘిక శాస్త్రవేత్త, సంఘనిర్మాత యని యీ భావములే నన్ను ప్రేరేపించినవి. "కఠినమైనపనులు చేయుటచేగాక నిష్కపటహృదయముతో, పవిత్రహృదయ ముతో చేయుటచేతనే మానవున కద్భుతశక్తులు కలుగును." అను సంస్కృతసామెతను అతని విజయపరంపరలు నాకు జ్ఞప్తికి తెచ్చుచున్నవి; ఉదారత, యేకాగ్రత, అప్రతిహతభక్తిచేతనే యద్భుతకార్యములు నెరవేరగలవు. మనకు గాంధీజీని సమ ర్పించిన విధికి కృతజ్ఞుల మగుదుముగాత!



# సమయము — వ్యక్తి

### గిరాల్డు హర్డు

ఐశ్వర్యమే నాగరికతయనియు, తన యంత్రనైపుణ్యము హెచ్చినకొలది తన సౌఖ్యము, భాగ్యభోగ్యములుకూడ సమ ముగ నభివృద్ధిచెందుననియు, తన యైశ్వర్యము శాశ్వతమగు ననియు, నందరకును అంతులేనివస్తువులు సమానముగ సరఫరా యగును కనుక మానవులందరును సములుగనుందురనియు, నభివృద్ధి యంతములేకుండ నుండుననియు వెర్రి పాశ్చాత్య ప్రపంచ మూహింపసాగెను.

ఇప్పుడీపాశ్చాత్యవ్యామోహ మంతరించుచున్నదికనుక మానవు లందరును సమానులుకారనియు సహజమైన యాధ్యాత్మిక వరప్రసాదములచే గొప్పవారును కొద్దివారును నుందురనియు, నాగరికత విధాయికముగ వృద్ధికానక్కరలేదనియు నది కూలిపోవచ్చుననియు లేదా యొకమహత్తర వ్యక్తియొక్క ప్రబోధముచే హఠాత్తుగ నూతనరూపములనొందవచ్చుననియు నిపుడు గ్రహింపబడుచున్నది.

ఈ జ్ఞానము మంచియదనులో కలిగెనని చెప్పవచ్చును. కారణమేమన పాశ్చాత్యప్రపంచము అనంతసుఖమును విశ్రాంతిని పుష్కలతను ప్రసాదించు భవిష్యత్తును నిర్మించుకొనుచున్నానని యూహించుచుండగా నది తన ప్రధానసమస్యను పరిష్కరించుకొనజాలకపోగా దానిని మరింత ముజ్జిడ్డు స్థితికి తెచ్చిపెట్టెను. న్యాయమును, క్రమమును కాపాడగల నిజదేవతకొరకు వారు వెతకుచున్నారు. శాంతిని, న్యాయమును కాపాడుటకు దౌర్జన్య మొక్కటే శరణ్యమైనచో వాని రక్షకులు వానిని నాశముచేయకుండ చూడగల మార్గమేదికలదు? ఈ ప్రశ్నయే గొప్పసంస్కర్త లందరను నెదుర్కొనెను. జీససు కత్తిని నిరసించెను; కాని పాలనాధికారము వచ్చుటతోడనే యతని యనుచరులు తిరిగి దానిని చేపట్టిరి. మహమ్మదు తమమును ప్రబోధముచేతనే వ్యాపింపచేయవలెనని ప్రారంభించెను; కాని తీవ్రప్రచారముపేరిట నది హింసలోనికి దిగెను. ధర్మా

ధర్మవిషయములటుండ యుద్ధ పద్ధతి ఫలప్రదము కాజాలదు. యంత్రజ్ఞాన మభివృద్ధియైనకొలది అస్త్రముల విధ్వంసకశక్తి యినుమడించుచున్నది. యుద్ధము గ్రుడ్డిది; లక్ష్యశూన్యమైనది; అది యుద్ధముతో సంబంధములేని కోటానుకోట్లను హింసించును; సంబంధము లేనివారినికూడ నీసుడిగుండములోని కీడ్చుకొనివచ్చును. యుద్ధము "నైతికాయుధము" కాదు; అదియొక సాంఘిక వ్యాధి.

కనుక నౌచిత్యము, యోగ్యత, పటుత్వముకల ఆయుధమును, "శక్తిని" కనిపెట్టి దానికి తగిన శిక్షనిచ్చుట కనేకమంది బుద్ధిమంతులు తమ ధన ప్రాణములను ధారవోసిరి. ఇగ్నేషియస్ లయోలాకుచెందిన జీసను స్థాపించిన సంఘమిట్టి ఘనప్రయత్నము చేసెను. ఆస్తి, యిల్లు, వాకిలి భార్యబిడ్డలు—సమస్తమును త్యజించిన కొంతమంది యోధులు; మనోబలబుద్ధిబలములు, కొంత మానసిక సాధన, పైవారి యాజ్ఞలనుశిరసావహించుటలోను విధేయతలోను సైనికశిక్షణమువంటి శిక్షణము—ఇట్టిసాధన సంపత్తితో నొక నిరాయుధసైన్యముకొల్పియిన రోమనుఛర్చిమత సాంప్రదాయము నొకనాయకుని నాయకత్వముక్రింద తిరిగి సాధించెను.

ఇట్టి నిరాయుధశక్తి మతరంగములోనేగాక మరియొక రంగములో కూడ జయము గాంచెను. దౌర్జన్యమువలన చక్కబడని కొన్నిప్రత్యేకసమస్యలు దీనిద్వారా నివారణమయ్యెను.

కర్రపడివాటముగ ప్రయోగింపబడు దౌర్జన్యమువలన కుదరని పిచ్చి మానసిక చికిత్సావిధానముచే కుదురును; అడవిమనుష్యులు, అడవి జంతువులు, సాత్త్విక పద్ధతులవలననేకదా విద్యను, సంస్కారమును బడయుచున్నవి; నేరములు చేయు జాతులవారు వీనివలననే తిరిగి చక్కని సాంఘికులగుచున్నారు. దౌర్జన్యముచే సాధువుకాని ప్రత్యేక మానవతరగతులు, జంతువులు దీనిచే సాధింపబడెను. కాని యీ ఫలితములు సకృతు; అవి యంత సకృతుగనుండుటచే నీపద్ధతులను కనిపెట్టినవారు తమపద్ధతికిని దాని శాస్త్రవిజయములకును యుద్ధసమస్యకును శాంతికిని, సాధారణ సాంఘిక క్రమముకును అంతర్జాతీయ బాంధవ్యముకును -- మధ్యగల సంబంధమును గుర్తింపజాలక పోయిరి.

ఈలోపున యుద్ధతంత్రమే యింతకుపూర్వ మెప్పుడును కనివిని యెరుగని యసామాన్య విధ్వంసశక్తిని సంపాదించెను; దాని నిష్ప్రయోజకత్వము, భీభత్సము వృద్ధియైనకొలది, యీ యుద్ధపిచ్చనుండి తప్పించుకొనలేకపోవుటయేగాక వెర్రిమానవులింతవరకొక సాధనగా పరిగణింపబడిన దానినే గమ్యముగ భావింప మొదలిడిరి; తప్పనిసరిగ నామోదింపబడుచు వచ్చిన యుద్ధమే పూజార్హము, కళ్యాణసంధాయకము అనుపిచ్చిలో మునిగిపోయిరి. స్వతంత్ర మానవులంధప్రాయముగ మానవహనన యంత్రములకు దాసులగుట; ఈ యంత్రములకంటె

మరింత యంథపాశ్రయము, విధ్వంసకరమునగు నొకవర్గము యొక్క బుద్ధితక్కువ శాసనమునకు తలయొగ్గుట—అను రెండు పిచ్చలమధ్య మానవలోకము అడకత్తెరలోని చెక్కవలె నిరుకు కొనెను. కనుక మానవలోకము నుద్ధరించుట కిట్టి రాక్షస మారణ పరికరములను కనిపెట్టినవారి బుద్ధినిమించిన తీక్ష్ణ బుద్ధియు, తమ ప్రజలను నిర్దాక్షిణ్య పరస్పర హత్యలకు పురి కొల్పిన రౌద్రమూర్తులనుమించిన చైతన్య స్వరూపుడునునగు వ్యక్తి యవసరమయ్యెను.

మోహనదాసు కరంచందు గాంధీయే యీ వ్యక్తియని చరిత్రకారులు గుర్తింతురనుట కెట్టి సందేహమునులేదు. యూరపు, ఆసియా, ఆఫ్రికాలమధ్య నపూర్వ యరాచకసంఘ ర్షణమేర్పడు సమయమున యూరపుమీద తన యపూర్వాస్త్ర మును ప్రయోగించుటకు భారతదేశ మీవ్యక్తిని ప్రసాదించెను. భారతదేశములో నుదయించిన యీ విధానము మొదట ఆఫ్రి కాలో ప్రదర్శింపబడుట యుక్తము; ఏలనన యీ విధానము మానవలోకముకంతకును సంబంధించినది; ఇది కేవల మానవ జాతులన్నింటిని సమన్వయముచేయు న్యాయమైన సంధాన కరణియేగాక మానవుని ప్రతిప్రాణితోను కలుపుచున్నది. ఈ వ్యక్తిని పంపించిన భారతదేశమే తరువాత నితని మహోద్యమ మునకు కేంద్రమయ్యెను; తన స్థితిచేతను అందున్న విషయముల చేతనుభారతదేశము మానవలోకములోనున్న ప్రజలయొక్కయు,

సమస్యలయొక్కయు సూక్ష్మరూపమని చెప్పదగును. భారత ఋషి సారమగునతని తత్త్వము నాచరణకు తెచ్చు శిక్షణము నతడు కఱపెను.

భవిష్యత్తు అగ్రాహ్యము; కాని రాబోవు తరములో నీహిందూదేశములోనే నిర్మాణ, సంహారకశక్తుల కంత్యపోరాటము జరుగునని జోస్యముచెప్పుట సాహసముకానేరదు; రెండు శక్తులమధ్య పోరుజరుగనున్నది. తాముమాత్రమే యీ లోకమును రక్షింపగలవని సంహారశక్తులు పిఱికి పందలకును, ధనవంతులకును ధర్మపన్నములు చెప్పుచుండును. నిర్మాణశక్తులు మానవలోకము నుద్ధరించునట్టి శిక్షణము, ప్రబోధము, విద్యగల నూతనక్రమముద్వారా రంగము నాక్రమించి యొక్క మానవసంపత్తునేకాక మానవజాతినికూడ నాశమునుండి రక్షించు నిజవిజయమును మానవులకుబ్రసాదింప బూనుకొనును. ఈ సమస్య యెట్లు పరిణమించునది మనము చెప్పజాలము. జయము మనచేతులలోలేదు. జయించినను జయింపకపోయినను తోడిమానవునికొరకు తపించువారికిది యొక్కటే మార్గము. నేడీమార్గము లభించుటకు మానవసేవాశిఖరాగ్రముల నధిరోహించిన యీ వ్యక్తియే కారణమని ముమ్మాటికి చెప్పక తప్పదు.

—0—

# మోహనదాసు కరంచందు గాంధీ—సత్యజ్ఞానదూత

కారల్ హీడ్.

దివ్యపురుషులు మానవచరిత్రలో సదా గొప్పపోరాటముల నెదుర్కొనక తప్పదు. "జ్యోతివలె నేను ప్రపంచములోనికి వచ్చితిని" అని యొకడు చెప్పెను. కాని దివ్యసంతతిని ప్రపంచ మెన్నడును ఆహ్వానముచేయదు. ఏలనన మానవులు జ్ఞానముకంటె నజ్ఞానమునే యెక్కువగ ప్రేమింతురు. అజ్ఞాన, ద్వేష, ఉదాసీన మేఘములు రక్షణ దేవతలవలె కూడ కాన్పించును. దివ్యపురుషుడీమేఘమును ఛేదించి నిగ్రహింపవలెను.

ఈ యజ్ఞానమును, అంధకారమును, ద్వేషమును తన యావజ్జీవము ఛేదించుకొనుచు నిగ్రహించుకొని వచ్చుచుండుటయే గాంధీజీ శీలములో నున్న విశేషము. కనుకనే నేడతడొక్క భారతాత్మవలె మాత్రమే గాక కరుణార్ద్ర మానవ ప్రపంచముకంతకును జ్యోతివలె ప్రకాశించుచున్నాడు; అతనిది చిరకాల బాధ, పోరాటము, అవిరళభక్తి అనేకోపవాసములు గల దీర్ఘ చరిత్ర. అట్లు కానినా డతని గొప్పతనమే లేదు. మోహనదాసుకరంచందుగాంధీ చాలకాలముక్రిందటనే క్షమా రహస్యమును గుర్తించెను. "అంతులేని క్షమలోనే నీకు శాంతి

యుండును" అను థామసు ఎకెంపిసు వాక్కులోని సత్యము నితడు కనిపెట్టెను. ఇతరులలోనున్న యుద్రేక మతని రక్తపు పోటు నపాయకరముగ హెచ్చించినను అది యతని సహజ క్షమను-వ్యతిరేకులయెడ క్షమ, విదేశప్రభుత్వముయెడ క్షమ, అంతుపొంతులు లేని ప్రేక్షకులపట్ల క్షమ; అప్పుడప్పుడు శ్రమ కలిగించుచుండు నిజశిష్యులపై క్షమ—తాకజాలదని యతనిజీవితమును ప్రజాకార్యములను ప్రజాసంబంధములను అతిసన్నిహితముగపరీక్షించి కనిపెట్టువారు గ్రహింపకతప్పదు. ఈక్షమయతనికే చెల్లును; ఏలనన నెట్టిభయంకరదోషము, మెట్టి విషమసంభవములు తటస్థించినను "దైవయంత్ర మెప్పుడును నెమ్మదిగ తిరుగుచుండును" అను విషయ మతని యాత్మలో హత్తుకొని పోయెను. మోహనదాసుకరంచందుగాంధీ యీ యంత్రముల లోనే పనిచేయుచుండును.

"ప్రమాదరహితుడ" నను దంభములు పలుకక నతడు తప్పులు చేసినను సాటిలేని ధైర్యముతో వానికి బహిరంగశిక్ష విధించుకొను సత్యారాధకుడు. "దేవుడు సత్యమను పరిపూర్ణ నిర్వచనముకంటె నాకు వేరు నిర్వచనము లేదు" అని మూడు వత్సరముల క్రిందట నతడు వ్రాసెను. ఇందువలన నత డూహా ప్రపంచ సత్యములతో తబ్బిబ్బులాడక నేహాతత్పరతలో తేలియాడునని మనము గుర్తింపవలెను. "అట్టి మతము నారాధించుటకు ప్రాణికోటియొక్క నిరంతరాయసేవలో మగ్నుడు కావ

లెను; నిరంతరసేవ చేయుచునే యుండవలెను". కాని యిది బాహ్యమునుండి దయతో చేయబడు సేవకాదు. "తానుపూర్తిగ నీయనంతజీవితసాగరమున లీనముకావలెను. దానితో నైక్యము కావలెను." "జీవిత వాహిను లన్నియు నిందులో చేరవలెను." కనుక నీవిధముగ సత్య మతని ప్రత్యక్షానుభవ విషయము.

కనుక మోహనదాసు చైతన్యస్వరూపుడు. అత డెచ్చటనో గగనమున నుండు ఉత్కృష్ట ఆధ్యాత్మిక యేకాకి కాడు. అతడు మహాత్ముడు; మానవులకొరకు పనిచేయు మానవులలో మానవుడు. నిర్దుష్టమైనదృష్టి, భగవంతునిమ్రోల మౌనముద్ర, న్యాయమైన నమ్రత, భక్తి, జ్ఞానములుగల ఆధ్యాత్మికత కలవాడు. విశేషించి కర్మయోగి. సులభలభ్యుడు; ప్రేమను చిలుకువాడు ప్రేమార్హుడు. హాస్యరసస్ఫూర్తి కలవాడు; మానవుని నైతిక, ఆధ్యాత్మిక రాజకీయ, సాంఘిక సమరములలో ముందుండువాడు. ఇంకేమి కావలెను ?

ఒక్కొక్కప్పు డగ్రాహ్యుడైనను అతని సరళత, నిర్దుష్ట మనస్సు ప్రేమింపదగినవి. ఏలనన నతడు మనస్సును చాల శుద్ధిపరచెను. అతని జీవితావసర ద్రవ్యములు కూడ నతి సరళమైనవి. ఈ సరళత అన్నిజాతుల స్త్రీ పురుషులను తనజాతి ప్రజనంతను ఆకర్షించుచున్నది; అతడు ఆస్తి నంతను ఒలిచివేసి థోరోవలె తృషితమైనను లేక సర్వమును కలిగియుండు నానందము ననుభవించుచున్నాడు. దక్షిణాఫ్రికాలోని తనజాతీయుల

కొరకు తన హిందూసంఘములోని హరిజనులకొరకు, భారత పల్లెజులకొరకు, వారి స్వాతంత్ర్యముకొరకు, మైదానములలో నున్నవారి గ్రామజీవితముకొరకు, గ్రామముల ఆర్థిక విద్యావసరములకొరకు, సరిహద్దులలో నున్న కొండజాతులవారికొరకు, హిందూ మహమ్మదీయ సఖ్యతకొరకు, ఖయిదీలకొరకు, అన్ని తరగతులకు మతములకు కులములకు జాతులకు చెందిన స్త్రీ పురుషులకొరకు, "గోరక్షణ" ద్వారా జంతుకోటికొరకు, చెడుగును దౌర్జన్యరహితముగ నెదుర్కొను నిర్మాణదక్షతగల గొప్ప యాదర్శముకొరకు—ఇన్నింటికొరకతడు సలిపిన సమరమును దృక్పథమున నుంచుకొనుడు! ఈయన్నిరంగములలోను నతడేవ్యక్తికిని చెడుగు దలంచి యెరుగడు. "భారతదేశము యొక్కయు, మానవలోకముయొక్కయు దీనసేవకుడను" అను నతని యభిమానపురస్సర వచనముల నాలింపుడు!

సత్యాగ్రహ సిద్ధాంతము నతడు భల్లూకపు పట్టుతో పట్టెను. ఇది సహజము. ఏలనన నతడాత్మశక్తియొక్క యవతారము. ఎంత రాజకీయ, సాంఘిక కార్యకలాపములలో మునిగియున్నను అత డెప్పుడును తన యాత్మలోనే మగ్నుడగును. కనుకనే యతడీయాధునికప్రపంచమును సవాలుచేసి మాట్లాడుచుండును. అదియే యతనిలో నున్న గొప్పతనము. భయపెట్టబడెను, బందీచేయబడెను, వెక్కిరింపబడెను, గర్హింపబడెను దూషణలకు గురియయ్యెను; కాని యతడు మాత్రము

అడుగడుగుకు, మెట్టుమెట్టుకు మానవ జీవిత ప్రమాణములో నుత్తమోత్తమస్థితికి పోవుచుండెను; పోవుచున్నాడు. మానవుల పట్లను, ప్రాణికోటి యంతటిపట్లను నతనిలో ప్రేమ మూర్తీభవించుటచే భూమండల మంతట నన్ని దేశములలోను, అన్నిజాతులలోను కోటానుకోట్లమంది యతనికి స్నేహితులైరి. హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ, బౌద్ధ, పారశీకాది మత భేదమనునది యతని మనమున లేదు. అందరును అతని స్నేహితులు; సత్యదేవతయొక్క కుటుంబములో భాగములు; సత్యమే భగవంతుడు.

జంతువులతోనేమి మానవులతోనేమి యతని సంబంధ మంతయు నహింసాపూరితము. ఈయుగమున నాగరికతకు, మానవత్వమునకు గాంధీజీ యొక 'మచ్చు'.



## శాంతిని కోరు నొక క్రైస్తవుని దృష్టిలో గాంధీజీ ప్రాముఖ్యత

### స్టైఫెను హోబుహౌసు, యం. యె.

మన మతము వేదాంతము బాహ్యము నారాధించున ట్లెంతకాన్పించినను కొద్ది విమర్శజ్ఞానము, తృష్ణగల మానవుడు తనను పరివేష్టించియున్న యీయద్భుత, యజ్ఞాతపరిసరములు

పరిపాలించు వస్తుసామగ్రినుండి తానొక స్వీయప్రపంచమును నిర్మించుకొనవలసియున్నది. మన ప్రకృతిని, హృదయమును, బుద్ధిని యద్భుతముగ నాకర్షించి చలింపచేయు విషయములు, శక్తులు, గుణములుపురుషులు (లేక ఆదర్శములు) కొన్నికలవు. వీనిని తెలుసుకొనవలెనని, ప్రేమింపవలెనని, వీనితో నైక్యము కావలెనని, అల్పములు, అప్రధానములు, అపవిత్రములు, అప్రియములు నగు వానినుండి విముక్తి నొందవలెనని వివేక స్థితిలో మనల నొక నిరంతరకోరిక వేధించుచుండును. మానవ కళలను సృష్టించి, శాస్త్రపరిశోధనాదులనుచేసి కొంద రీయానందమును పొందుదురు. పరిపూర్ణస్థితి నొందిన దివ్య స్త్రీపురుషులను కండ్లారకాంచియు లేక మనసార పఠించియు వ్యక్తిత్వములోనున్న యనిర్వాచ్యానందాశ్చర్యములను కొంద రనుభవింతురు. అట్లే వినీలాకాశము, సస్యశ్యామలపృథ్వి, కిలకిలారవ సంకులజీవరాశి—అగు దృష్టప్రపంచము ప్రసాదించు నాంతరంగికసామరస్యభావములలో నట్టి యనిర్వాచ్యానందమును కొంద రనుభవింతురు. నే నీరెండవతరగతి వాడను. నాకీరెండు ఉత్తమ యనుభవ కేంద్రములనుండియు భగవంతుడని మనము పిలుచు దానియం దనన్యభక్తి కుదిరెను. ఇంతేకాక నాయందు నాపరి సరములందునుండి యాత్మప్రకాశముకొరకు, మోక్షముకొరకు తహతహలాడు వివిధ జీవరాశికి మూలము, గమ్యమునై యనంతమై యవ్యక్తమై యకలంకవ్యక్తతను, కళ్యాణమును

పరిదర్శించు వ్యక్తిని పరిశోధించుటయందును యనన్యభక్తి కుదిరెను.

తమ దౌష్ట్యముచే జీవితసామరస్యాభివృద్ధిని భంగపరచు కుచ్ఛిత విధ్వంసక శక్తులను కూడ నేను గ్రహించితిని. కొంత వరకీశక్తులు బాహ్యప్రపంచములో నున్నట్లు కాన్పించును. కాని ధైర్యోపేతమగు మానవాత్మ ప్రకృతియొక్క అనుపప త్తుల నవలీలగ తరింపగలదు. కనుక ప్రకృతిలో నున్న దుర్బుద్ధి కంటె మానవులలోనున్న దుర్బుద్ధియే, ముఖ్యముగ నాహృద యములోనున్న దుష్టత్వమే, యెక్కువప్రమాదకరము. ఈదుష్ట స్వభావముల సైతానుశక్తికి తాళజాలక ససహాయుడ నైనచో నేను విశ్వాసమును కోల్పోయి నిర్వీర్యుడ నగుదును. నా సహా యముకొరకు, మోక్షముకొరకు నేనిపుడు మరియొక మానవ వ్యక్తి లేక దివ్య వ్యక్తియొక్క సాహచర్యము నభిలషింపక తప్పదు. కళ్యాణాత్మకమైన సర్వమును జీససులో మూర్తీభ వింపచేసిన సంఘములో పుట్టునట్లువిధి నన్ను శాసించెను. మరే వ్యక్తియు నేయవతారమును యీ చరిత్రాత్మక పురుషుడు పొందిన దివ్యత్వమును పొందలేదని నా విశ్వాసము. ఈయా త్మయే యితర మానవ వ్యక్తులలోను కొద్దిపాటి తక్కువ తేజ స్సుతో వెలుగొందుచుండును. వారి తేజస్సులో నచ్చటచ్చట కొద్ది కళంకముండవచ్చును. కాని యది వారి గొప్పతనమును కొంచపరచజాలదు. అతడు భగవంతుడని ప్రభువని వీరిలో

కొందరంగీకరింపకపోయినను వీరందరును ఆపురాణ క్రీస్తుయొక్క పరివర్తలు, దూతలు అని నా యభిప్రాయము.

అహింస-సత్యాగ్రహ బ్రహ్మయగు మోహనదాసుకరంచందు గాంధీ యీచరిత్రాత్మక దివ్యజ్యోతులలో నొక మహావ్యక్తిగ నెల్లకాలము పరిగణింపబడునని నా యభిప్రాయము. మన యుగమున జనించినవారిలో నతడు పురుషోత్తముడు. ప్రాచీన విశ్వాసములు, నీతులు నశించెను. యంత్రము నిరంకుశాధికారమును వహించెను. ఎవరి యధికారమును మనము సమర్థించుచున్నామో లేక నథమము సహించుచున్నామో యట్టి వక్ర పారిశ్రామికధురీణులు, యుద్ధకోవిదులు శాస్త్రము నపాత్రవినియోగము చేయుటచే ప్రపంచచరిత్రలో నొకయపూర్వనరకము సృష్టింపబడెను. మానవాహంకార మమకారప్రేరితమగు రాబోవు మహావిలయములో నాగరికత (దీని కనేకార్థములు కలవు) లేక నిపుడు మంచి యదృష్టవంతు లనుభవించుచున్న క్రమయుతము, దయామయము, విజ్ఞానభూయిష్టమునగు సంఘము మున్నెన్నడును కని విని యెరుగనట్లు పూర్తిగ నశింపవచ్చునను యూహకూడ కలుగుచున్నది.

మనల నావహించియున్న యిప్పటి దురవగాహస్థితి నుండి గాంధీజీ యొక్క మహత్తరఅహింస సత్యాగ్రహమొక్కటి మాత్రమే మనల నెట్లు తరింపచేయగలదో చూప యత్నించితిని. ఈప్రయత్నములో నీయాదర్శములే క్రైస్తవవిజ్ఞానాయ

కులచే నిరసింపబడి లేక నుపేక్షింపబడి ప్రపంచమునకు ప్రకటముకాకుండి పోయిన యూరపు దేశ భూత ఆదర్శచరిత్రనుకూడ చర్చించితిని. ఆత్మవినాశమునకు కత్తులకంటెను కఠారులకంటెను రాక్షసమగు నసంఖ్యాక వివిధాస్త్రశస్త్రనిర్మాణములో మునిగియున్న యూరపు మధ్యభాగమున మోటారు రొదచే ఘూర్ణిల్లించు నొకమార్గముద్వారా పోయినచో జర్మను సైలీషియాలో గోర్లిట్జు అను నొక పురాతన పట్టణము కానవగును. అచ్చట పదిహేనువత్సరములక్రితము జాకబు బోహీము అనువాని గౌరవార్థ మొక శిలావిగ్రహము స్థాపింపబడెను. ఆవిగ్రహముక్రింద నతని మాటలలోనే యిట్లు చెక్కబడెను. "ప్రేమ, సాధుత్వములే మన యాయుధములు." "దానితోనే మనము జీససుయొక్క కంటకస్థగిత సింహాసనము పేర పోరు సలుపగలము" అని వ్రాసినచో నతని సందేశము పూర్తియయ్యేడిది. అతడు భగవంతునికొరకు, సత్యముకొరకు పోరిన ఋషి. జీవాత్మకదియే మోక్షము నిచ్చునని ప్రకటించినందుల కతడు యింటి నుండి తరిమివేయబడెను. భూత యూరపుచరిత్రలో నహింసా సందేశానుసారము జీవించిన సాధుపుంగవు లనేకులు లేకపోలేదు. వారు తము దేశమవలంబించుచున్న సాంఘిక, జాతీయ కార్యకలాపముల ముందర నివి నిరర్థకమయ్యెనని వాపోవుచుండిరి. ప్రపంచకళ్యాణమునకును, సంఘ పునరుద్ధరణకును విశ్వప్రేమయే దివ్యసందేశమని ప్రజలకు ఘోషించునంతటి ధైర్య

సాహసములు, శక్తి, ప్రబోధము కొద్దిమందికి మాత్రమే యుండెను.

యూరపు క్రైస్తవ మతావలంబన చేయుచున్నట్లు చెప్పుకొనుచున్నను "నాగరిక" జాతు లన్నింటిలోను ఆత్మ వినాశమును తెచ్చిపెట్టు పోరాటముకొరకే సర్వప్రయత్నములను చేయుచున్నది; ఈసమయమున హిందూదేశమున నొకపలాకు వంటి దుర్బల లాయరొకడు (పూర్వాశ్రమమున) సత్యము, అహింస, ధర్మముల పేరిట, భగవంతుని పేరిట మరియొక యుద్ధమునకు లక్షలకొలది స్త్రీపురుషుల నుద్బోధించుచున్నాడు. ఈ యుద్ధములో మానవహననాస్త్రము లేవియు నుపయోగింపబడవు; ఈయుద్ధములో నాత్మశక్తి, అహింస, క్రూరశత్రువుపై గూడ ప్రేమను చిలుకుట, భగవంతునిమోల విశ్వాసముతో వినమ్రులగుట; ఇవియే ఆయుధములు. ఆధునికప్రపంచము నావరించియున్న దుఃఖ భయవిహ్వలతల మధ్య నిదియొక కలగా తోచును. అయినను నింతవరకు కొన్ని లోపములు, అసందర్భములు, విఘాతములు (నాయకునిలోను అనుచరులలోను కూడ) కలిగినను ప్రాణదాయకమగు నిట్టిప్రజాయుద్యమములో తొలిప్రయత్నములైనను చేయబడెనని యొప్పుకొనక తప్పదు. మహాత్ముడు గత విఫలతను గురించియు, ఆశాభంగమునుగురించియు గత కొలది మాసములలో మరియొకసారి నిర్మొగమాటముగ నొప్పుకొనెను. కాని భవిష్యద్విషయమై యతనివిశ్వాస

మెంతమాత్రమును మొక్కవోలేదు. "భారతదేశ మనుభవించు చున్న యనేకదోషములను నివారించుట కహింసామార్గమును ప్రసాదించు తన యుపకరణముగ నన్ను భగవానుడు నిర్మించి నాడు......దౌర్జన్యరాహిత్యమునందు నావిశ్వాస మెప్పటివ లెనే మొక్కవోక యున్నది. అది మనదేశమునకు కావలసిన వాని నన్నింటిని ప్రసాదించుటయేగాక సరిగా నడుపబడినచో పాశ్చాత్య ప్రపంచమును కూలద్రోయనున్న రక్తపాతమును గూడ నరికట్టకలదు."

పరపరిభుత్వ దాస్యము ననుభవించుచున్న ప్రజలలో లక్షలకొలది జనులు తమ నాయకశిఖామణియొక్క మధుర వాణి లేక లేఖినినుండి వెలువడు నీక్రింది యుపదేశములను తూ చా తప్పక నాచరించునంతటి దేశభక్తిని పురికొల్పు యుద్యమము నెట్లువర్ణింపవలెనో తెలియకున్నది.

"అహింస(హింస చేయకుండుట, దౌర్జన్యరాహిత్యము) యనగా విశ్వప్రేమ; అది పరమధర్మము. అది యొక్కటే మానవలోకము నుద్ధరింపగలదు."

"అహింసను విశ్వసించువాడు భగవంతుని యాస్తిక్య తను విశ్వసించును."

"అహింస తత్త్వోపదేశములచేత నబ్బునదికాదు. అది శ్రద్ధాన్విత ప్రార్థనాఫలితముగ భగవత్ప్రసాదమున మనహృ దంతరాళమును వెలుగొందచేయును."

"అహింస అతిశక్తివంతులయొక్కయు, ధైర్యశాలుర యొక్కయు నాయుధమని గుర్తింపవలెను. యదార్థ భగవద్భక్తుడు కత్తి పట్టగల శక్తికలవాడేయగును; కాని ప్రతివాడును భగవదంశమేయను జ్ఞానము కలవాడగుటచే నతడు దాని నుపయోగింపడు."

"రక్తమే ప్రవహింపవలసినయెడల మనరక్తమునే ప్రవహింపనిండు. ఒరులనుచంపకుండ మనమే ప్రాణముల నర్పించు సాత్త్వికధైర్యమును దోహదము చేసికొనవలెను."

"ప్రేమ యితరులను దహింపదు. చనిపోవువరకు నతి సంతోషముతో బాధల నాలింగనముచేసి యది తనను తానే దహింప చేసికొనును. అది యేఆంగ్లేయుని త్రికరణశుద్ధిగ హింసింపజాలదు."

"హిందూ దేశము తన విజేతలనబడువారిని ప్రేమచేతనే జయింపవలెను. మనదృష్టిలో మానవప్రేమయు దేశభక్తియు నొకటే కావలెను. హిందూదేశమును సేవించుటకు నేనింగ్లీషు వారినిగాని జర్మనులనుగాని బాధింపనొల్లను."

"సత్య, అహింసలు అవినాభావసంబంధము కలవి; ఒకదానిలో రెండవది యిమిడియే యున్నది."

"సత్యముకంటె నుత్కృష్టదైవము లేదు. మొదట మనము సత్యమునే యన్వేషింపవలెను."

"దైవోపదిష్టమగు మన పవిత్ర యుద్ధములో దాచవలసిన రహస్యము లేవియును లేవు; టక్కరితనమునకు, నసత్యమునకు తావు లేదు. సర్వము బహిరంగముగ శత్రుసమ్ముఖమున నే చేయబడును."

"సత్యాగ్రహము (సత్యశక్తి లేక నాత్మశక్తి) పవిత్రత కొరకు ప్రార్థించు నన్ని స్వార్థ విషయవాంఛలను నిగ్రహింప గోరును."

"తానవలంబించు ప్రతిసోపానమునందు సత్యాగ్రహి (సత్యశక్తి నారాధించువాడు) తన శత్రువుయొక్క యవసరములను గుర్తింపవలెను; అతడధర్మ చట్టములను, ఆజ్ఞలను శిరసావహింపడు. కాని యతడెప్పుడును సాధుత్వమును, మర్యాదను పాటించును."

"సత్యాగ్రహి ధర్మపథమునుండి యెప్పుడును తొలగడు, కాని శాంతికొరకెప్పుడును కాంక్షించును. అతనికితరుల యందు పరమవిశ్వాసము, అఖండమైన యోరిమి యుండును."

"వస్తుతః మానవ ప్రకృతి యభిన్నము. కనుక చిట్టచివర కుద్ధతుడైనవాడు ప్రేమపాశమునకు విధాయకముగ లొంగును."

"నిశ్చయాత్ములై, శాంతియుతులైన భగవద్భక్తుల దాడిముందీప్రపంచమున నేశక్తియు నిలువజాలదు. ప్రపంచ ఆయుధశక్తు లన్నింటికంటెను అహింస బలవత్తరమైనది."

"భగవద్భక్తులు మృత్యువుకెంతమాత్రమును వెరువరు."

"మనకు యుద్ధరంగమున ధైర్యమసంభవము; కాని నిర్భయత్వము ప్రాణావసరము; శరీర నష్టము, వ్యాధి, మృత్యువు, ఆస్తిని, కుటుంబమును కీర్తిని కోల్పోవుట మొదలగువానినుండి మనకెట్టిభయము నుండరాదు. ఈప్రపంచమున నేదియు మనది కాదు."

"అహింసకు యదార్థమైన నమ్రత యుండవలెను. ఏల యన నది మనమీదకాక భగవంతునిమీదనే యాధారపడుట యని గుర్తింపవలెను."

ప్రపంచైశ్వర్యములో నక్రమ వాటాకొరకు ప్రాకులాడు నంతవరకు లేక మనతోడివారిని కొల్లగొట్టుట లేక వారిపై నధికారమును చెలాయించుటలో నానందము చూచుకొనువరకు నిట్టిధర్మసూత్రములకు కట్టువడుట భయంకరముగనేయుండును. మానవునియందును, భగవంతునియందు, ఆధ్యాత్మిక విశ్వ ఆస్తిక్యమునందును విశ్వాసముతో జీవింప ప్రయత్నించువారును, కళ్యాణేచ్ఛగలవారును నగు స్త్రీ పురుషు లందరును (నెట్టి లోటుపాటులు, తప్పిదములు కాన్పించినను) మానవచరిత్రలో నిట్టి ప్రాణదాయకములగు సూత్రములను తొలిసారి ప్రతిజ్ఞగగొనిన యుద్యమములను తప్పక నభినందింపవలెను. శాసనోల్లంఘనరూపమును దాల్చిన సత్యాగ్రహోద్యమము తగినంత శిక్షణములేని ప్రజలలో నుద్రేకమును కలిగించి దౌర్జ

న్యమునకు తావిచ్చినపుడు తన "హిమాలయతప్పిదము"నొప్పు కొనుచు తన యనుచరులలో ననేకమంది యాగ్రహోనలమునకు గురియైనను యీభారతనాయకు డసామాన్యధైర్యసాహసము లతో తన యుద్యమము నథమము రెండుసారు లాపివేయగలి గెను. ఇంతేకాదు; దౌర్జన్యమును నిరంకుశత్వమును నెదుర్కొ నుటతో పాటు "గర్భదరిద్రులు, అతిదీనులు, పతితులు" ముఖ్య ముగ హిందూదేశములోని "అస్పృశ్యులు" వంటివారితో ననన్యభావమును ప్రకటించు కార్యకలాపము లనేకములు గాంధీజీ యుద్యమములో కలవు.

గత కొలదిశతాబ్దములలో పాశ్చాత్య ప్రమాణములు, సంస్థలు ప్రపంచమును చాలవరకలముకొనెను. సంఘము జీససుయొక్క ఆదర్శములను కొంతవరకే యనుకరించెను. దుర్బ లులు, దురదృష్టవంతులు, పీడితులు నగువారికి కొంత నిజసహా యము, న్యాయము, కరుణ చేకూరెను. సత్యమును, నిజాయి తీని నిలుపుటకును అధికసంఖ్యాకులను భౌతికలాలసనుండి రక్షించుటకును యీసంస్థలు స్వల్పముగ తోడ్పడెననుట నిజమే. కాని యీరంగములలోకూడ వాని విజయము స్వల్పము. ఇక నిరుద్యోగ దుఃఖములను, పారిశ్రామిక పోటీని, యుద్ధమును అరికట్టుటలో క్రైస్తవాదర్శములు పూర్తిగవిఫల మయ్యెను. క్రైస్తవు లందరును (అతిభక్తిపరులుకూడ) "పూచీ, భద్రత" నెక్కువగనారాధించుటయే యీవిఫలతకు కారణము.

శాంతిపాలకుడగు భగవంతునియందును భగవద్దత్తమేయైన తమ నిజాత్మశక్తియందును విశ్వాసమును కోల్పోయి వారు బాహ్యమైన యాధ్యాత్మిక విషయములను, ధనరాసులను, మారణాస్త్రములను విశ్వసించిరి. మనము భగవానుని, ధనదేవతను కూడ సేవింపగోరుదుము; అజ్ఞానులగు పాటకజనము అబుద్ధిపూర్వకముగ నాత్మవినాశకారులగు యంత్రోపకరణములచే తయారుచేయు వివిధవస్తుజాలముచే పరివేష్టింపబడుదుము. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయవలెనను నెపముతో మిలిటరీ శిక్ష నొందవలెనని "చంపుడు, కొట్టుడు, నాశము చేయుడు" అని మన యువకులను మనము హెచ్చరింతుము. ఆర్తులను మన తృష్ణచేతను, స్వార్థముచేతను మనము తరుచు దుర్మార్గులుగ మార్చివేసితిమి.

జీససు తన సందేశముచేతను, జీవిత సాదృశ్యముచేతను యీ నాగరికతాభాసాజాడ్యమునకు శాశ్వతచికిత్సను చూపెను. స్త్రీ పురుషు లందరును ఆత్మ నుజ్జీవింపచేయు దారిద్ర్యమును (మానవుని నిర్వీర్యముచేయు కటికదారిద్ర్యముకాదు) నిరాడంబర జీవితమును వరింపవలెను. భగవంతుని రక్షయందు, కళ్యాణగుణమునందు అనన్యవిశ్వాసముంచవలెను; అన్నిటికంటె నెక్కువగ భగవత్సన్నిధానమున నాధ్యాత్మిక పరవశత్వము నొందవలెను. శాశ్వత జీవిత సిద్ధిని బడయవలెను అని యితడు బోధించెను. మానవకోటితో ననన్యభావమును గుర్తింపవ

లెను. దౌష్ట్యమును అజేయమగు నోరిమితోను, ప్రేమతోను సాధింపవలెను. అధర్ములను సంస్కరింపవచ్చును. దౌర్జన్య మును దౌర్జన్యముతో నెదుర్కొనుటకంటె మనమే బాధపడు టకు ప్రాణముల నర్పించుటకు సంసిద్ధతను చూపవలెను. దుష్టు లను శిష్టులను చేయు భగవద్విధాన మిదియేయని యతడు బోధించెను.

కాని దురదృష్టవశమున మొదటినుండియు నతని యను చరులెవరును దుర్మార్గము నీవిధముగ నెదుర్కొనినట్లు కాన్పిం చదు. న్యూటెస్టుమెంటులో కూడ నీసిద్ధాంత మచ్చటచ్చట పూర్వపు దండనీతితో మిళావు చేయబడెను. ఆ పవిత్రగ్రంథ ములోని కొంతమంది రచయితలు క్రైస్తవవ్యక్తులు దౌర్జన్య మును దౌర్జన్యముతో నెదుర్కొనరాదని శాసించుచు భగవం తుడును ప్రభుత్వమును యిట్టి దండనీతి నుపయోగించుట ధర్మ మేయనిరి. సహజముగ చర్చిలన్నియు నీయభిప్రాయము నంగీ కరించి క్రైస్తవప్రభుత్వములకిట్లే బోధించిరి. శాశ్వత నరక మును ప్రసాదించు యీసూత్రములను భగత్పుత్రుడైన జీసను బోధించెనని వ్రేళ్ళు నాటుకొనిపోయిన యీభావము క్రైస్త వాదర్శముకు తీరని మచ్చ. ఇట్టి విశ్వాసముతో జీససుయొక్క శిలువను పూర్తిగ నర్థముచేసికొనుట దుర్ఘటము.

జీసను ప్రబోధములచేతను, టాల్స్టాయి వానిపై చేసిన వ్యాఖ్యానములచేతను, హిందూమత పవిత్ర గ్రంథములచేతను

నుద్దీపితుడై గాంధీజీ యహింసాసిద్ధాంతమును చేపట్టెను. అతడు దాని నన్నిజీవితశాఖల కనువర్తింపజేసి దానికొకయుక్తమును, శాస్త్రసమ్మతమును నగు స్పష్టవరూపము నిచ్చుటచే నది వేల కొలది జిజ్ఞాసువుల నాకర్షించెను.

భగవంతుడు గాంధిజీ దృష్టికొక నైతికవ్యక్తి; అయినను అవ్యక్తస్వరూపుడు. పునర్జన్మయందును, అవతారములందును నతనికిగల హిందూవిశ్వాస మతని యాచరణీయమగు నుపదేశములకు క్రైస్తవులాక్షేపింపదగిన మార్పును దేనిని కలిగింపలేదు. భగవంతుడు క్రోధమూర్తి; దండధరుడు అని వర్ణించిన వర్ణన గాంధీజీ వ్రాతలలో నెచ్చటను గానరాదు. ధనాశ, మానవాహంకారము, స్వార్థపరత్వము తమ శిక్షను ఆత్మవినాశమును తామే తెచ్చిపెట్టుకొనుచున్నవి. "భగవంతుడు ప్రేమస్వరూపుడు, క్షమావతారము, ప్రపంచము గుర్తించిన ప్రజాస్వామిక ప్రభువులలో నుత్కృష్టుడు" అని యతడు చెప్పును. పాపఫలితముల యనుభవమే 'కర్మ' యని యతడు వ్యాఖ్యానము చేయుటలో బ్రాహీము, లా, పాల్ మొదలగువారి భగవంతుని "అవ్యక్త" స్వయంచోదిత "క్రోధానలము" అను సిద్ధాంతమున కతడు చేరువ యగుచున్నాడు. మానవలోకము భగవంతుడు వస్తుతః అభిన్నులని యతడు విశ్వసించుటచే దుర్మార్గుల మోక్షము క్రమశః విధాయిక మగుచున్నది." మన కొక్కటే యాత్మ కలదు......కనుక నేనెంత దుర్మార్గ

జీవినైనను వీడజాలను ... నేను నా సత్యాగ్రహోద్యమములో నా మానవజాతి నంతను చేర్చుకొనవలెను.

మహాత్ముని పూర్తిప్రోగ్రాములో నావంటి పాశ్చాత్య క్రైస్తవులకు కొన్ని యసందర్భములు, విజాతీయములు, ప్రధానక్రైస్తవతత్త్వమును, హైందవ యహింస—సత్యాగ్రహాదర్శములనుకూడ వ్యతిరేకించు విషయములు కాన్పించుటలో నాశ్చర్యము లేదు; వివాహమును గురించిన యతని తాపసిభావములు, 'స్వదేశీ' యని యతడు పిలుచు పునీత హైందవ జాతీయత యీ శ్రేణిలోనివి. అయినప్పటికిని గాంధీజీ, అతనినిజానుచరులును అవలంబించు సత్యాగ్రహమేక్రైస్తవమత సారమనియు, దౌష్ట్యమును ప్రేమచే సాధించుటకును, దుష్టప్రవృత్తిని శిష్టప్రవృత్తిగ మార్చుటకును నైచ్ఛికముగ స్వీకరింపబడి యసమాన యోరిమితో సహింపబడు బాధయే—జీససు యొక్క శిలువయే—శాశ్వత సూత్రములని మాలో చాలమందికిని, హిందూదేశములోని ఆంగ్లోశాక్జను క్రైస్తవ మిషనరీలకును స్పష్టమగుచున్నది.

జీససు అనుభవించిన శిలువయొక్క సందేశము, అతని మృత్యువు మానవసంఘమున కమూల్యములను విషయము. జీససుయొక్క చర్చికి సంబంధించిన సభ్యునిచేగాక నొక 'సనాతనీ' హిందూవలన గుర్తింపబడెనను విషయమును ఛాందస క్రైస్తవులు గుర్తించెదరుగాక! ధనము, అధికారము, కత్తి

మొదలగునవి యెంత 'ధూముధాము' చేసినను సరకుగొనక యీ సందేశమునందు సన్యభక్తితో వేలకొలది ప్రజలనుద్బోధించినదీ వ్యక్తియే! ఇట్టి శక్తి యితనికే ప్రసాదింపబడెను. హైందవ సాంప్రదాయమందతనికిగల సహజానుబంధముయొక్క నిర్బంధములే లేనిచో నేటి సత్యాగ్రహమునకు జీససుయొక్క యుపదేశములేకాక నతని నిరుపమాన సాదృశ్యము, అతని యుత్ఫుల్లాత్మ మూలములని యిప్పటికంటె ననేకసారులెక్కువగ గాంధీజీ యుద్ఘాటించి యుండెడివాడు.

సత్యాగ్రహతత్త్వము, ఆయుద్యమము మానవచరిత్రలో నెట్టి భావముల నుత్పన్నముచేయగలవు? అని నన్ను నేను ప్రశ్నించుకొనునపుడు నాకీక్రిందివిధమున గోచరించును. "సామ్రాజ్య ధూర్వహ" ప్రభుత్వముల దౌర్జన్యపద్ధతులు, భావములు దుష్టపూరితములు. మతతత్పరులగువారికి ప్రపంచ పరిస్థితులలో నతిభయావహమగు రెండు విపరీతలక్షణములు ద్యోతకమగును. ఒకటి గొప్పపాశ్చాత్య ప్రజాస్వామికములని పిలువబడునవి యక్రమముగ తామనుభవించుచున్న భూభాగమును, ప్రకృతి సంపదను తదితర జాతులతోపాటు ధర్మయుతముగ పంచుకొనుట కిష్టపడకపోవుట; రెండు సక్రమమైన తమభాగమును కాంక్షించు కడుపుమాడు జాతులను దానినుండి దూరముచేయుట కెంతటి భయంకరయుద్ధనీతినైన నవలంబించి తమ యావచ్ఛక్తిని, యైశ్వర్యమును ధారవోయుటకు సంసిద్ధముగ నున్నామను మేఘ

గంభీర నినాదములు. ఈ యైశ్వర్యాధికారముల కొరకీ పరుగుల వలనను అధికారమును చెలాయించుటకును 'మహాలయమును' తెచ్చిపెట్టుటకును ప్రకృతి శక్తులను మానవసంఘములను యథేచ్ఛగ నుపయోగించుకొను బుద్ధిబలము విశేషముగ నభివృద్ధియగుటవలనను కొద్దికాలములోనే భూమండలము కొద్ది మంది నిరంకుశుల హస్తగతమగునట్లు తోచుచున్నది. యుద్ధ ప్రక్రియలతో నీ నిరంకుశుల నెదుర్కొనజూచు శేషించిన ప్రజాస్వామికములయొక్కయు నిరంకుశ ప్రభుత్వములలోనే బయలుదేరు విప్లవములయొక్కయు ప్రయత్నములు ప్రజా దారిద్ర్యమును, బాధను, తృష్ణను, భయమును మరింత ప్రజ్వ లింపచేయును. ఏలనన ఆధునిక భీభత్సయుద్ధములలో నెక్కువ శక్తివంతులు, నీతిదూరులునగు శత్రువులచే ప్రజాస్వామికములు నాశమొనరింపబడును. లేదా సైనిక సంఘటనావసరములనుబట్టి యవి స్వీయ నిరంకుశ ప్రభువుల హస్తగతమైనను కావచ్చును.

తరువాత ప్రపంచ ప్రమాణముమీద దైవశూన్యము దయాదాక్షిణ్యశూన్యమునగు మరియొక "విశ్వడిక్టేటరు" ప్రభుత్వము స్థాపింపబడును; కత్తితో నెదుర్కొను శత్రువు తుడిచివేయబడిన తరువాత రోమక సామ్రాజ్యమెక్కువ ప్రయోజనకరము నిష్పక్షపాతయుతముగనున్నట్లే ప్రపంచ డిక్టేటరుల పరిపాలనకూడ (నిరంకుశతను విషయలోలతను వీడక పోయినను) తక్కువ కాఠిన్యతను, వత్సలతను కలిగియుండును.

అయినను లక్షలకొలది స్త్రీ పురుషులు నిరంకుశత్వమునకు పరి
కరములు లేక దాసులగుటకు నంగీకరింపరు.

దారిద్ర్య బాధానుభవములచే పునీతమగు నొకక్రైస్తవ
ఛర్చి లేక కొన్ని ఛర్చిలు పునీతములగు బౌద్ధ, హైందవ,
ఇస్లాము తదితర మతసంఘములు, సదా అంతర్జాతీయ సంబంధ
మును కాంక్షించుచు నిరంతరాయబోధను,సహనమునువహించు
జీవితమును నడుపును. నేడు మహాత్మునిచే ప్రారంభింపబడిన
యీ "అహింస సత్యాగ్రహ" శిశువే మరింత పునీతమై విపులీ
కృతమై ప్రభుత్వ పీడితములగు పైసంఘములకు రక్షణనిచ్చును.
కనుక మహాత్ముడు నూతన యుగస్థాపకుడని ప్రజలు భావిం
తురు. బాహ్యశత్రువులను జయించి ప్రజాభిప్రాయమును, ముఖ్య
ముగ నభ్యుదయమునొందు తరగతి వారిని, యసహ్యమగు విప
రీత మార్గములద్వారా మార్చివేయుచు కొంతకాలమీప్రపంచ
డిక్టేటరు లెప్పటికిని అజేయులుగ కాన్పింతురు. కాని మానవు
నిలోనున్న దివ్యతత్త్వమిట్లు చిరకాల మణగియుండజాలదు.
క్రమముగ పాలకజాతుల యధికార మంతరంగమునుండి నిర్వీర్య
మగును. మొదటి కారణమేమన దుర్మార్గములో విధాయిక
ముగ తన్నుతాను నాశనముచేసికొను స్వభావముకలదు. దౌర్జ
న్యముతో దానిని రేపకుండ సాధుసజ్జనబృందము చూచిన
నాడిక చెప్పవలసినదేమున్నది? ఈ నిరంకుశపాలక యాదవ
కులములో ముసలము బయలుదేరును. సత్యాగ్రహతత్త్వము

దినదిన విస్తృతి నొందుటచే నీ సంకుల సమరములోని కక్షి దారులను సమర్థించు ప్రజలుండనేయుండరు. కాలము గతించిన కొలది తృష్ణ, అధర్మము, దౌర్జన్యముల చేతులలో కీలుబొమ్మల వలె నుండుట కిచ్ఛగింపక బలవంతముగ సైన్యములో చేర్చ బడు శాసనమును లక్షలకొలది స్త్రీపురుషులు ధిక్కరింతురు. తరువాత సత్యాగ్రహ సంఘములద్వారా ప్రసరించు కళ్యా ణాత్మకమగు భావములచే పాలకులయొక్కయు వారి మద్దతు దారులయొక్కయు బుర్రలుకూడ తిరుగును. ఈమార్పు కేవ లము మానవ ప్రేరేపణకాదు; ప్రేమమూర్తియగు భగవంతుడు జీసను, బుద్ధుడులేక కృష్ణుడు రూపమున నవతరించి ప్రభువు లేక నాయకుడు కాగలడను దృఢవిశ్వాసముగలవారిచే నిది కలుగును. నిశ్చయముగ నది 'సత్యము' దివ్యసూనృతము, ప్రేమతత్త్వము, మనలోనున్న (మనమధ్యనుండు) స్వర్గరాజ్యము. ఈ విధమున పాలకులుకూడ క్రమముగ సాధువులై కండ్లు తెరచెదరు; సత్యాగ్రహులవలన ప్రభుత్వములకు కలుగు ప్రయోజనమును గుర్తించి వారు వారికెక్కువ స్వేచ్ఛను, పాల నాధికారమును ప్రసాదింతురు. ఆర్థికరంగములో నీస్వేచ్ఛమత సంస్థలకు తమ్ముతాము పోషించుకొనుశక్తినిచ్చును; అవినీతిని పురికొల్పుయంత్రాధిపత్యమును తొలగతోయును. మానవుని పరిపూర్ణాభివృద్ధిని, సర్వజంతుసంతాన క్షేమమును అరికట్టని యంత్రములే అమోదింపబడును. ప్రజలు తండోపతండములుగ

సత్యాగ్రహసంఘములలో జేరుచుందురు. చిట్టచివరకు ప్రపం చమెన్ని సామ్రాజ్యముల క్రింద విభజింపబడెనో యన్నిసామ్రా జ్యములలోని ప్రజాబాహుళ్యమంతయు సత్యాగ్రహ ప్రయోజన మును గుర్తించి దానిని ప్రభుత్వసిద్ధాంతముగ నంగీకరింతురు. కొద్దిమంది 'కొరకరాని కొయ్యలు' సగముపిచ్చి యెత్తినవారు మాత్రము మిగిలిపోవుదురు. విషయభోగములలోను, అధికార మత్తతలోను తేలియాడు వీరు తమ్ము ప్రతిఘటింపక చలింపని యోరిమిని ప్రదర్శించు సంఘము ముందర నిర్విణ్ణులయ్యెదరు. "సాధుసత్వములు సంతుష్టాంత రంగులగుదురు; భూమి నేలు కొందురు." అను ప్రవక్తవచనము సఫలమగును. భూమియే కాదు స్వర్గముకూడ వారిదేయగును.

ఇక నేనూహింపజాలను! ఇది చక్కని గగనకుసుమము; హ్రస్వదృష్టికసాధ్యము; దూరదృష్టి కందరానిదని మీరన వచ్చును. అయినను నెట్టియుత్తమాధమ స్థితినైనను నిర్భయ ముగ నెదుర్కొనుటకిది ప్రయోజనకారియగును. విధి యెదురంత మునో తెచ్చిపెట్టి శేషించిన ప్రజాలోకమున చిచ్చుపెట్ట వచ్చును. లేక నీభూమిమీదనే యెప్పుడోయొకప్పుడు న్యాయ పరిపాలన, శాంతపరిపాలన యేర్పడు విధియేయున్నచో మధ్య మధ్య ననేక 'విశ్వామిత్రములు' కలుగుచుండుటలో నాశ్చర్య ములేదు. దైవయంత్రము లెప్పుడును మందముగ నడుచు చుండును. సంస్కారశూన్యమగు మానవప్రకృతి మౌర్ఖ్యమును

వీడకుండును. దైవరాజ్యము భూమిమీద స్థాపింపబడుచో మానవునకు మానవునకు కలుగుచుండు బాహ్యస్పర్థ, పోరాటము లేక పోవుటచే మానవజీవితము రసవిహీనమైన నిస్సారక్రియగ నుండునని భయపడ నవసరములేదు. మనము సత్యముయొక్క సర్వసంపన్నతను, సృజనపాటవమును విశ్వసింపవచ్చును. ఆత్మ యొక్క సాహసకలాపముల కెప్పుడును స్థానముకలదు. అది దివ్యసృష్టిలోని మర్మములను శోధింపగలదు.

భవిష్యత్తు బాధలచేతను, అజ్ఞానాంధకారముచేతను నిండియుండునను సూచనలున్నను జ్ఞాన, ఆనందాబ్ధి కెంతమాత్రమును కొఱతయుండదు. నలువది సంవత్సరముల క్రిందట లియోటాల్‌స్టాయియొక్క గంభీరవచనములవలన నీవ్యాసకర్త యొక్కనేత్రములు తెరువబడుటచే నైచ్ఛికదారిద్ర్యమునందును యుద్ధప్రతిఘటనయందును నీషదీషత్ప్రయత్నములను చేసెను; తత్ఫలితముగ దీర్ఘకాల కారాగారజీవితముకూడ సంప్రాప్తించెను; అప్పటినుండియు తన ప్రయత్నము లెక్కవసంబద్ధముగను నిరంతరాయముగను నుండిన బాగుండెడిదని యభిలషించుచున్నాడు. అయినప్పటికిని పై రషియాదేశపు ఋషియొక్క తేజ మావరించిన భారతప్రవక్తను గురించి వ్రాయనిచ్చినందుల కతడు తన కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాడు. “శరీరము మృతప్రాయము; దానిమీదనుండు ప్రతిరంధ్రముకు ప్రతిగాయముకు వేయినోళ్ళతో నాత్మరావము వినరానిచో నాబడుగుమానిసి

నడపీనుగు, వంకెకు తగిల్చిన చర్మభస్త్రి" అని యొకయాధ్యాత్మిక కవి వర్ణించెను. వృద్ధుడగు ఈట్సుకవి "నా కవితకు వృద్ధాప్యములేదు" అని గానముచేసినట్లే నిరంతర పరిశ్రమచే నవసిపోయిన మోహానదాసుబడుగుశరీరమునుండి వెలువడు నాత్మశక్తియొక్క సందేశ మెప్పుడును నవనవోన్మేషకాంతుల నీనుచు నలుబదియైదువత్సరముల క్రితమతడు ప్రారంభించిన "సత్యపరిశోధనల" నాటికంటెకూడ నవయౌవనముగ నున్నది. ఏలయన వత్సరములతోపాటు అతడు బ్రహ్మత్వమను శాశ్వత యౌవనమును పొందుచున్నాడు; దివ్యనమ్రత యనుశక్తిలోను, అనంత యఖండజీవితమును ప్రసాదించుట కాహుతియగు దివ్య జీవితములోను లీనమగుచున్నాడు. క్రైస్తవులము, సాంఘికశాస్త్రవేత్తలము అగు మన కతని దృష్టి కాలుష్యమైనట్లు తోచవచ్చును. అయినప్పటికిని గాంధీజీ యుగపురుషుడు; నేటి'మహాత్ముడు'; మోక్ష. మానవలోకముయొక్కయు, పునర్జీవమునొందిన ప్రపంచముయొక్కయు, సృజింపబడనున్నట్టియు (మనము కూడ మన ధర్మమును పాలించుచో) సృష్టియగుచున్నట్టియు ప్రపంచముయొక్క ప్రవక్త.

జీససుయొక్క అడుగుజాడలలో నడచు మనము గాంధీజీకిని యతని నిజ 'సత్యాగ్రహు' లందరకును నొక బృందములోని సభ్యులమే యనియు మనము కలలనుగను శాశ్వతస్వర్గధామ సహవాసుల మనియు కేలెత్తి జోహారు లొనర్చుచున్నాము.

# ఆస్తి—స్వేచ్ఛ

## విలియం హాకింగు.

ఆస్తి, సాంఘిక బంధనములు మన క్రియాస్వాతంత్ర్యమునేగాక భావస్వాతంత్ర్యమునుగూడ నరికట్టుట ప్రతివాడు నెరింగిన విషయమే! మన యుగమున కనేక దివ్య బోధల నొనర్చిన గాంధీజీ యీధర్మసందేహమునుగూడ విడగొట్టెను.

మన సంస్థలను గురించి తలచినకొలది మనకు వానిలో నున్న లోపములు గోచరమగును. పాశ్చాత్యదేశములలోని విద్యార్థికు డేచర్చికిని చెందగోరడు. ఏలనన వాటి ప్రస్తుత సిద్ధాంతము లేవియు నతనికి నచ్చజాలవు; అట్లే యత డేరాజకీయకక్షకును చెందడు. అవి యన్నియు నవివేకముతోను, స్వప్రయోజనపరత్వముతోను నిండియున్నవి. వేదాంతాధ్యయనమువలన మానవు డిట్టి బంధనములనుండియు, కుటుంబ, దేశబంధనములనుండియు ముక్తుడగుచుండును. వేదాంతి పక్షముల కతీతుడు కావలెను; "సంకులసంగ్రామమును తరింపవలెను."* మత మీ్యాయసంగమును మరింత ముందుకు తీసుకొనిపోవును. ఏకత్వములో లీనమైనపుడు భేదము లన్నియు నశించును; వ్యక్తి విశ్వపదార్థములో లీనమైపోవును. అప్పు డతడు ప్రయోజనము లేనివాడు, అర్థము నెరుగనివాడు అగును.

గాంధీజీ తన దేవతను 'సత్యము' అని పిలుచును; ఈ సూత్రము విశ్వమునకు సంబంధించినది; అన్ని మతసిద్ధాంతములకు నతీతమైనది. అతడు దానిని 'రామము' అని కూడ పిలుచును. అతడు రాజకీయములలో ప్రవేశించును. ప్రయోజనములలోను, సిద్ధాంతములలోను తనతో చాల భేదించువారితో గూడ నతడు చర్చించు విషయములనేకములుండును. అయినను నత డొకపార్టీ వహించు వ్యక్తి; కొంచె మించుమించు అతడే యొకపార్టీయని చెప్పవచ్చును. అతడు సారాంశములను నిర్ణయించును; విస్పష్టమగు సూచనలను చేయును; వానిని బలపరచుచు హరిజనపత్రికలోను, యితర పత్రికలలోను వాదమును విపులీకరించును; నిరర్థకుడు, నిష్ప్రయోజకుడు అను పదములతనికి చెల్లవు.

సన్యాసియొక్క యసంగము రాజకీయధురంధరుని పాటవమున కెట్లు తోడ్పడునో యతడు రుజువుచేసెను; స్థానికధర్మమును, ఆస్తిపాస్తులను పాలించుట వ్యక్తిస్వాతంత్ర్యమున కెట్లు తోడ్పడవచ్చునో యతడు చూపెను; ప్రతిదినము తాను చేయగోరునది తూ చా తప్పకుండ చేయుటయేగాక దానిని మహదానందముతో చేయువానిని నేను చూడలేదు.

అతని కిదియొక స్వల్పవిషయము. కాని యీనిర్మల దృష్టి లేకపోవుటయే ప్రపంచదుఃఖమునకు, గందరగోళమునకు మూలకారణము. ఆస్తిపాస్తులను, భార్యాబిడ్డలను, రాజకీయ

కార్యకలాపమును, మతసంస్థలను చివరకు స్వశరీరములను—అన్ని సంబంధములను అన్ని బాధ్యతలను తప్పించుకొని స్వేచ్ఛను బడయగోరువా రనేకులు అమెరికాలో మన సంఘములోనే కలరు. తమ బాధ్యతలను చక్కగ నెరవేర్చగలవారి సేవను ప్రజాస్వామికములు కోల్పోవుటచే నవి కుంటుపడెను.

మన యాత్మలోనే యున్న గొప్పతనముకంటె వేరు గొప్పతనము లేదనియు, మననిజసీమలోనున్న విశ్వాత్మముకంటె వేరు విశ్వాత్వము లేదనియు, మన నిజధనముపై నున్న స్వేచ్ఛకంటె వేరు స్వేచ్ఛ లేదనియు గాంధీజీ బోధించుచున్నాడు.

—౯—

# గాంధీజీ గొప్పదనముయొక్క స్వభావము

**జాన్ హేయిన్సు హెూమ్సు.**

"ప్రపంచ పురుషులలో గాంధీజీ గొప్పవాడు" అని నేను యిరువది వత్సరములక్రిందటనే అమెరికను ప్రజలకు చాటియుంటిని; అప్పుడు నా దేశస్థులు గాంధీజీ నెరుగరు; అతనిపేరు మా పాశ్చాత్య ప్రపంచమున కంతపరిచితముకాదు; కాని తదాది యతనిపేరు మరేజీవపురుషునిపేరును ప్రాకనట్లు ప్రాకిపోయెను. నేనతనిని "పురుషోత్తముడు" అనుట యుచితముగ నున్నదని యమెరికనులు గ్రహించిరి.

సామాన్యముగ భావింపబడు బుద్ధివైశద్యమును, 'పెళ పెళ'లాడు తెలివికలవాడునగుటచే గాంధీజీకీయుగమున నింత ప్రాశస్త్యము కలుగలేదు; అతనికి సైనికనికాయములా లేవు! అతడు దేశములనా జయించలేదు! అత డనేకజాతుల భాగ్యభోగ్యములను తన గుప్పెటలో పెట్టుకొనిన రాజకీయ ధురంధరుడా కాడు! అతడు వేదాంతియు లేక మునీశ్వరుడునుకాడు; పెద్ద పెద్ద గ్రంథములనుగాని తేనెలొలుకు కవనమునుగాని అల్లలేదు. బాహ్యాపటాటోపముచేతను, వేషభాషలచేతను దర్పముచేతను మహానాయకునివలె కాన్పించు ఆకారమూ లేదు! అతని గొప్పతన మతని యాత్మలోనే కలదు.

అతని "యాత్మశక్తియే" యతని కసామాన్య పలుకుబడిని, నాయకత్వమును ప్రసాదించెను. మానవ చరిత్రలో నేకొద్దిమందికోతప్ప తక్కినవారికి దుస్సాధ్యమగు విజయముల నతడు గాంచెను. హిందూదేశ స్వాతంత్ర్యము సాధింపబడిన నాడు దానిని సాధించిన భారతీయు లందరిలోను గాంధీజీ నామమే యెక్కువగ కీర్తింపబడును. తనప్రజలలో జాతీయవిజ్ఞానమును రేకెత్తించి, వ్యక్తిగౌరవ, ఆత్మాభిమానములను పురికొల్పి, ఆత్మనిగ్రహాశక్తి యలవడునట్లు వారి యాంతరంగిక జీవితములకు శిక్షకలిపి, యాధ్యాత్మికముగను, రాజకీయముగను వారిని స్వతంత్రులనుజేసి వారిని స్వాతంత్ర్యార్హులుగను, దక్షులుగను చేసిన యసాధారణ విజయమతనికే చెల్లును! దీనికి

తోడు అతడస్పృశ్యులను నిరంతరచెరనుండి రక్షించెను; చరిత్రలో మానవమోక్షమును సాధించిన యేకైకవిజయముగ నిది కలకాలము నిలుచు మహత్తరకార్యము. ఇక "దౌర్జన్య రహితప్రక్రియ" సూత్రమును స్వీకరించి దానిని ప్రపంచమున స్వాతంత్ర్యమును, న్యాయమును, శాంతినిస్థాపించు శాస్త్రముగ పోతపోసిన యఖండవిజయము నేమనవలెనో తెలియరాకు న్నది! ఇతరులు వ్యక్తిశిక్షణకొరకు చెప్పినదాని నితడు ప్రపంచము నుద్ధరించు సాంఘికపథకముగా మార్చివేసెను.

గాంధీజీ గత యుగపురుషు లందరితోపాటు గొప్ప వాడు. అతడు ఆల్‌ఫ్రడు, వాలేసు, వాషింగ్టను, కొసిస్కో, లాఫేటీలవలె గొప్ప జాతీయనాయకుడు; క్లార్కుసను, విల్బరు ఫోర్సు, గారిజను, లింకాలినులవలె బానిస మోక్షకుడు; ఫ్రాన్సిసు, థోరో, టాల్‌స్టాయిలతోపాటు "ప్రతిక్రియ చేయకుండుట" లేక "నప్రతిహతమగు ప్రేమ" యని క్రైస్తవమత గ్రంథములుప్రశంసించు బోధకాచార్యుడు; లయోట్జీ, బుద్ధుడు, జొరాస్టరు, జీససులతోపాటు అన్ని కాలములకును తగు నుత్కృష్ట మత ప్రవక్తలలో నొకడు. "పునర్యోచన చేయు మతము" అను నాపుస్తకములో వర్ణింపబడినవాడే యుత్తమ మానవుడు.

"అతడు సాధుపుంగవుడు, వినయశీలుడు, అప్రతిహత దయాపూర్ణుడు; అతని హాస్యరస మప్రతిమానము; సరళస్వభా

వము మోహజనకము; ఎంతటి సాధువో, యెంత శిరీషకుసుమ పేశలుడో యంత యప్రతిహతేచ్ఛ, చెక్కుచెదరని ధైర్యస్థైర్యములు కలవాడు. అతని నిజాయతీ యకలంకము; సత్యదీక్ష యవక్రము. అతడు కోల్పోవునదేదియును లేదు కనుక నతడభేద్యుడు. తాను సమస్తము నర్పించువాడు కనుక నితరుల నేమడిగినను యడుగ సమర్థుడు. అతని ధనేషణ, దారేషణ, పుత్రేషణ లన్నియు చాలకాలముక్రితమే నశించెను. సత్య, ప్రేమరూపములలో ప్రకటమగు నాత్మతత్త్వమే యతని నావేశించును.

"భగవత్సేవయే యనగా మానవ సేవయే నామతము ... సేవ యనగా నకలంక ప్రేమ" యని గాంధీజీ వచించును.

—:—

# ఒక దక్షిణాఫ్రికా నివాసి ప్రశంస

**ఆల్ఫ్రడ్ హెూర్నెలీ. యం. యె. డి. లిట్.**

గాంధీజీ తత్త్వమును, ఆదర్శములను గురించి ప్రపంచమంతటనుండియు వచ్చు సంకీర్తనలలో నథమ మొక్క దక్షిణాఫ్రికా శ్వేతముఖుని ప్రశంస యుండుటెంతయు యుక్తము.

గాంధీజీ దక్షిణాఫ్రికాలోనే మొదట 1893లో భారత సంఘము తరఫున రణభేరి ప్రమోగించెను. జాన్సుబర్గులో నేను

ప్రతిరోజు విశ్వవిద్యాలయమునకు పోవుత్రోవలోనున్న "కోట"
అనుదానిలో నతడనేకమంది సహచరులతో బంధింపబడి కఠిన
పరక మనుభవించెను. ట్రాన్సువాలుకు స్వయంనిర్ణయాధి
కారము వచ్చుటతోడనే వలసరాజ్య కార్యదర్శియైన స్మట్సు
సేనానితో నతడు దక్షిణాఫ్రికాలోని భారతీయుల తరఫున
రాయబారము నడిపెను. తన ప్రజలతరఫున నాయకత్వము
వహించి యక్రమచట్టములపై నతడు మొట్టమొదట సాత్త్విక
నిరోధాస్త్రము నిచ్చుటనే ప్రయోగించెను. దక్షిణాఫ్రికాలోని
ప్రతి భారతగృహమందును, భారతీయులకు చెందు ప్రతి ప్రజా
భవనములోను "మహాత్ముని" చిత్రము గౌరవస్థానము నలంక
రించును. గాంధీజీపక్షమును వహించి యష్టకష్టములను పడిన
శ్వేత శ్వేతేతరజాతి స్త్రీ పురుషు లెందరో దక్షిణాఫ్రికాలో
నింకను కలరు.

అతని కుమారులలో నొకడింకను తనతండ్రి స్థాపించిన
'భారతాభిప్రాయము' అను పత్రికను నేటాలులోని ఫొనిక్సు
ఆశ్రమమునుండి నడిపించుచున్నాడు. తన రాజకీయ, ఆధ్యా
త్మిక నాయకత్వ శక్తి సంపత్తుల నన్నిటిని తన జన్మభూమికిని,
తత్ప్రజలకును అర్పించుటకు పూర్వము దక్షిణాఫ్రికా చరిత్రలో
నెన్నటికిని మరపురాని స్థానము నతడు నిర్మించుకొనెను.

రివరెండు జాసెఫ్ డోల్ వ్రాసిన యతని దక్షిణాఫ్రికా
జీవితమును చదివినమీదట నతని ప్రజలపైనను శత్రువర్గములో

ననేకమందిపై ననుగూడ నతనికిగల పలుకుబడికి కారణమేమని విమర్శింప నాకీ క్రిందివిషయములు తట్టెను.

దౌర్జన్యమును దౌర్జన్యముతో నెదిరించునంతటి రోషము నితరులలో కలిగించు పరిస్థితులలో గూడ దౌర్జన్యరాహిత్యమును యథేచ్ఛగ నవలంబించు మానసిక స్థైర్య మతనికియుండుట మొదటి విషయము. శ్వేతముఖు లతనిని యనేకసారులు కొట్టి, తన్ని తిట్టి తమ జాతి యాధిక్యత నీవిధముగ ప్రదర్శించి యీ "కూలీ"కి బుద్ధిచెప్పగోరిరి. అతడెన్నడును దౌర్జన్యమును చూపలేదు. ప్రెసిడెంటు క్రూగరు యింటి యెదుటనున్న కాలిబాటనుండి యతనిని తన్నిన నౌకరుపై నతడు చర్యతీసికొనన నిరాకరించెను. మఱియొకసారి తన ప్రజలలోని శత్రువులే యతనిని క్రూరముగ కొట్టినప్పుడొకవంక రక్తము కారుచుండ నిస్సహాయుడై పడియుండియు కూడ నతడు తనను హింసించిన వారిని శిక్షించవలదని పోలీసువారిని కోరెను. "తాము యోగ్యముగ ప్రవర్తించుచున్నామనియే వారు భావించిరి; నేను వారిపై చర్యతీసికొనగోరను" అని యత డనెను. తనను తాను జయించుటచేతనే యతని కితరులపై నిట్టి యమోఘశక్తి కలిగెను.

దక్షిణాఫ్రికాలో భారతీయుల నస్పృశ్యులుగ చేయ సమకట్టిన చట్టము నెదుర్చునాడతడు కేవల తాత్త్వికహక్కు

లను కోరలేదు. వారి యాత్మగౌరవమును నిర్మించు టతనికి మరింత ప్రధానము; వారు నిస్పృహులై, హతాశులై పెదవి మెదల్పకుండ వెతలనొందుట గాంచెను. భారతీయులను దక్షి ణాఫ్రికాలోని తెల్లవారు మానవులుగ పరిగణింప గోరుటకు వారి పౌరుషమే నైతికాధికారమని యతడు హెచ్చరించెను. భావి భారతసంఘమునుగురించి యత డీక్రింది కలలను గనెను. "దక్షిణాఫ్రికాలోని భారతసంఘ మంతయు సమానప్రయోజ నములు, సమానాశయములు కలిగి తమ ప్రాచీన నాగరికత కుచితమగు విద్యాగంధమును, నైతికసంపత్తును కలిగియుందురు గాక! వారు వస్తుతః భారతీయులుగనే యుండి దక్షిణాఫ్రికా యీపాశ్చ్యవాసులను కలిగియున్నందుల కెంతయు గర్వించు విధమున ప్రవర్తించుచు ప్రతి బ్రిటిషు పౌరుడు ననుభవించు హక్కుల కధికారులుగ గుర్తింపబడుదురు గాక!" మూడవది, నాయకత్వమును వినయముతో నెట్లు మేళవింపచేయవలెనో యత డెరుంగును. ధనవంతులగు భారతీయుల కతడు ప్రజా సేవను బోధించెను. తనకు వచ్చిన ప్రతిష్ఠపైన నతడు తన ప్రజల ప్రయోజనములకొరక కకుంఠితముగ వినియోగించెను; అతడు బీదలలో బీదవాడుగ సంచరించెను. తన సంస్థానములోని ప్రధానమంత్రి కుమారుడై హోదా, పలుకుబడి, అధికారము, విజ్ఞానముగల కుటుంబములో జన్మించి, ఆంగ్లదేశములో బారి స్టరుగ శిక్షనొంది, విజ్ఞానధనులైన యూరపియనులతో సరి

సమానప్రవృత్తి గలిగిన యతడు తనకొరకెన్నడును హక్కులను కోరియుండలేదు. అతడితరభారతీయుని చూచినట్లే తన్ను చూడగోరును. భారతీయు లందరును గుర్తింపబడుటకు వేలిముద్రలను వేయవలెనని చట్టము శాసించినపుడు తాను మినహాయింపు కోరగలిగియు నితరులకు సాదృశ్యముగ నుండుటకు తానే ముందర దారి తీసెను.

నాల్గవది, భారతీయుల హక్కులకొరకు కత డొకవంక పోరాడుచు నాగరికాధికారముల కర్తవ్యాలు కాగోరువారు పోరాటములో పాల్గొనకపోయినను అవసరము వచ్చినపుడు తమ ధర్మము నైచ్ఛికముగ నెరవేర్చవలెనని యతడెప్పుడును ప్రకటించుచుండెను. బోయరుయుద్ధములో నేటాలురంగమున క్షతగాత్రులైనవారిని మోయు భారతదళము నొకదాని నతడు నిర్మింపగోరెను. మొదట కొంత తిరస్కారము చూపబడినతరువాత నది యంగీకరింపబడెను; భారతీయులందులో నమూల్యమైన సేవ జేసిరి. రాబర్ట్సు సేనాని కుమారుడు చావుదెబ్బతిని షీవెలీలోని ఆస్పత్రికి భారతవాహకులచే నేడుమైళ్ళదూరము తీసికొనిపోబడెను. 1906లోని జూలూయుద్ధములోకూడ నీసేవ చేయబడెను. జాన్సుబర్గులో 1904లో వచ్చిన ప్లేగుసమయమున గాంధీజీ సాయపడనిచో మరింతవిశేష ప్రాణినష్టము కలిగియుండెడిది.

భారతీయుల అంతరాత్మలను పరాభవించు చట్టములకు తలయొగ్గ నిరాకరించుచు (ప)్రభుత్వ చట్టములను మన్నించు

వాడు కనుక) నవి యొసంగు శిక్షల ననుభవించుచు జాతీయ స్పర్థ లేకె త్తిన సమయములో "సాత్త్వికనిరోధమును" మొదట ప్రయోగించినవాని తత్త్వ, గుణసంపత్తు లీవిధముగ నుండెను. ఇతడు "సాత్త్వికనిరోధము" అను పదము ఆదర్శములో సగ భాగమును మాత్రమే వ్యక్తపరచునని యతని కప్పుడే తెలి యును; అత డట్లే చెప్పుచుండెడివాడు. "అది నాభావమునం తను వ్యక్తము చేయజాలదు; అది యొకపద్ధతిని మాత్రమే నిర్వచించును. దేనిలో నది యొకభాగమో యట్టివిధానము నుగురించి యదియేమియు సూచింపదు. నిజమైన నేర్పరితనము (అదియే నా లక్ష్యము) "అపకారికి నుపకారము నెపమెన్నక" చేయుటలో కలదు" అని యతడు చెప్పెను. ఈసందర్భములో జీసస్ శాసించిన "ఒక చెంప కొట్టిన వానికి మరియొక చెంపనిమ్ము" అను శాసనము భారత మత, వేదాంతముల ననుసరించియేయున్నదని యతడు ఘోషించెను.

సాత్త్విక "అస్త్రము" అని నేను పేరిడినదానినిగురించి కొంచెము చెప్పెదను.

దానికొక స్థావర మేర్పడెననుట స్పష్టము. అప్పటి నుండియు ప్రజలు దాని ననేకరంగములలో, అనేక రూపము లలో ప్రయోగించిరి; ఇకముందుగూడ ప్రయోగింతురు. వ్యక్తులు (యుద్ధము కూడదనువారు) దానిని వ్యక్తిగతముగ నుపయోగించవచ్చును. రాజకీయముగను, సైనిక సంపత్తు

చేతను అసహాయులైన వారికిదియొక్కటే మహాస్త్రము. స్థూలముగగాక నైతికముగ నిది రాజకీయసమరము నుత్తమ స్థాయికి గొంపోవును. ప్రతిఘటనచేయువారు బుద్ధిపూర్వకముగ బాధల నాలింగనము చేయవలెను; పరాభవముల ననుభవింప వలెను; కనుక వారి కసాధారణమగు ఆత్మనిగ్రహము, మనో బలము కావలెను. అది శత్రువుయొక్క యంతరాత్మను కలచి వైచి యతని యక్రమము నతనికిచూపి, వాని పశుబలము నిరుపయోగమని రుజువుచేసి, యకారణహింస నల్పితిమేయును పాపభీతి వారిని నిర్వీర్యులను చేయవలెను. అంతరాత్మ, పాప భీతిలేనివారి నిదియేమి చేయగలదో నాకు సందేహముగనే యున్నది. జర్మనీలోని యూదులు సాత్త్వికనిరోధము చేయ వలెనని యతడు సలహాచెప్పెను. వారట్లుచేసినచో నాజీ అత తాయులు, వారినాయకులు నిట్టి నైతికశక్తికి లొంగనిగుండెలు తీసినబంటులని రుజువైయుండెడిదని నాయభిప్రాయము.

పైగా సాత్త్విక నిరోధము నైతికాయుధముకనుక, తాత్కాలికజన్యమగు కలహము, క్రోధము, తిరస్కార ధిక్కా రములు క్షమ, శాంతి, ప్రేమరూపములుగ మారిపోవునంతటి స్వార్థరహితభక్తి ప్రజాసామాన్యముకబ్బుట దుస్సాధ్యము; అతియరుదు. "ఒక విధానములో భాగమగు" "పద్ధతి" ప్రత్యే కముగ నాచరింపబడునదికాదు.

ప్రజలంత మహోత్కృష్టస్థితిని పొందగలిగినచో మామూలుగ ప్రజానాయకత్వమును వహించువారికంటె గొప్ప నాయకులు కావలెను. అట్టినాయకులు బహుఅరుదు, ఒక గాంధీ జీవితములో నొకసారియైనను జన్మింపడు.

దక్షిణాఫ్రికాలోని తెల్లవారు అచ్చటి యాదమనివాసులుకూడ గాంధీజీ ననుసరింతురేమోయని భయపడిరి; వారు భారతీయులకంటెకూడ కనిష్టముగ చూడబడుచుండిరి. దక్షిణాఫ్రికా "తెల్లవానిదేశము"గ నుండవలెనని వారి యాశయము. తెల్లవారిసందర్భములో గాంధీజీని ఆక్షేపించినపుడు దౌష్ట్యము, దౌర్జన్యము, రక్తపాతములకంటె నైతికాయుధము మేలు; నైతికాయుధము ధర్మకార్యమును చేపట్టదు. దేశీయుల సమస్య ధర్మయుక్తమై వారుపయోగింపవలసిన సాత్త్వికనిరోధమునకు తగినంత సంస్కారమే వారిలోనున్నచో దక్షిణాఫ్రికాలోని వివిధజాతి నిర్మాణములో వారికి హక్కు, స్థావరము దానంతటదియే చేకూరునని యతడు చెప్పెను.

నాటినుండి ముప్పది వత్సరములు గతించెను; దక్షిణాఫ్రికా భారతీయు లింకను మహాత్ముని నాయకత్వ గాథలను చెప్పుకొనుచుందురు. కాని యతడు హిందూదేశముకు తిరిగి వచ్చినతరువాత వారు సాత్త్వికనిరోధము నుపయోగింపలేదు. ఇక దేశీయుల విషయములో ననేకయడ్డంకులు కలిగినను వారు చాల యభివృద్ధిచెందిరని చెప్పక తప్పదు. కాని వారి సాత్త్వి

కాస్త్రము (దీని నుపయోగించువా రసాధారణశక్తిసంపన్నులు కావలెను, నెప్పు డుపయోగింప సమర్థులగుదురో యెవరును చెప్పజాలరు. నిరాయుధులై, తమలో తాము కలహించుకొనుచు, నసహాయులై యున్న వీరికిదియొక్కటే తుది శరణ్యము. కాని దేశీయులలో గాంధీయంతటివా డుద్భవించు కాలమింకను రాలేదు; అది రాకపోవచ్చును. కాని దక్షిణాఫ్రికాలోనున్న యల్పసంఖ్యాకులగు తెల్లవారే యెల్లకాలము రాజకీయ, సాంఘిక, ఆర్థిక సామ్రాజ్యము నేలుకొనవలెనను దురాశ యూరపియనులు కాని ప్రజలందరను వారిపై తిరుగబడునట్లు చేయవచ్చును. అదియే తటస్థించుచో గాంధీజీ సాంప్రదాయానుభవముగల భారతసంఘము యూరపియనులతో సాత్త్విక నిరోధము చేయు నాయకు నొకనిని ప్రసాదింపవచ్చును.

—o—

## దక్షిణాఫ్రికాలో గాంధీజీ

**జాన్ హెచ్ హోఫ్మయర్. యం. యె.**

తాంబరం కాన్ఫరెన్సుకు హాజరగుటకు భారతదేశము వచ్చిన జాన్‌మాట్ అను మిషనరీ రాజకీయవేత్త సైగానులో మహాత్ముని దర్శించెను. "మీ జీవితములో నత్యంత వీర్యవంతములైన యనుభవము లెవ్వి ?" అని యతడు ప్రశ్నింపగా మహాత్ము డిట్లు చెప్పెను.

"అట్టివి యసంఖ్యాకములుగ గలవు. కాని మీరీప్రశ్నను వేసినపుడు ముఖ్యముగ నాజీవితమునంతను మార్చివేసిన యొక యనుభవము జ్ఞప్తికి వచ్చెను. నేను దక్షిణాఫ్రికాలో పాదము పెట్టిన వారమురోజులకే నా కది సంభవించెను. నేనచ్చటకు కేవల మొక ప్రాపంచిక స్వార్థ ప్రయోజనముకొరకు వెళ్ళితిని. నేనప్పుడే యింగ్లండునుంచి తిరిగివచ్చి ధనార్జనకొరకాసించు చున్న పడుచు కుర్రను. నన్నచ్చటకు పిలిపించిన వర్తకుడొక స్మాత్తుగ డర్బనునుండి ప్రిటోరియా వెళ్ళగోరెను. అది యంత సులభ ప్రయాణము కాదు. ఛార్లెసు పట్టణమువరకు రైలు ప్రయాణము; జాన్సుబర్గువరకు గుర్రపుబగ్గీ ప్రయాణము చేయ వలెను. రైలులో నాకు మొదటి తరగతి టిక్కెట్టు కలదు. కాని పడకటిక్కెట్టు లేదు. మారిట్జువద్ద గార్డు వచ్చి నన్ను దిగిపొమ్మని గెంటివేసెను. ఆ నిశీథమందు చలిలో నొంటరిగ గజగజ వణుకుచుంటిని. రైలు కదిలిపోయెను. నాకచ్చట ప్రాణోత్పాదకమగుననుభవము కలిగెను. జీవితముకే మోసము కలుగునను భయముతోచెను. నేనొక యంధకారమయమగు ముసాఫరుగదిలో చేరితిని. ఆగదిలో నొక తెల్లదొరయుండెను. తోడనే నాకు భయము కలిగెను. నాధర్మమెద్ది? యని నన్ను నేను ప్రశ్నించుకొంటిని. నేను తిరిగి హిందూదేశము పోవలెనా? లేక భగవానుని యండగొని ముందుకు పోవలయునా? చివరకు

నే నాగిపోయి బాధపడుటకే నిశ్చయించితిని. నాటినుండి నా సత్యాగ్రహము కార్యరూపమును దాల్చెను."

దక్షిణాఫ్రికా నివాసి యీఘట్టమును సంస్మరించుట ముదావహము కాదు. కాని గాంధీజీ జీవితచరిత్రలో దక్షిణాఫ్రికా కెంత ప్రాముఖ్యత కలదో యిది తెలుపగలదు. దక్షిణాఫ్రికాలోనే సత్యాగ్రహ సిద్ధాంతము కనుగొనబడెను. తఱుచు చారిత్రక సంఘటనలలో న్యాయము ద్యోతకమగుచుండును. భారతదేశము (ఐచ్ఛికముగ గాకపోయినను) దక్షిణాఫ్రికా కొక క్లిష్టసమస్యను ప్రసాదించెను, దక్షిణాఫ్రికా (ఐచ్ఛికముగ గాకపోయినను) భారతదేశమునకు శాసనోల్లంఘనభావమును కలుగచేసెను. తెల్లవారి ప్రయోజనములకొరకే భారతీయులు దక్షిణాఫ్రికా వెళ్ళిరి. ప్రవాసితులగు కూలీలు లేనిచో నేటాలు తీరమును పిండుట దుస్సాధ్యము. కనుక భారతీయులు వచ్చి నేటాలు ఐశ్వర్యమును వృద్ధిచేసిరి. చాలమంది యచ్చట స్థిరనివాసము నేర్పరచుకొనిరి; వారివెనుక ననేకమంది స్వతంత్ర భారతీయులును, ప్రవాస కూలీలును కూడ వెళ్ళిరి. కాని తక్కువఖర్చుతో జీవించు భారతీయు డంతకుపూర్వము గుత్తగ ననుభవించుచున్నకొన్ని వృత్తులనుండి యూరపియనుల కుద్వాసమిప్పింప ప్రారంభించెను. దీనితో వర్ణ దురభిమానము రేకెత్తెను. మిల్నరుగారి భాషలో భారతీయులు "తమ్ము తీసికొనననిచ్ఛగింపని సంఘముమీదకు చొరుచుకొనివచ్చు విజాతీయు

లుగ పరిగణింపబడిరి.'' మారిట్జుబర్గు రైల్వేస్టేషనుమీాదనున్న గాంధిజీ కీద్వేషమే ద్యోతకమయ్యెను; దీనికి ప్రతిక్రియగ సత్యాగ్రహము పెట్టెను.

మహాత్ముని దక్షిణాఫ్రికా జీవితమును గురించి, కృషిని గురించి యిచ్చట వేరుగ చెప్పనక్కరలేదు. అదియొక గొప్ప సమరము; నేటి ప్రపంచ పురుషులలో మరియొక చారిత్రక పురుషుడగు స్మట్సుసేనానితో నతడు పోరాడవలసియుండెను. వారిలో సాదృశ్య మెక్కువగ నుండెను. జాన్సుబర్గు సమీాపమున భారతీయబాలురను సంస్కరించు నొక కారాగారమును చూచితిని. ఒక గొప్పయుద్యోగి నాతో కూడ నుండెను. అది యంతకుమునుపు మామూాలు ఖయిదు. నాసహాచరుడందులో నాకొక గదిని చూపి ముప్పది వత్సరములక్రిందట తా నొక ఛోటామేజిస్ట్రేటుగ నుండెననియు గాంధీజీ యాగదిలోనే బంధింపబడెననియు ప్రధానమంత్రి స్మట్సుసేనాని యాజ్ఞప్రకారమతడు గాంధీజీకి వేదాంతగ్రంథముల నిచ్చుచుండెడివాడనియు చెప్పెను. వారిరువురమధ్య గొప్పపోరాటము జరుగుచుండినను వారి పరస్పర గౌరవము, స్నేహము గమనింపదగినవి. అవి నేటికిని యట్లే యున్నవి. దక్షిణాఫ్రికాలో గాంధీజీ యేమి సాధింపగలిగెను? దక్షిణాఫ్రికాకు భారతకూలీలు రాకుండ చేయుటకే స్మట్సు పట్టుపట్టెను. గాంధీజీ దాని నడ్డగింపలేక పోయెను. కాని యతడు ప్రవాసచట్టములో కేవల భారతీయ

లనే పేర్కొను యమర్యాదను నిర్మూలించి యచ్చట నదివరకే స్థిరనివాస మేర్పరచుకొనిన భారతీయుల యనేకకష్టములను నివారించెను. దానితో దక్షిణాఫ్రికాలో నాసియావాసులపై నున్న ద్వేషము పోవునని యతడాసించెను. కాని నేటికిని యా ద్వేషముల్లేయున్నది.

కాని గాంధీజీ నాయకత్వము దక్షిణాఫ్రికాలోనున్న భారతసంఘమును మార్చివేసెను. అందులో తక్కువజాతులలో పుట్టిన వారధిక సంఖ్యాకులుగ నుండిరి. జన్మచే వారికి కలిగిన యిక్కట్టుల నతడు రూపుమాపి యెన్నటికి మొక్కవోని జాతీయ గౌరవమును భారతీయులలో రగుల్కొలిపెను. దక్షిణాఫ్రికాలోనున్న భారతసంఘ మిప్పుడు తమ్ము న్యూనతపరచునెట్టి చట్టమునైనను గాంధీజీధ్వజముక్రింద పోరినట్లే పోరగలదు. అన్నిటికంటెను ముఖ్యమైన దేదియన గాంధీజీ వ్రేలిముద్రలను వేయ నిరాకరించుచు రాష్ట్ర సరిహద్దులను దాటుచు జయిలు శిక్ష ననుభవించుచు పైకి వచ్చి తిరిగి శాసనోల్లంఘనము చేయుచు నాత్మార్పణ తత్త్వమును పరిపూర్ణ స్థితికి తెచ్చెను; అది శక్తివంతము పటుత్వము గల యాయుధమని యతడు గ్రహించెను. కనుక భారతదేశమునకే 'మహాత్ముడు' గాక ప్రపంచ ఆధ్యాత్మిక నాయకులలో నగ్రగణ్యుడగువానిని ప్రసాదించుటలో దక్షిణాఫ్రికాఘట్టము (తెల్లప్రభువులు డిల్లపోవు ఘట్టము) మరువరాదని గ్రహింతురుగాక!

# గాంధీజీ-యుద్ధ వ్యతిరేకవాదముయొక్క భవిష్యత్తు

**లారెన్సు హౌస్మను.**

సాత్త్వికమతమును (యుద్ధము కూడదను మతము) జయప్రదముగ ప్రదర్శించినవారిలో గాంధీజీ యగ్రగణ్యుడు. కార్యరంగమును దాల్చిన సాత్త్వికమతము ప్రపంచ రాజకీయములలో నొకమహాశక్తి కాగలదు; అనగా పీడ, దౌర్జన్యములతో గూడిన ప్రభుత్వముకంటె నిది శక్తివంతమైన యాయుధము. దక్షిణాఫ్రికాలో నతడు సంపూర్ణ విజయము నొందెను.

హిందూదేశములోను విశేష విజయము చేకూరెను. ఎంతమాత్రమును దౌర్జన్యములేని మరింతయెక్కువమంది యనుచరులే యతని కున్నచో నతని సాత్త్వికాయుధము జయభేరి మ్రోగించెడిది.

నిజముగా సత్యాగ్రహ విజయమే విజయము. ఏలనన నది యింతవరకు సామాన్య మానవలోకమవలంబించు పద్ధతికి భిన్నమైనది; అక్రమమును నివారించుటకు దౌర్జన్యమే సాధనమని మానవలోకమును తప్పుమార్గము పట్టించిన చిరసాంప్రదాయమున కది కేవలము భిన్నమైనది. మహాత్ముడట్టిసాంప్రదాయము నవతలకుత్రోసి యసామాన్యాగ్ని పరీక్ష నెదుర్కొ-

నుట కంతమంది విశ్వాసపాత్రులగు యనుచరులను సృష్టింప గలుగుట కతడు బోధించినది మానవ ప్రకృతిలో నిగూఢమైన మూలసత్యమగుటయే కారణమని తోచుచున్నది; మరియు సాదృశ్యమును చూపినపుడు సామాన్య స్త్రీపురుషుల బుద్ధి కది యందుబాటులోనిదని, వారు దాని నవలంబించి గొప్పయుద్యమములలో పాల్గొనగలరని యిది రుజువు. మహాత్ముని జీవిత మీయన్ని కారణములచేతను యమూల్యమని నా విశ్వాసము. అతని డెబ్బదియవ జన్మదినమున నా యభివందనముల నర్పించుచు నతడనేకవత్సరములింకను యువకుడై యుండగోరుదును. అప్పుడు ప్రపంచ మతని దివ్యనాయకత్వము నింకను అనేకవత్సరము లనుభవించు భాగ్యము లభించును.

—౹—

## గాంధీజీ సత్యాగ్రహము — శిలువయొక్క పథము

**జాన్ యస్. హైలాయిబండు.**

1938 వత్సర శరత్కాలమున ప్రపంచ మంతటినుండి, ముఖ్యముగ నాఫ్రికా, ప్రాచ్యఖండములనుండి వచ్చిన క్రైస్తవ రాజకీయ ధురంధరులు జీససు సందేశానుసార మాధునికప్రపంచ సమస్యల నవలోకించుటకు మద్రాసులో నొకసభ జరిపిరి. సభ

జరుగుముందొక వింత విషయము జరిగెను. ఐశ్వర్యాధికార దర్పములతో తులతూగు క్రైస్తవ మత పీఠములలో జగద్విఖ్యాతి, పలుకుబడిపొందిన యీనాయకశిఖామణులు హిందూనాయకుడైన గాంధీజీని దర్శించి, పాదాభివందనచేయుట కనేక వందలమైళ్ళదూరము ప్రయాణించిరి. జీసను ననుసరించు శ్రేష్ట మార్గము నతనివలన గ్రహించుటకే వారు వెళ్ళిరి. గత చరిత్రలో నెన్నడును (అనేక పరివత్సరంపరలు జరిగినను) క్రైస్తవ నాయకు లిట్టిపని చేసియుండలేదు. వారిప్పుడట్లుచేయుటయే క్రైస్తవమతము వక్రించెనను గాఢ విశ్వాసమునకు తార్కాణము. ఇంతేకాదు, ఈ భారత ఋషి జీసను తత్త్వమును గ్రహించి యతని విధానము నాచరించుటలో మనకంటె మిన్నయను విశ్వాసము నిది బలపరచుచున్నది.

వీరితో సలిపిన యతి ముఖ్య సంభాషణలలో నతడు మొదట ద్రవ్యమునుగురించి మాట్లాడెను. తన యభిప్రాయముల నతడొక్కమాటలో నిట్లుచెప్పెను "మీరు భగవంతుని కుబేరుని నేకకాలమందు సేవింపజాలరు; భారతదేశమును సేవించుటకు ధనదేవతను పంపి భగవంతుని వెనుకకు నెట్టిరని నా భయము. భగవంతు డెప్పుడో యొకప్పుడు దీనికి ప్రతీకారము చేయును.........ఏమతసంస్థకైనను దానికి కావలసిన దానికంటె నెక్కుడు ధనమున్నచో నది భగవద్విశ్వాసమును

కోల్పోయి ధనారాధన కుపక్రమించునని నా విశ్వాసము. మీరు దానిపై నాధారపడుట మానివేయవలెను.

దక్షిణాఫ్రికాలో నేను సత్యాగ్రహమును ప్రారంభించి నపుడు నాచేతిలో నొక్క పైసయైనను లేదు; అయినను నేనతి యుల్లాసముతో నుంటిని. నేను 3,000 మంది సిబ్బందీని పోషిం పవలసియుండెను. 'మన కేమియు భయములేదు. భగవదేచ్ఛ యున్నచో నతడే దానిని నిర్వహించును' అని నేనంటిని. అప్పుడు హిందూదేశమునుండి ధనము వర్షింప నారంభించెను. అది వచ్చినకొలది నాదుఃఖమతిశయించుచుండుటచే నేను దాని నాపివేయవలసివచ్చెను. అదివరకు రొట్టె, పంచదారలతో తృప్తిపడినవారు నానావిధపక్వాన్నముల నడుగజొచ్చిరి !

"నేనిపుడు ప్రారంభించిన నూతన విద్యాపరిశోధనను చూడుడు. ఎట్టిద్రవ్యసహాయమును కోరకుండ నది సాగవలె నని నేనంటిని. అట్లుకానిచో నాయనంతర మీసంస్థ ముక్కలు కాక తప్పదు. నిజమేమన మెప్పుడు ధనాభావముండదో యప్పుడే యాధ్యాత్మిక దివాలా నిశ్చయమగును."

ఈతుదిభావముకంటె గాంధీజీ యాశయము నెక్కుగవ వ్యక్తముచేయునది వేరొకటిలేదు. చైతన్యవంతమగు నుద్యమ మునకు మూలనిధి, యినుపభోషాణములు ఆధ్యాత్మిక వినాశ మును తెచ్చిపెట్టునని యతడు మాటిమాటికి హెచ్చరించును.

ఈవ్యాసకర్త కఱవుకాటకములు, జాడ్యములు, యుద్ధములు మొదలగు సంకటములు వచ్చినపుడు వివిధదేశములలో నార్తుల దుఃఖోపశమన నిధులను వెచ్చించుటలో కొంతయనుభవముగడించిన మీందట గాంధీజీ చెప్పినది నిజమని నమ్ముచున్నాడు, యదార్థచైతన్యముగల యాధ్యాత్మికోద్యమము సాధ్యమైనంతవరకు నిధులనుకోరదు; అట్లుచేసికొనిననాడే దానికనంతశక్తిచేకూరును. ఆస్తియుండరాదను సూత్రముపట్లనతనికిగల విశ్వాసమునుండియే గాంధీజీకీయభిప్రాయములు కలిగెను. "ఆస్తి"ని, స్వంత ధనధాన్యములను కలిగియుండవలెనను భావమునణచివేయవలెనను ఫ్రాన్సిసుయొక్క సూత్రమునిది పోలియున్నది. గాంధీజీ ప్రియశిష్యులలో నొకడీవిషయమును ముక్తసరిగనిట్లుచెప్పెను. "నీవు నీప్రాణముల నర్పింప నడుకట్టిన యుద్యమమునకు ద్రవ్యముతప్పక చేకూరును. కాని ద్రవ్యములేక పోయినను నీకాచింతయుండదు; అవిలేకుండిన నాడే పనియంతజయప్రదముగ జరిగిపోవును."

"దోపిడి" జాతులతో నెట్లు సంచరించవలెనను మరియొక ముఖ్యవిషయమునుగురించి గాంధీజీ యాక్రైస్తవనాయకులతో న్సావకాశమున చర్చించెను. ఇట్టి విషయమును గురించి చర్చించునపుడు ప్రపంచములోనున్న యనేకజాతులు బ్రిటిషువారవైన మనలను దోపిడిజాతులలో నొకజాతిగ భావించుచున్నారను విషయమును మరువరాదు. 1919 లో బ్రిటిషు

సామ్రాజ్యమునకు తొమ్మిది నూతన మాండేటరీ రాజ్యములను కలుపుకొని పొట్టనుండియు బుద్ధిమంతులమై సంచులను నింపుట పూర్తిచేసితిమనునంత మాత్రముచేత నంతర్జాతీయబందిపోటుకు నవీనముగ బయలుదేరిన వారితోపాటు "దోపిడిజాతి" యను బిరుదమును మనకీయకుండ తక్కినజాతు లెట్లూరకుండగలవు? అంతర్జాతీయదోపిడిని గురించి మనము లబలబలాడునప్పుడు జర్మనీ, ఇటలీ' జపానులదోపిడిని గురించి మాత్రమే కన్నీరు విడువవలదని బ్రిటిషు సామ్రాజ్యముక్రింద నలిగిపోవుచున్న ప్రజలు మనకు హితవొసగుచున్నారు. అతి విషాదకరము, భయంకరమునగు యీయాధునిక అంతర్జాతీయ దోపిడినికూడ సత్యాగ్రహమందు విశ్వాసము, అనుభవముకలవారు సత్యాగ్రహపద్ధతితోనే డీకొనగలరని, డీకొనవలెనని గాంధీజీమతము. "ఎంత ధర్మమార్గముగ మనము దౌర్జన్యము నుపయోగించినను చివరకది హిట్లరు, ముసోలినీలు త్రొక్కినబురదలోనికే మనల నీడ్చివేయక తప్పదు" అని యతడుచెప్పెను. "కొంతఛాయా భేదముండిన యుండవచ్చును; సత్యాగ్రహమును విశ్వసించు వారు విషమసమయములో దానినే యుపయోగించవలెను. బందిపోటుల హృదయములనుగూడ సంస్కరింప జూచుటగొప్ప కొండను డీకొనినట్లు మనకు మొదటకాన్పించినను మనము నిరాశచెంద నవసరములేదు" తరువాత సత్యాగ్రహముద్వారా అక్రమమును సాధించు జీవితమును సృష్టించిన యనుభవములను

గురించి చర్చజరిగెను. దక్షిణాఫ్రికాలో పాదమిడుటతోడనే జరిగిన యుదంతమును గురించి గాంధీజీ వివరించెను.

ఈయుదంతము గాంధీవిజయములోని రెండు ముఖ్యాంశములను ద్యోతకముచేయుచున్నది. ఒకటి భయము నతడు జయించుట. సామాన్యభారతీయుడు తెల్లవానిని చూచినపు డెంత భయభ్రాంతు డయ్యెడివాడో (ఇప్పుడా భయమును మహాత్ముడు నాశముచేసెను) కేవలపాశ్చాత్యుల మధ్యనే జీవించు తెల్లవారికి తెలియజాలదు. సామాన్యరైతు తెల్లవానిని మరియొక లోకమునుండి దిగివచ్చినవాడని, ప్రకృతిశక్తులనుజయించిన యమానుషవిగ్రమని, దానిసివలె గజగజవణకుచు భయభక్తులతో సేవింపదగినవాడని భావించెడివాడు. తెల్లవానిని చూచినపుడు కలుగు నీభయపిశాచమును పారద్రోలు శక్తిని తనదేశీయుల కొసంగుటే మహాత్ముని యేకైకవరప్రసాదమని వేనోళ్ల శ్లాఘింపబడుచున్నది. భారతీయుని, ముఖ్యముగ రైతును, వంగివంగి సలాములుమాని నిర్భయముగ నుండుమని, తెల్లవానిని నిర్లక్ష్యముగ తేరిచూడమని, తనదేశమున కరిష్టమగు శాసనముల నతడు చేసినచో వానిని బుద్ధిపూర్వకముగ నుల్లంఘించవలెనని యతడుపదేశించెను. భయము అంటుజాడ్యమువంటిది. నిర్భయత్వముకూడ నట్టిదే; గాంధీజీ నిర్భయుడు; అతడాశక్తి నితరలపైగూడ ప్రసరింపచేసెను. జిల్లా యధికారులెంత తర్జనభర్జనచేసినను అక్రమ భూమిపన్నుల నీయ

కుండ తిరస్కరించు ధైర్యసాహసముల నతడు భారతరైతుకు ప్రసాదించెను. భయమును పారద్రోలిన యతని యసాధారణ శక్తికి రుజువొక్కటియే చాలునని భారతదేశము నెరిగినవారు గుర్తింపగలరు. రెండవది యితరులను తరింపజేయుటకు మనము బాధపడవలెనను నతని యనన్య విశ్వాసమును మారిట్జుబర్గు రైల్వేస్టేషను యుదంతము వెల్లడిచేయుచున్నది. రైలునుండి గెంటివేయబడుట, బగ్గీలోనుండగ మోదబడుట స్వల్పవిషయములే కావచ్చును; కాని "యితరులకొరకు" ఒక యభిమానశూరుడగు బాలకుడు హింసను, పరాభవమును సహించెను. గాంధీజీ సత్యాగ్రహాశయము మాటలలోగాక చేతలలో నిచ్చటనే ప్రారంభమయ్యెను. "కష్టముల ననుభవింపవలసిన స్థితినుండి పారిపోకుము; దానిని ధైర్యముగ నాలింగనముచేయుము. కాని భేషజముకొరకు, తాపసజీవితముకొరకు లేక శరీరమును దహింపచేయుటకు నట్లు చేయకుము. ఇతరులకు సాయపడవలెనను సద్బుద్ధితో చేసినచో నన్యాయము నశించును. అట్టి త్యాగము వీర్యవంతమగును." ముప్పదిసంవత్సరముల తరువాత తమ దేశ భావికళ్యాణముకొరకు రెండులక్షలమంది స్త్రీపురుషులత్యుత్సాహముతో జయిళ్ళను వరించుట నేటాలులో యీ బాలు డతిధైర్యముతో ననుభవించిన యనుభవ ఫలితమని వేరుగ చెప్పవలెనా? న్యాయబుద్ధితో ననుభవించు బాధ, త్యాగము, పరాభవాగ్ని వృధ కాజాలవు. సత్యాగ్రిహము

యొక్క దేశస్వాతంత్ర్యమును నైకమత్యమును సాధించుటకును, సైనికతత్త్వము లేక యుద్ధతత్త్వమును జయించుటకును, దుష్ట సాంఘిక, ఆర్థిక క్రమమును నాశము చేయుటకును మాత్రమే యేర్పడిన నాటక ప్రదర్శనము కాదు. అది మరింత గంభీరమైనది. అది జీససుయొక్క శాశ్వత త్యాగ సూత్రము.

తనప్రజల నీవిధముగ నితరులకొరకై చ్ఛికముగ బాధల ననుభవించుచు సత్యాగ్రహము చేయ ప్రోత్సహించిన గాంధీజీ పాశ్చాత్య నాగరికత స్వార్థముచేతను, విషయలాలసచేతను, లాభములను జుఱ్ఱుకొను తత్త్వముచేతను యింతవరకు మన కండ్లకు కనిపించకుండ చేసిన యొక ప్రపంచ సూత్రమును మరి యొకసారి వెల్లడిచేసెను. పారిశ్రామిక యుగారంభమైన నూట యేబది వత్సరములనుండియు త్యాగ సూత్రమును గురించి శ్రోత్రియ క్రైస్తవమతము వెర్రిబోధలను చేయుచునేయుండెను. కాని యురుకులెత్తుకొనివచ్చి సమస్తమును కబళింప నహామహమికనుజూపు స్వార్థము ముందర త్యాగము మాటువడి 'శ్రీరంగ నీతి' లేక కేవల వ్యక్తిమోక్షముకు సంబంధించిన పరికరమయ్యెను. ఈపురుషాంతరము త్యాగమును కేవల మొకధర్మోపన్నముగ గాక నక్రమమును, యుద్ధమును, దౌర్జన్యమును అంతమొందించు శాశ్వత సూత్రముగ పునరుద్ధరించవలెను. అట్లు చేయనినాడు నాగరిక మానవలోకమున కిది యవసాన దశయే కావచ్చును. "త్యాగధనమును బూని మీరు నన్నను

సహింపుడు* అను జీసను వాక్యములను మనము క్రొత్తగ నర్థము చేసికొనవలెను. మనంతట మన మైచ్ఛికముగ జీసను అనుభవించినట్లే కడుపు మంటను కంటక జీవితమును తుదకు మృత్యువును ఆలింగనము చేయవలెను; దీనిని మనము లోకసంగ్రహార్థము, పాపపంకిలమునుండి ప్రపంచమును రక్షించుటకు, హింసకుని, దోషిని ద్వేషింపక, 'కుక్క-కాటుకు చెప్పుదెబ్బ' యను తత్త్వముకు స్వస్తిచెప్పి దౌర్జన్యరహితముగ నాచరింపవలెను. ఇంతేకాక మనము దీనిని విధేయతతో, ఒప్పుతో, సుహృద్భావముతో, కళ్యాణాత్మకబుద్ధితో చేయవలెను.

కాని జీసను భగవద్ధ్యానతత్పరుడై యీ త్యాగమును చేయగలిగెను. తన యనుచరులుకూడ నట్లేచేయగోరెను. నేడు గాంధీజీ సందేశముకూడ నీవిశ్వాసమునే ప్రతిధ్వనింపజేయుచున్నది. మనము భగవంతుడున్నాడనువిషయమును తిరిగి గుర్తింపవలెను. భగవంతుడే దౌర్జన్యరహితమార్గమున, త్యాగమార్గమున పనిచేయుచుండును. ఈ త్యాగమార్గమే కొద్దిమంది బుద్ధిహీన యుద్ధ వ్యతిరేకుల బుద్ధిజాడ్యమో కాదని గ్రహింతురు గాక! పాపమును సంహరించుటకును, అక్రమమును తొలగత్రోయుటకును నిది భగవన్నిర్మిత మార్గము. చరిత్ర యంతయు త్యాగముతో నిండియున్నది; ప్రతి వ్యక్తి జీవితము కూడ నిట్టిదే! మానవరంగమున భగవదేచ్ఛ యీ విధమున కార్యరూపమును దాల్చును. ఎన్నియో దోషములుచేసి తిరిగి

యింటికి వచ్చిన తెలివిమాలిన పుత్రుని నెంతమాత్రమును తూలనాడక స్వీకరించు తండ్రివలెను, తప్పిపోయిన యొకగొర్రె పిల్లను రక్షించుటకొరకు సురక్షితమగు భవనమును వీడి నిశీథమందు సాంద్రారణ్య పర్వతసీమలను ఝంఝూమారుతమును లక్ష్యము సేయక వెతుకు గొల్లవానివలెను భగవంతుడు సర్వ సముడని జీసను బోధించెను. దోషము నీవిధమున పరిష్కరించుట భగవదేచ్ఛ, భగవద్విధానము, భగవత్ప్రకృతి, భగవదంశ; భగవంతు డట్టి ప్రేమమయుడు. భగవంతుడు తనంతటతానన్వేషించు ప్రేమమూర్తి; రక్షణనిచ్చు ప్రేమమూర్తి; మోక్షమునిచ్చు కళ్యాణమూర్తి; అతడు దుఃఖమును, బాధను, మృత్యువును తనంతట తానే యార్తులను రక్షించుకొరకు తనపై వేసికొనిచివరకు దుఃఖమయప్రపంచమునంతనురక్షించును.

మన మట్టి భగవంతుని గుర్తింపవలెను; యుద్ధము, దారిద్ర్యము, యితర మానవారిష్టములు సకాలములో నశింపవలెనన్న మనము భగవత్ప్రబోధమును పొందవలెను.

సంశయాస్పదు డవైనపుడు, సంకటములు, సమస్యలు, ప్రశ్నలు తారసిలినపుడు మీకేదియాత్మశాంతి నొసంగును ? అనిప్రశ్నింపగా "భగవంతునియందకుంఠిత విశ్వాసము" అని గాంధీజీచెప్పెను. భగవంతుడుమానవులకు కలలలోను, ప్రత్యేక సందర్శనములలోను గాక క్రియలద్వారా ద్యోతకమగును. ఈ సందర్భములో నస్పృశ్యతా నివారణకొరకతడు సలిపిన త్రివా

రోపవాసదీక్షలో కలిగిన యనుభవము నతడు పేర్కొనెను. భగవదేచ్ఛను నెరవేర్చుటకు మనమాత్మార్పణ చేసినవాడు భగవంతడే మనకపసరమైన మార్గము నతని పద్ధతులద్వారా వెల్లడిచేయును. "భగవదేచ్ఛను నెరవేర్చువాడు యదార్థోపదేశమును బడయుగలడు" అని జీసను ఒకసారిచెప్పెను. కొఱత వేయబడుటకు పూర్వము జీసను తనశిష్యునిపాదములను కడిగి కాయకష్టము, నీచసేవలోనున్న ఘనతనుచాటి తనశిష్యులకిట్లు బోధించెను. "మీగురువునైన నేను మీకొరకిట్లు చేసినపుడు మీరుకూడ నిట్లేచేయవలెను; నేనుచూపిన సాదృశ్యమునర్థము చేసికొని దాని ప్రకారమాచరించినచో మీరు ధన్యులుకాగలరు" జీసను క్రియలవంటి క్రియలచేతనే మనజీవిత ప్రయోజనములను పొందగలము; విశ్వప్రయోజనముతో సామరస్యము ననుభవింపగలము.

చెడ్డను జయించుటకు మానవజీవితములో నెక్కువ మౌనముండవలెనని గాంధీజీ నొక్కివక్కాణించును. "నేనిపుడు శాశ్వతమౌనవ్రతుడనని చెప్పగలను. కొద్దికాలము క్రిందటనే నేను సుమారు రెండుమాసములు పూర్తిగ మౌనమును వహించితిని; ఆమౌనప్రభావమింకను చెక్కుచెదరలేదు...... ఈరోజులలో ప్రతిసాయంత్రము ప్రార్థన సమయమున నేను మౌనమువహించి ప్రేక్షకులకొరకుదయము రెండుగంటలకు విడిచిపెట్టెదను. ఈరోజున యితఃపూర్వమే మౌనమును విడిచి

తిని. శారీరకముగను ఆధ్యాత్మికముగను నాకదియవసరమయ్యెను. మొదట కార్యభారమును తీర్చుకొనుటకు దానినవలంబించితిని; తరువాత వాతకొరకు నాకుకాలమవసరమయ్యెను. కాని నేను కొంతకాలమాచరించిన తరువాత దానియాధ్యాత్మిక ప్రభావమునాకు గోచరించెను. నేను భగవంతుని సంపర్కము ననుభవించుటకదియే మంచిసమయమని నాకకస్మాత్తుగతట్టెను. మౌనముకొరకే సహజముగ సృజింపబడితినని నేనిపుడు భావించుచున్నాను.” అని యతడుచెప్పెను.

గాంధీజీయొక్క పవిత్రశక్తి వెనుకనున్న గంభీరయాధ్యాత్మికపునాదిని గురించియింతకంటె సుస్పష్టముగ వర్ణింపగలవాక్యములులేవు. భగవంతునిలో మగ్నమగు నీయకలంకకాలములయందే యతడగ్రాహ్యమగు నార్షశక్తిని, ప్రవక్తపదవినిపొంది తన్నుప్రేమించు యనుచరులపైన సాధారణాధికారమును సంపాదించుచున్నాడు.

తరువాత చెన్నపట్టణములో సమావేశమైన క్రైస్తవనాయకులతో నతడు మరియొకసారి ప్రపంచమునంతను మహాసంగ్రామములోని కీడ్చి ద్వేష, దౌర్జన్య, రక్తపాతములను యథేచ్ఛగ ప్రసరింపజేయనున్న యంతర్జాతీయ విషమస్థితినుండి మానవలోకము నుద్ధరించు సమస్యనుగురించి చర్చించెను. నేడు నాగరికవృక్షముయొక్క వేళ్లను తెగకొరికి వేయుచున్న “నిర్వీర్యతయను పరాభవమునుండి” నాగరికతను రక్షించుటెట్లు?

జీససుయొక్క సందేశమును రెండువేల వత్సరములనుండి పాశ్చాత్యనాగరికత యెఱిగియున్నను అది యాసందేశమును జీర్ణించుకొనజాలకపోయెను; ఆచరింపజాలకపోయెను. కనుకనది నేడు మన కండ్లయెదుటనే తుత్తునియలగుచున్నది. ప్రస్తుతము పాశ్చాత్యదేశములు దుర్భరయశాంతితో తపించుచున్నవి; భవిష్యత్తు అగమ్యముగనున్నది. కనుక జీసను సందేశములోని ముఖ్యసూత్రమును పునరుద్ధరించుటయే జీవిత సమస్యగచేసికొనిన పురుషపుంగవుని యీక్రైస్తవనాయకులు సమీపించుట యుక్తముగనున్నది. ఈదివ్యపురుషుని ప్రయత్నముల ద్వారా మనకండ్లయెదుటనే, క్రైస్తవేతర వాతారవణములో త్యాగధీన ముజయభేరి మ్రోగించెను.

భారతదేశమునకు తానొనర్చిన సేవయొక్క ప్రధానాశయమెద్ది? అది రాజకీయమా, సాంఘికమా, మతసంబంధమా? యనిగాంధీజీని యొకరు ప్రశ్నించిరి. దానికి గాంధీజీ యిట్లు బదులు చెప్పెను. "నాయుద్దేశ్యము కేవలము మతసంబంధమైనది.........మానవసంఘు మంతటితోను నైక్యమైనగాని నేను మత జీవిని కాజాలను; రాజకీయములలో పాల్గొనిన గాని నేను మానవసంఘముతో నైక్యము కాజాలను. నేటి మానవ కలాపము ప్రత్యేక విభజనలకు వీలులేని కలగూరగంప. సాంఘిక, రాజకీయ, మత కలాపములను గదులపెట్టెవలె విడదీయుటకు వీలులేదు. మానవకలాపములకు సంబంధములేని

మత మేదియు నాకు తెలియదు. మతము యితర కార్యము లన్నింటికి నైతిక పునాది; ఆ పునాదిలేనినాడు జీవితము 'అర్థ రహితమైన శబ్ద పటాటోపము; భయావహము.'

తన యుద్యమమందలి ప్రేమచే సేవచేసెనా లేక తాను సేవచేయు ప్రజలయందలి ప్రేమచే చేసెనా యని మరియొక ప్రశ్న వేయబడెను. ప్రజలయెడల ప్రేమయే దానికి కారణ మని యతడు చప్పు లేకుండ చెప్పెను. ప్రజలకు సేవ చేయ కుండ నొక యుద్యమముకు చేయు సేవ మృతప్రాయమైనది.

తన బాల్యమందత డస్పృశ్యులయెడల నభిమానము కలిగి వారిస్థితిని చక్కబరుపగోరెను. ఒకనాడతనితల్లి వారితో నాడుకొనరాదని నిషేదించెను. దానిపైన యతని మనస్సులో ప్రశ్నలుదయించెను. "అప్పటినుండి నాలో విప్లవము ప్రారం భమయ్యెను."

సత్యాగ్రహమును గురించి మరింత వివరముగ చెప్పవల సినదని యతనిని కోరగ నత డిట్లు చెప్పెను. "నా యభిప్రాయ ములో సత్యాగ్రహ మెవ్విధమునను జడమైనది కాదు; నాకు తెలిసిన సత్యాగ్రహము ప్రపంచములో నతివీర్యవంతమైన శక్తి ......అది పరమధర్మము. ఏబదియేండ్ల నా నిరంతరానుభవ ములో నేను నిరాశ చెందవలసిన స్థితి యెన్నడును కలుగలేదు; సత్యాగ్రహముద్వారా నివారింపజాలని సమస్య కాన్పించలేదు.

యూదులను గురించి నేను వ్రాసితిని; నాపద్ధతి నవలంబించినచో నొక్కయూదుడును నిరాశ చెంద నవసరములేదు. యూదులు దౌర్జన్యపరులని నేనూహించుట న్యాయము కాదని యొక స్నేహితుడు నాకు వ్రాసెను. యూదులు దౌర్జన్యపరులు కారనుట నిజము. కాని వారు విశ్వాసముగల సత్యాగ్రహులును కారు. డిక్టేటరులు చేయు యత్యాచారములకు 'వారు పెట్టు బాధలను మేమనుభవించెదము; వారి కంతకు మించి యేమియు తెలియదు. కాని మేమెట్లు బాధపడవలెనని వారనుకొందురో యట్టి బాధను పొందము' అని వారిలో నొక్కడు నిలిచినను తన యాత్మగౌరవమును నిలబెట్టుకొని సాదృశ్యమును చూపినవాడగును; ఇది సర్వత్ర వ్యాపించినచో యూదులనందరను రక్షించును; ఇంతేకాక వారు మానవజాతి కొకపెన్నిధిని సమర్పించిన వారగుదురు.

"చీనాను గురించి యేమి చెప్పెదరు? అని మీరడుగవచ్చును. చీనా వారి కితరులజోలి యక్కరలేదు; అన్య రాష్ట్ర కాంక్ష లేదు. నిజమే! బహుశా చీనా కట్టి దుండగమునకు శక్తిలేదు. వారి శాంతిప్రియత్వమువలె కాన్పించునది వారి సోమరితనమే. చీనా దౌర్జన్యరాహిత్యము నవలంబించలేదు. జపాను దాడి నది తీవ్రముగ నెదుర్కొనుటచే నది బుద్ధిపూర్వకముగ దౌర్జన్యరాహిత్యము నవలంబింపలేదని చాటుచున్నది. అది యాత్మరక్షణమాత్రమే చేసికొనుచున్నదని చెప్పినంతమా

త్రిమున దౌర్జన్యరాహిత్యముకు సమాధానము కాజాలదు. సత్యాగ్రహపరీక్షకు సమయమువచ్చినప్పుడది విఫలతనొందెను. నేను చీనాను విమర్శించుటలేదు. దాని విజయమునే నేనుకాంక్షించుచున్నాను. ప్రపంచ మామోదించిన ప్రమాణముల ననుసరించి దానిప్రవర్తన చాలసక్రమమైనదని చెప్పకతప్పదు. కాని సత్యాగ్రహ పద్ధతి ప్రకారము చీనావంటి నాగరిక దేశము, నలుబదికోట్ల ప్రజలు గల దేశము, జపాను పద్ధతులద్వారానే జపాను దుండగము నెదుర్కొనుట యుక్తముకాదు. చీనా నా సత్యాగ్రహము నంగీకరించినచో జపానుయొక్క నూతనవిధ్వంసక యంత్రములతో దాని కవసరము లేదు. చీనా జపానుతో నిట్లు చెప్పును. 'మీ యంత్రబలము నంతను రానిండు; మేము సగముమంది మీ కెరయగుదుము; కాని మిగిలిన యిరువది కోట్లమంది మీకు మోకరించువారు కారని గుర్తించుడు.' చీనా యట్లుచేసినచో జపాను చీనాకు సలాము చేయును."

సత్యాగ్రహమునం దతనికి గల యచంచల విశ్వాసమునుగురించి గాంధీజీ యింతకంటె ఖచితమైన స్టేటుమెంటు నేమి చేయగలడు? యుద్ధముద్వారా దుర్మార్గమును శిక్షింపజూచుట "సైతానును సైతానుద్వారా రూపుమాపుట" ఇట్టివిధానము వలన మొదటి దుండగమునకు తావిచ్చిన దుష్టబుద్ధి యంతమొందజాలదు. అది యాదుర్మార్గమును మరింత యుపద్రవకరము, స్థిరీకరణము చేయును; అగ్నిహోత్రములో నాజ్యము

పోసినట్లగును. కనుక నౌద్ధత్యమును మిత్రత్వముగ మార్చుటకు 'కుక్క-కాటుకు చెప్పుదెబ్బ' పద్ధతిని వీడి యాత్మార్పణ పద్ధతి నవలంబించు టొక్క-టే శరణ్యము.

తరువాత నీవిషయములోనే మరియొక శాఖను గురించి చర్చ జరిగెను. "యూదుల సందర్భములో సత్యాగ్రహము యుక్తమైనదే. ఏలనన యిచ్చట వ్యక్తికిని వానిని బాధించు వారికిని వ్యక్తిగత సంబంధము కలదు. కాని చీనాలోనో! జపాను వాయువిమానములను, దూరముపోవు తుపాకులను ప్రయోగించును. ఆకాశమునుండి మృత్యుదేవతను సంధించు వానికి క్రిందనున్న దెవరో, యెంతమంది హతులగుచున్నారో తెలిసికొన నవకాశమే లేదు. పరస్పర సంపర్క-ములేని విమాన పోరాటమును సత్యాగ్రహ మెట్లు డీకొనగలదు?" అను నాక్షేపణ కలదు.

దానికి గాంధీజీ యిట్లు చెప్పెను. "మృత్యువును ప్రసాదించు బాంబు వెనుక దానిని సంధించు మానవహస్తమున్నది; దాని వెనుక దాని నాడించు మానవహృదయమున్నది. భయ విహ్వలతను పురికొల్పు దౌర్జన్యనీతి వెనుకదానిని జంకులేకుండ నుపయోగించుచో నిరంకుశునికి శత్రువు పాదాక్రాంతుడగునను భ్రమ కలదు. కాని ప్రజలు నిరంకుశుని యిచ్ఛకు లొంగరను కొనుడు; అతనివలె ప్రతిదౌర్జన్యము నుపయోగింపరనుకొనుము. అప్పుడతనికి దౌర్జన్యమును సాగించుట వృథయగును. నిరంకుశు

నకు తగినంత మేత నిచ్చిననాడతడు మ్రింగలేక బాధపడు సమయము వచ్చును............"నా భార్యను నా యిచ్ఛ వచ్చినట్లు లొంగదీయ ప్రయత్నించినపుడు నేను సత్యాగ్రహము నామెవద్ద నేర్చుకొంటిని. నేనెన్నియిక్కట్టులు పెట్టినను పెదవి మెదల్పక సహించుచు నా యిచ్ఛను ప్రతిఘటించుట కామె దృఢనిశ్చయురాలయ్యెను. చివరకు నన్నుగురించి నాకే సిగ్గు కలిగి నేనామెను నిరంకుశముగ పాలించుటకే పుట్టితినను నా జాడ్యము కుదిరెను; తుద కామె నాకు సత్యాగ్రహ గుర్వి యయ్యెను. ఆమె యబుద్ధిపూర్వకముగ వ్యక్తిగతముగ నాచరించిన సత్యాగ్రహ సూత్రమునే నేను దక్షిణాఫ్రికాలో బాహుళ్యము మీద ప్రయోగించితిని.

సత్యాగ్రహమునకు సంబంధించిన మరియొక యత్యంత ప్రధానసూత్రముకలదు. ఈ ముద్యమములో పురుషులతో పాటు స్త్రీలుకూడ సమానముగ పనిచేయవచ్చును. ఇంతే కాదు. ఈయుద్యమములోనాయకత్వమువహించుటకు స్త్రీలకు ప్రత్యేకార్హతకలదు. యుగయుగములనుండి రెండవకంటివానికి తెలియరానిబాధను సహించుట స్త్రీలకు యసమానాస్త్రమయ్యెను; దీనికితోడు నిర్భయముగ, నిర్మోగమాటముగ దౌర్జన్యమును, పీడనుసాక్షీభూతముగ చూడగలుగుట యామె లక్షణము. ఈతత్వమును, పద్ధతిని ప్రధానసూత్రముగ చేసికొని ప్రపంచము నుద్ధరించుటలో నామె ముందంజవేయవలెను.

సత్యాగ్రహముయొక్క నాలుగుప్రధాన భావములను మనము స్మరణకు తెచ్చుకొందముగాక !

మొదటిది ప్రపంచములో నక్రమము యథేచ్ఛగచెల రేగెను.

రెండు, అక్రిమమును జయింపవలెను.

మూడు, అక్రమము దౌర్జన్యమునకు లొంగునదికాదు; దౌర్జన్యము దుర్బుద్ధిని మరింతగంభీరము, స్థిరతరముగావించును; ఎంతదయావిహీనముగ మనము దానినణచినను అది పదితలల శిఖండివలె తిరిగి యెప్పుడో యొకప్పుడు విజృంభించుటతప్పదు.

నాలుగు, క్షమాన్వితమగు కష్టసహిష్ణుత యక్రమము నోడింపగలదు. ఏలయననది యక్రమముకురిపించు కష్టపరంపరల నన్నింటిని చివరకు మృత్యువునుకూడ సుహృద్భావముతో నైచ్ఛికముగ ననుభవించును. వ్యక్తిసత్యాగ్రహి సత్యము కొరకు బలియైనను ఆతత్త్వము మాత్రము తిరిగి తప్పక తల యెత్తును.

ఈనాలుగు ప్రిధానభావములకు సంబంధించినంత వరకు స్త్రీలు అనాదిసిద్ధముగ సత్యాగ్రహము నెరిగి యాచరించు చున్నారనుట లోకవిదితము. తానువ్యక్తిగతముగ నిరంకుశత్వ ముక్రిందపడి నలుగుచుండుటచే నక్రమము స్త్రీహృదయమున హత్తుకొనిపోయెను. ఈనిరంకుశత్వము నామెక్రమముగ గుర్తిం చియంత మొందింప నిశ్చయించుకొనెను. దౌర్జన్యపద్ధతులచే

నామె దాని నంత మొందింపజాలదు; పైగా స్త్రీపురుషసంబంధ మివ్విధమున నెన్నటికిని కదటబడదను జ్ఞానమామెకుకలదు. కనుక నామె స్వగృహమునందేమి, జాతీయ రాజకీయముల యందేమి నిరంకుశత్వమును సాటిలేని ధైర్యముతో ప్రతిఘటించు క్రొత్తపద్ధతిని త్రొక్కెను. ఇతరుల కొరకైచ్ఛికముగ తానే బాధపడుట యామెసొమ్ము. మానవప్రకృతిలో నుత్పత్తికి సంబంధించిన ప్రధానవిషయములు, శిశూత్పత్తి పోషణములు, స్త్రీలకు సత్యాగ్రహసూత్రముల నంతరంగమునుండి బోధించుటయేగాక వారిని నిత్యసత్యాగ్రహుల నొనర్చెను. ఐచ్ఛికముగ స్వీకరించు ప్రసవబాధనుండియే శిశూదయమగుచు నితరులకొరకెట్టిబాధలనైననసహించు ప్రేమవలననే అదిపోషింపబడుచున్నది.

కనుక జీససుయొక్క త్యాగ సూత్రము నతి విశాల మానవరంగమున కూడ నవలంబించవలెనను గాంధీజీ నూతన సందేశము నిజముగ స్త్రీజనమున కుద్దేశింపబడెను; అతడు మానవలోక మహారిష్టములైన దారిద్ర్యము, పీడ, యుద్ధముల నంతమొందింపవలెనను ప్రపంచభావములలో స్త్రీలు నాయకత్వము వహింపగోరుచున్నాడు.

మన తల్లులు సత్యాగ్రహము నారాధించుటచేతనే పురుషులమైన మనము జనింప గలిగితిమి. ఒక్క ప్రసవవేదనయే కాదు. విస్మరింపబడిన యెన్ని వేలకష్టముల నామె మనబాల్యావస్థలో నిత్యము ననుభవించెనో యెవరి కెరుక! వారు మనలను

ప్రేమించిరి కనుక బుద్ధిపూర్వకముగ, మహదానందముతో మనకొరకు వెతలనొందిరి. మానవలోకము సంతను రక్షించు టకు మన మట్టి ముదావహమగు సహనముతోనే రంగములో నికి దిగవలెను. పురుషులమైన మనకావంతయైనను బుద్ధి యున్నచో నీసందర్భములో స్త్రీలిదివరకే మనకంటెముందంజ వేసిరనియు వారు మన కాదేశికులు, ప్రబోధకులు కాగల రనియు గుర్తింపగలము. వారి నాయకత్వము లేనిచో మనము విధాయికముగ విఫలత నొందుదుము.

నైతిక సందేశము డిక్టేటరులముందు పనికిరాదని మరి యొకనికి ధర్మసందేహము కలిగెను; వారిపై సత్యాగ్రహమును ప్రయోగించుట మృత్యుగహ్వరమున చొరుచుకొనిపోవుట కాదా? డిక్టేటరు లనగా నీతిబాహ్యులు కదా! నైతికముగ సంస్కరింపజూచుట వారియెడల వర్తించునా? గాంధీజీ దాని కిట్లు నిష్కర్షగ జవాబు చెప్పెను. "డిక్టేటరులు సంస్కార దూరు లను భావము నీవాదములో కలదు. కాని వస్తుతః మానవప్రకృతి యంతయు నొక్కటే యను భావముమీదనే సత్యాగ్రహ మాధారపడియున్నది; కనుక నది విధాయికముగ ప్రేమకు జోహారుచేయకతప్పదు. ఇంతవర కీడిక్టేరులు ప్రయో గించు దౌర్జన్యమును వెంటనే దౌర్జన్యమే యెదిరించుచున్నదను విషయమును మనము మరువరాదు. క్రమమైన సత్యాగ్రహ ప్రతిఘటనను వారెన్నడును రుచి చూచియుండలేదు. కనుక

వారెంతటి దౌర్జన్యము నుపయోగించినను దానికంటె సత్యా గ్రహ ప్రతిఘటనమే మిన్నయను విషయమును వారంగీకరింపక తప్పదని నా విశ్వాసము. ఇంతేకాక సత్యాగ్రహ శాస్త్రము నకు డిక్టేటరుల సుహృద్భావ మాధారముకాదు. సత్యాగ్రహి కప్రతిహతమగు భగవత్సహాయమే శరణ్యము. అదియే దుర్గ మములగు కష్టపరంపరలలో నతనికి తెప్పవంటిది. అతని విశ్వా సమే యతనిని మేరుసమానునిగ చేయుచున్నది.''

జీససుయొక్క శిలువలోనున్న యాశయమువలెనే గాంధీజీ సత్యాగ్రహాశయములుకూడ ముఖ్యముగ మతసంబంధమైన వని యిదివిదితము చేయుచున్నది. నిరంకుశత్వము, హింస సహింపరాని మానవబాధను కలిగింపవచ్చును. కాని మనము దీనిని పురస్కరించుకొనక భగవంతుని పురస్కరించుకొనియే బయలుదేరవలెను. దేనిని భగవదేచ్ఛయని నేను విశ్వసించు చున్నాను? భగవంతుడెట్టివాడని విశ్వసించుచున్నాను? అను ప్రశ్నకు మనము సమాధానముచెప్పవలెను. అతడు కళ్యాణేచ్ఛ కలవాడనియు, న్యాయస్వాతంత్ర్యముల కొరకు పనిచేయువాడ నియు, మానవ వ్యవహారములలో నతనిన్యాయ, స్వాతంత్ర్య ప్రియత్వమే రాజ్యముచేయగలవనియు విశ్వసించుచూ నీజగత్ప తియొక్క సహాయము నర్థించుటయే మనము చేయవలసిన కర్తవ్యము.

కనుక మనము భగవంతునియందతో ప్రారంభము చేతుము. మనచర్చలన్నింటి వెనుక, మనము వేయు పథకముల వెనుక, భగవంతుడున్నాడని గుర్తింపవలెను. అతనిని మరచి పోయినచో మన కపజయముతప్పదు. మరియు నతడు చైతన్య మూర్తియే యైనపుడు మన మతనిని మౌనముగ నారయవల యును. ఏలయన మన మతని నెంతశాస్త్రయుక్తముగ, నెట్టి లయ, రాగ, తాళములతో కీర్తించుచున్నా మనునది ముఖ్య ముకాదు. అతడు తన యిచ్ఛను మన కెరిగింపవలెను, తన మార్గమును విశదము చేయవలెను. మన సంకల్పములను భగ వత్సంకల్పముతో నైక్యముచేసి వానిన్రమోాల మౌనముగనిలచి, యతని వాణి నాలకించిననాడే మన కతని సందేశము లభింప గలదు.

మనము భగవంతునివైపు తరలి యతని సంకల్పము నెఱింగిననాడు మన కచంచల విశ్వాసముచేకూరును; అది మన కష్టముల నన్నింటిని తరింపజేయును.

కాని మనము భగవంతునితో ప్రారంభముచేయవలెను. అతనివైపు తరలవలెను. మన నీతులు, మన కార్యకలాపములు మనవిగాక నతనివే కావలెను.

దౌర్జన్యము నుపయోగింపకపోయినను అభయమును చూపి తమకు కావలసినదానిని గుంజుకొనప్రయత్నించు డిక్టే టరులపట్ల నెట్లు ప్రవర్తింపవలెనని మరియొకరు గాంధీజీని

ప్రశ్నించిరి. దానికి గాంధీజీ యిట్లు చెప్పెను. "జర్మనులు జెక్కుల గనులు, ఫ్యాక్టరీలు మొదలగు ప్రకృతి సంపత్తు నాక్ర మింతు రనుకొనుము. అప్పుడీ క్రింది ఫలితములు చేకూరవచ్చును.

1. "ఆజ్ఞల నుల్లంఘించినందులకు జెక్కులను సమూల నాశము చేయవచ్చును. అది జెక్కులకఖండ విజయమును జర్మనీ పతనారంభమును కాగలదు.

2. "అసమానమైన దౌర్జన్యము ముందర జెక్కులు భగ్నహృదయులై వికావికలు కావచ్చును. అన్నిపోరాటము లలోను కలుగు సామాన్యఫలిత మిదియే. కాని యట్టి పరా జయమే కలుగునెడల నది సత్యాగ్రహమువలనగాక నది లేనం దువలననో లేక నది యసమగ్రముగ నుండుటవలనో ప్రాప్తించును.

3. "జర్మనీ తనకు క్రొత్తగ సంక్రమించిన భూములలో తమ దేశములో నెక్కువగనున్న ప్రజలనే ప్రవేశపెట్టవచ్చును. దౌర్జన్యముతో ప్రతిఘటించి దీని నాపివేయజాలరు. ఏలనన దౌర్జన్యమున కాస్కారము లేదని మొదటనే యొప్పుకొంటిమి.

"కనుక నన్నిపరిస్థితులలోను సత్యాగ్రహమే శ్రేయో దాయకమైన పద్ధతి.

ఇంతకును హిట్లరు, ముసోలినీలు ప్రపంచాభిప్రాయము నంత నిర్లక్ష్యముచేతురని నేననుకొనను. 'గొప్పప్రభుత్వములు' అని పిలువబడునవేవియు పవిత్రహస్తములతో వారిని చేరజా

లవు. కనుకనే డిక్టేటరులు ప్రపంచాభిప్రాయమును తృణీకరించు టలో సంతృప్తి పొందుచున్నారు. ఇంతేకాక గతములో నీ'గొప్పప్రభుత్వములు' తమ ప్రజల కన్యాయముచేసిరను దుగ్ధ వీరికి గలదు. నాజీజర్మనీ యింగ్లండు చేసిన పాపఫలితమని కొద్దిరోజులక్రిందటనే ప్రఖ్యాత ఆంగ్ల మిత్రుఁడొకడు నాయొద్ద నొప్పుకొనెను.

వెర్సెలీసు హోమగుండమునుండి హిట్లరుపుట్టెననియత డనెను." వెర్సెలీసుసంధియైన వెంటనే వియన్నాలోని యంతు లేని శిశుఆస్పత్రుల వార్డులలో తిరిగిన నాటి దృశ్యములింకను యీవ్యాసకర్త స్మృతిపథమునకువచ్చుచున్నవి. అవి మహాక్షా మదినములు. అప్పటి కమెరికావారి శిశుపోషణ స్కీములింకను ఫలోన్ముఖమునకురాలేదు. ఆయాస్పత్రులలో నసంఖ్యాకము లగు పసికూనల శుష్కవ్యగ్రశరీరములు చూపరులకు గోచర మగుచుండెను. వారు మన దిగ్బంధనకును, దానివలన నుత్పత్తి యైన రోగములకును గురియైరి. ఆ యసమాన యంతర్జాతీయ ద్రోహమువలన పదిలక్షలమంది జర్మను, ఆస్ట్రియను దేశ స్త్రీలును శిశువులును చనిపోయినట్లు మదింపువేయబడెను. 1871లో బిస్మార్కు ప్యారిసును పట్టుకొని తొలియవకాశము దొరుకుటతోడనే క్షామపీడితమైన యాపట్టణము నాహార పదార్థములుగల రైళ్ళతోనింపివేసెను. తాత్కాలిక సంధియైన తరువాత నెనిమిదిమాసములవరకు మనము జర్మనీ, ఆస్ట్రియాలను

బుద్ధిపూర్వకముగ మాడ్చి వేసితిమి! ఓడిపోయినశత్రువులతో మన యిచ్చవచ్చిన సంధిచేసికొనుటకే మనమట్లుచేసి కృతార్థులమై తిమి. అదిచాలచెడ్డసంధి. కాని యాసంధిలోనేయున్న యక్ర మములకంటెను పరాభవములకంటెను దానిని సాధించిన దిగ్బంధన విధానము మరింతదుర్మార్గమైనది. ఆర్తులైన యా శిశువులను చూచినపుడు నాలోనేనిట్లనుకొంటిని. "దీనికంతకు నెప్పుడో యొకప్పుడు వడ్డీతోసహాచెల్లింప వలసియుండును." నేడాదినమువచ్చెను. ఆబిడ్డలలో మిగిలినవారును, వారిసమవయ స్కులును నేడు నాజీసైన్యాధినేతలు. నాజీ యాశయములు వారిలో కలడుగట్టుకొనిపోయెను. జయభేరిమ్రోగించిన మిత్ర మండలివారమైన మనము యుద్ధమైన తరువాత ఇటలీపట్ల చూపిన వైఖరీవలన ముసోలినీని సృజించితిమి. క్రొత్తగానిర్మిం పబడిన పదునాలుగు మాండేటరీలలోను బ్రిటను తొమ్మిదింటిని పుచ్చుకొని యిటలీకి మొండిచేయిచూపెను. వెర్సైలీసు సంధి వలన, జర్మనీ ఆస్ట్రియాల దిగ్బంధనసమయములోచూపినవైఖరి వలన మనమే హిట్లరును సృజించితిమి. అంతటి యట్టి యంతర్జా తీయనేరములకు మనము తగినప్రతిక్రియ ననుభవింపకుండ జాల మని చరిత్రచాటుచున్నది. జర్మను పరాభవాగ్నికి, చిత్రవధకు యూదులు కారణమను నొక యితిహాసముకలదు. వీరు జర్మను సైనికులింకను పరాజితులు కాకుండ యుద్ధరంగమున పోరు చుండ గృహచ్ఛిద్రము తెచ్చిపెట్టి వెనుకపాటుగ పొడిచిరట!

కాబట్టి మొట్టమొదట వీరి 'తాళము పట్టవలెను'. కనుక నేడు జర్మనీలో యూదులనుభవించుచున్న నరకమునకు దిగ్బంధన కాలమందును, సంధికాలమందును మనముగావించిన యంతర్జాతీయాపరాధమే కారణము. యూదులయెడల నాజీలవలంబించు నీతిని మనముగర్హింపజాలము. దానికి మనమే కారకులము. మొట్టమొదట మనలను మనమే నిందించుకొనవలెను. తరువాత బాధపడుచున్న యూదులకు మనము చేయగలిగిన దంతయు చేయవలెను.

మరియొక డిట్లుప్రశ్నించెను "క్రైస్తవుడనైన నేను అంతర్జాతీయశాంతికెట్లు సాయపడగలను? అంతర్జాతీయ అరాజకమెట్లు తుదముట్టింపబడగలదు? శాంతిని స్థాపించుటకు సత్యాగ్రహమెట్లు సాగింపబడవలెను?"

శాంతిస్థాపకాచార్యుని ప్రియశిష్యులైన యీ క్రైస్తవ నాయకులు యుద్ధసమస్యలను పరిష్కరించుటకు జీససుయొక్క సూత్రమును ప్రయోగించుటలో రెండువేలవత్సరములు విఫల మనోరథులైన తరువాత 'పదునారణాల హిందువు'అని ఘంటాపథముగ చెప్పుకొను గాంధీజీని తమ స్వీయ క్రైస్తవమత ప్రధానసూత్రము నాచరణకు తెచ్చు యుక్తమార్గమునుగురించి సంప్రదించు దృశ్యము దేవతలు చూడతగినది.

గాంధీజీ యిట్లు ప్రత్యుత్తరించెను. "క్రైస్తవుడవైన అవసరమైనచో నీవు నీసమస్తము నర్పించినపుడే సత్యాగ్రహ

మునకు తోడ్పడగలవు. 'గొప్ప ప్రభుత్వములు' ధైర్యముతో నస్త్రసన్యాసము చేయనంతవరకు శాంతి యెన్నటికి నేర్పడజా లదు. ఈమధ్య జరిగిన సంభవములవలన నీవిశ్వాసము 'గొప్ప ప్రభుత్వము'లకు జనించునని నేననుకొందును. ఏబదివత్సరముల నిరంతరాయ సత్యాగ్రహానుభవమువలన, నేడొక్క-సత్యాగ్రహ మువలననే మానవలోక ముద్ధరింపబడగలదను నకుంఠిత విశ్వా సము (మునుపటికంటె నెక్కువ దృఢతరముగ) నాకబ్బెను; నాకర్థమైనంతవరకు బైబిలుయొక్క ముఖ్యసందేశ మిదియే!"

గాంధీజీ "దౌర్జన్యరాహిత్యము" లేక సత్యాగ్రహము అనగా జీససుయొక్క శిలువ! కనుకనే యతడు బర్మింగుహా ములో మన మకాములకు వచ్చినపుడు "అద్భుతమగు శిలు వను నేను పరీక్షింప" అను కీర్తన తనకు విశ్వవ్యాప్తమగు సత్యహృదయమును ద్యోతకము చేయుచున్నదని చెప్పెను. మానవలోక మొక్క 'శిలువ' వల్లనే రక్షింపబడగలదని యత డీవిధముగ ధృవము చేయుచున్నాడు; "త్యాగధనమును బూని నన్ననుసరింపుడు" అను గురువాక్యములను మన 'మక్షురాల' నాచరింపవలెను.

మన నిజమతముయొక్క భావమును మన మెప్పుడు గ్రహింపగలము? ఈ యసామాన్య హిందూసన్యాసియొక్క యుపదేశములు, అంతకంటె నెక్కువగ నతడు విశ్వసించు సూత్రములను తూచా తప్పకుండ నాచరించు యోగము-

క్రైస్తవలోక ప్రబోధమును త్వరితము చేయవచ్చును. యూరప్పులో నెక్కువగ క్రైస్తవులే గల దేశములలో క్రైస్తవ మతమిదివరకే హింసింపబడుచున్నది. ఇంతకంటె నెక్కువ కష్టములు రానున్నవను వదంతులు కూడ కలవు. త్యాగ మార్గమున కష్టముల నెదుర్కొని "జయిళ్ళను సౌధములవలె వరించి" జీససుకొరకు త్యాగముచేయగలమను నానందముతో క్రైస్తవ మతమును పునరుద్ధరించుటకును, నాగరికతను రక్షించుటకును జర్మనీలోనున్న క్రైస్తవులు పూనుకొనెదరా? యుద్ధము, దారిద్ర్యము మొదలగు మన నిజసమస్యలలో కూడ మనమీసూత్రమును వరింపగలమా?

తరువాత గాంధీజీ యుద్ధజాతులగు సరిహద్దుజాతులలో సత్యాగ్రహతత్త్వమెట్లు అభివృద్ధియైనదియు వర్ణించెను. "అట్టి దృశ్యమును చూతునని నేనెన్నడును అనుకొనలేదు; దాని విషయమై వారతిశ్రద్ధాళువులై యుండిరి. శ్రద్ధ వారి హృదయములలో నాటుకొనిపోయెను. వారంతట వారికే సత్యాగ్రహములో నాశాంకురము లుద్భవించెను; జ్ఞాన ముదయించెను... పూర్వమంతయు నంధకారబంధురముగ నుండెడిది.

కుటుంబ కలహములచే రక్తవరదలుకార్చని-కుటుంబ మొక్కటియునులేదు. వారు గుహలలోని పెద్దపులులవలె జీవించెడివారు. పఠానులెప్పుడును (కత్తులు, కటారులు, తుపాకులుధరించుచుండినను) యుద్యోగములనుండి బర్తరఫుచేయబడు

దురని తమపైయధికారులకు భయపడెడివారు. ఇదంతయు నిపుడు మారిపోయెను. ఖాన్‌సాహేబుయొక్క సత్యాగ్రహ పద్ధతిక్రిందకు వచ్చిన పఠానులలో రక్తమునుచిమ్ము కలహ ములు గతచరిత్రఅయ్యెను. జీవనాధారముకొరకు యల్పనౌకరీల కాశించుటకు బదులు వారిపుడు వ్యవసాయకులైరి; త్వరలోనే వారు పరిశ్రమలను చేబట్టుసూచినలుకలవు. ”

ఈతుది రిమార్కుల వలన గాంధీజీ కాయకష్టమును, ముఖ్యముగ వ్యవసాయపనిని, ప్రేమించునని తేలుచున్నది. 1931 లో నతడింగ్లండులో నున్నపుడు నిరుద్యోగమును పరి ష్కరించుటకును, క్రైస్తవ నాగరికతను పునః ప్రతిష్ఠచేయు టకును సామాజిక భూవిభాగము జరుగవలెనని చెప్పెను. హిందూదేశములోకూడ నతడీ సందేశమునేయిచ్చెను. దానితో పాటు నిత్యము కొంతకాలమును చేతిపనులకు, ముఖ్యముగ నూలువడకుటకు, వినియోగించవలెనని యతడు నొక్కిచెప్పెను.

ఆయిదవ శతాబ్దములో పురాతన గ్రీకునాగరికత తుత్తు నియలైనపుడు కొద్దిమంది చిన్నచిన్న సంఘములుగ బయలు దేరి పూర్వము సమస్త సస్యముల కాలవాలమై నేడు స్మశాన వాటికలైన ప్రదేశములలో జీససుపేర చిన్నచిన్న సామాజిక భూవిభాగములను, ప్రాచీన మఠములను స్థాపించిరి. శాస్త్రీయ మైన వ్యవసాయమును, విద్యను, మతమును, సంస్కారమును తెచ్చిపెట్టిన మొదటి సన్యాసులు పార, గొడ్డలి, గునపములను

చేబూని భూమిని త్రవ్విన మనుష్యులే. వానిని చేబూని తమః స్వలాభముకొరకు గాక సంఘముకొరకును, జీససుకొరకును, బర్బరజాతుల దాడులవలన నురుముచేయబడిన యతని ప్రజ కొరకును యీవీరకోటి మార్గదర్శకులై మధ్యయుగ నాగరికతను సృజించిరి. అది మన నాగరికతకంటె యనేకవిధముల నెక్కువ సృజనశక్తికలది; ఎక్కువ క్రైస్తవమత తత్పరతకలది.

నేడు మనకాలములో మరియొక ప్రపంచయుద్ధము ద్వారా మిలిటరీతత్త్వముతోను పారిశ్రామిక పోటీతోనుకూడిన నేటి నాగరికతకూడ నశించు సూచనలు కాన్పించుచున్నవి. ఇదియే నిశ్చయమైనచో తమకొరకుగాక సంఘముకొరకు, జీససుకొరకు, యుద్ధమువలన బాధపడువారికొరకు పారలను చేబూని పనిచేయు ఖనికులు తిరిగి లోకము నుద్ధరింపవలసిన సమయ మాసన్నముకానున్నది. కనుక నిది తప్పనిసరియగుచో మనమిప్పుడే తయారు కావలెను. అందువలన యీమధ్య యింగ్లండు వేల్సు ప్రాంతములందు విశేషముగ నభివృద్ధిచేయబడిన (నిరుద్యోగులకు భూముల నేర్పాటుచేయు) సంఘములకు విశేష ప్రాముఖ్యత యేర్పడెను. అదృష్టవంతుల తరగతులకుచెందిన సభ్యులుకూడ నీసంఘములయొక్క కాయకష్టములలో నెక్కువగ పాల్గొనుట యవసరము.

తరువాత గాంధీజీకిని క్రైస్తవ నాయకులకును మతమును గురించి చర్చజరిగెను. ఆయన భగవంతుని యెట్లు ధ్యానించును?

అను ప్రశ్న వేయబడెను. "ఉదయ సాయంకాలములయందు మేము సమష్టి ప్రార్థనలు సలిపెదము. ఇది వత్సరములకొలది జరుగుచున్నది. గీతాశ్లోకములును, యితర మతగ్రంథముల లోని గీతములును, మహర్షుల గేయములును (సంగీతమున్నను లేకున్నను) చదువబడును. వ్యక్తిగతమైన ప్రార్థనను వాచావర్ణించు టకు వీలులేదు. అది నిరంతరాయముగను, అబుద్ధి పూర్వకము గనుకూడ జరుగుచునేయుండును. నేనా సర్వసాక్షిని గుర్తింపని నిముసమైనను లేదు; అతని కనుమరగియుండు సదేదియును లేదు. అతనితో సామరస్యము నొందుటకే నేను యత్నింతును. క్రైస్తవసోదరులు ప్రార్థించునట్లు నేను ప్రార్థింపను. ఆవిధాన ములో దోషమున్నదని నాభావము కాదు. నాకప్పుడు మాటలు రావు. అదియొక యలవాటు కావచ్చును......మన కోరికలు, అవసరములు మనకంటె ముందుగనే భగవంతునకు తెలియును; అతనికి నా ప్రార్థన యవసరములేదు. కాని అతి యపరిపూర్ణ మానవుడనైననాకు తండ్రి రక్షనుకోరు శిశువువలె నతని రక్షణ యవసరము......అతడు తనధర్మమున వెనుకబడి యుండుటను నేనెన్నడును నెరుగను. ఏమాత్ర మంధకారము నన్నావరించి నను నాకతడందుబాటులో నుండును. భగవంతుడు నన్నువిడిచి వేసెనని నేను భావించిన నిముసమొక్కటియు నా జీవితములో కానరాదు."

ఇట్లు గాంధీజీని దర్శించిన కొంతమంది క్రైస్తవనాయకుల పూర్వాభిప్రాయముల నెరిగిన వారి కీసంభాషణ చాల రసవంత ముగ నుండును. ఈ వ్యాసకర్త కేంబ్రిడ్జిలో విద్యార్థిగ నుండ వీరిలో నుద్దండుడైన యొకనాయకు డచ్చటకు వచ్చెను. ఈ పురుషాంతరమున ప్రపంచ మంతయు దివ్యత్వ సిద్ధి నొందెనని యతడు మేఘ గంభీర నినదములతో నురుముచు పాశ్చాత్య ప్రొటెస్టెంటు క్రైస్తవులమైన మనము (ముఖ్యముగ మనలో ప్రిస్బిటేరియనుశాఖవారు) 'సత్యమును గ్రహించితిమి;' దీనిని మనమీమూలనుండి తక్కిన ప్రపంచమునకు మోసుకొనిపోయి సత్యము పూజ్యమగుటచే ప్రాచ్యదేశములలో కలిగిన యుపద్ర వములను తొలగించు టొక్కటియే సమస్య యనెను!

తరువాత మహాసంగ్రామకాండ (1914) ప్రారంభమ య్యెను. నేడు పరిస్థితులెంతవిపరీతముగ మారిపోయెను! తాను హిందువునని చెప్పుకొనుటకు గర్వించు మానవుడు జీసను యొక్క సత్యమును త్యాగసూత్రమును మనకంటె నెక్కువగ గ్రహించెనని ద్యోతకమయ్యెను. మన నాయకులు—అతనిని దర్శించిన యీనాయకులే—అతని పాదములకడ చేరి క్రైస్తవ మతాంతరార్థమును గ్రహించుట శుభావహము.

—⁂—

# ఒకభారత రాజకీయవేత్త యభిప్రాయము

**సర్ మీర్జాయిస్మెయిల్** (మైసూరు దివాను)

మహాత్మగాంధీ డెబ్బదియవ జన్మదినోత్సవసందర్భమున వానికి సమర్పింపబోవు యీ యుత్కృష్ట గ్రంథములో నన్ను కూడ పాల్గొననిచ్చినందులకు నేను మహదానందము నొందుచున్నాను.

మహాత్ముడు 'సహస్రసమాజీవి'యగుట ప్రపంచములో నసంఖ్యాకులుగనున్న యతని మిత్రమండలికిని, సహచరకోటికిని ముదావహమైన విషయము. వారిలో నేనొకడను. అతని ప్రతి జన్మదినము సేతుసీతనగమధ్యస్థలోకము నానందమున ముంచివేయును.

మహానాయకుడు, ఆచార్యుడు నగు మహాత్మునితో నా కెట్టిపరిస్థితులలో సన్నివేశము కలిగెనో యని నా దృష్టిపథమునకు వచ్చుచున్నవి. 1927 లో నతని యారోగ్యముభంగమైనపుడు మైసూరులోని నందిపర్వతములలో నతడు విశ్రాంతి తీసుకొనెను. అప్పుడు నాకాయనతో వ్యక్తిగత సంబంధము కలిగెను. మైసూరుప్రజలు అతడిచ్చట గడిపిన కొద్దివారముల నెన్నడును మరువజాలరు. అప్పుడవకాశము దొరికినపుడెల్ల నేనతనిని కలుసుకొనుచుండెడివాడను. అప్పుడు నాకతనియెడల పూజ్యభావము, ప్రేమ, యనురాగము లేర్పడెను.

రౌండు టేబిలుసభలనాడు నేను లండనులో గడిపిన దినములు కూడ మరువరానివి. మహాత్ముడు కాంగ్రెసుయొక్క యేకైక ప్రతినిధిగ రెండవ రౌండు టేబిలుసభకు వచ్చెను. భారత సభ్యులలో నత డగ్రగణ్యు డనుట కెట్టి సందేహమును లేదు. అతని యుపన్యాసములు సభ నంతను దద్దరిల చేసెడివి. రెండవ రౌండు టేబిలుసభలో ఫెడరల్ కౌన్సిలునుగురించి నేను చేసిన సూచనను మహాత్ముడు కొద్దిసవరణలతో నంగీకరించుట వ్యక్తిగతముగ నాకు మరెంత చిరస్మరణీయము.

ఈ వ్యక్తిగత గాథను విడిచి మన దేశమున కేగాక ప్రపంచము కంతకు నమూల్యమైన యీ భరతపుత్రుని జీవిత చరితామృతమును కొంత చవిచూచెదముగాక! సమకాలికుని యమరత్వమును సూచించుట సాహసమను లోకోక్తి కలదు; ఏలనన రాబోవు సంతతివారు తమ యిష్టమువచ్చిన నిర్ణయమును చేసికొనవచ్చును. కాని మహాత్ముని సందర్భములో నిట్టి జోస్యమును చరిత్ర కాదనజాలదు. భారతదేశమున నుదయించిన గొప్పవారిలో నితడొకడని సమకాలికు లందరును అంగీకరించిన విషయమే! జీవించియున్నవారిలో నితడధికుడన్న సంగతి లోకవిదితమే! "అతడు భారతతత్వ ప్రతినిధి; ఆమె భా వ ము ల న న న్య సా ధ్య ము గ ప్రి క టిం చు మే టి" అని నేననేకవత్సరముల క్రిందట నొక సభలో చెప్పియుంటిని. అతడు తన విశ్వమానవత్వమువలనను, తన మహదాశయముల

నెట్టి పరిస్థితులలో కూడ వీడకుండుటచేతను ప్రజాహృదయము నాకర్షించెను. సేవాతత్త్వమును ప్రేమించువారతనికి జోహారు లొనర్తురు. ప్రపంచములో నేడుత్కృష్ట మానవులలో నొకడైన మహాత్ముడు భారత జాతీయజీవితములో నసమానుడు. తన యసమానస్థితి నతడు మాతృదేశ కళ్యాణముకొరక కర్పించెను. భారతప్రజాసామాన్యములో నతనికిగల యద్వితీయమైన పలుకుబడిని బట్టి బ్రిటిషుసామ్రాజ్యములో నతడత్యంతశక్తి సంపన్నులలో నొకడుగ భావింపబడుచున్నాడు.

రాచకీయములు 'ఇంద్రజాలము'లవంటివి. పరిస్థితులను బట్టి మన మంతరాత్మకు తరుచు స్వస్తిచెప్పుచుండవలె ననుట కొంత పరిహాసమేమైనను అందులో సత్యము లేకపోలేదు. నీతి నియమములకు వెరువనివానికే యిందు విజయము చేకూరునని చెప్పుచుందురు. కాని మహాత్మునిపట్ల నిది విపరీతమయ్యెను! ఇతడు భరతపుత్రులలో నత్యంతనీతివంతుడు; నియమములకు, సూత్రములకు కట్టువడువాడు. అయినను వారందరిలో నపూర్వ విజయమును పొందిన రాజకీయవేత్త! అత డగ్రాహ్య భారతము. అసమాన నైతికసంపత్తి, అకలంక వ్యక్తిజీవితము, కపట కల్లము లెరుగని ప్రవర్తన, బలీయమైన మతసంస్కారము కల యీతడు భారతఋషులను, ఆధ్యాత్మికనాయకులను జ్ఞప్తికి తెచ్చుచున్నాడు. భారతమును గాఢనిద్రనుండి మేల్కొలిపి, భారతీయులలో నూతనోత్సాహమును రగుల్కొలిపి,

వారికాత్మగౌరవమును ప్రసాదించి, తమ నాగరికతయం దభి రుచి కల్పించిన మహాత్ముడు కేవల రాచకీయవేత్త కాడు! అతడు రాజ్యతంత్ర ప్రవీణుడు, ప్రవక్త. స్పెక్టేటరు పత్రికలో రిఛర్డుఫ్రూడ్ వ్రాసినట్లు "భారతజాతి యస్థైర్యముగ, తాత్కాలికముగ విజృంభించుచున్నను దాని యాకృతి విశదమగుచునే యున్నది; గాంధీజీ దాని విధాత." ఋషి, ప్రజానాయకుడు, రాజనీతికోవిదుడు—ఈ త్రివేణీసంగమము ఆంగ్లేయుల కర్థము కాలేదు; కాదు. అతని భారతీయానుచరు లర్థము చేసికొనలేక పోయినను దాని నంగీకరించిరి. అందరిచేతను స్తుతింపబడుచు ప్రపంచములో నెవరికిని యర్థముకాని యుత్కృష్టపురుషులలో మహాత్ము డొకడు. అతడు మతమును నీతిని రాచకీయము లలో ప్రవేశపెట్టి వింతయైన నైతికాయుధమును సృజించి ఆయుధశక్తుల నెదుర్చుచున్నాడు; మతమును రాచకీయములలో ప్రవేశపెట్టి వానికాధ్యాత్మిక సంస్కారమును ప్రసాదించినాడు. అట్లే మతములోనికి రాచకీయములను ప్రవేశపెట్టె శ్రోత్రియ హిందూమతము కేవలము మతముక్రిందకు తీసుకొనివచ్చిన యనేకసమస్యల నైహికసమస్యలుగ మార్చివేసెను. వీనిలో హరిజనసమస్య ముఖ్యమైనది. కాని యీ "యస్పృశ్యతా" నివారణ కతని సంస్కరణ ప్రియత్వము, రాచకీయ దూరదర్శకత్వములే కారణము కాక నతని నిజభూతదయాళుత్వముకూడ కారణమని చెప్పక తప్పదు.

మహాత్మగాంధీ యాత్మవిశ్వాస మపారమైనది. ఆధ్యాత్మికశక్తియొక్క మహిమయందతనికున్న విశ్వాసముచే నది మరింత వృద్ధియయ్యెను. అతనిని బుద్ధిగాక హృదయమే యెక్కువగ నడుపుచుండును. తర్కముచేగాక నాత్మప్రేరణచే నతడు నడుచుచుండును. అప్పుడప్పుడతడు మనము నిర్ఘాంతపోవునట్టి సలహాయిచ్చును. లేదా కొన్నిపరిస్థితులలో నగ్రాహ్యామగు విధమున ప్రవర్తించును. అది "నాయంతర్వాణి" యొక్క ప్రబోధము అను నొక్కమాటతో దానికి జవాబు చెప్పును. "సరళజీవితము, ఉన్నతభావములు" వానిజీవిత సూత్రము. తన భావములను, ప్రవర్తనను చివరకు శరీరమును వశమునందుంచుకొనును; అల్పసంస్కారులు దీని కాశ్చర్యమును నిస్పృహను చెందుదురు. "నిన్ను నీ వశమందుంచుకొనుచో రాజకీయములు నీవశమగును." అతడు విషయముల కెంతమాత్రమును లొంగడు; ఆచారములలోను, రుచులలోను స్పార్టను తత్వమును ప్రదర్శించును. సత్యము దౌర్జన్యరాహిత్యము అను స్థిరనక్షత్రముల ద్వారమున నతడు తన యోడను నడిపించుచు క్షుభిత భారత రాజకీయ సముద్రమునుండి కాంగ్రెసుయొక్కయు భారతజాతి యొక్కయు నోడనుకూడ తరింపచేయ యత్నించుచున్నాడు.

భారత ప్రజాహృదయము నతడంత యెక్కువగ నాకర్షింపగలుగుటకు కారణమేమి? అతడారితేరిన రాజకీయవేత్త; భారత సమస్యలను పరిష్కరించుటలో నతనిపద్ధతి విజయవంతమే

యగుగాక! పై ప్రశ్నకివి తగు సమాధానములు కాజాలవు. భారతజాతి యన్నిటికంటె శీలము నెక్కువగగు ర్తించును. బుద్ధి వైశద్యముతో గూడిన నాయకత్వముకంటె నైతిక విశేషము గల నాయకత్వమును వారారాధింతురు. మహాత్ముని యనన్య లక్ష్యశుద్ధి, శ్రద్ధ, పవిత్రోద్దేశములు, అమోఘమైనబుజుప్రవర్తన తనవర్గమువారి ప్రేమ విశ్వాసములనేగాక నతని యభిప్రాయ ములన్నింటితో నేకీభవింపనట్టియు, నతని రాజకీయసూత్రము లనుపద్ధతులను ఆమోదించనట్టియు ననేకమంది కాంగ్రెసేతరుల యొక్క ప్రేమవిశ్వాసములనుగూడ చూరగొనెను. సుమారు అయిదు వత్సరములక్రిందట మైసూరు శాసనసభ్యుల సభలో నొకసారి నేనిట్లు చెప్పియుంటిని. "మన కష్టములను పరి ష్కరించుకొనుటకు సాయపడువాడును, స్వపరిపాలనకు పునాది యగు నూతనయుక్తిని మన కొసంగినవాడును నొకడుకలడు. నేను గాంధీమహాత్ముడు రాచకీయములనుండి తప్పుకొనవలెనని శపించు జాతివాడనుకాను. మున్నెన్నడును కోరనట్లు భారత దేశమిపుడు పదునారణాలవన్నెకువచ్చునాయకునే యపేక్షించు చున్నది. భారతదేశమున నతనికసమానమైనపలుకుబడికలదు. అతడు శాంతిప్రియుడు; అతుల దేశభక్తుడు; దూరదృష్టి, బుద్ధి పాటవముగల రాజనీతి కోవిదుడు. దేశములోనున్న పరస్పర విరుద్ధములైన కూటముల నన్నిటిని సమన్వయపరచి స్వపరి పాలన పథమున మరియొక మజిలీకి నడిపింపగల యోధుడత

డొక్కడేయని నాయభిప్రాయము. భారతదేశమునకును గ్రేటు బ్రిటనుకును నుభయతారకమగు సంబంధమును స్థాపింపగల శక్తి యతని కొక్కనికే గలదు. ప్రభుత్వమున కతనివంటి శక్తిసంపద గల మిత్రమును, గ్రేటుబ్రిటనుకట్టి నిజస్నేహితుడును లేడని నాదృఢవిశ్వాసము. ఇట్టి విషమపరిస్థితిలో నతడు రాజకీయ ములనుండి విరమించినచో నర్థశూన్యమైన వాగాడంబరములతో దేశమును పెడదారిని పట్టించు శుష్కరాజకీయ వేత్తలును, దంభప్రలాపులును రంగము నాక్రమింతురను చిహ్నములు కాన్పించుచున్నవి."

నేనిట్లుపన్యసించిన తరువాత దేశములో ననేకకథలు జరిగెను. శాసనసభలకు బాధ్యమగు మంత్రివర్గము లన్నిరాష్ట్ర ములలోను యేర్పడెను. భారత ఫెడరేషనుసమస్య ప్రాముఖ్యత వహించెను. "కాంగ్రెసులో లేకపోయినను నా కాంగ్రెసు సంబం ధముమాత్ర మవిచ్ఛిన్నముగ సాగుచుండును" అని గాంధీజీయే చెప్పెను. కాని నేనపుడు వ్యక్తపరచిన భావములను మార్చు కొనవలసిన యగత్యము నాకేమియు కాన్పించలేదు. ఎప్పటి కిని నచంచలుడుగనుండునొక్క మహాత్ముడు తప్ప దేశమును నడుపగల దక్షుడొక్కడును కానరాడు. రాచకీయములలో నతనివలె మితిని, సాధ్యాసాధ్యములను, హేతువును సమర్థించు వాడులేడు. భారతదేశమిప్పుడేకాక మనదృష్టి పోవునంతవర కతనిని కోల్పోజాలదు.

భారతదేశములోనున్న మనకుమాత్రమే మహాత్మ ఁడమూల్యుఁడగుటయేగాక వర్తమానమున యుద్ధముచేతను, యుద్ధభయముచేతను భీభత్సరూపమునుదాల్చిన బాహ్యప్రపంచ మున కతని జీవితమును, కృషియు మరింత యమూల్యములనుట నిర్వివాదాంశము. యెత్తుపై యెత్తులు, ద్వేషము, యుద్ధముఅను దుష్టత్రయముచే బాధపడుచున్న జాతుల కత్యంత శాంతియుత మగు నతని రాజ్యతంత్రమును సత్య, అహింస, ప్రేమయను త్రివేణీతోయములును రోగనివారణకు తగిన చికిత్సనీయ గలవు. ఈ డెబ్బదియవ జన్మదినమున మహాత్మునకు నాధన్య వాదముల నర్పించుచు నతఁడింకను అనేకవత్సరము లాయు రారోగ్య భాగ్యములనుబడసి ప్రపంచముకును ముఖ్యముగ హిందూ దేశముకును సేవచేయుగాతయని యాశించుచున్నాను.

## నైతికశక్తి, నిస్సంగమునకు ప్రమాణము

### సి. యి. యం. జోడ్, యం. యె.

మానవజాతియొక్క సహజగుణమెద్ది? నైతిక సంపత్తు అని కొందరందురు. కొందరు దైవసంపత్తు అందురు. ధైర్య సాహసములని కొందరు, స్వార్థత్యాగమని కొందరు అందురు; అరిస్టాటిల్ 'బుద్ధి'యనెను. బుద్ధిచేతనే మానవుడు పశువుకంటె నధికుఁడని యతఁడనెను. అరిస్టాటిల్ చెప్పినదానిలో కొంతసత్య మున్నది. కాని యది పూర్తిసత్యము కాజాలదు; బుద్ధియొక్క-

స్ారము లక్ష్యశుద్ధిలోను, నిస్సంగములోను కలదు. జ్ఞాని నిర్భయుడు. అతడు విషయములను తనకుపకరించు దృష్టితోను, తన కోరికయే పర్యవసానమును శాసించులాగునను, తన యాశయే న్యాయరూపమును దాల్చులాగునను గాక వస్తుతత్త్వదృష్టితో పరికించుటకు భయపడడు.

కనుక బుద్ధివంతుడు నిస్సంగుడు. తన బుద్ధి పరిశోధించు విషయమునందతడు తగుల్కొనడు.

అతడు తనయెడల కూడ నిస్సంగియేనా? కాడని నా యభిప్రాయము. అసమాన బుద్ధివైశద్యముగలవారు అల్పవిషయములకు చిందులు త్రొక్కుటను నేనెరుగుదును. కాలిజోడు త్రాళ్ళు తెగినంతమాత్రమున, రైలు తప్పినంతమాత్రమున వారు గజిబిజి యగుదురు. గొప్పశాస్త్రవేత్తలు, గణితవిద్యాపారంగతులు చిత్తస్వాస్థ్యమున మిన్నలుకారు. ఇక సమబుద్ధి కలిగియుండవలసిన వేదాంతులు చిరుబురులకు ప్రసిద్ధికెక్కిరి. కనుకనే అరిస్టాటిల్ ప్రవచనము సత్యసూచనకాని సత్యమును చెప్పుటలేదని నాయభిప్రాయము. నిజమేమన బుద్ధిశాలి తాను పరిశోధించు వస్తువునందు తగులుచెందక నెంతనిస్సంగముగ పరిశోధనసాగించునో యట్లే తనను తనరాగద్వేషములను, ఆశాపాశములను నిస్సంగబుద్ధితో పరిశీలించుటలోనే మానవత్వము యొక్క విశేషలక్షణము కలదు.

ఈనిస్సంగత్వమువలననే గాంధీజీ మనకు ప్రామాణికుడ గుచున్నాడు. అతడు తనశరీరమును తనవశమునందుంచుకొనుట యతని నిస్సంగత్వమునకొక బాహ్యచిహ్నము; తన నిజాత్మ నుండి శరీరమును వేరుపరచిన నిస్సంగుడు, శరీరమును నిజాత్మ కొకపరికరముగ నుపయోగింపగల గాంధీజీ తృటికాల వ్యవధిలో తాను కోరునంతకాలము నిద్రింపగలుగుట, ఆహారమును మార్చకుండగనే బుద్ధిపూర్వకముగ శరీరభారమును తగ్గించుట లేక హెచ్చించుట చిత్రసంఘటనలు కావు.

ఈగుణమే మరియొకవిధముగ ప్రస్ఫుటమగుచున్నది. అతడొకలక్ష్యమును సాధింప దృఢనిశ్చయుడై తత్సిద్ధికనువగు నట్లు సాధనములను ప్రయోగించుచుండును. నిస్సంగుడు మూర్ఖత వహింపడు. అతడు మరియొకమార్గమును త్రొక్కవలసినపుడు తనమార్గమునే యంటిపెట్టుకొనియుండునట్టి సక్తుడు కాడు. గమ్యస్థానము నిర్దుష్టముగనున్నంతవరకతడు పరిస్థితులు, సంఘటనలు సూచించు నేమార్గమునన్నైనను దానిని సాధింప గోరును. కనుకనే చూపరులు దిగ్భ్రమనొందునట్లు గాంధీజీ ఋషి, రాజకీయవేత్త యగుచున్నాడు. శాసనోల్లంఘనము నొకరాజకీయాస్త్రముగ ప్రయోగించిన గాంధీజీ విజయవంతము కాదని తోచినపుడు దానినుపసంహరించుటకెంతమాత్రమును జంకడు. తన యాత్మపవిత్రతకొరకు ప్రాయోపవేశముచేయు గాంధీజీ దానివలన రాచకీయప్రయోజనము కలిగినపుడాలబ్ధిని

పొందుటకు తన యుపవాసమును విరమించును. చట్టమును భగ్నముచేయ శపథముబూనిన గాంధీజీ సంస్థానాధిపతులచే పంపబడు ప్రతినిధులు ప్రజలచే నెన్నుకొనబడువారగుచో నేడు చట్టముతో సహకారము చేయుటకు సంసిద్ధుడు. హిందూదేశములో బ్రిటిషువారికి యావజ్జీవశత్రువగు గాంధీజీ నేడు పరమమిత్రుడై నాడు. విప్లవోద్యమముగాని, శాసనోల్లంఘనముగాని తిరిగి తలయెత్తకుండునట్లతడొక్కడే చేయగలడు. ఇప్పుడు కోరబడుచున్న కొద్దికోరికలను బ్రిటిషువారైచ్ఛికముగ, నుదారబుద్ధితో 'కృతిమించకమునుపు' సమర్పించెదరా? లేక హిందూదేశము మరియొక విప్లవయుత ఐర్లండు కావలెనా? అను నాశ్చర్యము కలుగకమానదు.

నిస్సంగత్వముకు తిరిగివత్తము. సుళువుగ గుర్తింపగలిగినను నిర్వచించుటకు కష్టతరమగు నొకనైతికశక్తిని ప్రసాదించు పటుతర రసాయనద్రవ్యమే నిస్సంగత్వము. అది జీవకోటిలో మనుష్యులకే సాధ్యమగును.

పశుశక్తి పెద్దసమస్యలకుగాని యక్షప్రశ్నలకుగాని తావీయదు. ఒకడు నీకంటె చాలబలవంతుడు. కనుక నాలుగు మొట్టికాయలు మొట్టుటచేతనో లేక నతని కెదురు చెప్పుచో 'దంతశుద్ధి' యగునను భయముచేతనో నీవతనికి వణుకుచుందువు. నీవు చెప్పినట్లు చేయనిచో కలుగు నుపద్రవములకు జడిసి యితరులను నీ యిష్టప్రకారము నడిపించు శక్తి పశుబలములోకలదు.

కాని నైతికశక్తి బెత్తమును ఝూడించునదికాదు. నేను నైతికశక్తి నెదుర్చుచో బాధపడను. అయితే నేను దాని నెందుకు శిరసావహింతును ? దీనికి సమాధానముచెప్పుట కష్టము. నేను దాని ప్రమాణమును గుర్తించుటచే దానికెదురు తిరిగిన తప్పు నాదేయగుననియు, దానిలో దోషమేమియు నుండదనియు నాకు తెలియును. నేను ఆత్మను--కనుక నితరులలో నున్న విశిష్టాత్మను గుర్తించుటచే నాకీవిషయములు తెలియును. కనుక నైతికశక్తి యధికారమును చెలాయింపదు. కాని పలుకుబడి కలిగియుండును; అనగా నొకడుకొట్టుననుభీతిచేతను బహూకరించునను ఆశచేతను కాక నది నెదుటివానిలోనున్న నిజాధికృత నంతఃకరణచే గుర్తింపచేయును.

నైతికశక్తిచేతనే గాంధీజీ లక్షలకొలది జనులను జయిళ్లకు పంపించెను. నైతికశక్తిచేతనే పెదవి మెదల్పకుండ, నాత్మరక్షణాకైనను చేయి యెత్తకుండ నురుముచేయబడుటకు వేలకొలది జనుల నతడొప్పింపగలిగెను.

నైతికశక్తిచే ప్రేరేపింపబడిన శాసనోల్లంఘనము పాశ్చాత్యలోకమును దిగ్భ్రమ నొందించెను. ఆధునికజాతి మనగలుగుటకు మార్గమేది? తాను మిగుల్చుకొనగల సమస్తైశ్వర్యములను మానవ హననయంత్రములపై వెదజల్లు టొక్కటియే గతియా ? ఒక ప్రభుత్వమువారు మరియొక ప్రభుత్వములో నున్న ప్రజాహత్య యవసరమని తలంచినపుడెల్ల అందులోనున్న

ప్రిజలీ మారణయంత్రముల నన్నింటిని దాని కుపయోగించుట కొప్పుకొనుటొక్కటియే గతియా? తన హక్కులకొరకు మరి యొక జాతితో స్పర్థవచ్చినపుడెదిరి జాతిలో దొరికినంతమందిని మారణముచేయుటకంటె తమ న్యాయమును ప్రదర్శించుటకు వేరొక గత్యంతరములేదా? పాశ్చాత్యలోకమున నీప్రశ్నలకు తగు సమాధానము రావలసియున్నది. సాంప్రదాయ సిద్ధముగ వచ్చుచున్న సమాధానముకాక వేరొక సమాధానమును మన పురుషాంతరము కనుగొననిచో మన నాగరికత నశింపక తప్పదు.

మరియొక సమాధానమును సూచించి దానిప్రకారము కార్యరంగమున కురుకు భాగ్యము గాంధీజీకే చెల్లెను. జీసను, బుద్ధుడు న్యాయమార్గమును సూచించిరని యతడు చెప్పెను. కయ్యమున కిద్దరుండవలెను. నీవు రెండవవాడవు కాకుండ దృఢ నిశ్చయుడవైయున్నపుడు నీతో నెవరును పోరజాలరు. దౌర్జన్య విధానమును మానితివేని దానిద్వారా పొందు ఫలితమును సత్వరముగ పొందుటేకాక దాని నిస్సారతను ప్రదర్శించి దానినే యోడించినవాడవగుదువు. మానవ చింతనము ప్రారంభమైనదాది సూత్రప్రాయముగనున్న యీ విధానమునే గాంధీజీ మానవ వ్యవహారములలో ప్రయోగింపబూనెను. అతని విధానము కాలమునుమించి ముందుకు పరుగిడుచున్నదనుట తథ్యము. కనుక నతని భావములు తాతలనాటి సాంప్రదాయ

ములచే పిష్టముకట్టుకొనిపోయిన భావములుకల యనేకులకు కంటకముగ నుండకతప్పదు. స్వప్రయోజనపరులకది సహాలు; పెట్టుబడిదారులను, అధికారులను అదికలవరపెట్టును. మనుష్యుల భావముల నది తబ్బిబ్బుచేయును. వారి నీతులకది గొడ్డలిపెట్టు. కనుకనే నవ్యభావవీథులను త్రొక్కినవారందరివలెనే యితడును దైవదూరుడని, వంచకుడని, యుపద్రవకరుడని నిందింపబడెను. కళాప్రపంచమున సాంప్రదాయ విరుద్ధముగ నడచిన నది యొక 'వెర్రిమొర్రి' యని యూరకుందురు. కాని రాచకీయములలోను, నైతికవిషయములలోను సాంప్రదాయవిరుద్ధము నాందోళనతో గూడిన దుర్మార్గమని తూలనాడుదురు. దానిని సహాసముతో గ్రహించిన సాంఘికపునాదులే మొదలంట కదలిపోవును. వర్తమాననీతి కొకయడుగుముందుకు పోవుటకు (మామూలుగ సాంప్రదాయ విరుద్ధమనిన నిదియే యర్థము) స్వార్థపరులతో వివాదతప్పదు. కళాప్రవీణుడగువానిని తిండిలేక తనగదిలోనే మాడనిచ్చుచు శీలములో నిధియగు వానినిమాత్రము చట్టమను నాయుధముతో హింసించి చంపుదురు. చట్టప్రకారము జరిగిన చరిత్రాత్మక విచారణల నవలోకింపుడు! సోక్రటీసు, బ్రూనో సెర్వెటస్ మొదలగు వారప్పటి యధికారులకు రుచించని యభిప్రాయములు కలవారను నేరము మోపబడి శిక్షింపబడిరి. ప్రపంచమిపుడు ఆయభిప్రాయముల కే వారినారాధించుచున్నది. "భావిని వర్తమానములోనే చూడగలిగి మున్ముందు పుష్పించి

ఫలించు భావబీజములు గలవారే" పెన్నిధులని షెల్లీకవి నిర్వ చించెను. నిధియనగా జీవితముయొక్క సహజ ప్రయోజనము నెఱుకతో వ్యక్తపరచుటకు మానసిక, ఆధ్యాత్మిక క్షేత్రమున పరిణామముపొందిన "మొలక" యని జీవశాస్త్రభాషలో చెప్పవలెను. కనుక నతడు జీవితములో నొక నూతన యావి ర్భావమునుచూపి, వర్తమానభావముల 'గుడికట్టును' నాశము చేయుచు నూతనభావములను, నీతులను స్థాపించును. అతడు ప్రకటించిన విధ్వంసక సందేశమును సంఘమంతయు మొత్త ముగ నచిరకాలములోనే స్వీకరించును. ఈనాటి సాంప్రదాయ విరుద్ధములు రేపు తత్వప్రాయములగుట చరిత్ర మనకు బోధిం చుటలేదా ?

ఈ దృష్టిలో గాంధీజీ నీతి నిపుణుడని చెప్పకతప్పదు. స్పర్థలుతీరుట కతడొకవిధానమును ప్రకటించెను. అది దౌర్జన్య విధానమును రద్దుచేయవచ్చును. అంతేకాదు ! మానవుల విధ్వంసకశక్తి మెక్కువయైనకొలది నాగరికత నిలబడవలెనన్న అదియొక్కటియే శరణ్యము కావచ్చును. అతని విధానము ప్రస్తుతము విఫలమయ్యెను. తాను నిర్వహింపగలదానికంటె నెక్కువ చేసెదనని యతడు వాగ్దానముచేసెను. కాని మాన వులు తాము చేయగలదానికంటె నెక్కువ చేతుమని యెన్న డును వాగ్దానము చేయనిచో ప్రపంచమే దుర్భిక్షమగును. ఏలనన సాధింపబడిన సంస్కారము సాధింపబడని యాదర్శము

యొక్క మొలక. గాంధీజీ యనన్య విశ్వాసము కలవాడు. కనుకనే యతడు విశ్వసింపబడుచున్నాడు. అతనికెట్టి దౌర్జన్య బలము లేకపోయినను ప్రపంచములో మరేవ్యక్తికిని లేని ప్రమాణబల మతనికి గలదు.

## మహాత్మా గాంధీ—ఆత్మశక్తి

**రూఫస్, యం. జోన్సు. డి. లిట్.**

మహాత్మాగాంధీని, యతని శిష్యవర్గమును నావలెనే సబర్మతీ యాశ్రమమున దర్శించినవాడెవడైనను అతని డెబ్బదియవజన్మదినప్రచురణలో పాల్గొనుటకానందపడకమానడు. నానిత్యజీవితవిధానము, జీవిత వేదాంతము అతని వరవడియే! నా యదృష్టవశమున నాజీవితకాలమున జీవించు యీయద్భుత వ్యక్తికి నాఋణము నీవిధముగ చాటించుకొనుటకు ముద మొందుచున్నాను. 1905 లో ఫ్రాన్సిసు జీవితమును చదివినదాది నాకతడారాధ్యుడయ్యెను. నేనెరిగినవారందరికంటె గాంధీజీ ఫ్రాన్సిసు నెక్కువగ పోలియుండెను. 1926 లో నేను గాంధీజీని దర్శించినపుడతడు "బడుగు" ఫ్రాన్సిసు నెరుగకపోవుట నాకాశ్చర్యమును కలిగించెను. నేనతనిమ్రోల కూర్చొని "ఫ్రాన్సిసుఋషిప్రోక్తములైన చిన్నిపుష్పముల" నుండి యనేక కథలను చదివి వినిపించితిని. అన్నిటికంటె హృద్యమైన "పరమానందము" అను గాథను, గైల్సు సోదరుడు ఫ్రెంచి రాజైన

బూాయిూని కలుసుకొనిన యుదంతమును వినిపించితిని. వారొకరి నొకరు కలుసుకొని, కౌగలించుకొని ముద్దుపెట్టుకొని మౌన ముద్రతో చాలకాలము మోకరించి పరస్పరసంభాషణ లేకుండగనే వెడలిపోయిరి. "మేము ముఖస్తముగ మాట్లాడుకొనుటకంటె నెక్కువగ మాహృదయముల నర్థముచేసికొంటిమి" అని గ్రైల్సు చెప్పెను. నేలపై కూర్చొనిన యీయాధునికఋషి. సమీపమున నాసీనుడనైన నాకును గ్రైల్సుకు కలిగినట్టి యనుభవమే కలిగెను.

గాంధీజీతత్త్వమువంటి తత్త్వమేకలిగిన జాన్ వూల్మనునుకూడ నతడెరుగడని నేను తెలిసికొంటిని. వూల్మను 18వ శతాబ్దపు క్వేకరుమతస్థులలో ఋషి; అసదృశ"యాత్మశక్తి"ని ప్రదర్శించినవాడు. నస్క్వెహానాలోని 'రక్తవర్ణభారతీయులు' యుద్ధసన్నాహములలోనుండిరనియు పశ్చిమముననున్న వలస నివాసుల చర్మముల నొలుచుచున్నారనియు వూల్మను వినెను. "వారిజీవితమును తత్వమును గ్రహించి దానిని హృద్గతముచేసికొనవచ్చును. వారివలన కొంత నేర్చుకొనవచ్చును. లేదా వారిమధ్య సత్యవిధానమునవలంబించుటచే నేను వారికి కొంత తోడ్పడినవాడను కావచ్చును." అని యతడీభారతీయులను దర్శింపవలెనను పవిత్రప్రేమతో బయలుదేరెను.

భారతీయులు యుద్ధరంగులను, యీ కెలనుధరించి సమర సన్నాహముచేయుచుండ నతడు చూచి వారినందరను సమావేశపరచెను. వారు గంభీరమైన యాంతరంగిక స్థైర్యమును వహించిరి. అతడతి సుహృద్భావముతో వారిని సమావేశపరచిన విషయమునుగురించి వెల్లడించి చివర నొక ప్రార్థనచేసెను. సభ ముగిసినతరువాత నొక భారతీయుడు "ఆపలుకుల మూలకందము ననుభవింపగోరెదను" అనెను. గాంధీజీ విధానమిట్టిదే! అతని పలుకులకంటెను, వ్రాతలకంటెను నెక్కువగంభీరముగ నతడు మనహృదయములను చూఱగొనును. ఏలనన "ప్రజలామాటల మూలప్రాదమును గ్రహింతురు." మనమతని 'సత్యాగ్రహమును', జీవితసూత్రమును "దౌర్జన్యరాహిత్యము" అని తరచు వాడుచుందుము. ఆపదము 'నేతి' (కాదు) వాక్యము. కాని యతని ప్రాణసూత్రమతివీర్యవంతమైనది. క్వేకరుమతస్థుడైన మైకేలు కోట్సు అనువానికి తానెంతయో ఋణపడియున్నట్లతడు నాతో చెప్పెను. దక్షిణాఫ్రికాలో గాంధీజీకతడత్యంత స్నేహితుడు. జీససుయొక్క సందేశము నతడు గాంధీజీ కెరిగించెను. జీససుతత్వము, జీవితవిధానము, పీరపురుషోచిత ప్రేమ గాధలు గాంధీజీ గ్రహించెను. దీనివలన నతని యంతరంగ దృష్టియు, స్థూలదృష్టికగోచరమగు శక్తులయందు విశ్వాసమును గాఢమయ్యెను. అతని జీవితమునకును, భావములకును కారకు

లనేకులు కలరు. వారిలో టాల్‌స్టాయి, రస్కిన్, థోరో, కార్పెంటరు మొదలగువారతిముఖ్యులు.

సత్యాగ్రహము డైనమోనుండి బయల్వెడలి యద్భుత ఫలితములనొసంగు విద్యుచ్ఛక్తికంటె తక్కువదికాదని యతని యభిప్రాయము. ఆ శక్తిని డైనమో 'సృజించుట' లేదు. దాని నది తనగుండ "ప్రవహింపనిచ్చుచున్నది." "ఆత్మశక్తిని" ప్రదర్శించు వ్యక్తికూడ నిట్టివాడే! అతడు తన యల్ప, సంకుచిత, స్థూలశరీరశక్తికంటె గంభీరమైన జీవితమున కాకరమగుచున్నాడు. జీవితగాంభీర్యమును చూఁడగాను మానవాత్మ అనంత చిచ్ఛక్తికిని, సత్య, జ్ఞాన, ప్రేమలకును ఆకరమై, యుక్తపరిస్థితులలో నతనినుండి యుద్గమించుచుండును. "మానవుని యనంతవ్యక్తిత్వమును" గురించియు, సదా యతనిలోనే యుండు పరాత్పరునిగురించియు నుపనిషత్తులు చెప్పుచున్నవి.

ఈగంభీరజీవితశక్తుల నుపయోగింప నెరిగినవ్యక్తి శమదమాది సంపన్నుడగుటయేగాక, శౌర్యప్రతాపములతోఁగూడిన ప్రేమ, సాహసము, సృజనపాటవకలాపముల కాకరముకూడ నగును. గాంధీజీ "ఆత్మశక్తి" కిదియే యర్థము. దాని కతని జీవితమే యసదృశ సాదృశ్యము.

"వజ్రకాఠిన్యమైన యీప్రపంచ గజిబిజిలను, మీవిఫల ప్రయత్నములను గుర్తెరింగినమీదకూడ "నాత్మశక్తి" యందు మీకు విశ్వాస మున్నదా?" అని యతనిని ప్రశ్నించితిని.

"సంపూర్ణవిశ్వాసము కలదు. సత్య, ప్రేమల యనంత విజయ శక్తియందు నాహృదంతరాళమున విశ్వాసము హత్తుకొనిపో యెను. ఈవిశ్వములోని యేశక్తియు నా యీవిశ్వాసమును చలింపచేయజాలదు" అని యతడు చెప్పెను.

ఇట్టి వీరప్రేమను దౌర్జన్యముకంటె వేయిమడుంగు లుత్కృష్టమైన జీవితవిధానమును ప్రకటించిన వ్యక్తుల చరిత్రను తెలుపగోరెదను. వీరిపేర్లు గాంధీజీకి తెలియవు. కాని వారును యితనిమార్గమున పురోగాములైరి. జేమ్సునైలరు 17 వ శతాబ్దమున నొక క్వేకరు మతస్థుడు. "దైవద్రోహి" యని యతనికి యమదండన విధింపబడెను; యెఱ్ఱగ కాలిన యినుపకడ్డీతో నతని నాలుకకు చిల్లుపొడిచిరి; కొన్నిగంటల సేపు బొండవేసినతరువాత లండనునగరవీధులలో త్రిప్పుచు కమిచీకఱ్ఱతో నతనిని చావమోదిరి. "బి" అను నక్షరము పడునట్లతని నుదుటి చర్మము నొలిచిరి. తోకవైపు ముఖముగ గుఱ్ఱముమీద కూర్చుండబెట్టి యతనిని బ్రిస్టలునగరముగుండ త్రిప్పి విఫణివీధిలో నిలబెట్టి కొరడాలతో బాది పార్లమెంటరీ చట్టముచే విడువబడువరకతనికి కలము, కాగితము యివ్వకుండ బైడ్వెలు జయిలులో నొంటరికొట్టులో ఖయిదుచేసిరి.

ఈవిధముగ హింసించి, పలుబాములుపెట్టి మానవనిర్దయకు పాల్పడచేసిన పాడుప్రపంచమునకత డీసందేశము నొసగెను. "ఎట్టి కీడుగాని, ప్రత్యపకృతిగాని చేయనొల్లనిది, దుర్మా

ర్గమును దుర్మార్గముతో నెదుర్కొనక మందహాసముతో సను భవించునదియగు నాత్మ యొకటి కలదని నేనెరుంగుదును; అది క్రోధమును, స్పర్థను జయించి తన తత్వముకు వ్యతిరేకమైన క్రూరత్వమును, హింసారతిని నిర్వీర్య మొనర్పగోరును; అది మోహజాలముల యంతును కనుగొనును. అది చెట్టయెరుగదు. కనుక నితరులకు చెట్టతలంపదు. భగవంతుని క్షమ, కరుణాదులే దానికి మూలములు. కనుక నదియెట్టిద్రోహమునైనను భరింప గలదు. సాధుత్వమే దాని శిరోభూషణము. కల్ల కపటమెరు గని నిరంతర నిర్మలప్రేమయే దాని జీవితము. స్పర్థచే కాక ప్రేమచేతనే యది తనరాజ్యము నేర్పరచుకొని సాత్త్వికబుద్ధిచే తనే దానిని నిలుపుకొనును. ఎవరు దానిని గుర్తింపకపోయినను అది యొక్క భగవంతునియందే రమించుచుండును. దుఃఖము లోనే యది పుట్టి యోదార్చువారు లేకుండగనే వృద్ధిచెందును. తాప, క్లేశముల కది గొణగదు, సణగదు. క్లేశములలోనేతప్ప దాని కానందము లేదు. ప్రాపంచికానందమున మునుగుట దానికి మృత్యువు. అమిత్రుడను, ఏకాకినినైయై నేను దానిని కనుగొంటిని. మృత్యువుద్వారా యిట్టి పునర్జన్మను, శాశ్వత పవిత్రజీవితమును గడించిన గుహాగహనవాసులు నాకిందు సహ చరులు." "ఆత్మశక్తి" కిదియొక మంచి యుదాహరణము.

విలియంలా పదునెనిమిదవ శతాబ్దములో నొకవిఖ్యాత ఆంగ్ల ఋషి. ఇతడు నైలరు పడినన్నికష్టముల నెరుగడు. కాని

యనేక బాధల ననుభవించి యీయాత్మశక్తియొక్క సందేశ మునే మరపురాని మాటలతో నిట్లు పాదిగెను.

"ప్రేమ బహుమానములను, గౌరవ కీర్తులను కోరదు; తనను తాను ప్రసరింపచేసికొనుటయే దాని యాశయము. అది దాని నభిలషించువారికి సంతోషానందముల నొనగూర్చును. కనుక నంధకారమును పోద్రోలు వెలుతురువలెనే యది ఆనంద మును చేకూర్చు నేకైకనిష్ఠతో క్రోధ, ద్వేష, మత్సరాదు లను తారసించును. క్రోధ ద్వేషములబారినుండి తప్పించుకొనవలెనని కాని యొకరి మెప్పు పొందవలెననికాని నీవాశించితి వేని నీకది సిద్ధింపకపోవచ్చును. కాని కళ్యాణేచ్ఛ తప్ప నీకు మరియొక తలంపులేనిచో సమస్తము నీకు బాసటకాకతప్పదు. శత్రువుయొక్క కోపము, మిత్రముయొక్క ద్రోహము, చెడుగులకెల్ల చెడుగు ప్రేమతత్వముకు మరింతబలము జలమునిచ్చును. కనుక నీవానందమనుము లేదా పూర్ణత్వమనుము—సమస్తము ప్రేమతత్వములోనే యిమిడియున్నది; ఇంకొకమార్గము లేదు. ఏలనన నఖండపరిపూర్ణ సచ్చిదానందబ్రహ్మము కేవల ప్రేమ మూర్తియే! అచంచలమైన కళ్యాణైకనిష్ఠుడే! కాన జగత్కళ్యాణైకచింతతప్ప యన్యచింతకలవ్యక్తులందరును నీతిదూరులు దుఃఖజీవులు కాకతప్పదు. కావున ప్రేమతత్త్వముయొక్క క్షేత్రము, ప్రకృతి, పూర్ణత్వము మనకీవిధముగ ద్యోతకమగు చున్నది."

# గాంధీజీ బ్రిటిషు కామన్వెల్తు కేమి సాధించెను?

ఎ. బెరిడేల్ కీత్ యం. ఏ. డి. లిట్

ఆదర్శ పద్ధతులను క్రియారూపమున పెట్టకపోవుట చేత నీప్రపంచమున కల్పింపబడు నసంఖ్యాకములగు కష్టములను సరకుగొనక బుద్ధిపూర్వకముగ నొక యాదర్శము ననుసరించిన గాంధీజీ జీవితముకు జోహారుచేయు వారిలో నేనొకడను. ఈ కామన్వెల్తు చరిత్రలో దక్షిణాఫ్రికాలో నతడు మానవవ్యక్తిత్వమును గుర్తించుటకు చేసినసేవ ప్రధానమైనది. ఆఫ్రికాలో తెల్లజాతులుకాని వారిపైన ననేక నిషేధములు కల్పింపబడి కృత్రిమ విభేదము లేర్పరుపబడెను. మానవులంద రును ఒకజాతివారు; వర్ణ జాతి విభేదములు కృత్రిమములు, నీతి బాహ్యములు, అక్రమములు అను ప్రధానసూత్రము కొరకతడు పోరాడెను. అతడెదుర్కొనవలసిన యసమానశక్తుల బలమును గుర్తించితిమేని యతడుపొందిన విజయమతని విజయములలోనన్నిటికెల్ల గొప్పదని యొప్పుకొనకతప్పదు. అతడు తన ప్రజలస్థితి నెన్నియోరెట్లు చక్కపరచి దక్షిణాఫ్రికను యూనియనులో వారిసమస్యకొక నూతనవికాసమును కలిగించెను. అతడాదేశ మును వీడినతరువాత సంకుచిత జాతితత్వము తిరిగి తలయెత్తుట శోచనీయమైన విషయము. కాని మహాత్ముడు తన దివ్యశక్తిచే

నాత్మగౌరవమును రగుల్కొల్పిన తరువాత నచ్చటి భారత సంఘముయొక్క సంత్రాణశక్తి యనేకరెట్లు వృద్ధిపొందెను. ఏవ్యక్తిని, యేసంఘమును యితరులెవరును తమ స్వార్థము కొరకుపకరించు పరికరముగ కొల్లగొనుట యసంభవము అని యతడురూఢిపరచెను. ఈయాదర్శము తాత్కాలికముగమృగ్యమైనను నిది పూర్తిగ మాయమగునను కొనరాదు. కెనియా, జాంజిబారులలోకూడ నచ్చటనున్న యాంగ్లేయులు భారతీయుల హక్కులను గుర్తింపకుండ నింగ్లండులో తమకున్న పలుకుబడిని వినియోగించుకొనజూచిన ప్రయత్నములు అతని యుపదేశములవలన కొంతవరకు సన్నగిలెను. అతడొక్క భారతీయుల శ్రేయస్సుకొరకే ప్రయత్నింపలేదు; అతడుపదేశించిన సిద్ధాంతములు ఆఫ్రికనుల భవిష్యత్తుకుకూడ పనికివచ్చును. ఆఫ్రికాలోని యాదిమనివాసులు అల్పులు; వారు సేవకావృత్తికే యర్హులు; భారతీయులకు చరిత్రప్రసిద్ధమైన విజ్ఞానము కలదు. కనుక యూరపియనులతో సమాన ప్రతిపత్తి ననుభవించుటకు తమకొక్కరికేహక్కు కలదనుసిద్ధాంతము నతడెన్నడును ప్రోత్సహింపలేదు. మానవులందరును సమానులేయని యూరపియనుల కతడెట్లు బోధించెనో యట్లే భారతీయులకునుచెప్పెను. భారత మతగ్రంథములు మానవులలో హెచ్చుతగ్గుల నామోదించునట్లు (ప్రతిదేశములోని ప్రాచీన సిద్ధాంతములును నిట్లే కలవు) కాన్పించును. కనుక నతనిసింతము తోడి భారతీయుద్ధా

లకు కంటక ప్రాయముగనున్నను భారతీయుల స్వపరిపాలనకు కల్పింపబడిన యడ్డంకులనన్నింటిని నివారించెను. అస్పృశ్యుల కొరకు మహాత్ముడు పట్టినపట్టు, తద్వారా హిందూమతము లోని నిగ్గు బయటపడుటయు నతని చరిత్రలో నెన్నటికిని మరువ రానివి. ప్రభుత్వముపై దౌర్జన్యరాహిత్య సిద్ధాంతము నమలు పరచుట కొంత వివాదగ్రస్తమైన విషయము. అది సామాన్య మానవ ప్రకృతికందనితత్త్వము; మానవుడు స్వతస్సిద్ధముగ పోరుసల్పుచుండును. దౌర్జన్యరాహిత్యమును సమర్థించినవారు తఱచు పశుసంస్కారముకు లొంగిపోవుచుండిరి. అయినను బ్రిటిషు ప్రభుత్వము కేవల హేతువాదము నంగీకరింపక ప్రతిఘటనకే లొంగుచుండును. మహాత్ముడు దౌర్జన్యమున కవకాశమిచ్చు శాస్త్రమును అవలంబించెనని యనవచ్చును. కాని తన దేశమున కత్యవసరములని యతడు భావించిన లక్ష్య ములను సాధించుటకింతకుమించిన తఱణోపాయమతనికి ద్యోత కము కాలేదని చెప్పకతప్పదు. భారతరాష్ట్రములలో బాధ్యతా యుత ప్రభుత్వములను స్థాపించి సక్రమముగ నడిపించుటలో నితరుల కెంతస్థానమున్నను మహాత్మునిస్థాన మద్వితీయము. శైశవమునుండియు ప్రతివిద్యార్థిచే కంఠస్థముచేయబడు భావ గర్భితములగు ననేక శ్లోకములు సంస్కృతభాషలో కలవు. గాంధీజీ హృదయఫలకమున నీక్రింది శ్లోకము బాల్యమునుండియు హత్తుకొని యుండవలెను.

అయం నిజః పరో వేతిగణనాలఘు చేతసాం
ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబకం॥

"అల్పబుద్ధివానికి నాది యితరులది అనుభేద భావముండును. ఉదారబుద్ధికలవారికీ ప్రపంచమంతయు తమ కుటుంబమే."

# ప్రపంచ చరిత్రలో మహాత్ముని స్థానము

## కౌంటు హర్మను కిసర్లింగు-జర్మనీ.

మానవచరిత్రలో నేకాలమును నెరుగని శక్తులతో కూడిన యుగమున మనము నివసించుచున్నాము. దేశ కాలములు జయింపబడుటచే నేకాంతమనుభావము నశించినది. పరిజలు లేక నధికసంఖ్యాకవర్గమువారు (ప్రపంచయుద్ధమువరకు ప్రతిదేశములోను సిద్ధాంతముల పేరు లేవియైనను, అల్పసంఖ్యాకులే యన్ని దేశములను పాలించిరి.) రాజకీయ సాంఘికాధికారములందుద్బోధితులైరి. కనుక సంఖ్యాబలము గొప్ప శక్తియయ్యెను. జీవితము పరస్పర సంఘర్షణలతో కూడిన శక్తుల మధ్య కలుగు నస్థిర సామరస్యమే! రెండు వ్యతిరేకశక్తుల సమీకరణమువలన విద్యుచ్ఛక్తి యుత్పన్నమగుచున్నది. ఒక శక్తి తనకు వ్యతిరేకమైన మరియొకశక్తిని తానే కలుగచేయుచున్నది. కనుక పైనుదహరించిన మార్పువలన మానసిక, యాధ్యాత్మికరంగమున కని విని యెరుగనిశక్తులు పనిచేయుచున్నవి. ఉద్యమములకును వాని వెనుకనున్న భావములకును

సంబంధము తక్కువ; అవి యెప్పుడును తీర్థము వేరు ప్రసాదము వేరువలెనుండును. మొదటి కారణ మేమన వానిని సూచించు నామముల వెనుక ననేక యితరాంశములుండును. రెండవది "నామరూపముల" వెనుకనున్న నిజశక్తికిని నామరూపములకును సంబంధ మతిస్వల్పమని చరిత్ర చాటుచున్నది. ఒకలక్ష్యముతో ప్రారంభింపబడిన యుద్యమము కాలము గతించినకొలది మరియొకవిధముగ పరిణమించుటను మనము చూచుచునే యున్నారము. కనుకనే ప్రపంచ ఉద్యమముల కిప్పుడీయబడుచున్న పేరులలో నాకెట్టి నమ్మకమును లేదు; ప్రజాస్వామికముకొరకును, సామ్యవాదముకొరకును, స్వాతంత్ర్యముకొరకు నాస్తికతకొరకును పోరాడుచున్నట్లు నటించు జాతులు నిజము చెప్పుచున్నట్లు నేనెంతమాత్రమును విశ్వసింపను. యదార్థమున కవియన్నియు తామింకను గ్రహింపని గమ్యముకొర కంధకారమునబడి కొట్టుమిట్టులాడుచున్నవి. ఈరోజులలో నేకారణములకొరకు ప్రజలు పోరాడుచున్నారో అందొక్కటికైనను తుది జయము చేకూరునని నేను భావింపను. మానవప్రపంచము బలీయమైన శక్తికేంద్రములుగ విభజింపబడుటచే చిట్టచివరకు మిగులు శక్తుల సమరససమన్వయము (ఇది యిప్పటిలో చేకూరని దూరస్థవిషయము) తుదకు కొంత స్థిరముగనుండు సమన్వయమును ప్రసాదించును.

కాని వర్తమానశక్తులలో నేది చిరకాలముండగలదో జోస్యము చెప్పుట సులభము కాదు. ఏశక్తి యింతవరకు తల యెత్తకపోయినను తనవంతు వచ్చుసరికి ప్రపంచశక్తి కాగలదో యెవరి కెఱుక? కాని వివేకముతో నర్థము చేసికొనగలిగినచో రెండుసూత్రములనుబట్టి సరియగు జోస్యమును చెప్పవచ్చును. ప్రాచీన చీనా మొదటిసూత్రమును స్థాపించెను. దానిప్రకారము ప్రతి చారిత్రకసంభవము యిరువదియైదువత్సరముల పూర్వము ప్రారంభమగును. నేటి శిశువులే యిరువదియైదు వత్సరములలో ప్రపంచమును పాలింతురని దీని భావము. కనుక నిప్పటి శిశువులలోనున్న యదార్థతత్త్వమును సరిగా గ్రహింపగలిగినచో భవిష్యత్తును గ్రహింపవచ్చును; రెండవసూత్రము శక్తికిసంబంధించిన చట్టము. ప్రతిశక్తియు తనకు వ్యతిరేకమగు శక్తిని తానే సృష్టించుకొనును. ఒక యుద్యమ మొకపక్షమునే బలపరచినకొలది దాని వ్యతిరేకోద్యమము కూడ బలవత్తరమగును. ఈదృక్పథమునుండి చూచినచో మహాత్ముని యుద్యమము లోని చారిత్రిక ప్రాముఖ్యతను సరిగా గుర్తింపగలుగుదుము. మన యుగము వెనుకటి యుగములు యెరుగని దార్జన్యమును స్వీకరించెను. తెల్లవారు నివసించు అన్ని దేశములలో నధిక సంఖ్యాకులందరు దార్జన్యము నేదోరూపమున ఆమోదించిరి. రంగుజాతులుకూడ చాలవరకు దీని నామోదించినవి. కనుక దార్జన్యము పూర్తిగ నలసిపోవువరకును దీనిలో మార్పు కలుగ

జాలదనియే నాయభిప్రాయము. ప్రపంచములో నెచ్చటనో యొకచోట శతాబ్దములవరకును దౌర్జన్యము జరుగుచునే యుండును. కాని యీకారణముచేతనే దౌర్జన్యరహిత యుద్యమముకు గూడ మున్నెన్నడును లేని చారిత్రక ప్రాముఖ్యత వచ్చును; వచ్చినది. దౌర్జన్యరాహిత్యములోనున్న ఆదర్శముకును దాని వ్యతిరేకశక్తిలోనున్న యాదర్శముకును మధ్యనున్న పోరులో మరియొక ప్రశ్న యిమిడియుండును. సాధనములకు ప్రాధాన్యత నీయవలెనా లేక లక్ష్యముకు ప్రాధాన్యత నీయవలెనా యను సమస్య ప్రభవించును. గాంధీజీ యుద్యమము కెట్టి ఫలితము చేకూరుగాక! ఈనూతనసమస్యయే గాంధీజీ కమరత్వమును ప్రసాదించునని నాయభిప్రాయము. "లక్ష్యమే సాధనములకు పవిత్రతనిచ్చును" అను నీతి ప్రబలముగా నున్నంత వరకు ప్రపంచపరిస్థితులలో శాశ్వతమైన యదార్థ కళ్యాణమేర్పడజాలదు. ఒకనాశనశక్తి ప్రయోగింపబడినపుడు వెంటనే మారుశక్తి ప్రయోగింపబడుచు దీనికొక హద్దులేక యుండును. "ద్వేషముకు ద్వేషమే ప్రయోగమైనచో ద్వేష మెప్పుడు అంతరించును? ఎచ్చట నంతరించును?" అని బుద్ధుడు ప్రశ్నింపలేదా?

ఆధునిక దౌర్జన్య విజృంభణకు చికిత్స నొక్క-గాంధీజీయే కాక నితరులును ప్రారంభించిరి. పౌరుషజాతులు మేల్కొ-నెను. శాంతియుతమగు చీనాదేశము ఆత్మసంరక్షణకొరకు ప్రతిదౌర్జ

న్యముతో తలపడినది. అట్లే పౌరుషవంతమైన జాతులుకలభారత దేశములో కూడ ననేకమార్పులు రావచ్చును. కాని యీవిరుగుడును ప్రయోగించువారిలో గాంధీజీ బాహాబాహీగపై కివచ్చి శక్తిని ప్రదర్శించుచున్నాడు. అతడు తదేకమనస్సుతో, పవిత్ర హృదయముతో పై విరుగుడునుప్రయోగించుచున్నాడు. ఇంతవరకునతడొక్కడే బ్రహ్మాండమైన ప్రజాయుద్యమమును లేవదీసెను.

కారణమేమన యహింస హైంద వాదర్శములకు పట్టుకొమ్మ ; పరమధర్మము. మరియొక కారణమువలన మహాత్ముడు గొప్ప చారిత్రక పురుషుడు కాగలడని నాదృఢవిశ్వాసము. అతడు పరస్పర విరుద్ధములగు రెండు యుగములమధ్య నిలిచినాడు. ఒకవంక నతడు భారతసాంప్రదాయాను గుణ్యమైన ఋషిసత్తముడై యవతరించెను. మరియొక వంక నతడా తేరిన ఆధునిక ప్రజానాయకుడు. ఈసందర్భములో నతడు జాన్ బాప్టిస్టును పోలియున్నాడు. నేను వర్ణించిన రాబోవు మానవపరిణామమునకు కేవలఋషిసాంప్రదాయముచాలదు. దానికొకనూతనసమన్వయ మవసరము; ఐహికాముష్మిక సమన్వయముకావలెను. త్యాగభోగములు సమముగ నుండవలెను. నూతనమానవుడు సమగ్రమైన మానవుడుకావలెను. వానిలో నాధ్యాత్మిక ఆధిభౌతికశక్తులు సమన్వయము నొందవలెను. కాని యీయుగసంధిలో నవతరించిన గాంధీజీయొక్కడే యీనూతన సాదృశ్యమును తయారుచేయగలడు.

# జన్మదినాభివందనము.

**జార్జిల్యాన్సుబరీ (పార్లమెంటు సభ్యుడు.)**

మహాత్మాగాంధీ యింకను అనేకజన్మదినము లమందానందముతో ననుభవించునుగాక! యని ప్రపంచములోని ప్రతికోస్తానుండియు 1939 అక్టోబరులో హర్షధ్వానములనుచేయు లక్షోపలక్షలభక్తులతోఁ చేరుట నాయదృష్టము.

అతఁడొక మహదాశయము కొరకుత్కృష్టసేవతోఁకూడిన గొప్పజీవితమును గడిపెను. చెడ్డ, దుర్మార్గము యేరూపము దాల్చినను తనజీవితము ద్వారముననను, భారతదేశమందును తదితరప్రాంతములందును తన్నారాధించు లక్షలకొలది ప్రజలజీవితముల ద్వారముననను దాని నెదుర్చుసాత్త్విక నిరోధశక్తియొక్క మహత్తు నతడు ప్రదర్శించెను. న్యాయము కొరకతనివలె హృదయపూర్వకముగ నిరంతరపోరాటమును సలిపినవాడతని కాలమున మరియొకడు లేడు. ప్రేమ, సహకారము, సేవా మార్గములద్వారా విశ్వశాంతిని ప్రసాదించుమార్గమున భారతదేశ స్త్రీ పురుషులనేగాక యావత్ప్రపంచవాసులను నడుపుటకతని. కింకను అనేకవత్సరములు ప్రసాదింపబడును గాక!

# గాంధీజీ విశ్వాసము, పలుకుబడి.

## జాన్ మాక్ముర్రే యం. ఏ.

గతశతాబ్దములలో నొక యాంగ్లకవి "తూర్పు తూర్పే, పడమర పడమరయే. తూర్పుపడమరలకు కలయిక యెప్పటికి నుండజాలదు" అని వ్రాసెను. పై ద్విపద వ్రాయబడిన కాలము లో నీయభిప్రాయము చర్చనీయముగనే యుండెను. నేడీయభి ప్రాయము పరిహాస పాత్రమగుచున్నది. ఇట్లు మానవలోకమేక మగుటకు గమనసౌకర్యము లెక్కువయగుటయే చాలవరకు కారణము. దీనిఫలితముగ ప్రపంచములోనన్ని ప్రాంతముల వ్యక్తులును సులభముగ నెఱుకపడుచు నంతర్జాతీయకీర్తిని బడ యుచున్నారు. కాని యిట్లు 'చురచురవెలుగువారు' కాల పరీక్షలో నెంతవరకు నిలిచెదరో చూడవలసియున్నది. ఇది యేకొద్దిమందికో చెల్లును. ఒకమహాత్మాగాంధీ విషయమైనా కెట్టి సంశయములును లేవు. మానవాధిక్యత కనేక ప్రమాణములు కలవు. కాని ఆయాధిక్యతలో గంభీరతయున్నచో నది శాశ్వత మగును. చారిత్రక ప్రసిద్ధిగాంచినవారు తమవ్యక్తిత్వములోని గంభీరతచేతనే ప్రపంచపురుషులైరి. అట్టివారిలోనున్న యొక విశేషమేమన వారు పరస్పరవిరుద్ధములగు వివిధవ్యాఖ్యానముల కాకరమగుచున్నారు. సోక్రిటీసుమహాశయుని గొప్పతనమతని

యనంతర మొక్క పురుషాంతరములో నతని శిష్యులమని చెప్పు కొనువారిలోనే పరస్పర విరుద్ధములగు వివిధ వేదాంతమతములు బయలుదేరుటలోనే ద్యోతకమగుచున్నది. వీరు మామూలు భాషలో గ్రంథకర్తలుకారు; కార్యశూరులునుకారు. ఇతరుల ద్వారా వీరీ రెండురంగములలోను వర్తించుచుందురు. వారి వ్యక్తిత్వమితరులపై ముద్రింపబడుటయే వారిక్రియాశక్తి. వారీ ప్రపంచమున తమ స్వస్వరూపమున జీవించుటచేతనే దానిని మార్చివేయ గలుగుదురు. మార్పుచెందిన ప్రపంచము తిరిగి యథాస్థితికిపోజాలదు. గాంధీజీ యీజాతిలోనివాడు. అతని వ్యక్తిత్వములోనున్న పవిత్రతయే యతని పలుకుబడికి కారణము. అది యితరుల దృక్పథమునుమార్చివేసి వారి మానవ శక్తులనుచ్ఛస్థితికి గొంపోవును. అతనిని యోగి, రాజకీయవేత్త, శాంతిదూత, ప్రజాస్వామికవాది, సాంఘిక విప్లవకారుడు, శుద్ధ శ్రోత్రియుడు అని వ్యాఖ్యానముచేయవచ్చును. అతని జీవితము నుండి యీయన్ని యభిప్రాయములకును రుజువులను చూపవచ్చును. కాని యతని పలుకుబడిలోని మర్మము నివియేవియు స్పృశింపజాలవు. అతని పలుకుబడిలోని మర్మమిట్టి విభజనల కందనంతటి గంభీరమైనదని గ్రహింపవలెను.

గాంధీజీయెడల నాకుగల గౌరవము, పూజ్యభావము అతని యభిప్రాయములను, సిద్ధాంతమును నేనంగీకరించుటపై నాధారపడలేదు. అట్టి పురుషునిపట్ల సిద్ధాంతములనుగాని,

ఆచరణలనుగాని యంగీకరించుట, యంగీకరింపకపోవుట యను విషయముప్రధానము. అతడు ఋషి. సాంప్రదాయములోనున్న క్రియాశక్తిని, నైతికసూత్రములోని సత్యమునందలివిశ్వాసమును మనప్రపంచమునకు తిరిగి ప్రదర్శించిన పురుషోత్తముడు. భౌతిక శక్తులనునమ్మి పాశ్చాత్యనాగరికత వికావికలగుచున్న యీ యుగమున, భౌతికశక్తియొక్క యుగ్రితముందు మానవజాతి యొక్కసూత్రములు నిరర్థకాశయములని భావింపబడుచున్న యీరోజులలో గాంధీజీ నైతికసూత్రబలమును పురస్కరించు కొని ధన, కనక సైన్యనికాయ శక్తుల నెదుర్చుచున్నాడు. అతని జయాపజయములను సూచించుట కిదియదనుకాదు. కాని భారతదేశ నిర్ణేతనను కొనిన నాగరికత విశ్వాసమును కోల్పోయి చెల్లాచెదరగుచుండ నతడు తనవిశ్వాసముచే లక్షోపలక్షుల భారతీయుల నైక్యము చేసినాడనుటకెట్టి సందేహమును లేదు. రూసోయొక్క శాసనకర్తవలె "అధికారములేని యధికారమును చెలాయించుచు" నతడొక ప్రజాసంకల్పమును సృజించి భారతదేశము నొకజాతిగచేసినాడు. అతడు తన యుదార, నిరాడంబరనైతిక స్థైర్యమువలన తనతోడి ప్రజలలో నాత్మగౌర వమును రగుల్కొలిపి వారి నిజమానవత్వమునందు విశ్వాస మును పురికొల్పెను. అతడిట్లు చారిత్రక ప్రవాహమును మార్చివేసి మానవజాతిలో నొకగొప్పభాగము (భారతదేశము) యొక్క భవిష్యత్తును నిర్ణయించెను.

# దౌర్జన్య రాహిత్య శక్తి.

## ఎథెల్ మెనిన్ కన్య.

మహాత్మాగాంధీకి నేనీపూజాంజలిని సవినయముగ సమర్పించుకొనుచున్నాను. అతనిని దర్శించుభాగ్యము నాకబ్బక పోయినను అతని దౌర్జన్యరహిత నిరోధ మొక్కటియే యుద్ధమా లేక శాంతియాయను సమస్యల కాచరణీయమైన పరిష్కారమని నేను గ్రహించితిని. కత్తినేకాని మరేశక్తిని గ్రహించని ప్రపంచమునకు, దౌర్జన్యము దౌర్జన్యమునే పరిభవింపచేయునుగాని దానినోడింపజాలదని గ్రహింపజాలని ప్రపంచమునకు అతడు 1930 లోని శాసనోల్లంఘనము ద్వారా దౌర్జన్యరాహిత్యములోనున్న ప్రాణశక్తి నత్యద్భుతముగ ప్రదర్శించెను.

మహాత్మాగాంధీ యీసూత్రమును క్రొత్తగ సృజింపలేదనియు భారతదేశములోనిది యనాది సిద్ధముగనున్నదనియు నేనెరుగుదును. కాని బ్రైల్సుఫర్డు చెప్పినట్లతడు "పాశ్చాత్యదేశములును, సాదృశ్యములునుచూపు ప్రవాహమునకెదురుగ" దీనిని తిరిగి ప్రతిష్ఠించితద్వారా ప్రజానాయకుడై బ్రహ్మాండమైన నైతికశక్తియయ్యెను. 1930 లోని జాతీయ సంగ్రామమున లక్షోపలక్షలగు తనయనుచరుల కతడు కేవలమొక రాజకీయ యుక్తినిగాక సత్యముకొరకు బలియైన ప్రథమ క్రైస్తవులకు

జీససు ప్రసాదించినట్టి గాఢమత విశ్వాసమును పరిసాదించెను. అతడు తనప్రజలలో (వారిని పీడించువారు ప్రదర్శించునట్లు) తుపాకులయొక్కయు మరఫిరంగులయొక్కయు శక్తినిగాక పరిజానీకములోని ప్రతివ్యక్తిలోను అంతర్గితముగనున్న శక్తి నిరేకెత్తించెను. యుద్ధపిచ్చలో మునిగియున్న యీప్రపంచ మింకను దీనిని గ్రహింపవలసియున్నది. దీనిని పూర్తిగ వినియోగించిననాడు యుద్ధము అసంభవమగును. తమలక్ష్యములను సాధించుటకొరకు దౌర్జన్యమును ప్రచారముచేయు యుద్ధపిపాసులును రాజకీయవేత్తలును నొక విషయమును మరచిపోవుచున్నారు. స్వేచ్ఛయందుగల మానవవిశ్వాసము నెవరును నాశముచేయజాలరను విషయమును వీరు గుర్తింపరైరి. తుపాకులును, మరఫిరంగులును మానవునియాత్మనుగాని, జాతీయాత్మనుగాని నాశముచేయజాలవు. ఒకజాతిని నలిపివేయవచ్చును, బానిసగచేసికొనవచ్చును. కాని యెంతటి దౌర్జన్యమైనను దాని స్వాతంత్ర్యేచ్ఛను రూపుమాపజాలదు. దానిని కొంతకాలముపైకి కనపడకుండ లోపలనుండులాగున అణచిపెట్టవచ్చును. కాని యది రహస్యముగ నంధకారమునుండియే పైకుబికి, శక్తివంతమై మానవలోకమును నడిపించు దివ్యజ్యోతి కాగల రోజువచ్చును.

తనయాత్మకు తానే యజమానియగు మానవునికి బాని సత్వములేదు. అట్టివాని శరీరమును నాశముచేయుట యతని

యాత్మశక్తిని పెంపొందించుటయేయగును. విజయశాలియై తనరిన జీససుకంటె శిలువపైనున్న జీసను అనేకరేట్లు శక్తి వంతుడు.

దెబ్బకు దెబ్బతీయుట యనగా శక్తిని వినాశన, మారణ రూపములలో మాత్రమే గ్రహింపగలిగిన యుద్ధతులనీచస్థితికి దిగుటయనియర్థము. దార్జన్యరహిత నిరోధపద్ధతి ప్రాణశక్తి, అదాహ్యమైన యాత్మశక్తిప్రదర్శనము! తనబోధలచే గాంధీజీ భార"తాత్మను" మేల్కొలిపెను. భారతీయులు అతినైచ్య భానిసస్థితినుండి తిరిగి మానవులైరి. వారిపుడు తలలనుపంకించు చున్నారు; వారినేత్రములాశా విశ్వాసజ్యోతులతో వెలుగొం దుచున్నవి. వారు తమ్ముపీడించు వారియవినీతి కరములగు పద్ధ తులకు దిగక తమ మోక్షముకొరకు ఒక్కజాతిగ నడవగలప్రజ లైరి. స్త్రీలు తమ బానిస చిహ్నమగు ఘోషావిడిచి పురుషులతో సమముగ రక్తపిపాసనెరుగని స్వాతంత్ర్యసమరమున కురికిరి. స్త్రీ పురుషులాబాలగోపాలము జీవితము "విశుద్ధజ్యోతి" యనియు "మనలో నదృశ్యముగనున్న తేజఃప్రభావముచే జీవించు చున్నాము" అనియు దీనికి మోటమిలేదనియు గ్రహించిరి.

దార్జన్య రహితశక్తి ఆచరణయోగ్యమైన రాజకీయ యుక్తియని 1930లో జాతీయభారతము ప్రదర్శించెను. ఇంతే కాదు. అదిమానవతత్త్వ విజయప్రదర్శనము! భారతప్రజానీక మున తుంగోత్తుంగరంగముగ ప్రవహించుచున్న యీనైతికా

భ్యుదయము వేలకొలది జయిళ్లకుగురిచేయబడినంత మాత్రము చేతను అనేక క్రౌర్యముల పాల్పడచేయబడినంత మాత్రము చేతను ఆగునది కాదని రుజువయ్యెను. దౌర్జన్య రాహిత్యము కేవలము రాజకీయయెత్తుకాదని గ్రహించుటకు గాంధీజీసన్యాస తత్త్వముకు యిచ్చు ప్రాధ్యాన్యతను గుర్తించుటత్యవసరము. సత్యాన్వేషణ ప్రేమ అహింసలకవినా భావసంబంధముకలదు. నిజముకు విశ్వప్రేమయే యహింస. శరీరమును లొంగదీసి యాత్మ నభివృద్ధిచేసికొను యీసందేశము క్రొత్తదికాదు. జీసను సందేశములలోనిది యొక భాగము. వర్తమాన జీవితమున దీనిని ప్రదర్శించుటలోనే గాంధీజీయొక్క శక్తి, గొప్పతనము ద్యోతకమగుచున్నది.

వివాదను పరిష్కరించుటకు, తప్పును సవరించుటకు దౌర్జన్యమును పూనినకొలది సత్యమునకు దూరులమగు చుందుము. బాహ్యశత్రువును డీకొనినకొలది ఆంతరంగిక శత్రువును విస్మరించిన వారమగుదుము. “మనలను బాధించు చున్నారని భావించి దొంగలను మనము శిక్షింతుము”. తాత్కాలికముగ మనలను వారు విడిచిపెట్టుదురు. కాని వారు మరియొకనిపై బడుదురు. రెండవవాడుకూడ రూపాంతరములో నున్న మనమే! కనుక మనమీ విషచక్రములో తగుల్కొను చున్నాము... దొంగలను శిక్షించుటకంటె సహించుటయే యుక్తమని మనము క్రమముగ గ్రహింతుము. క్షమ వారి

జ్ఞాననేత్రములను తెరచినను తెరువవచ్చును. సహించుటవలన దొంగలు మనకన్న వేరు కారనియు, వారుమనస్నేహితులనియు రక్తబంధువులనియు వారిని శిక్షింపరాదనియు మనకు ద్యోతకమగును."

యుద్ధము నెదుర్కొనుటకు, సాంఘిక స్వాతంత్ర్యమును సంపాదించుటకు నైతికముగ ప్రయోగింపబడు దార్జన్య రహిత వేదాంతసారమిదియే. గాంధీజీ ప్రపంచ సమస్యలకెట్లో యట్లే తన నిత్యజీవితములోను అహింసను ప్రయోగించును. అహింస నిరంతర బాధను తెచ్చిపెట్టును; దాని కంతములేని యోర్పుకావలెను. కాని దానిఫలిత మమోఘమైన మనశ్శాంతియు, నద్వితీయమైన ధైర్యమునని యతడు చాటును.

ఏదిశాశ్వతమో యేది యశాశ్వతమో, యేది యమూల్యమో యేది కాదో మనము తెలిసికొందుము. పాశ్చాత్య నాగరికత కీ నిత్యజీవితమును నియమించు తాపస తత్త్వము (క్రైస్తవమతమువలెనే) కొరకరానిసీతి. అయినను ద్వేషమును పారద్రోలి విశ్వప్రేమను ప్రతిష్ఠించినపుడే, (దార్జన్యమును పూర్తిగ విసర్జించినపుడే) మానవలోకము సాంఘిక పోరాటములు లేకపోవుటచే కలుగు శాంతినిగాక మానవకళ్యాణమున కవసరమగు నాంతరంగిక శాంతిని బడయగలదు.

మహాత్మా గాంధీ యిరువదియవ శతాబ్దపు టద్వితీయ ఋషి. అతడు తన బోధలచేతను సాదృశ్యముచేతను చూపు

మోక్షమార్గము నీపరిపంచ మాదరింపనిచో దాని కాత్మ వినాశము తప్పదు. భారత జాతీయోద్యమున కతడు సల్పిన సేవ యమూల్యమేయైనను అతనిని రాజకీయ నాయకునిగ గాక నాధ్యాత్మికాచార్యునిగను, నాయకునిగను పరిగణింప దగును. అతని రాజకీయములు అతనినీతిశాస్త్ర, వేదాంత శాస్త్రముల ఫలితములు.

ఒకఋషియొక్క పావిత్రతను గౌరవించుటకును, కీర్తిం చుటకును మనమతని నీతిని స్వాయముగ ధృవపరచ నక్కరలేదు. గాంధీజీయొక్క అహింస భౌతిక తత్త్వవాదులకు ప్రాణహానిగ కాన్పించవచ్చును. కాని గాంధీజీరంగ మాధ్యాత్మిక రంగము. ఆరంగమునకది యెంతయు యొప్పిదమైనది. అన్నిమతములును గొప్పవారి నుద్భవింప చేసెనని గాంధీజీయే వక్కాణించెను. నేడు ప్రపంచములో మహాత్ముడు దౌర్జన్యరాహిత్య శక్తిని ప్రదర్శించు జ్యోతిగ ప్రకాశించుచున్నాడు. అతని జ్ఞానము సర్వప్రజలకు సర్వకాలములకు నని గుర్తించెదరుగాక.

## గాంధీజీ—పసిబిడ్డ.

**డాక్టరు మరియా మాంటెసోరి. యం. డి. డి. లిట్.**

యూరపియనులమైన మనకు తన సమీపవర్తులకు కనిపించు వానికంటె భిన్నమైన గాంధీ కాన్పించును. రాత్రి ఆకసమున నున్న నక్షత్రమును చూచినపుడు మనకు మినుకు మినుకుమను

చిన్నవస్తువు కాన్పించును. కాని మనము దానిని దగ్గరనుండి చూతుమేని యదినొకచిన్నదియు ఘనీభవించినదియు గాక వస్తువుకాని విస్తృత తేజఃపుంజమని గుర్తింతుము.

మనకు గాంధీ కేవలమొక మానవుడుగ కాన్పించును. అతడు కౌపీనధారియైన యొక వామనరూపుడు. యూరపులో మూల మూలలనున్న ప్రతిశిశువుకూడ నతనినెరుగును. అతని పటమునుచూచుటతోడనే ప్రతివాడును తనభాషలో "గాంధీ అడుగో"యనును.

విరుద్ధమైన నాగరికతలో పెరిగి, యతని కంతదూరములోనున్న మనప్రజ లతని నెట్లుభావింతురు? అతడు శాంతి బోధకుడని వారెరుగుదురు. కాని యతడు యూరపులోని శాంతివాదుల వంటివాడు కాడు. మన శాంతివాదులు వాదించుచు నురుకులెత్తుచుందురు. వారు సభలకు హాజరుకావలెను; పత్రికలకు వ్రాయుచుండవలెను. గాంధీ కట్టి తొందరలేదు. అతడొక్కొక్కప్పుడు ఖయిదులోనుండి మాట్లాడనేమాట్లాడడు; తిండికూడ తినడు. కాని భారతదేశములోనున్న లక్షలకొలది ప్రజలతనిని గ్రహించి యనుసరింతురు. వారి కతనిశక్తి తెలియును.

అతనిశక్తి మానవులలోనున్న యాంతరంగిక చైతన్యమును స్పృశించి వారి నైక్యపరచు మహాసంధాన కరణి. ఈయద్భుత యనిర్వాచ్యశక్తి ప్రేమ యనబడుచున్నది. ప్రేమ

యొక్కటియే మానవులలో నిజమైన యైక్యతను చేకూర్చ గలదు. అదిలేకపోయినచో బాహ్యాపరిస్థితులవలనను, సంఘ ప్రయోజనములవలనను వారొక 'యాషామాషి' సంఘముగ నుందురు. ప్రేమలేని యీకలయిక యుపద్రవ కరమైనది. మానవులు రెండువిధముల ననగా నాత్మనాకర్షించు నాధ్యాత్మిక శక్తిచేతను, భౌతిక సంస్థలచేతను నైక్యత నొందవలెను.

కొన్ని వత్సరముల క్రితము గాంధీ యూరపువచ్చి యింటికి తిరిగిపోవుచు రోమునగరములో కొద్దిరోజు లాగినపుడు నేను దీనిని కనుగొంటిని. అతనిలో నొక యద్భుతశక్తి యున్నట్లు నే ననుభవించితిని. అతడు లండనులో నున్నపుడు నా పాఠశాలలోని పిల్లలతనికి స్వాగతమిచ్చిరి. అతడు నేలపై కూర్చొని వడుకుచుండ వారు మౌనముద్రితులై యతిశాంతముగ నతనిచుట్టు కూర్చొనిరి. ఎన్నడును మరపురాని యీ స్వాగతముకు హాజరైన పెద్దలుకూడ మౌనమునే వహించిరి. అట్లు కలసియుండుటే పరమానందమయ్యెను. రాగతాళములు, నృత్యగీతములుఅవసరములేకపోయెను. గొప్పకుటుంబములలోని స్త్రీలు తెల్లవారుజామున నాలుగున్నర గంటల కతనిప్రార్థనకు హాజరయి తాముకూడ ప్రార్థించుటకు వచ్చినపుడు నాకుమరింత యాశ్చర్యము కలిగెను. ఇంతకంటె విశేషము మరియొకటి కలదు. రోమునగరమున నతడొక ప్రశాంతభవనమున సంపూర్ణవిశ్రాంతి తీసికొనుచుండ నొకనాటి ప్రాతఃకాలమున

నతనితో నొంటరిగ మాట్లాడుటకొక లేత్రాయపు రాణివాస స్త్రీ నడచివచ్చెను. ఆమె యిటలీదేశ మరియా రాకుమార్తె.

ఈ యాధ్యాత్మికాకర్షణ గమనింప దగినది. మానవ లోకము నుద్ధరింపగల శక్తి యిదియే. భౌతిక ప్రయోజన ములచే బంధింపబడక మనమీ యాకర్షణ ననుభవింపవలెను. ఇది మనకెట్లు సంభవమగును?

విశ్వములో భౌతికకిరణములున్నట్లే మనచుట్టు నీయా ధ్యాత్మిక శక్తులెప్పుడును పరివేష్టించియుండును. వానిని మనము తెలిసికొను ప్రత్యేక పరికరములు కలవు. ఈపరికరములంత యరుదైనవికావు. ఇవియే శిశువులు! అతిదూరములోనున్న విస్తృత తేజఃపుంజమొక చిన్న మినుకు మినుకు మను నక్షత్ర ముగ మనకు కాన్పించునట్లే శిశువు మనయాత్మకు దూర మైనచో మనకతని చిన్నిశరీరము మాత్రమే కాన్పించును. నలుదిక్కుల ప్రసరించుచుండు దివ్యశక్తి ననుభవించుటకు మనము తగినంత సమీపమున నుండవలెను. మన కతిదూర ములోనున్న శిశువు నాధ్యాత్మిక దృష్టితో సమీపించుకళయే మానవ సౌభ్రాతృత్వమును స్థాపించురహస్యము. అది మానవ లోకమునకు శాంతిని ప్రసాదించు దివ్యకళ. శిశువు లనంతముగ గలరు. వారొక నక్షత్రమువంటివారు కాక వియత్పథమున తేజరిల్లు నక్షత్రధార వంటివారు. తనజన్మదినమున గాంధీ భారతదేశమునను యావత్ప్రపంచమునను గల 'శిశువును'

గౌరవింపగోరెదను. అతనియందును, ఆత్మశక్తియందును విశ్వాసముగల యతని యనుచరులకుగూడ 'శిశువు' నందట్టి విశ్వాసమును ప్రసాదింపగోరుచున్నాను.

## గాంధీజీ పరిణామము.

### ఆర్థర్ మూర్ - స్టేట్సుమన్ పత్రికాధిపతి.

డెబ్బదియేండ్ల గాంధీజీ యుత్సాహములో నలువదేండ్ల యువకులలో చాలమందికంటె యువకుడు. అతడింకను విద్యార్థియు, పరిశోధకుడు నగుటయే దీనికికారణము. అతనిని కొన్ని సిద్ధాంతములతో నైక్యము చేయవచ్చును.. కాని వాని హద్దులెన్నడును బిర్రబిగుసుకొని యుండవు. అతడెప్పుడును సత్యాన్వేషణమును తన ప్రధానాశయముగ పరిగణించునట్లు నేను గ్రహించితిని. దాని నితరులకు తెలిపి వారినట్లు నడుపుట రెండవది. మరింతజ్ఞానమును సంపాదించుట కతడు చాలకాలము నాయకత్వమును విరమించుటయు కలదు.

1924 సెప్టెంబరులో నేనతనిని మొట్టమొదట ఢిల్లీలో కలుసుకొంటిని. అప్పుడు హిందూ ముసల్మాను సఖ్యతకొరకతడు త్రివారోపవాస దీక్షలో నుండెను. అతని జీవితమును గురించి స్నేహితులు కలవరపడ జొచ్చిరి. "ఐకమత్యము కూర్చుసభ" కు రావలసినదని మహమ్మదాలీ తనకు తెలిసినంతమందికి తంతులను పంపెను. ఆవేసవిలో ననేక కులకలహ

ములు చెలరేగెను. నేనుకూడ నాసభకు హాజరైతిని. నన్ను చూచుటతోడనే మహమ్మదాలీ మెల్లగ గాంధీజీ దగ్గరకు తీసికొనివెళ్లెను. అతడు సుల్తాన్‌సింగు భవనమున నొకప్రక్క మీద పడుకొనియుండెను. అతడు చాలనీరసపడి యున్నను ముఖమున చిరునగవు మొలకలెత్తుచుండెను. భక్తుడైన ఆండ్రూసు తదితరులు ప్రక్కన నిలచియుండిరి. మేము కొద్దిగ మాట్లాడితిమి. గాంధీజీ యెక్కువ మాట్లాడ జాలకపోయెను. అతడేమి మాట్లాడెనో నాకు జ్ఞాపకములేదు. కానియారంగము మాత్రము నాహృదయమున హత్తుకొనిపోయెను. ఆసమావేశము నాకమితానందము నొనగూర్చెను. తరువాత నేనతనితో నారేడు సార్లకుమించి సంభాషించి యుండకపోయినను అతడు వెలిబుచ్చిన యాస్నేహ, పరిచయానందము నన్ను వీడలేదు. పత్రికాధిపతిగను, వ్యతిరేక కక్షిలో శాసన సభ్యుడుగను నుండి నేనతని పద్ధతిని, ప్రణాళికను (ముఖ్యముగ 1930—32 లలో) తీవ్రముగ విమర్శించితిని; యెదిర్చితిని. కాని యివేవియు ఆవ్యక్తిగత సంబంధమును మార్చలేదు. ఒక్కొక్కప్పుడు మేము జాబులను వ్రాసికొనుచుండెడివారము. నానిర్మొగ మాటపు వ్రాతలకతడు మెరిమి చూపెడివాడు.

మహాత్ముడు రెండురంగముల కధినాయకుడయ్యెను. అతడు రాచకీయ నాయకత్వము వహించెను. జాతీయ నాయకుడై యతడు తనప్రజల జాతీయభావములను రేకెత్తించెను;

పౌరుషమును రగుల్కొలిపెను; ఆత్మాభిమానమును పురి గొల్పెను. బుద్ధిపూర్వకమైన సత్యాగ్రహమును ప్రబోధించెను. వీనితోపాటు తనవైరాగ్యమును, తాపసశక్తిని పురస్కరించు కొని ప్రజాహృదయమును చూఱగొనెను. ఇది తూర్పుదేశ ములలో, ముఖ్యముగ హిందూదేశములో ప్రజల నాకర్షించును. కామినీ కాంచనములనువీడుట విజ్ఞానమార్గమని యచటచిరకాల మునుండి బోధింపబడుచున్నది. తన రాజకీయానుభవములు తన కంతముఖ్యములుకావనియు, నాధ్యాత్మికరంగములో తన "సత్య పరిశోధనలు "తన నిజజీవితమును నిర్మించెననియు గాంధీజీ తన గ్రంథములో వ్రాసెను. 1927 వరకు నతనివిషాదజీవిత ప్రస్థానో దంత మొకవిధముగ నతని యపజయము నంగీకరించుటయే. ఆత్మోపలబ్ధిని పొందుటకు "భగవంతుని ముఖాముఖి చూచు టకు, మోక్షమును సంపాదించుటకు" ముప్పది వత్సరములతడు తదేక నిష్టతో విశ్వప్రయత్నములను చేయుచుండెను. దీని కొరకతడు దౌర్జన్యరాహిత్యము, బ్రహ్మచర్యము, శాకా హారము మొదలగు ననేక త్యాగములను చేసెను. "అసిధారా వ్రతచర్యను" అవలంబించెను. ఇన్నివత్సరములైన తర్వాత చివరకతడేమి సాధించెను? "'అఖండ సత్యస్వరూపుని' 'భగ వంతుని' స్వల్పఛాయలను" కనుగొనెను. భగవంతుడున్నాడు, అతడొక్కడే నిత్యుడు- అనుసంపూర్ణ నిశ్చయమతనికి కలిగినను అతడు భగవంతుని కనుగొనలేదు; సత్యమును గ్రహించలేదు.

గాంధీజీ ప్యూరిటను తెగకు చెందినవాడు. ప్రపంచమంతయు పాపమయమను సిద్ధాంతము నతడు గట్టిగ విశ్వసించును. సన్యాసులందరివలెనే యతడును జీవితము నిషేధపరంపరలతో గూడినదనియు భగవద్దత్తమైన దానిని కృతజ్ఞతతో స్వీకరించి భోగింపరాదనియు చెప్పును. విషయసౌఖ్యము దుఃఖాలయము. బ్రహ్మచర్యమునుగురించి యతడువ్రాసిన యధ్యాయములును, స్త్రీ పురుష సంబంధమునుగురించిన యతని యభిప్రాయములును ఆధునిక మానసిక వైద్యశాస్త్రములకు విరుద్ధములని చెప్పక తప్పదు. కేవలము సిగ్గుచేటు అని అతడుతలంచు మానవప్రకృతిని 'అణచుము, అణచుము, మరింతయణచుము' అనిచెప్పుచుండును. "వైరాగ్యమునకు హద్దులులేవు." పాలు బ్రహ్మచర్యనిష్టకు భంగముకలిగించు నుద్రేకకరమైన పానీయమని యతడుభావించి తానింకను వానిని త్రాగుట మానజాలనందుకు విచారపడుచుండెను. పండ్లు కాయలు "బ్రహ్మచారికి ఆదర్శమైనయాహారము." ఉండగలిగినంత కాలముపవాసముండుట యంతకంటె మంచిది.

ప్రజాసామాన్యమున కందుబాటులోలేని యట్టియాదర్శములుగల గాంధీజీ, కొంతమంది క్రైస్తవ స్వాములవలె, దుర్భరుడు, హింసకుడని ప్రజలచే భావింపబడుచో నాశ్చర్యమేమియులేదు. కాని యతనివిషయమున నట్టిదేదియు జరుగలేదు. అనేక నిషేధములచే జీవితము నతడంత కష్టతరము

చేసికొనినను అతనికంత శక్తినిచ్చిన శీలముమరింత ప్రేమాస్పద మయ్యెను. సత్యసాక్షాత్కారము కొరకతడు తహతహలాడుట తోపాటు తోడిమానవులపట్ల నిజప్రేమను వెలిగ్రక్కెను. అతడు క్రౌర్యమును నిరంకుశత్వమును నెట్లు ద్వేషించునో పాపమును దోషమునుకూడ నట్లే ద్వేషించును.

ఇంగ్లండులో విద్యార్థిగ నుండినపుడే యతనిపూర్వుల మత మతనిలో దృఢతరముగ నాటుకొనెను. మొట్టమొదట సారి యతడు భగవద్గీత నచ్చటనే ఎడ్విను ఆర్నాల్డు తర్జుమా ద్వారా పఠించెను.

నేనిదివ్రాయుచుండగనే గాంధీజీ మరియొక నూతనరంగమున ప్రవేశించుచున్నట్లు కాన్పించును. రాజకోటలోని తన యనుభవముల ఫలితముగ "నూతనజ్యోతి" పొడమినట్లతడు వ్రాయుచున్నాడు. ఆజ్యోతియొక్క స్వభావమిపుడు తెలుపబడెను. అది చాలముఖ్యమైనది. అనేక వత్సరములనుండి హిందూ ప్రజలపై గాంధీజీకిగల యద్వితీయ పలుకుబడియు, నాధునిక భారతచరిత్రలో నతనికిగల స్థానమును నిర్వివాదాంశములు. అతడు రెండుశాసనోల్లంఘ నోద్యమముల విధాతయై దేశము నల్లకల్లోలమునముంచి ప్రభుత్వమును తబ్బిబ్బు పరచెను. ఈరెండు ఉద్యమములును ఆగిపోయినను నేటికిని నిలిచియున్న నవిఫలితముల కలుగచేసెను. కాంగ్రెసు సంస్థమీదను, ప్రజా హృదయముమీదను నతనికిగల యనన్యాధికారము నతడు

తిరిగి ప్రదర్శించిన యీసమయమున సతనిసిద్ధాంతములో కలిగినమార్పు అతిప్రధానమైనది. గాంధీజీశిష్యు లంతటనుకలరు. కనుక నిదియొక్క భారతముకేకాక ప్రపంచవార్త యగుచున్నది.

దార్జన్యరహిత సహాయనిరాకరణ మత్యున్నతాధ్యాత్మిక గాథ యనునంశము నితరులతోపాటు నేనుకూడ విమర్శించితిని. మానసికమని శారీరకమని దార్జన్యము నిది రెండింటి క్రింద విభజించెను. అది యాయుధములు లేనివారుచేయు పోరాటవిధానము; సమ్మెలు, బహిష్కారములు దీనిభాగములు. పరిష్కరింపబడవలసిన సారాంశమునుబట్టియు, నిరుకక్షులవారి వ్యవస్థలలోని యాధిక్యతనుబట్టియు నది ఫలించవచ్చును లేదా విఫలము కావచ్చును. కానియిది సాయుధ విప్లవములేక యుద్ధముకంటె విశిష్టమైన యాధ్యాత్మికాయుధముకాదు. క్రైస్తవుల కీబోధ తెల్లముగనేయున్నది. మనస్సులోనున్న భావము హృదయములోనున్న కోరిక దోషమును నిరూపించును. క్రియ దాని బాహ్యప్రదర్శనము. అసహాయోద్యమమును పురెక్కించుటకు గాంధీజీయే బ్రిటిషువారిని నిరసించి, విదేశదిగుమతులపై ధ్వజమెత్తి దార్జన్య భావములను ప్రోత్సహించెను. జాతిద్వేషమును పురికొల్పుటకతని శిష్యులెంతదూరమైనను వెళ్ళిరి. ఫలితమేమన "దార్జన్యరహిత" యుద్యమములో యుపన్యాస వేదికలపైనను, పత్రికలలోను

భారతదేశమున వెలిగ్రక్కబడినంతటి హద్దుపద్దులులేని దౌర్జన్యయుతమైననింద ప్రపంచములో మరెచ్చటను కాన్పించలేదు. దౌర్జన్యముకూడ ప్రదర్శింపబడెను. బ్రిటిషువారి యుద్ధపద్ధతిని ( ఇదియు నొకయుద్ధమే ) గురించి మొరపెట్టలేదు; కానియది యున్నత నైతికరంగమున జరుపబడుచున్నదనియు, క్రైస్తవ మతము నాచరణకు తెచ్చుటయనియు నంతకంటెకూడ నుత్కృష్టమైనదనియు చెప్పువిషయమును వారంగీకరింపలేదు. లాంకషైరు వస్తువులను బహిష్కరించుటయనగా హిందూదేశములోనున్న యొకతరగతి ప్రజలకు పని, కూలి, ఆహారము కల్పించుటకు ఇంగ్లండులోనున్న మరియొకతరగతి ప్రజకు పని, కూలి, ఆహారము లేకుండచేయుటయే; తిండిలేకుండ మాడ్చుటకును చంపుటకును మధ్యనైతిక భేదమేమియునులేదు. బాధపడుచున్న జర్మను సోల్జరులమీదను ప్రజలమీదను యొత్తిడి కల్పించి యుద్ధమునువిరమింప పురికొల్పిన జర్మనునావికాదిగ్భంధనము నైతికముగ యుద్ధముకంటె వేరైనదని సిసలైన ఆంగ్లేయుడెవడును చెప్పజాలడు. తేడాయేయున్నచో నదియుద్ధముకంటెనీచమైనది.

సహాయనిరాకరణమువలన దౌర్జన్యము కలిగినప్పుడతడు తాను స్వయముగ నుపవసించును. చౌరీచౌరాలో జరిగిన దురంతములదోషము నతని యెనిమిదిరోజుల యుపవాసమెట్లో కొట్టివేయునని యతని విశ్వాసము. తరువాత నతడు తనయుప

వాసముల నితరవిషయములకుగూడ ప్రయోగించెను. హిందూ మహమ్మదీయ మైక్యత కొరకతడు 1924 లో మూడువారము లుపవసించెను. తుది శాసనోల్లంఘనముయొక్క రెండవఘట్ట ములో నతడు నిర్బంధింప బడినపుడుపవాసముచేసి విముక్తు డయ్యెను. ఉపవాసముచేసియే యతడు కుల పరిష్కారమును మార్పించెను. అతడుచేసిన చివరయుపవాసములలో (రాజకోట తోసహా) ప్రాయశ్చిత్త లక్షణములు కాన్పించవు. అవి నిర్బంధకములుగ నున్నవని యతనియనుచరులే చాలమంది విమర్శించిరి. దౌర్జన్యరాహిత్యమును సహాయనిరాకరణమును అతని యుపవాస విధానములయొక్క ఆధ్యాత్మికవిలువను గురించి విమర్శించినపుడు గాంధీజీ యిదివరలో వినిపించుకొనెడివాడు కాడు. తానుచేసినది యుక్తమని, దానికేదోయొక యాధ్యాత్మిక విలువయున్నదని తనకొక ఆంతరంగిక యనుభవమువలన తెలియునని యతడుచెప్పును. పైకివిఫలములైనట్లు కాన్పించినవికూడ నతనికి విజయములే! దీనిని పురస్కరించుకొని యెదో యొక మిషమీద ఉపవాసము చేయువారు, యెదోయొక విషయముకొరకు "దౌర్జన్యరహిత" సత్యాగ్రహము చేయువారు కుప్పతిప్పలుగ బయలుదేరిరి.

ఇప్పుడు గాంధీజీలో మార్పుకలిగెను; అతనికి నూతన జ్ఞానోదయమయ్యెను. అతనియుద్దేశముల నతడే శంకింప నారంభించెను. ఒకయాధ్యాత్మిక కార్యమును నిర్వహించుచున్నానని

విశ్వసించుచు చివరకు తాను రాచకీయ, భౌతిక ప్రయోజనముల కొరకు పనిచేయుచున్నట్లతడు భావింపనారంభించెను. రాజకోట యుపవాసము "హింసతో మలినమైనది" అనియతడు మనకు చెప్పెను. వత్సరముల తరబడి యతడుచేసిన తపస్సు, ఆత్మ పవిత్రితనుసాధించు ప్రియత్నములు, శత్రు మిత్ర సమభావ యత్నములు విఫలములైనచో ప్రజాసామాన్య మెప్పటికైనను యీపని కర్హులగుదు రనుటకుగాని, యిప్పుడు ప్రయత్నించు చున్న వారర్హులనుటకుగాని సావకాశము కలదా?

ఈవిమర్శయటుంచి గాంధీజీ చాలయభివృద్ధి చెందినట్లా పుకొనవలసియున్నది. దీనివలన హిందూదేశములోను తదితర చోట్లను మంచిఫలితములు కలుగవచ్చును. చాలవత్సరముల నుండి గాంధీజీ క్రైస్తవమతస్వీకరణ కతి సమీపవర్తియయ్యెను. బౌద్ధ, క్రైస్తవ మతములలోగల ఆంతరంగిక సౌష్టవమునతడు నూతనముగ నర్థముచేసికొనినట్లు కాన్పించును. "నేతివాక్యము" (Non) సమృద్ధమైనదికాదు. సహాయనిరాకరణముకంటె సహా కారమేగుణవంతమైనది. ప్రపంచముదౌర్జన్యపూరితమైయున్నది. మానవహృదయములను మార్చివేయు నూతనశక్తి చాల యవసరము. అన్ని దేశములలోను దానికొరకాక్రందన బయలు దేరినది. "మానవాక్రందన పూర్తియైనపుడు" అదిరానున్నది. దానిముందు బయలుదేరిన యుద్యమములు చాలకలవు. గాంధీజీ యుద్యమములో నెక్కువయంతరార్థ ముండవచ్చును.

ఈరోజులలో యుద్ధసమస్య అతి క్లిష్టమైన నైతికసమస్య. చాలమంది క్రైస్తవులును బౌద్ధులును తదితరులును దేశరక్షణ కొరకు చేయబడు యుద్ధములోకూడ పాల్గొనరాదందురు. దుర్మార్గమును ప్రతిఘటింపరాదను క్రైస్తవసిద్ధాంతము వ్యక్తులకేగాక జాతులకును వర్తించునని వారందురు. గాంధీజీ యనుసరించిన టాల్‌స్టాయి సిద్ధాంతము తాత్త్వికఅరాజకముగ నాకు కన్పట్టును. దేశరక్షక సైన్యముల నెత్తివేయవలసినచో పోలీసుసిబందీనికూడ బర్తరఫు చేయవలెనను నావాదనకు సమాధాన మేమియురాలేదు. తననుబాధించుహింసకునియెడల యదార్థమైన ప్రేమచే నెట్టిబాధలనైనను సహించి యొకవ్యక్తి తననుపీడించువాని హృదయమును చూఱగొనవచ్చును. ఒక జాతిలోనున్న వ్యక్తులు తమకుస్వయముగ నెట్టియపాయము కలుగలేదను నెపమున మరియొక యుగ్రమైనజాతి తమలో నితరులను యథేచ్ఛగ హింసింపనిచ్చుటను నేనంగీకరింపజాలను. నైతికాగ్రహమెంత యుపద్రవకరమో నైతికరాగముకూడత నంతయుపద్రవమైనదే! పై సిద్ధాంతమును బోధించువారు తమంతవ్యక్తిగతముగ తాము నిజసాధుత్వము నార్జించుటతో తృప్తినొందక నితరులపై నొకనిర్బంధప్రవర్తనను శాసింతురు. ఉద్ధతులమీదకలుగు నైతికాగ్రహముచే సాధుత్వమునువీడి వారిలోనున్న సామాన్య మానవత్వమును మరచినవాడును సాధుత్వముపైగల నైతికరాగముచేత ననిత్యజీవితములో

ప్రేమపూర్వకముగ బాధల ననుభవించుటతో తృప్తిపడక కనపడినవారినందరును యుద్ధతులముందు సాగిలబడమన బోధించుటకే యెక్కువకాలము వినియోగించువాడును సమానులే యగుచున్నారు. ఉభయులును యదార్థము నెదుర్కొనని వ్యర్థులే యగుచున్నారు. నైతికాగ్రహముచే నొకడును, రాగముచే మరియొకడును మానవలోకమంతయు నొక్కటే యనువిషయమును మరచుచున్నారు. సంఘము దుర్మార్గమును ప్రతిఘటింపకూడదను నైతిక నైష్ఠికుని మాటయేచెల్లినచో దుర్మార్గమే రాజ్యముచేయును. మరియు నీనైతిక నైష్ఠికుని యొక్కమనుమలు బానిసలగుదురుగాని ఋషులు కాజాలరు; సాధుత్వముకాక బానిసత్వమే వృద్ధిపొందును. బానిసదేశములో నేకోటి కొక్కరుమాత్రమో ప్రపంచజ్యోతులగుదురు. ప్రజలు ముఖస్తుతి, రహస్యవర్తనము, ద్విజిహ్వాజీవితము గడుపవలెను.

భగవద్గీతలో కృష్ణుడు అర్జునునకుచేసిన బోధనుబట్టి యుద్ధముకూడదను వారివాదము సత్యోత్తమరంగమునుండి పారద్రోలవలెనని నేననుకొందును. మూడువత్సరముల క్రితము గాంధీజీకి నేనీవిషయమును చెప్పితిని. కాని గీతలోనున్న యుద్ధము కేవలము సాంకేతికమైనదనియు నదియుద్ధమునకు గాని చంపుటకుగాని వర్తింపదనియు నతడుచెప్పెను.

కాని రాజకోటతరువాత నాకొక నూతనమహాత్ముడు కాన్పించుచున్నాడు. యావజ్జీవము నతినిశితమైనశిక్షను, సర్వ

సంగపరిత్యాగమును, ఆత్మపవిత్రతను సాధింపబూనిన ఋషి సత్తమునికి మనమందరము కేలెత్తిమ్రొక్కవలెను. అతడు నూతనజ్యోతిని పొందెనేని యాదివ్వె ప్రకాశమానముకాక తప్పదు. మానవుని వ్యక్తిగత ఆత్మద్వారముననే ప్రపంచ మోక్షము కలదని ప్రతిదేశము గుర్తించినది. ప్రతివాడును తనతోనే ప్రారంభముచేయవలెను. కాని మనము మననిజాత్మలు మాట్లాడునపుడు వినగల శక్తినిచ్చు మానశక్తి నారాధింప వలెను. లేనిచో మనము తప్పుదారిత్రొక్కుదుము. నైతిక రాగముచే నీడ్వబడినకొందరు మానముదాల్చి వినవలసియుండ నితరులనుకూడ తమపద్ధతికిత్రిప్పుకొనుట కాతురపడుచున్నారు. చివరకు హిందూదేశమున నొక్కగాంధీజీ నిజశాంతిని ప్రసాదింపగల మానమును సృజింపగలిగెను.

---

# గాంధీజీయొక్క యాధ్యాత్మిక ప్రమాణము.

**గిల్బర్టు ముర్రే యం. యె. డి. సి. యల్.**

ఈ ప్రపంచజాతులయొక్క పరిపాలకులంతకంత కెక్కువగ పశుబలముపై నాధారపడుచుండ, నన్నిజాతులునున్యాయ, ధర్మములను, సౌభ్రాతృత్వమును ధిక్కరించుపద్ధతులను నమ్మి తమ ధనమాన ప్రాణముల నొడ్డుచుండ నొక్కగాంధీజీ

యేకాకియై క్షుభితార్ణవమధ్యనుండు దివ్వెవలె వెలుగొందు చున్నాడు. ధనరాసులు, గూఢచారులు, మరఫిరంగులు మొద లగు నట్టహాసములచేగాక నతడీభౌతిక ప్రపంచ ప్రమాణము లనునిర్వీర్యముచేయునట్లు కాన్పించు నాధ్యాత్మికాధికారముచే, (భయముచేగాక భక్తిచేతనే మ్రొక్కు) కోట్లకొలది ప్రజల కతడు మకుటములేని చక్రవర్తియయ్యెను. "కాన్పించు" అనినేనంటిని. ఏలయనదయారసముకాని, అంతరాత్మకాని లేని కేవలపశుశక్తినది కదల్పజాలదు. అది తనశ్రీవులోనున్న యాధ్యాత్మిక ప్రకృతిని, (పశువువలెసంచరించుట కెంతప్రయ త్నించినను విడిచిపెట్టని మానవప్రకృతిని) రహస్యముగ నిమం త్రించుటచే విజయవంతమగుచున్నది.

"మానవాత్మ యేకాకియై యపారమైన భౌతికశక్తు లతో పోరాడును. ఫలితము! భౌతికశక్తు లొక్కొక్కటి క్రమముగ దిగజారి యాత్మపక్షమునే వరించును." అని గాంధీజీని గురించి నేనిరువది వత్సరముల క్రిందట వ్రాసితిని. మార్గదర్శికత్వములో నొకయాధ్యాత్మిక ప్రమాణమెల్లపుడును యుక్తముగనేయుండునని చెప్పజాలము. అదిచాటునట్టి ఫలిత ములు, గుణగణములు రుజువుకు అతీతమైనవి. సామాన్య మానవులకుండు దుర్బలత్వములుగల మానవులే దానినినడుపు చుందురు. అధికారబలముచే నితరనిరంకుశులు నీతిదూరు లైనట్లే వీరును నీతిదూరులు కావచ్చును. కాని యాధ్యాత్మిక

పాలకులలో గాంధీజీ యసమానుడు. మొదటికారణ మేమన నతడెట్టిశాసనమును, విధులను ప్రకటింపడు. ఒక నివేదన! మన యంతరంగశక్తులకొక యాహ్వానము! సత్యమని తాను భావించుదానినతడు మనకుచూపును. కాని యితరమార్గముల పోవువారిని గర్హింపడు, బహిష్కరింపడు. రెండవది, తనపోరాటవిధానములోకూడ నతడసమానుడు. భారతీయుల హక్కుల కొరకతడు దక్షిణాఫ్రికారంగమున పదిహేను వత్సరముల పోరాటములో దీనిని ప్రదర్శించెను.

అతడు, అతనియనుచరులు ననేకసారులు బంధింపబడిరి; నేరగాండ్రమధ్య త్రోయబడి జంతువులవలె చూడబడిరి. అయినను తన్ను బాధించిన ప్రభుత్వము కెప్పుడెప్పుడాపదవచ్చిను లేక నదిదుర్బలస్థితిలోనున్నను నతడాయవకాశమును తీసికొనక వారికిసాయపడెను. ప్రభుత్వము యుద్ధములోచిక్కుకొనినపుడు భారత వాహకదళముల నేర్పరచి వారికపార సేవజేసెను. అతని యనుచరులు దౌర్జన్యరహితముగ సమ్మెకట్టుచుండ ప్రభుత్వము నకస్మాత్తుగ విప్లవయుత రైల్వేసమ్మె యెదుర్కొనెను. తానుపోరుచున్న ప్రభుత్వము తిరిగిభద్రముగనుండువరకు పనిచేయుచుండవలసినదని యతడువెంటనే తనయనుచరుల నాజ్ఞాపించెను. అతనికి జయము చేకూరెననుటలో నాశ్చర్య మేమియులేదు. యదార్థమానవ విరోధియెవడును యిట్టిసంగ్రామవిధానము నెదుర్కొనజాలడు.

మూడవది, యనేకలక్షలప్రజలచే నారాధింపబడుచు నవతారమువలె చూడబడునాయకుడు తాను ప్రమాదరహితు డనని యెన్నడును వచింపడు. తనయనుచరులును తానును పరిస్థితుల నవలోకించుకొనుట కిప్పుడతడు "అసహాయోద్యమము"నాపివేసెను.

నిరాయుధుడైన యొకమానవుడు లక్షలకొలదిప్రజల కాధ్యాత్మిక ప్రమాణముగ నుండుట త్యాశ్చర్యకరమైన విషయము. దౌర్జన్యమునువిడిచి యాపత్సమయమునయున్న శత్రువుకు సాయపడుటయేకాక తన మానవ ప్రమాదములనుకూడ నంగీకరించువాడు సర్వప్రపంచముచే కీర్తింపబడక తప్పదు. దూరదేశస్థుడను, విజాతీయ నాగరికతగలవాడను, అనేకసమస్యలనుగురించి యతనితో భేదాభిప్రాయములు కలవాడను-అజ్ఞానము, పశుశక్తియను సమ్మెటప్రేటులముందు మానవాత్మ, బుద్ధిబలము తాత్కాలికముగ నిస్సహాయ స్థితిలోనుండ, యూరపును చీకాకుపరచి చిందరవందర చేయుచున్న పరిస్థితులలో నున్నవాడను అగునేను తనశిష్యకోటిచే కీర్తింపబడు "మహాత్మా గాంధీ" యనుబిరుదము పురుషోత్తమున కిచ్చుట కమందానందము నొందుచున్నాను.

—

# దూర ప్రాచ్యమునుండి సందర్శనము

## యోన్ నాగ్నీ - టోకియో, జపాను.

1935 డిసెంబరులో నేను నాగపురమువీడి బొంబాయి వెళ్లుచు గాంధీజీ యుద్యమమున కాధ్యాత్మిక కేంద్రమగు వార్ధాలో మజిలీచేసితిని. ఆయాశ్రమము, మఠము లేక ఋషివాటికకు తగినపరిసరములతో గాంధీజీనిచూచి యానందించితిని. అచ్చట ప్రాచీనతాపసులవలెగాక నీయాధునిక ఋషిసత్తముడు తనజాతీయజీవిత సుఖదుఃఖములతో స్పందించుచుండును. అతడు వ్యాధిగ్రస్తుడై యొకరెండంతస్తుల భవనముమీద నమర్చబడిన గుడారములో పడుకొనియుండెను. ఒకశిష్యుడతని యీూచలవంటికాళ్లను పిసుకుచుండెను. అతని పవిత్రమందహాసము బోసినోటిని విశదము చేయుచుండెను. ఈ నిరాడంబర నిర్వికారమూర్తి యెక్కడ! కదలకమెదలక యున్న యింగ్లండుయొక్క బృహదాత్మను తనయుపవాస శ్రమచే కంపింపచేసిన శక్తియెక్కడ! అతనితలమీద నొకకట్టు కాన్పించెను. అదియేమియని నేను ప్రశ్నించితిని. అది తడిమట్టి యనియు తనకువలె రక్తపుపోటు హెచ్చుగనున్న వారికది మంచిదని డాక్టరు చెప్పెననియు నతడుచెప్పెను. తరువాత వేదాంతము పరిహాసము కలిసినభాషలో నతడిట్లుచెప్పెను.

"నేను భారతభూమినుండి పుట్టితిని. కనుక భారత దేశపుమట్టి నాశిరము నలంకరించుచున్నది."

కొంచెము సేపు మాట్లాడినతరువాత నేనతని శలవు తీసుకొని క్రిందకుదిగివచ్చితిని. ఆశ్రమమును చూపించుటకిద్దరు ముగ్గురుశిష్యులు నాతో వచ్చిరి. తేనెపెట్టెలనుచూచి, నూనె గానుగవద్దకువచ్చితిని; అచ్చటనుండి కాగితము చేయుచోటకు వెళ్లితిని. "కాగితముచేయుట బహు తేలిక! ఈ కాగితపు పరిశ్రమను మా దేశములో నొకయుపపరిశ్రమగ చేయగలిగితి మేని దేశమునుండి చాలధనము పైకిపోకుండ చేయగలుగు దుము." అనియొకశిష్యుడు నాతో చెప్పెను. ఆశ్రమములో రాట్నమున కగ్రస్థాన మీయబడునని వేరుగచెప్పనక్కరలేదు. జయిలులోనున్నపుడు విశ్రాంతికాలమున గాంధీజీచేతనే కను గొనబడిన చిన్నరాట్న మొకపెట్టెలో నమర్చిబడియుండెను. మీరు దానినొకచేతిసంచిలో నిమిడ్చుకొని రైలులోకూడతీరిక కాలమునువినియోగించ వచ్చును." అనినాకతడువిశదవరచెను.

అతడింకను యిట్లుచెప్పెను. "గాంధీజీ నిశితశాస్త్రజ్ఞుడు. అతనియోరిమి యెల్లపుడు నతనిపరిశోధనా బుద్ధికి సంపూర్ణ విజయమును చేకూర్చును. అతడు గడియారములను చేయునత డేయైనచో ప్రపంచములో నుత్తమోత్తమమైన గడియార మతని నిర్మాణమే యైయుండును; సర్జను లేక లాయరుగ నున్నను అత్యుత్తమస్థానము నలంకరించెడివాడు. కాని

1922 లో విచారణసమయమున తనవృత్తి వ్యవసాయము, నేతపనియనిచెప్పి యతడు కాయకష్టములోనున్న పవిత్రతను చాటెను. వివిధములగు కాయకష్టములలో నతడు నేతపని కగ్రస్థానమునిచ్చును. మనకది తూచాతప్పని యలవాటులను, ఆర్థికన్యాయమును, నిక్కచ్చిగ పాటింపదగు మానసికశిక్షను ప్రసాదించుటయే దీనికికారణము. గాంధీజీ అన్నిటికంటె దూబరా నెక్కువగ గర్హించును. కాయకష్ట మొక్కటియే భారతదేశముకు నూతనచైతన్యమును ప్రసాదించునని యతని విశ్వాసము. కనుకనతడు రాట్నమును తనచిహ్నముగ స్వీకరించి యీపవిత్ర స్వతంత్ర జీవితధ్వజముక్రిందకు చేరుడని భారత ప్రజలనుద్బోధించును." అతని యుద్యమము బ్రిటిషు ప్రభుత్వముపై తిరుగుబాటుగ కాన్పించును. హిందూదేశమునవినీతినుండి రక్షించుటలోనది ప్రపంచములోని యితర దేశములనుకూడ సృజనశక్తిచేతను ఆయాభూమికిసన్నిహితమగుజీవితమునుప్రచారము చేయుటచేతను రక్షింపగోరును. బహుదూరస్థములగు నాదర్శముల కొరకంధకారమున కొట్టుమిట్టులాడుటకంటె నతిసన్నిహితములగువాని సేవలోనున్న ప్రాధాన్యత యొక్కహిందూదేశమునకే నియమింప బడలేదు. ; "మనపైననే మనమాధార పడవలెను. సమస్తమును ప్రపంచమంతటను యెల్లకాలములందునుమనమే తయారుచేసికొనవలెను" అను స్వదేశదీక్షలోని శక్తిగుర్తింపబడవలెను.

దరిద్రనారాయణసేవ, వానితో నైక్యమగుట—ఇంత కంటె నుత్కృష్ట భగవదారాధన గాంధీజీకి కాన్పించదాయెను. రైలులో ప్రయాణముచేయు నపుడతడెప్పుడును మూడవ తరగతిలోనే ప్రయాణముచేయును. తానుకూడ మానవత్వము, ప్రేమ యుప్పొంగుచుండు మానవజాతియొక్క యధమతరగతి వాడని యతడీవిధముగ స్మరణకు తెచ్చుకొనుచుండును. తన జీవితములో నుత్తమ కాలమును పాటక జాతులతోగడిపి, వారితో సమముగ సుఖ దుఃఖముల ననుభవించిన గాంధీజీ "స్వయంశక్తి, స్వయంతృప్తి" చేకూర్చగల జీవిత చిహ్నముగ తన స్నేహితులకు రాట్నమును ప్రసాదించును.

బొంబాయిపోవు రైలులో నాబండిలో నేనొంటరిగ పడుకొనియుండ మహాత్మాగాంధి విగ్రహము కొంత కాలము వరకు నామనఃఫలకమునుండి తొలగదాయెను! "ఐచ్ఛిక దారిద్ర్యము" అను నతని వ్యాసమును నేనొకసారి చదివితిని. అందులో నంతకు పూర్వము తనవైన వస్తుజాలమును విసర్జించుటలోగలతనయానందమునతడు వెల్లడించెను. భారత దేశము వంటి దేశములో నెవడైనను తనకు కావలసిన ప్రాణావసరముల కంటె నెక్కువ యుంచుకొను వాని జీవితము బందిపోటు జీవితమని యతని విశ్వాసము. నీశరీరమును కప్పునదేదియు లేక బయటనే నిద్రించువానివలె నుండజాలనిచో భారతదేశమును, భారతీయులను రక్షింపగలనని చెప్పుటకు నీకెంత మాత్రమును

హక్కు లేదు. తన శరీరమునుకప్పు అంగవస్త్రమును గాంధీజీ చాలవరకు తగ్గించెననికూడ వింటిని. ఈదారిద్ర్య స్తోత్రము నుండి గాంధీజీ తపస్వియగుట సహజము. తద్వారా పంచేంద్రియములను నియమించి యతఁడాత్మ పవిత్రతను సాధించును.

---

# గాంధీయొక్క అనేక దృక్పథములు

**బి. పట్టాభిశీతారామయ్య, బి. ఏ. యం. బి. సి. యం.**

## 1 గాంధీ—అవతారము

"విషయ సౌఖ్యములను సరకుగొనక దూషణ భూషణములను సుఖదుఃఖములను లెక్కసేయక తాను యుక్తమని నమ్మినదానిని చేయ దృఢనిశ్చయుడగు వానితో జాగ్రతగ మెలగవలెను. అతడుపద్రవకరుడును కంటక ప్రాయుడునగు శత్రువు; అతని శరీరమును నీవెల్లపుడును జయింపవచ్చును కాని యతని యాత్మ అభేద్యము" (ఆచార్యగిల్బర్టుముర్రే)

ప్రపంచమున గొప్పవారు యుగయుగములందుద్భవించుచునే యున్నారు. ప్రతిజాతి తన ఋషులను, త్యాగులను, వీరులను, కవులను, యోధులను రాజకీయవేత్తలను సృజించెను. భారతదేశములో మన గొప్పవారిని 'అవతారము' లందుము.

వారు దుష్టశిక్షణ శిష్టరక్షణలకు భూమిమీద నవతరించిన దివ్యశక్తులు; నిత్య ప్రపంచరంగమున పరిపూర్ణ దౌర్జన్య రాహిత్య సందేశము నాచరింప గాంధీజీ మనమధ్య నవతరించెను.

## 2 గాంధీ—స్థితప్రజ్ఞుడు

తెల్ల నిరంకుశత్వము బదులు నల్ల నిరంకుశత్వమును తెచ్చిపెట్టుట గాంధీజీ దృష్టిలో స్వరాజ్యము కాజాలదు. జీవితము పూర్తిగ మారిపోవలెను. భారతదేశము తిరిగి జయింపబడవలెను. రాష్ట్రములక్రిందను సంస్థానముల క్రిందను విభజింపబడిన భూవిభాగములను హిందువులు, ముస్లిములు, క్రైస్తవులు అను కులకోతలను, గ్రామజనులు పట్టణవాసులు అను వృత్తి విభాగములను, రాష్ట్రపాలనక్రిందవచ్చు భాగములు రానిభాగములు అను అడ్డకోతలను-ఏకముచేయుటయే గాంధీజీ సమస్య. జాతీయ విజ్ఞానమును పునరుద్ధరించుట, ఆధునిక జీవితములో ననుకరణ యోగ్యమైన దానితో దానిని మేళవింపచేయుట, సేవాదర్శమును పునఃప్రతిష్ఠచేయుట, బీదల యెడల ననుకంపతో నూతన నాగరికతచే దోహదముచేయబడిన స్వార్థమునూడబెరుకుట; సంఘములో కోటీశ్వరులు గర్భదరిద్రులనను వ్యత్యాసములేకుండ క్రిందివారిని పైకి లేవనెత్తుట; అందరకు నన్నవస్త్రములకు లోటులేకుండ చేయుట; కొద్దిమంది జీవిత ప్రమాణమును వృద్ధిచేయుటకంటె నవసరమైనచో

మొత్తమువిూద దానిని తగ్గించుట—ఇది యతని కృషిలో రెండవభాగము. ఈ లక్ష్యముతో నతడు తన జీవితములో నొక నూతన సమన్వయమును సాధించి హిందూసంఘములోని చాతుర్వర్ణాశ్రమ ధర్మములను తనలో మేళవింప చేసికొనెను. అతడు బ్రాహ్మణుడై శాసనకర్త యగుచున్నాడు; క్షత్రియుడై భారతదేశ ప్రథను రక్షకభటుడగుచున్నాడు; వైశ్యుడై దేశసౌభాగ్యమును వృద్ధిచేయుచున్నాడు; శూద్రుడై యన్న వస్త్రముల నుత్పత్తి చేయుచున్నాడు. 1922 లో విచారణ సమయమున "నేను నేయువాడను, వ్యవసాయికుడను" అని యతడు చెప్పియుండలేదా? గృహమేధియైనను బ్రహ్మచారివలె నతడు బ్రహ్మచర్యమును పాటించును; వనప్రస్తునివలె భార్యతో కూడ మానవలోకమునకు సేవచేయును. చివరకతడు మానవ లోకోద్ధరణకొరకు సర్వసంగ పరిత్యాగముచేసిన సన్యాసి. గాంధీజీ మానవాతీతుడు కాడు; అట్టి నటన యతనికి పనికిరాదు. అతడు వ్యవహారదక్షుడు, హాస్యరసస్ఫూర్తి కలవాడు, యుక్తిపరుడు, ప్రజ్ఞావంతుడు. పసిపిల్లలలో పసివాడు, పెద్దవారిలో "సరససల్లాప" వంతుడు. మానవజాతిలో ఋషిసత్తముడు, తపస్సంపన్నుడు, సర్వజనులకు నేత, జ్ఞానప్రదాత మిత్రము. అతని ముఖకమలము సంతోషోత్సాహములతో నుట్టిపడుచుండును; నేత్రద్వయము తళతళ మెరయుచుండును; నవ్వు హృదయ కుహరమును విస్పష్టపరచును. అతడు చాల నిర్మాగ

మాటకి; వ్యక్తులవెనుక చేయబడు నారోపణల నెన్నడును విశ్వసింపక ముఖాముఖిగనే ప్రశ్నించుచుండును. అతడు నీసమాధానమును స్వీకరించును; నీవాక్యములను సత్యముగ పరిగణించును; విషయమును విడువక ముక్తసరిగ మాట్లాడును. అతడుచేయు ప్రతిస్టేటుమెంటును అందులోనుండు 'అయితే' 'కాని' యను షరతులను ప్రధాన వాక్యములనుకలిపి మనమర్థము చేసికొనవలెను. చాలమంది తుదిమాటలనే గ్రహించి మొదటివానిని పరిగ్రహించి తమ బాధ్యతలను వహింపక ఫలితముల నాసించుచుందురు. అతనిభాష యతని స్వంతము. సరళమైన యతని వాక్యములు తుపాకిరవ్వలవలె నతిత్వరితముగవచ్చి చురుక్కుమని తగులుచుండును. గాంధీజీ యుపనిషత్తులలో చెప్పబడిన 'పూర్ణపురుషుడు'. అతని నెరిగియుండుట మహాభాగ్యము; అతనితో పనిచేయుట మహాదృష్టము. అతడు గీతలలోని స్థితప్రజ్ఞుడు. అతడు ఆత్మ నిగ్రహమువలనను త్యాగమువలనను తన్నుతాను జయించుటయేగాక ప్రపంచమును కూడ జయించెను.

### 3 గాంధీజీ — ద్వివిధప్రణాళిక

సత్యాగ్రహియైన గాంధీజీ కపజయములేదు; జాతి పోరాటముతో విసిగినచో నతడు దానిని వెంటనే నిర్మాణ కార్యక్రమముకు మరలించును. పోరాటములోని విధ్వంసక రంగము నుండి నిర్మాణ రంగమున కతనిశక్తి పంజాబుమెయిలు బండి

వలె పరుగెత్తును. అట్లే శాసనోల్లంఘన కార్యక్రమమునుకూడ నతడు వాయువేగ మనోవేగములతో పరుగెత్తించును. అతని పోరాటమెట్లుండునో ప్రపంచ మిదివరకే గ్రహించెను. సమష్టి శాసనోల్లంఘన మెట్లుండునో యతనికే గ్రాహ్యముకాలేదు. కాని యదితిరస్కారమని, దౌర్జన్యరాహిత్యమని, యపరిమేయ మగు ప్రజానీకముచే నిర్వహింపబడునదియని యతడెరుగును. అతని యుద్యమములలో నెప్పుడును నైతికసమస్య యొకటి యుండితీరును. అది పైకియప్రధానముగ కాన్పించును. కాని యది యేకాశయబద్ధమై విశేష ఫలితములనిచ్చును. అది యొకసారి అమృతసరు హత్యలకు క్షమార్పణ కావచ్చును; మరియొకసారి ఖిలాఫతుద్రోహము. దానిరంగము, స్థానము దూరమేమైనను దాని ఫలితములు, పలుకుబడి యతి సన్నిహితములయ్యెను. మరియొకసారి ఉప్పుపన్ను. దానిభారము స్వల్పమేమైనను దాని యాదాయము పాపభూయిష్టము. గాంధీజీ మోడిపోయెనని ప్రపంచము భావించుచుండ నాయోటమియే విజయమని ప్రజలుకీర్తించునట్లతడు మార్చివేయును.

గాంధీజీ నిర్మాణ కార్యక్రమము ప్రజాసామాన్యము నింకను ఆకర్షింపలేదు. అతని ఖద్దరు సూత్రము బీదవాని కామధేనువు; నవీన ఆర్థికరక్షకరేఖ; వితంతువుకు శరణ్యము; పంగు, అంధ, అనాథాదుల కాశాజ్యోతి; ఋణభారముచేతను, పన్నుల భారముచేతను కృంగి కృశించిన రైతుకు కాలాను

కొనుగోలుశక్తి, ఉపపరిశ్రమ; ఖద్దరు పునరుద్ధారణ యొక్క సమగ్రవిజ్ఞానచిహ్నము. అది యంత్రములవలన కలుగు ననర్థములను తీసివేయును. స్వేచ్ఛ, యాజమాన్యము, కుటుంబ పవిత్రత, కుటుంబము చెదిరిపోకుండనుండుట— ఈ యన్నింటిని యనుభవించుచు భారతకళలు, చేతిపనులు పెంపొందినవి. ఖద్దరు యిట్టి భారత నిర్మాణ దక్షతను శేకత్తించుచిహ్నము; భారత దేశభక్తునిదుస్తు, జాతీయ మోక్షకంకణము. ఖద్దరును తద్వారా గ్రామ పరిశ్రమలను, గృహపరిశ్రమలను స్థిరమైన పునాదులపై నిలుపుటకును, యంత్రమును (చలన పూర్వకమైన దార్జన్యమును) జీవితావసరము వరకు నియమించుటకును గాంధీజీ మొదటి అయిదు వత్సరములను ప్రత్యేకించెను.

గాంధీజీ నిర్మాణ విధానము ముప్విధములు. ఖద్దరు ఆర్థికము; అస్పృస్యతా నివారణము సాంఘికము; మద్యనిషేధము నైతికము. మొదటిదానిని సాధించిన పిదప నతడు రెండవ దానిని చేపట్టెను. 1932 సెప్టెంబరులోని యతని ప్రాయోపవేశదీక్ష ప్రపంచచరిత్రలో నొకయధ్యాయమయ్యెను. మూడవ మద్యనిషేధము రాష్ట్రీయ పరిపాలనలో మంత్రులవలంబించిన ప్రణాళికలో నొకభాగము. నాలుగవది విజ్ఞానమునకు సంబంధించిన జాతీయవిద్య. హరిపురములో దీనికొరకొక అఖిలభారతపీఠ మేర్పరుపబడెను. దాని తరఫున వార్ధా విధానమను నొక ప్రాథమిక విద్యావిధానము ప్రచా

రము చేయబడుచున్నది. శిశువుయొక్క విద్యను జాతీయ జీవితముతో మేళవింప చేయుటయే దీని యాశయము. ఇక కులములలో నైకమత్యమును కూర్చుట—ముఖ్యముగ హిందూ మహామ్మదీయ సఖ్యత -మిగిలెను. దాని చిత్తువిధాన మిదివరకే తయారు కాబడెను. ఈసఖ్యత బేరసారములమీద నాధారపడక నుభయసంఘములలోనున్న సుహృద్భావమును, ఉదార స్వభావమును కోరుచున్నది. జాతీయదృష్టి, కార్యకలాపము యీవిధముగ నొకసారి మనుష్యులను, సాధన సామగ్రిని చేకూర్చుటలోను మరియొకసారి పోరాటములోను నిమగ్నమై యుండ జయాపజయములనుగూర్చి చర్చింపరాదు.

గాంధీజీదృష్టిలో బ్రిటనుతోడి మన పోరాటము ముఖ్యముగ నైతికము. బ్రిటిషువారు తమ కేంద్ర ప్రభుత్వముచుట్టు ఉద్యోగములు, శాసనసభలు, వర్తకము, కోర్టులు, కాలేజీలు, స్థానికసంస్థలు, బిరుదాంకితులైన పౌన్నుకర్రలవారు అనుసప్త ప్రాకారములను కట్టుకొనియున్నారు. గాంధీజీ వీని నొక్కొక్కటిగ కడతేర్చి చివరకన్నింటిని 'ఆపోశనము' పట్టతలంచెను. కోర్టులను, కాలేజీలను, కౌన్సిళ్లను బహిష్కరించుట దీనిలో నొక భాగము. ఉద్యోగములను, సైన్యమునువీడి బయటకు రావలెనను ఆ దేశముకూడ నొకప్పుడీయబడెను. ఈవిధముగ భారత దేశమున బ్రిటిషు ప్రభుత్వముపైగల మోజు, దాని యజేయత విచ్ఛిత్తి చేయబడెను.

బి. పట్టాభిశీతారామయ్య, బి. యె. యం. బి. సి. యం.

## 4 గాంధీజీ — సత్యాగ్రహము

సత్యాగ్రహము రాతియుగములో నుక్కుకత్తివలెను, ఒంటెద్దుబండ్ల పటాలములమధ్య పెట్రోలు యంత్రములవలెను దౌర్జన్యము, యుద్ధము, రక్తపాతము తాండవించు యీయాయుగమున నొకవింత యాయుధము. ఇది ప్రజల కర్థముకాదు, వారు దీనిని విశ్వసింపరు; దీనికేసి చూడనైనను చూడరు. ట్రాన్సువాల్ యుదంతమునుచూపినపుడు వారది 'పిల్లపితూరీ' యని, టుమ్రీవ్యాపారమని, భారతదేశమువంటి ఖండమునకు పనికిరాదని త్రోసివేయుదురు. చంపరాను, కైరా, బోర్సాదు చరిత్రలుకూడ 'బొమ్మలపెండ్లిండ్లవంటివని' జాతి మొత్తము మీద నడిపించుటకయోగ్యమని బర్తరపు చేయబడును. నేడో! సందేహములన్నియు మాయమయ్యెను. కష్టములన్నియు పటాపంచలయ్యెను. సత్యాగ్రహమును 'సత్య' 'అహింస' లను హద్దులమధ్య దోహదము చేయవలెను. ఇవి దాని ప్రధానాంగములు. ఇవి కేవలము సాత్త్వికములును, వ్యతిరేక శక్తులును మాత్రమేకావు. దౌర్జన్యరంగములో యుద్ధమునకుండు తతంగమంతయు దీనికిని కలదు. నీశత్రువులను చీకాకుపరచి, యేమిచేయుటకును తోచకుండచేసి చివరకు వారిలో మార్పు కలిగించి వారిని జయించుట; సత్యాగ్రహులలో కఱుకైన శిక్షాభావములను నాటుట; ఈనూతన శాస్త్రాభిమానుల మనోభావములపై కుంభకారునివలె పనిచేయుట; ధైర్యసాహసము

లను, త్యాగమును, సహనమును పురిగొల్పుట; కొద్దిపెట్టు బడితో విధ్వంసకాట్టహాసమేమియు లేకుండ జాతియంతలోను ప్రతిఘటనశక్తి నిరేకెత్తించుట—ఇన్నివిధముల సత్యాగ్రహ మమోఘమైనది. అనుభవమే దానిపటుత్వమునుగురించి మనకు తగినంత సాక్ష్యము నిచ్చుచున్నది.

గాంధీజీయొక్క 'సత్య,' దౌర్జన్యరాహిత్యముల అంతరార్థములెవరికిని తెలియవు. ఈరెండింటికి విధి, నిషేధము అను రెండేసిరూపములుకలవు. చంపరాను కలెక్టరతని కొకసారిఘాటైన యుత్తరమునువ్రాసి తరువాత నుపసంహరించుకొని దానిని తిరిగి యిచ్చివేయకోరెను. గాంధీజీ శిష్యులు దానిని కాపీచేయ మొదలిడిరి. అట్లు చేయరాదనియు వారియొద్ద నొకప్రతియున్నచో నాయుత్తర ముపసంహరింపబడినట్లు కాజాలదనియు నతడు వారినివారించెను. ఈనూతన 'సత్య' నిర్వచనము గాంధీయిర్విను సంధికాలమునకూడజరిగెను. కార్యదర్శి ఎమర్సను తూలుమాటలతోనొకజాబువ్రాసి తరువాత బుద్ధితెచ్చుకొని దానినుపసంహరించుకొనెను. దానిప్రతి మనకిపుడు కాంగ్రెసుచరిత్రలో నెచ్చటనుకానరాదు. ఉపసంహరించుకొనబడిన దానిప్రతిని మన రికార్డులోకాని హృదయములలోకాని యుంచుకొనుట సత్యవిరుద్ధము; దౌర్జన్యరాహిత్యముకు వ్యతిరేకము.

గాంధీజీ దౌర్జన్య ప్రేరేపణ నెంతమాత్రము సహింపడు. 1921 లో ఆలీసోదరుల యుపన్యాసములలో దురభిప్రాయ

పడుటకవకాశము కలదని యతడు గ్రహించుటతోడనే వారట్లు ద్దేశించలేదను నొకస్టేటుమెంటు వెంటనేవారిచేత నిప్పించెను. కాని ఆయాలీసోదరులే కరాచీలో 1921 లో అక్టోబరులో నిచ్చిన యుపన్యాసముకు ప్రభుత్వము చర్యతీసికొని నపుడతడు తిరుచనాపల్లిలో తానాయుపన్యాసమును చదువుటయేకాక వేలకొలదివేదికలనుండి దేశమంతటిచేతను చదివించెను. ఉప న్యాసము వస్తుతః దౌర్జన్యరహితముగనున్నదా లేదా? యని యతడు ప్రశ్నించును. లేనిచో నతడెంత త్వరితముగ క్షమార్పణచెప్పునో అట్లున్నచో నంతత్వరితముగనే సవాలు వచ్చును. కనుకనే 1921 నవంబరులో వేల్సుయువరాజు వచ్చి నపుడుచేసిన శాసనోల్లంఘనములో ఏబదిముగ్గురు చనిపోవుట, నాలుగువందలమంది గాయపడుట యతనిని నిర్ఘాంతపరచెను. అప్పుడతడు ప్రాయశ్చిత్తార్థముచేసిన అయిదురోజుల యుపవాస ము తరువాత నతడు చేసిన త్రివార, చతుర్వారోపవాసముల ముందటను, తుది "ప్రాయోపవేశదీక్ష" ముందటను అతిస్వల్ప విషయమగుచున్నది.

గాంధీజీ సహాయ నిరాకరణమెప్పుడును సహకారము కొరకేయుద్దేశింపబడి సాగింపబడును. కాని యతడెన్నడును సత్య, అహింసలను తన ప్రథమ సూత్రములను జారవిడువడు. 1922 ఫిబ్రవరి 1వ తేదీని రీడింగు ప్రభువు కతడువ్రాసిన యుత్త రము దీనినే విశదముచేయుచున్నది. "కాని భారతప్రభుత్వో

న్నతాధికారులైన మీరు బార్డోలీ ప్రజలు సమష్టిశాసనోల్లంఘనము ప్రారంభించుటకు పూర్వము మీనీతినిమార్చుకొని సహాయనిరాకరణ ఖయిదీలను- అనగా ఖిలాఫతు పంజాబు అక్రమములకొరకు, స్వరాజ్యముకొరకు ఆందోళనచేసినవారిని (శిక్షాస్మృతిక్రింద శిక్షింపబడినను, మరేనిర్బంధ చట్టములక్రింద శిక్షింపబడినను) విడుదల చేయవలసినదని వినయపూర్వకముగ కోరుచున్నాను. మరియు ముద్రణాలయములమీది యధికార నిర్బంధములను తొలగించి క్రొత్తగావేయబడిన జుల్మానాలను ప్రభుత్వవశముచేసిన ఆస్తులను తిరిగియిచ్చివేయగోరుచున్నాను. నేడు నాగరికప్రభుత్వ మనిపించుకొను ప్రతిదేశములోను జరుగుచున్నదానినే మీరును చేయగోరుచున్నాను. ఈప్రచురణ జరిగిన వారమురోజులలోగా మీరు అవసరమగు ప్రకటననుచేసిన మీదటవిడుదలయైన ఖయిదీలు పరిస్థితులను తిరిగి పర్యవలోకనచేయువరకు తీవ్రరూపమగు శాసనోల్లంఘనమును నిలుపుచేయవలసినదని నేనుసలహాయిచ్చెదను.”

### 5. గాంధీజీ - అతని యసందర్భములు.

గాంధీజీ యాశయముల నాచరణీయములని మితవాదులందురు. అతని ప్రొగ్రాము మితవాదతత్వమని యతివాదులందురు. అతని ప్రవర్తన యసంబద్ధముగనుండునని యుభయులును వాగొనెదరు. ఇట్టి నిందాస్తుతులమధ్య నతడచంచల పర్వతరాజమువలె నిలచి

" సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతోయుద్ధాయ యుజ్యస్వనైవం పాపమవాప్స్యసి "

యను గీతావాక్యమును తనజీవిత సిద్ధాంతముగ స్వీకరించెను.

1896 లో గాంధీజీ పూనాపట్టణము దర్శించి తిలకు గోక్లేలవద్ద ప్రథమరాజకీయ పాఠములను నేర్చుకొనెను. తిలకు మహాశయుడతనికి దుర్గమము, మహోన్నతమునైన హిమాలయమువలె కాన్పించెను. గోక్లే యవగాహనము చేయదగిన పవిత్రగంగానదివలె తోచెను. 1939 లో గాంధీజీ హిమాచలోన్నతినొందెను; అయినను అతడు సులభలభ్యుడు. అతడగాధ గంగాగర్భమును కనుగొని పవిత్రుడయ్యెను.

సత్యాగ్రహము సాత్త్విక నిరోధమని స్థూలముగ గ్రహింపబడినపుడెవరికిని అర్థముకాలేదు. 1909 లో గోక్లేదానినిట్లు నిర్వచించెను. "అది ముఖ్యముగ నాత్మరక్షణ కుద్దేశింపబడినది; అది నైతికాధ్యాత్మిక పరిసరములలోనే పోరుసల్పును. సాత్త్విక నిరోధకుడు తనపై బాధలను వేసికొని నిరంకుశత్వము నెదుర్కొనును; పశుశక్తిపై నాత్మశక్తిని ప్రయోగించును; మానవునిలోనున్న దైవీసంపత్తు నాసురీసంపత్తుపై ప్రయోగించును; నిర్బంధములను కష్టసహిష్ణుతతో నెదుర్కొనును; పశుబలము నంతరాత్మతో డీకొనును; అన్యాయమును విశ్వాసముతోను, తప్పిదము నొప్పిదముతోను నెదుర్కొనును."

1939 లో సత్యాగ్రహము గృహనామమయ్యెను. అది బ్రిటిషు యిండియాలోగాని స్వదేశ సంస్థానములలోగాని పీడిత ప్రజల కనన్యశరణ్యము. జ్యూమతస్థులు జర్మనులను, చీనావారు జపానుదాడులను నెదుర్కొనుటకుకూడ నిది హృదయపూర్వకముగ శిఫార్సు చేయబడెను.

"భారతీయుల దుఃఖములను బాపుటకును భారతీయాత్మ గౌరవమును నిలుపుటకును దక్షిణాఫ్రికాలో గాంధీజీ, అతని యనుయాయులు చూపిన యసమాన ధైర్యసాహసములను, త్యాగములను" 1913 కరాచీ కాంగ్రెసు యేకగ్రీవముగ మెచ్చుకొనెను. తిరిగి 1931 కరాచీ కాంగ్రెసులో (వెనుకటివలె దక్షిణాఫ్రికాలోని యేకొద్దిమందికొరకోగాక) 35 కోట్ల భారతీయులకొరకు సత్యాగ్రహ సూత్రములమీదనే ప్రదర్శింపబడిన వీరకలాపములకు గాంధీజీ స్తుతి పాత్రుడయ్యెను.

1914 లో గాంధీజీ బ్రిటిషు సామ్రాజ్యములో రాజభక్తిగల యొక పౌరుడు. అతడు జూలూతిరుగుబాటు కాలమునను బోయరు యుద్ధములోను రెడ్‌కాస్ దళములను స్థాపించినట్లే 1914 మహాసంగ్రామమునకూడ ప్రభుత్వముకు తోడ్పడెను. కాని యుద్ధమునుగురించి యతని యభిప్రాయములు పూర్తిగ మారిపోయెను. సైనికులను చేర్చుట కట్టి షరతులును లేకుండ బ్రిటిషువారికి తోడ్పడవలెనని 1918 అగష్టువరకు నతడు చెప్పుచుండినను 1938 సెప్టెంబరులో యూరపులో యుద్ధవాయువు

లతిప్రచండముగ వీచుచుండినపుడతడు భారతదేశ లాభము కొరకు యుద్ధపరిస్థితులను వినియోగించుకొనుట కెంతమాత్రము నొప్పుకొనలేదు. ఇంతేకాక రాబోవు యుద్ధములో నేవిధము గను పాల్గొనరాదనెను. ఈ రెండు దృశ్యములను మరింత సన్నిహితముగ పరీక్షింపదగును.

జిల్లా కలెక్టరు యనుజ్ఞ లేనిదే యుపన్యసింప గూడదని తిలకు మహాశయునిమీద 1919 లో నాంక్షవిధింపబడెను. కొద్ది రోజులక్రితమే యతడు సైనికులను జేర్చుటకు పూను కొని తాను కొన్ని షరతులను చెల్లించనిచో శిక్షక్రింద తీసికొన వచ్చునని మహాత్మునకు 50,000 రూపాయిల చెక్కు పంపించెను. ఇదియొక విధమగు పందెము. ఈపందెమేమన మహారాష్ట్రమునుండి తిలకు 5000 మందిని సైన్యములో చేర్పించుట; సైన్యములో కమిషను ఉద్యోగములు భారతీయుల కీయబడునని ప్రభుత్వమువారివద్ద మహాత్ముడు వాగ్దానము తీసి కొనుట. మన సహాయమున కెట్టి బేరసారములుండరాదని మహాత్ముని వాదన. కనుక నతడాచెక్కును తిలకు మహాశయు నకు త్రిప్పివేసెను.

1938 సెప్టెంబరులో కాంగ్రెసు వర్కింగు కమిటీవారు యుద్ధపరిస్థితులను గురించి యోచించుట కనుదినము ఢిల్లీలో సమావేశమగుచుండిరి. దేశములో రెండు కక్షలవారుకలరు. ఎట్టి పరిస్థితులలోను ప్రభుత్వముకు సాయముచేయకూడదను

వారొకరు. బ్రిటిషువారితో హిందూదేశ హక్కులనుగురించి తేల్చుకొని సాయము చేయవలెనని కొందరు. గాంధీజీ మొదటి తరగతిలోనివాడు. 1918 లో నతడెట్టి షరతులు లేకుండ ప్రభుత్వమునకు సాయముచేయ గోరినట్లు 1938 లో నెట్టి పరిస్థితులలోను ప్రభుత్వమునకు యుద్ధములో సాయము చేయరాదనెను. 1918 లో నతడనేక కార్యములలో మగ్నుడయ్యెను. అందులో రౌలటు బిల్లులు ముఖ్యమైనవి. నేడతడు తిరువాన్కూరు, జయపూరు, రాజకోట, డేంకనలు, మొదలగు సంస్థానములలో నతిజోరుగ సాగుచున్న రౌలటు చట్టముల వంటి చట్టముల నెదుర్చుచున్నాడు. అతని కార్యక్రమమును గురించి దానిప్రయోజనమునుగురించి (1919) నాటి 'హిందూదేశము' అను గ్రంథకర్తకంటె నెక్కువగ నెవడును వ్రాయజాలడు.

"గాంధీజీ మహోన్నతాశయములు, పరిపూర్ణస్వార్థరాహిత్యము గల టాల్‌స్టాయి మతస్థుడు. దక్షిణాఫ్రికాలో నతడు భారతీయుల తరఫున నిలిచినది మొదలు తూర్పుదేశములలో తపస్సంపన్నులైన మతనాయకులకుండు సాంప్రదాయిక పూజ్యభావముతో నలరారుచున్నాడు. ఇతనిని మెచ్చుకొనువారే మతకక్షకు చెందకయుండుట యతనికి మరింత బలమును చేకూర్చుచున్నది. ఇతడు అహమ్మదాబాదులో నివాసమేర్పరచుకొనిన తరువాత ననేకవిధ సాంఘిక సమస్యలనుచేపట్టెను.

"పీడింపబడు వ్యక్తికొరకు లేక సంఘము కొరకతడు పోరాడ సదా సంసిద్ధతను చూపుటచే నతని ప్రజల ప్రేమకు పాత్రుడయ్యెను. బొంబాయి రాష్ట్రములోని నాగర, జానపదులలో నతని పలుకబడి యపారము, నిస్సందేహము. అతనిని దైవతమువలె పూజింతురనుటతిశయోక్తి కాజాలదు. పశుశక్తి కంటె 'నాత్మశక్తి' యుత్తమమైనదని విశ్వసించు వాడగుటచే నతడు దక్షిణాఫ్రికాలో నుపయోగించిన సాత్త్వికనిరోధమును రౌలటు చట్టములపై ప్రయోగించుట తన ధర్మమని భావించెను. ఆచట్టము లామోదింపబడినచో సాత్త్వికనిరోధములేక సత్యాగ్రహము జరుపబడునని ఫిబ్రవరి 24 వ తేదీని ప్రకటింపబడెను. ఈప్రకటన భారతప్రభుత్వమును చాలమంది భారత రాజకీయ వేత్తలనుకూడ దిగ్భ్రమ పరచెను. కొంతమంది మితవాద భారత శాసనసభ్యులు దీనివలన కలుగు ఫలితములను గురించి బహిరంగముగ తమభయమును వెలిబుచ్చిరి. భారతీయుల స్వభావమును బాగుగ గుర్తించిన బిసెంటుసతి గాంధీజీ తలపెట్టిన యుద్యమము అపరిమితమగు దుర్మార్గశక్తుల కాస్పదము నిచ్చునని మందలించెను. గాంధీజీ భావములలోగాని, ప్రకటనలోగాని ఉద్యమము ప్రారంభింపకపూర్వమే ప్రభుత్వమువారు చర్యతీసికొన దగినదేదియునులేదు. ఎట్టి పశుబల ప్రదర్శనము పనికిరాదని గాంధీజీ స్పష్టముగ చెప్పెను. సాత్త్వికనిరోధముద్వారా శాసనములను ధిక్కరించి రౌలటు

చట్టమును వదలుకొనునట్లు ప్రభుత్వమును గద్దింపగలడని యతని విశ్వాసము. మార్చి 18 వ తేదీని రౌలటు చట్టమును గురించి యతడొక ప్రమాణమును ప్రచురించెను. అది యిట్లుండెను. 1919 లో చేయబడిన భారత శిక్షాస్మృతి సవరణ బిల్లు నెం 1, శిక్షాస్మృతిక్రింద నత్యవసరాధి కారములనిచ్చు బిల్లు నెం 2- ఈరెండు అక్రమములు; న్యాయ, స్వేచ్ఛాసూత్రము లను భంగించునవి; యావత్తు భారత దేశము యొక్కయు, ప్రభుత్వము యొక్కయు క్షేమభద్రతల కాధారభూతమైన వ్యక్తి యొక్క ప్రాథమిక హక్కులనే నాశమొనర్చునవియని మేమంతఃకరణ పూర్వకముగ విశ్వసించుచు నీబిల్లులు చట్టముగ చేయబడినచో రద్దుచేయబడువరకువీనిని శాంతియుతముగధిక్కరించుటే గాక నికముందు నియమింపబోవు కమిటీవారు నిర్ధారణచేయు నితరచట్టములనుకూడ ధిక్కరింతుము. ఈపోరాటములో మేము విశ్వాస పూర్వకముగ సత్యమునే యనుసరింతుము; ప్రాణ, మాన, ధనములకెట్టి యపకృతి నొనరింపము!"

ప్రభుత్వముయొక్కయు, స్నేహితులయొక్కయు సలహాననుసరించి 1919 (జూలై 21) లో గాంధీజీ శాసనోల్లంఘనమును విరమించెను. తిరిగి 1934 ఏప్రిల్ లో తానొక్కడు తప్ప యితరులు శాసనోల్లంఘనము చేయరాద నెను. "నేను అగ్గిపుల్లను వెలిగించితినని నాపై నింద మోపుచున్నారు. నేను అప్పుడపుడు చేయుచుండు ధిక్కారమే అగ్గిపుల్లయైనచో

కాలటుచట్టము, దానిని శాశ్వతముగ 'చట్టగ్రంథము' లో నుంచపలెనను పెంకితనము భారతదేశమంతటను వెదజల్లబడిన వేలకొలది యగ్గిపుల్లలుగాక మరేమగును! శాసనోల్లంఘనము లేకుండ చేయుటకీ చట్టమును రద్దుచేసికొనుటొక్కటియే మార్గము." అని 1919 లో నతడుచెప్పెను. శాసనోల్లంఘనమును విరమించుచు 1934 ఏప్రిల్ పాట్నాస్టేటుమెంటులో నతడిట్లుచెప్పెను. "ప్రజానీకము కందుబాటుచేయు విధానము కల్తీయగుటచే సత్యాగ్రహముయొక్క పూర్తి సందేశము వారికందలేదని నేను గ్రహించితిని. అనాధ్యాత్మిక పాత్రల ద్వారా బోధింపబడినపు డాధ్యాత్మిక సాధనల పటుత్వము తగ్గిపోవునని నాకు స్పష్టమైనది. ఆధ్యాత్మిక సందేశము లాత్మవర్థకములు.

"ప్రత్యేక కారణములకుగాక స్వరాజ్యముకొరకు చేయు శాసనోల్లంఘనము నాపివేయవలసినదని నేను కాంగ్రెసు వారికందరకు సలహాయిచ్చుచున్నాను. వారు దానిని నాకేవిడిచి పెట్టవలెను. ఈశాస్త్రము నాకంటె బాగుగ తెలియునను వాడొకడు బయలుదేరి ప్రజావిశ్వాసమును చూరగొనువరకు నాజీవితములో దీని నితరులు నాయాజ్ఞానుసారమే నడుపవలెను. సత్యాగ్రహ బ్రహ్మను, ప్రారంభకుడను కనుక నేనీ యభిప్రాయమును వెలిబుచ్చుచున్నాను. కనుక స్వరాజ్యముకొరకు నేనిచ్చిన ప్రత్యక్ష సలహావలనగాని యప్రత్యక్షమైన యూహలవలనగాని

శాసనోల్లంఘనము చేయుచున్న వారికముందు మానివేయవల సినదని కోరుచున్నాను. భారత స్వాతంత్ర్య సమర శ్రేయమున కిది యుత్తమమైన మార్గమని నాదృఢ విశ్వాసము.

"మానవలోకము నుద్ధరింపగల యీయసమానాస్త్రము విషయమై నేనతి శ్రద్ధావంతుడనై యుందును."

1934 లోని యాపాట్నాస్టేటుమెంటులోనే "అంతః కరణ శుద్ధిలేకుండ ననేకులచే గావింపబడిన సత్యాగ్రహము (దాని ఫలితములు గొప్పవేయైనను) టెర్రరిస్టు జాతియొక్కయు పాలక జాతియొక్కయు హృదయములను స్పృశింపలేదు" అని యతడు విచారించెను. కాని నేడో! తమ యిండ్లలోనే బంధింప బడిన యిట్టి 2500 మంది స్నేహితులను విడుదల చేయించుట, వారు దౌర్జన్యరాహిత్యమునందు విశ్వాసమును ప్రకటించుట యతని కపరిమితానందము నొసగూర్చినది. దౌర్జన్యరాహిత్యము దౌర్జన్యముమీద నొందిన యఖండవిజయము మరియొక విషయములో ద్యోతకమగుచున్నది. సర్దారుపృథ్వీసింగు చని పోయెనను కొంటిమి. నిజమున కతడొక జయిలునుండి మరి యొక జయిలుకు బదిలీయగుచు పోలీసు బందోబస్తులోనుండి పరుగిడుచున్న రైలులోనుండి దుమికి పారిపోయి 17 సంవత్సర ములు యిరువు యిండియాలమధ్య స్వేచ్ఛగ తిరుగుచుండెను. చివరకతడు గాంధీజీ శరణుజొచ్చెను. గాంధీజీ యతనిని యిండి యాలోని బ్రిటిషు జయిళ్లకు వప్పగించి యతని విడుదలకొరకు హార్నిశములు పాటుపడుచున్నాడు.

1919 లో శాసనోల్లంఘనము నాపివేసిన తరువాత పంజాబులో జరిగిన సంభవములను గాంధీజీ తెలిసికొనియును కొనని విధముగ పరిస్థితులు విషమించినందుకు నిర్ఘాంతపడి "అతడు 'హిమాలయ సన్నిభమగు గొప్పతప్పు' చేసినట్లు, అది నిజమైన సాత్త్వికనిరోధకు లెంతమాత్రమును కాని దుష్ట ప్రవర్తకులు దుండగములుచేయుట కవకాశమిచ్చెననియు" నొప్పుకొనెను.

1919లో సంస్కరణచట్టము చేయబడినపుడా సంస్కరణల సంతృప్తికరములుగనున్నను చక్రవర్తి ప్రకటనలోనున్న భావముల నంగీకరించుచు "అధికారులును ప్రజలునుకూడ సంస్కరణల నాచరింపచేయుటకు తోడ్పడి బాధ్యతాయుత ప్రభుత్వముచేకూరునట్లు చేతురుగాకయను విశ్వాసము" కాంగ్రెసువ్యక్తపరచవలెని యతడుకోరెను. కాని 1937లో ప్రత్యేకాధికారములను వినియోగించకుండ, దైనందిన రాష్ట్రపరిపాలనలో జోక్యముకలుగజేసికొనకుండ నభయహస్తమీయవలసినదని యతడు ప్రభుత్వమునుకోరెను. బార్డోలీరైతుల భూములను వాపసుచేయుట, జమీందారీ, ల్యాండు రెవిన్యూచట్టములలో తీవ్రమైన మార్పులనుచేయుట, ఒరిస్సా గవర్నరు నియామకము, దౌర్జన్యవాదులైన రాజకీయఖయిదీలను విడిపించుట మొదలగు వానినికూడ నతడు రొక్కించెను. ఈమార్పుగమనింపదగినది.

"ప్రభుత్వముచేయు పిచ్చుపనులకు తిరిగి పిచ్చుపనులను చేయక వివేకమును చూపవలెను" అని అమృతసరు కాంగ్రెసులో గాంధీజీకోరెను. నేడు రాజకోటలోను, యితరసంస్థానములలోను ప్రభుత్వముచేయు పిచ్చుపనులను దౌర్జన్యరాహిత్యముతోను, వివేకముతోను నెదుర్కొనుచో తిరిగి ప్రజలకే విజయముచేకూరునని యతడు దేశమునకభయహస్త మిచ్చుచున్నాడు. యావన్మానవలోకరంగమునుండి గాంధీజీ కేవలరాచకీయ రంగమునకు దిగుచుండుట దృగ్గోచరముకాదు; పైగనదియు నైచ్ఛికముగ జరుగుచుండును. అదియతనికి తెలియకకాదు. కాని యదియనివార్యము. అఖిలభారతహోమురూలు లీగులోజేరి తనసహచరులతో దానికధ్యక్షుడైనపుడు ధర్మప్రేరణచేతనే యతడట్లుచేసెను. స్వదేశీ, కులసామరస్యము, భారతదేశమున హిందూస్థానీవ్యవహార భాషగచేయుట, భాషలనుబట్టి రాష్ట్రములను పునర్విభజించుట యనువానిలో నతడు ప్రత్యేకకృషి చేసెను. కేవలసత్యాహింసలతోనే వీనిని సాధించవలెనను పరతు నతడుకోరెను. సంఘ సంస్కారమతనికి రెండవవిషయము. మతముద్వారా సంఘసేవనుండి రాచకీయము లతనికొక యడుగు; నేడతడు ఆమార్గముద్వారానే రాచకీయములనుండి సాంఘికసేవకు మరలెను. నిజమునకతనికవి రెండును ఒకటే. అవి యొకేనాణెముయొక్క రెండువైపులు; ఇకనాణెమో! అన్ని మతములకును పునాదిసూత్రములైన సత్యఅహింసలను నిర్దుష్టలోహము.

గాంధీజీకి సహాయనిరాకరణము సాధనముకాని గమ్యము కాదు. భారతీయ గౌరవమునకు భంగముకలుగ నంతవరకతని సహకారము నెప్పుడును శత్రువుపొందవచ్చును. 1920 లోను నేడును అతనిస్థితియిదియే. 1920 లో ప్రభుత్వము దానినితిరస్కరించెను. నేడువారు దానికొరకు ప్రాకులాడుచున్నారు.

సంపూర్ణస్వాతంత్ర్యమును గురించి 1921 లోను 1929 లోను అతనికిగల వ్యత్యాసభావము గమనింపతగినది. 1921లో అహమ్మదాబాదులో నతడిట్లు చెప్పెను. "మీలోకొంతమంది యీతీర్మానమును నిర్లక్ష్యముతోచూచుట నాకువిచారకరముగనున్నది. బాధ్యతలేనట్లు కాన్పించుటయే నాకుకలుగు విచారమునకు కారణము. జవాబుదారీగల మనము (స్త్రీపురుషులము) నాగపురము, కలకత్తా నాటిరోజులను స్మరింపవలెను." 1928 లో స్వాతంత్ర్యతీర్మానము తిరిగిముందుకుతీసికొని రాబడినపుడతడిట్లుచెప్పెను. "మహమ్మదీయులు అల్లాపేరును శ్రోత్రియహిందువులు రామనామమును జిహ్వాగ్రమునుండి జపించునట్లు మీరును స్వాతంత్ర్యనామము నుచ్చరింపవచ్చును. కాని యేమిలాభము? పౌరుషములేనిచోట తుంపర్లపసయే కాని మంత్రముల పసయుండ నేరదు. మీవాక్కులను మీరేచెల్లించుకొననినాడు స్వతంత్రమెచ్చటనుండును? ఇంతకును స్వాతంత్ర్యముసామాన్య విషయముకాదు. పదజాలమును కురిపించినంత మాత్రముచేనది ఊడిపడునదికాదు."

1929 డిసెంబరు 23వ తేదీని జాతిని సంపూర్ణస్వాతంత్ర్యమునకు తయారుచేసెదనను సవాలుతో నతడు యిర్వినుప్రభువుతో సంభాషణలను కట్టిపెట్టెను. "ప్రజలలోనుపై తరగతులలోను గలబుద్ధిమంతులు అసహాయోద్యమము గగనకుసుమమనియు, వెర్రిమొర్రి ప్రణాళికయని తిరస్కరింతురనియు, నదియే జయించినచో దేశమంతట నరాచకము, అక్రమము రాజ్యముచేయుననియు" నమ్ముచున్నట్లు ప్రభుత్వము 1920 లో వ్రాకుచ్చెను; "అసహాయోద్యమము అజ్ఞానమును, దురభిమానమును రేకెత్తించును; దానిసిద్ధాంతములలో నిర్మాణబీజములెంతమాత్రమునులేవు" అని బ్రువ్వెను. నేడు ఆప్రభుత్వమే యాయుద్యమవిధాతతోను, శాసనోల్లంఘనముతోను రాజీచేసికొననాతురపడుచున్నారు.

1921 లో గాంధీజీ రీడింగు ప్రభువుతో సంధి సంభాషణలు ప్రారంభించిననాడు (గాంధీజీ తంతి రీడింగు ప్రభువుకు కొంచెమాలస్యముగ చేరుటచే నవి విఫలమయ్యెను) అతడు కార్యవాది కాడనియు నసాధ్యుడనియు ప్రతివాదును తలంచెను. కాని యొకదశమైన తరువాత 1931 లో ఇర్విను ప్రభువు అతనిని, ఆతని 26 గురు అనుచరులను చెరనుండి విడిచి సంభాషణలు ప్రారంభించినపుడతడు చితాను చితముల నెరిగినవాడనియు, ప్రమాణ జ్ఞానము కలవాడనియు, పట్టువిడుపులు కలవాడనియు ప్రతివాదును పొగడ నారంభించిరి. 1937 లో

లిన్‌లితుగో ప్రభువుతో నెరపిన సాధుసంభాషణలలో నాగుణములే ప్రస్ఫుటించి ఫలప్రదములై కాంగ్రెసు మంత్రిపదవుల నంగీకరించుటగ పరిణమించెను.

1922 లో చౌరీచౌరా దురంతములు జరిగెను. ఇరువదియిద్దరు పోలీసులు ఒక సబిన్‌స్పెక్టరుతోసహా పోలీసుస్టేషను తగుల పెట్టబడెను. దీనితో గాంధీజీ యావత్తు శాసనోల్లంఘన కార్యక్రమమునుఆపివేసెను. 1938 లో రాణ్పూరులో (ఒరిస్సా) బేజిల్ గెట్ అను నతడు వధింపబడెను. కనుక ఒరిస్సాలోని తూర్పు యేజెన్సీ ప్రజల కందరకు నతడా సలహానే యీయక తప్పినదికాదు. దౌర్జన్య రాహిత్యమునకు భంగము వాటిల్లు నపుడతడు గౌరవముకొరకు ప్రాకులాడడు. "శాసన సభా ప్రవేశము అసహాయోద్యమమునకు విరుద్ధమను నాభావము మారలేదు" అని యతడు విడువబడిననాడు 1924 లో చెప్పెను. కాని 1934 లో శాసనోల్లంఘనము విరమింపబడిన నాడతడే శాసన సభాప్రవేశము నామోదించి కొన్నిషరతులతో పదవీ స్వీకారము చేయించెను. ఆషరతులవలన మంత్రులు చట్టమును బ్రిటిషు ప్రభుత్వ ముద్దేశించినట్లు ప్రయోగింపక జాతికోరునట్లు శాసించునట్టి పరిపాలననే చేయగలిగిరి.

1934 ఏప్రిల్‌లో నతని పాట్నాస్టేటుమెంటులో సంస్థానములను గురించి యొక ప్రకటన చేసెను. "సంస్థానములను గురించిన నాసలహాకును కొంతమంది చెప్పునీతికిని చాల వ్యత్యా

సము కలదు. నేను యీసమస్యను గురించి గంటలకొలది తల పోసితిని. కాని నాయభిప్రాయమును మాత్రము మార్చుకొనజాలకపోతిని" అని యతడనెను.

సంస్థానములలోని పరిస్థితులు పూర్తిగ మారిపోవుటచే 1939 లో నతడు తన యభిప్రాయములను మార్చుకొనెను. సంస్థాన ప్రజలలో నపూర్వమైన యభ్యుదయము కలుగుటచే వారికతడు చేయతగినంత సాయముచేయ బూనుకొనెను. కనుకనే నేడు కస్తూరిబాయి రాజకోటజయిలులో నున్నది. సంస్థానాధిపతులు తమ ప్రజలకు బాధ్యతాయుత పరిపాలన నీయవలెను; లేదా తమ యునికికి తిలోదకముల నొదలుకొనవలెను అని గాంధీజీ చెప్పెను.

## 6 గాంధీజీ — అతని యంతఃకరణము

సత్య, అహింసలు మానవుని యున్నతానుభవములు. సంగీతమును, లెక్కలను, ఖద్దరును, కులసామరస్యమును గుర్తించుటకు సుశిక్షితేంద్రియ పరిజ్ఞానమెట్లవసరమో యట్లే సత్య, అహింసలను గ్రహించుటకును నది యవసరము. సుశిక్షితేంద్రియ జ్ఞానము అంతఃకరణ ప్రబోధముల కాలవాలము. గాంధీజీ యెప్పుడును బుద్ధిచేగాక నంతఃకరణముచేతనే శోధించుచుండును. సత్యము నంతఃకరణచే చూడగలుగుట గుణవంతుని లక్షణము; అతడీకోటికిచెందినవాడు. అతని సందేశములను దేశకాలములకు సంబంధించిన సాంఘికాచారములను నైతిక చట్ట

ములను పురస్కరించుకొని వ్యాఖ్యానములను చేయుట యతని యనుచరుల ధర్మము. 1922 లో బార్డోలీలో వెనుకకు తగ్గుట, 1930 లో ఉప్పు సత్యాగ్రహము, 1934 లో శాసనోల్లంఘన మును విరమించుట, 1939 లో సంస్థానములలో ననుసరింప వలసిన నీతిని—అతడీవిధముగనే నిర్ణయించెను. అతనికి జ్ఞానము హఠాత్తుగ కలుగుచుండును. తన కింకను యేమియు స్ఫురించ లేదనియు జ్ఞానముకొరకే ప్రార్థించుచున్నాననియు నత డనేక సారులు చెప్పుచుండెను. అతనికి కాన్పించు వెలుతురు అతని ప్రజలకు వింతగ కాన్పించును. ఏలయన నతని చికిత్సాపద్ధతి యపూర్వము, భయజనకము. అ. భా. కా. కమిటీ మీటింగు లో పిచ్చివాడొకడు అల్లరిచేయునపుడు వాలంటీరులు పిచ్చి వానిని మోసికొనిపోవుచుండ నతడు వారించి మూడువందల మంది సభ్యులుగల యాసభనంతను ఆపివేయగోరును. ఆ యల్లరి చేయువాడు డిల్లపోవును. ప్రజాకోరికకు వ్యతిరేకముగ చీరాల పేరాల ప్రజలపై బలవంతముగ మున్సిపాలిటీని అంటకట్టి నపుడు ప్రజాలాప్రదేశమును ఖాళీచేయుటయే దానికి చికిత్స యని యతడనెను. జెబెక్‌పై తిరుగబాటుచేసిన పూర్వపు టర్కరీదేశస్థులవలె వారు వెంటనే కాళీచేసిరి. బార్డోలీ, ఛెర్పడా పన్నుల నిరాకరణోద్యమములో రైతులను తమయిండ్లు, వాకిండ్లువదలి చుట్టుప్రక్కలనున్న సంస్థానములలోనికి తరలి పొమ్మని యతడాజ్ఞాపించెను. దానితో రవి యస్తమించని

బ్రిటిషు ప్రభుత్వము, వారి సాయుధపటాలముల పటాటోపము రిత్తవోయెను. ఒరిస్సాలోని నీలగిరి సంస్థానాధీశుడు ప్రజా పీడంకరుడైనపుడు ప్రాచీనవలస విధానము విధింపబడెను. ప్రజలు బారులుకట్టి పోవునాడు తప్పుచేసిన సంస్థానాధిపతికి బుద్ధివచ్చెను. ఈవిషయములలో జయము ప్రజల సహనశక్తి మీదను, హృదయ పవిత్రతమీదను ఆధారపడియుండును. కాని గాంధీజీ యనుచరులెల్లప్పుడును అతనివలె చూడజాలరు. తరుచు వారతని నిర్ణయముల నెదిర్చిరి; 1922 లో బార్డోలీలో వెనుకకు తగ్గరాదని వారతని నెదిర్చి యరాచక నేరముల వెనుకనున్న యుత్సాహమును పొగడిరి. 1924 లో అఖిలపక్ష సమావేశములో అహమ్మదాబాదులో సిరాజ్‌గంజి తీర్మానము తిరిగి వోటుకువచ్చిన నాడతడు బహిరంగసభలో భోరున యేడ్చెను. తన నిజభక్తులలో కొందరు నేరముచేసిన యువకుని స్తుతించు పక్షమున వోటుచేసి నందులకే యతని కంత దుఃఖము కలిగెను.

అతడగ్నిహోత్రములో చెరలాడుచునెల్లప్పుడు నీయగ్ని పరీక్షలో నూతనశోభతో దనర్చారుచుండును. తనప్రజలయొక్క యవివేకమున కతడనేకసారులు విచారపడుచు కాంగ్రెసుకూడ నల్లేచేయపట్టుబట్టును. ఎచ్చటనో యొకచోట (ఎంతదూరము లోనైనను) దౌర్జన్యముజరిగి నంతమాత్రమున నతడు సమష్టి శాసనోల్లంఘనమును నిలుపుచేయుచుండెను.

గాంధీజీ మాట్లాడు నపుడుకంటె మౌనముగనున్నపుడును కాంగ్రెసులో నున్నపుడుకంటె బయటనున్నపుడును దేశము నెక్కువగ కదల్చగలడు. రాచకీయములలో మౌనము దాల్చెదననియతడు 1925లో కాన్పూరులో శపథముబట్టి గౌహతీలో 1926 డిసెంబరులో మాత్రమే దానినివిడిచిన సంగతి ప్రజలు మరచిపోవచ్చును. కాని యట్టి కాయిక, రాచకీయమౌనకాలములలోనే యాతడు గొప్ప గొప్ప వ్యూహములను తలపోయును. అవిపూర్తిగ దోహదముచేయబడిన తరువాత సమ్యగ్భావిత విధానములు, ప్రణాళికలు ఆవిర్భవించును. 1925 కాన్పూరు కాంగ్రెసుకును 1928 కలకత్తా కాంగ్రెసుకును మధ్యగలవ్యవధి యిట్టిదే! 1929లో స్వాతంత్ర్య తీర్మానమువచ్చెను. గాంధీజీ తనశత్రువులను ప్రతిఘటించిశోధించునట్లే తనయనుచరులశక్తిని కూడ శోధించును. అతని పరీక్షకు నిలిచిన యెడలవారిభావములను స్వీకరించి వానిని తనభావములుగ చేసికొనును; పరీక్షలో నిలువనివారికి స్వస్తిచెప్పబడును. మొదట శాసనోల్లంఘన సమస్యను తరువాత సంపూర్ణస్వాతంత్ర్య, సంస్థానసమస్యలను యతడిట్లే పరిష్కరించెను. నేడతడు సంస్థానసమస్యపై తీవ్రత వహించెను. యువకకాంగ్రెసు వారతనిని శంకించుచు ఫెడరేషనువిషయమై బ్రిటిషువారితో నతడు రాజీపడినట్లు బహిరంగ నేరారోపణచేసిరి. రెండంతస్తుల సౌధమైన ఫెడరేషనును భగ్నమొనర్చెదమని వారు ముక్తకంఠములతో చాటుచుందురు.

యువకులు తమయాయుధములను పైయంతస్తుమీాదికి బారు చేయుదురు. ఈలోపుగనే గాంధీజీ మొదటియంతస్తును దాని స్తంభములను కూలద్రోయుచున్నాడు. సంస్థానములే యీా స్తంభములు. ఇవిలేనిదే ఫెడరేషనులేదు. క్రిందియంతస్తులోని రాష్ట్రీయవిభాగములు కూలుసూచనలపుడే కాన్పించుచున్నవి. సత్యమే గాంధీజీ రాజనీతి. దౌర్జన్యరాహిత్యమే యుద్ధనికనచను. అతనిమాటకు, అర్థముకు, చేతకు నవినాభావసంబంధముకలదు. ప్రభుత్వము హరిజనులకు ప్రత్యేకనియోజకవర్గముల నేర్పాటుచేసి హిందూసంఘమును విభజింప బూనినపుడతడు రెండవ రౌండుటేబిలు సభలో "తనజీవితము నర్పించి" దాని నెదిరింతునని చెప్పినపుడు యదార్థమునే చెప్పెను. ఇంగ్లండునుంచి తిరిగివచ్చుటతోడనే అజదుమైదానములో (1931 డిసెంబరులో) నతడు దానిని ధృవపరచెను. దానినేయతడు 1932 మార్చిలో సర్ సామ్యుయల్ హోరుకు లిఖితపూర్వకముగవ్రాసి 1932 సెప్టెంబరు 20వ తేదీని "ప్రాయోపవేశమును" ప్రారంభించెను. సంస్థానసమస్యమీాద నేడతడు మరియొక భయంకరశపథమునుబూని ఫెడరేషనును భగ్నము సేయనున్నాడు. "ఇంతేకాదు, భగవదేచ్ఛయైనచో నేనిదివరకు పోరినయుద్ధముకంటె తీవ్రతరమైనయుద్ధమును సేయుటకు తగిన జవసత్త్వములు నాలోనింకను కొరవడలేదని చెప్పగలను." గాంధీజీ జీవిత, నడకలలోగల వ్యత్యాసము గమనార్హము.

అదిబాహ్యము ; ఊహాజనితము. గాఢమతాభి నివేశము, విశేషకార్య వాదిత్వము కలవానికిది యవసర లక్షణము. ఆదర్శమును యదార్థమును, సాహసమును జాగ్రతను, విప్లవతత్వమును శ్రోత్రియత్వమును మేళవింపచేయుటయు, భూతమును గుర్తించు భవిష్యత్తుకు సాహసించుటయు, జాతీయతను సఫలపరచుకొనుచు జాతిని విశ్వమానవతత్వముకు తయారుచేయుటయు- ననగా నొక్క-మాటలో స్వేచ్ఛను సౌభ్రాతృత్వముతో సమన్వయపరచి యా రెంటినుండియు మానవత్వము నుత్పన్నముచేయుట- చక్క-నిస్థితిలోనున్న రైలుయొక్క- యింజనుకు బ్రేకు వేసి మిట్టపల్లములు, యెగుడుదిగుడులు, వంకరటింకరలు, సమవిషమ దేశములు చూచుకొనుచునాపుచునిదానముగ నెమ్మదిగపై కెక్కించుచు చటాలున క్రిందకు దింపుచు చతురతతో నడుపుటవంటిది. మానవులలో మానవుడై నను అతడు సమకాలిక ప్రపంచము నివ్వెరపడునట్టి యద్భుతవ్యక్తి. స్థితప్రజ్ఞుడు; అవతారమూర్తి. రాజకీయములకు మతపవిత్రతను ప్రసాదించినవాడు. సాంఘికసంఘర్షణలకు మహోన్నతనైతిక, మానవకారుణ్య వాసనలను కల్పించిన యనఘమూర్తి; అఖిల మానవజాతియొక్క- పార్లమెంటు, ప్రపంచ ఫెడరేషనులను దివ్య సంభవముల నతిత్వరితముచేయ నుంకించు పుణ్యమూర్తి.

---

# ప్రపంచమున కంతకును గాంధీజీ సందేశము

**మాడ్ డి. పీటరుకన్య.**

ఆంగ్లజాతిస్త్రీనైన నేను నానిజదేశముయొక్క ప్రవర్తన
నెంతమాత్రమును సహింపక, నెక్కునభాగము దానికి వ్యతిరేక
ముగజీవించి పనిచేసినవాని జీవితమునుగురించి కొద్దిగ చెప్ప
బోవుచున్నాను. ఈగ్రంథములో పాల్గొనునవకాశము నాకిచ్చి
నపుడు నేనుదానిని నిర్భయముగ స్వీకరించితిని. ఏలయనమహా
త్ముడు తనజీవితమునంతను తనప్రజలకొరకు ధారవోసినపుడత
డొక మహాశయముకొరకు, కళ్యాణాత్మకమగు నాశయము
కొరకుకూడ పనిచేయుచున్నాడను సంగతి నేనెరుగుదును.
ముఖ్యముగ నతడు ప్రపంచసౌభాగ్యమును చేకూర్చుటలోను
తన నిజవ్యవహారములను సమర్థించుకొనుటలోను తనవిధిని నెర
వేర్చుకొనవలెనను జ్ఞానముకలిగిన ప్రతిదేశముయొక్క యాదర్శ
ములకొరకు పనిచేసెను. వ్యక్తికివలెనే ప్రతిదేశముకును రెండు
విధములైన వృత్తులుకలవు. తననిజకళ్యాణముకొరకు తన జీవి
తమును, తనవ్యవహారములను తానే నిర్వహించుకొనుట; సర్వ
జాతి సమ్మేళనములో మానవలోకములో తానొకయంగముగ
జీవించుట.

మహాత్ముఁడు ప్రతివ్యక్తియొక్కయు, ప్రతిమానవసంఘము యొక్కయు నీరెండవ మహత్తరవృత్తిలో ప్రవక్త, నాయకుడు. కనుకనే నాకతని కేవల రాచకీయ జీవితభాగమంత ప్రధానముగ కాన్పించదు. అతడెల్లపుడును బోధించుచుండు నిస్సంగత్వము, విశ్వప్రేమయను గుణపారమును నేనారాధింతును. నేనేకాక భావిసంతతికూడ నారాధించుగాత యని యాశింతును.

అతడొకసారి యిట్లుచెప్పెను "నేను రాచకీయములలో పాల్గొనునట్లు కాన్పించుటకు నేఁడు రాచకీయములు మనలను విషసర్పవలయము లావరించినట్లు ఆవరించుటయే కారణము. మనమెంత ప్రయత్నించినను వానినుండి తప్పించుకొను మార్గముకాన్పించదు. నేనీసర్పమును మర్దింపగోరెదను. నేనురాచకీయములలో మతమును ప్రవేశపెట్ట ప్రయత్నించుచున్నాను."

యావత్తు మానవసంఘముయొక్క నైతిక పునర్జన్మయే ప్రధానవిషయముగ చేసికొను వాని జీవితమును గురించి మన మేమియాశింపవలెను? స్వార్థమును స్పర్థను క్రౌర్యమును పరస్పర సహనము, సోదర సహకారముగ మార్చివేయుటా? ఇట్టివిషయములలో ఋషుల యాశలు ఆశాభంగములు, విఫలములు, అవమానములుగ పరిణమించును. గాంధీజీ యెంత సాధింపగలిగినను వీరవిఫలత నొందెనని నేను చెప్పసాహసింతును. సంస్కర్తలెప్పుడును తమ శరీరముల నేరోడ్డుప్రక్కలనో విడిచి

పెట్టుటకు తయారుకావలెను. ఏలయన మోసెసువలె వారు స్వర్గధామమును చూడవచ్చును గాని ప్రవేశింపనేరరు. "నీవు కండ్లతో చూచునట్లు నేనుచేసితిని కాని నీవందుపోరాదు" "తన ప్రవర్తన సాదృశ్యమునుచూపి యసాధ్యమును సుసాధ్యము చేయుటమాత్రమే సంస్కర్తయొక్కపని" అని గాంధీజీయే చెప్పెను. తన "కించిజ్ఞత్వమును హద్దులను" గురించి యోచించు నపుడతడు "ముగ్ధుడు" అగును.

గొప్ప యాధ్యాత్మిక లక్ష్యములు స్థూలములగు ప్రయత్న, కార్యరూపములను దాల్చినపుడు శరీరమునకును ఆత్మకునుగల నిరంతర దేవాసుర సంగ్రామము ప్రారంభ మగును. ఆధ్యాత్మిక ప్రయత్నములోనున్న పవిత్రత కళంకిత మగును; లక్ష్యము మలినమై మృగ్యమగును; ప్రవక్త మానవ రాగ ద్వేషరంగములలోని కీడ్వబడును; అతని మహత్తర విధానములు అయోగ్యులచే నిర్వహింపబడును. మానవరాగ ద్వేషములచేతను, స్వార్థముచేతను అతని పవిత్ర ప్రయత్నములు దోష భూయిష్టములగును.

ఈసమరములో నోటమియే సంభవించును. కాని యీ యపజయములన్నియు కలిసి నిర్మాతచే పరిత్యజింపబడు రాళ్ల వలె మరియొక నూతన సౌధమునకు పూనాది రాళ్లుఅగును. మోసెసు స్వర్గధామమునుచూచెను కాని ప్రవేశింపలేదందుము. కాని ఆ భూమి యచ్చటనే కలదు. అతడక్కడ యుండుటలేక

పోవుట యిస్రేలు దేశ భవిష్యత్తుకు నష్టముకాదు. అతడు దేని ముందర చనిపోయెనో ఆసీనుమధ్యనే యితరులు శాంతి, ఆనందములతో నధివసింతురు.

కనుక నితని జీవితముయొక్క ప్రధాన ప్రయత్నములను లెక్కవేయునపుడు మనమందలి ప్రధాన అపజయములనుగూడ లెక్కించుచున్నట్లు నాకు కాన్పించును. అపజయము విధాయిక మైనను అది ఫలభరితమైనదనికూడ గ్రహింతురుగాక !

అతడు ఓడిపోయిన సమరములను కొన్నింటిని పేర్కొందును. కాని వాని పాఠములు ఆచంద్రార్కములు; అపజయమును మరపించునవి.

మొదట నతడెట్టి యాయుధములును లేకుండ యంత్రిమును రాటముతో డీకొనెను. అతని యనుచరులే చాలమంది చెప్పినట్లది చాల జాలికరమైన ప్రయత్నము. ఇది విఫలము కాక తప్పదు. అయినను రాటచక్రము మనలో చాలమంది చిరకాలముక్రిందటనే మనస్తాపముతో గ్రహించిన సత్యమును, ఆత్మను శోధించు సత్యమును ద్యోతకము చేయుచున్నది.

యంత్రము జీవితమును మానవ స్థాయినుండి కూలద్రోసెను. అది మనమీద 'మేకై' స్వారిచేయుచున్నది. భారతదేశమంతయు వడికినను మనము దానిని జయింపజాలము. కాని వడుకుటవలన భారతదేశము తన బానిసతనమును గుర్తింపవచ్చును. నిరాడంబర జీవితమును మానవజీవితమును గడపిన

నాడది మానవాధిక్యతను స్థాపించుకొనులాగున ఘనలను పురి కొల్పవచ్చును. యంత్రభూతమును యుక్తమైన హద్దుపద్దులలో నుండునట్లు శాసింపవచ్చును; దానిని మానవాత్మపై యజ మానినిగగాక నతని బానిసగ చేసికొనవచ్చును; మానవుని నిజ శరీర,ఆత్మానందములకు కేవలము వ్యతిరేకముగనుండు నపుడు దానిని అడ్డగించి, యది ప్రసాదించు తాత్కాలికభౌతిక లాభ ములనుకూడ తిరస్కరింపవచ్చును.

రెండవది మానవ పశుపక్ష్యాదులపై చూపబడు క్రౌర్య మును డీకొనుట. ఈసందర్భములో నతడు పైవారితో గాక తన ప్రజలతోనే యెక్కువగ పోరవలసివచ్చెను. "తన జాతిని దాటి జీవకోటి యంతటితో నైక్యము కావలెను" అని యతడు మానవున కుద్బోధించెను. జీవితము పవిత్రమైనదను సిద్ధాంతము నతడు సమర్థించు నపుడతని హృదయము మూకజంతుకోటి బాధలచేగాక, వాని నుపేక్షించినందులకుగూడ వ్రక్కలగును.

మూడవది యధికార, దౌర్జన్యతత్వముల నెదిరించు యసామాన్య పోరాటము. ఇందు మానవరాగ, ద్వేష, క్రౌర్యములను భూతము నతడు డేవిడ్‌కంటెను నిరాయుధుడై పోరవలసివచ్చెను. ఏలయన నొక్క దౌర్జన్యరాహిత్యమే యతని యాయుధము.

అతడు శత్రువుచేతనేగాక తన మిత్రులచేతకూడ పదే పదే హింసింపబడెను. దౌర్జన్యపూరిత ప్రపంచములో దౌర్జన్య

రహిత మానవులు జీవించు టెట్లు? దౌర్జన్యము రాజ్యముచేయు చున్న ప్రపంచములో దౌర్జన్యరాహిత్యమే జీవించు టెట్లు? యుద్ధముకూడదను సమస్యను సాధించు టెట్లు? ఈసమస్యల నతడు పరిష్కరింపవలెను.

మహాత్ముని నిరంతరాయముగ నతని జీవితములో నెదుర్కొనిన సమస్యలను గ్రహింపగోరువారు 'యంగు యిండియా' పత్రికాపారాయణము చేతురుగాక!

ఈయంశమును చర్చించునప్పుడు విఫలతయే విజయ మని యతడు నిర్మొగమాటముగ చాటును. ఫలమున యీ సూత్ర మింకను యదార్థముగ నమలుపర్చబడలేదని యతడు చెప్పును. దీనిని ప్రయత్నించిచూడుము. ఆత్మను బాహ్యసాధనల ద్వారా రక్షించుకొను ప్రయత్నములను మానుకొనినంతవరకు మనము దాని నిజబలము నెప్పటికిని గ్రహింపజాలము.

"నేను నిరంకుశుని, ఖడ్గధారను మరింత నిశితఖడ్గధారతో ఢీకొనక పశుబలముతో నెదిరింతునను యాశనే భంగపరచి దానిని నిష్ప్రయోజన మొనరింపజూతును. దానికిబదులుగ నేను ప్రయోగించు నాత్మప్రతిఘటన మతనిని దిగ్భ్రమ చెందించును. అది మొదట నతనిని మిరుమిట్లుగొలిపి చివరకతడు దానిని గుర్తింపక తప్పని సరియగునట్లుచేయును. అట్లు గుర్తించుటలో నతడు పరాభవము చెందక నున్నతినిపొందుచున్నాడు. అదియొక యాదర్శస్థితియని మీరనవచ్చును. అవును, అదియట్టిదే!"

ఇచ్చుట కండ్లారగుర్తింపబడుచున్నట్టి విఫలతయు విశ్వాసమును జోడింపబడినవి. గాంధీజీ తన యుపదేశములను, ఆదర్శములను మానవజీవిత, రాగద్వేషరంగములమీాద వర్తమానమున (నథమముకొంతవరకైనను) విఫలమగు విధమున ప్రయోగించెనని మనము విచారపడవలయునా? దీనికి రెండు జవాబులుకలవు. విచారపడవలసినదే! మహత్తరమైన కొన్ని మానవాదర్శములు నిర్వీర్యమైనట్లా వ్వుకొనుట కెవ్వడంగీకరించును? ఒకప్రవక్త నికృష్టరంగములోని కీడ్వబడుట నెవ్వడు చూడగలడు?

విచారపడ నవసరములేదు! పోరులోనున్న పశుత్వమే ఆదర్శములపట్ల మానవులకండ్లను బలవంతముగ తెరపించెను; లేనిచోనవి యేకొద్దిమంది యోచనపరుల హృదయకుహరములలో నో దాగొనియుండెడివి. యూదులు జీససునుకొట్టుటకు పూర్వమతని ముఖమునవలోకింపక తప్పదయ్యెను; ధర్మ, సాధు సందేశములను నిరాకరించుటకు పూర్వము మానవులు వానిని వినవలెను.

దెబ్బలు తినకుండ మనము పోరగలమా? మనముకూడ కొట్టకూడని వారిని కొట్టకుండ నెట్లుపోరగలము ? కనుక మహాత్ముని రాజకీయపోరాటములో మంచిచెడుగులు రెండును కలిసియున్నవి.

కాని కలహములతోను స్పర్థలతోను నిండిన యీప్రపంచ హోరుమధ్య మానవలోకముకంతకు నొక కారుణ్యా సందేశము

బయలుదేరెను; ఇది ప్రాచ్య, పాశ్చాత్యములకు రెంటికినన్వ యించుసందేశము; ఇది హిందూసందేశమేయైనను చాలవరకు క్రైస్తవభాషలో నుడువబడెను. కనుక నేను వినయపూర్వ కకృతజ్ఞతార్పణలతో మహాత్మగాంధీయొక్క స్థానిక, జాతీయ నీతిని యుపేక్షింపగోరెదను. అతనిని, అతని సందేశమును మన దేశమేకాక యావత్ప్రపంచము చూడగోనగోరెదను.

---

# గాంధీజీ బుద్ధిసంపన్నత.

## హెచ్. యస్. యల్ పోలక్ (లండను)

"ఆధునికభావ నిర్మాతలు" అనునంశముమీద కొన్ని వత్సరములక్రిందట గిల్డుహాసులో నిప్పించిన యుపన్యాసము లలో గాంధీజీనామమూరక జేర్పబడలేదని గ్రహింతురుగాక ! నేటి యుత్కృష్టమానవులెవరు? వారు ప్రపంచమునకెట్టి భావ ములను, అచరణను ప్రసాదించిరి? అనునంశమును తేల్చునప యమువచ్చునపుడీ భారతనాయకమణి పేరును మించినదేదియు నుండజాలదని చెప్పకతప్పదు.

ఇంతకంటె తసదుగ మూనవులచే నుచ్చరింపబడుయితర నాయకులు ప్రపంచమున నెందరోకలరు. వారు జీవితమునుగాక

మృత్యువును సృజించిన నాయకులు! ఉన్నతికిగాక నధఃపాతాళ మునకు గొంపోవసమర్థులైన నాయకులు; దౌర్జన్యరాహిత్యము ను, ప్రేమను చిలికిన నాయకులుగాక దౌర్జన్య, ద్వేషములను పురిగొల్పిన నాయకులు! ఉదారనాగరికతకు ముందుకు గొంపోవు నాయకులుగాక ననాగరికతకు వెనుకకు తీసికొని పోవునాయకులు; జాతిని జగత్పితయైన భగవంతుని క్రిందనుండు మానవసాహచర్యమునకుగాక జాతి "యాధిక్యత" యనునసత్య దివ్యసిద్ధాంతమునకు తీసికొనిపోయిన వినాయకులు!

కాని చరిత్రబోధించు గుణపాఠముల నవగతముచేసి కొనుచు, ఫలితములను పరిశోధించుచు, ధూమావృతమైన చరిత్రవైపు వెనుకకు త్రిరిగిచూచినచో నీయాధునిక సీజరుల (నిరంకుశులు) దౌర్జన్యముగాక గాంధీజీ యహింసాసిద్ధాంతమే చిట్టచివరకు జయించితీరునని చెప్పుటకెవడు సందేహించును? అతని విజయములు మానవలోకము నుద్ధరించు ఆత్మవిజయ ములు; వారివిభౌతిక ప్రపంచమునకు చెందినవి; వారిమార్గము లు రక్తసిక్తములు; అశ్రుధారా ప్రపూర్ణములు. అతడు తన బాధలద్వారా శత్రువులజయింపగోరును; వారో! తమమార్గ ముకడ్డమువచ్చిన వారినందరను, సమస్తమును నిర్దాక్షిణ్యముగ తెగనరుకుదురు.

చాల వత్సరములక్రితము గాంధీజీ నాతో నిట్లుచెప్పెను. "నేను రాచకీయములలో నణగిపోవుచున్న ఋషినినిజనులందురు.

చున్న రాచకీయవేత్తను" స్వయంశిక్షణద్వారా పూర్ణత్వ మును ప్రయత్నపూర్వకముగ సాధింపగోరు మానవ అపరి పూర్ణత యితకంటె వినయ పూర్వకముగ, హృద్యముగ, నాధునికముగ తన యసమగ్రత నంగీకరింపజాలదు. "సత్యా న్వేషి" యైన యతడు గత యేబదివత్సరముల జీవయాత్రలో నొప్పుకొనిన దోషకార్యములకు ప్రమాదములకు నిదియే సమాధానము. "సత్యముకన్న గొప్పమతములేదు" అని చాటుట కతడెన్నడును జంకలేదు. దీని నొప్పుకొనుటకు మన మొక పరిస్థితి నన్వయము చేసికొనుటలోగాని, దాని నెదు ర్కొను నుత్తమ పద్ధతినిగురించి కాని యతనితో నేకీభవించ నక్కరలేదు. స్థిరమైన దృష్టిని, విశ్వాసమును కలిగియుండుట కింతకంటె కావలసిన దేమున్నది ? అప్పుడప్పుడతడు ప్రమాద ములకు లోనగుచో నవి సత్యపథమున మానవానుభవములు కావా ? అవి యతని నప్రమత్తునిగచేయు మందలింపులు; వాని వలన తన దోషములను సవరించుకొని తానేర్పరచుకొనిన లక్ష్యమునకు మరింత ప్రమాద రహితముగ పోవుచుందునని యతడు చెప్పను. అతని జీవయాత్రలో నతడనేక గుణపాఠము లను నేర్చుకొని యామార్గముననే పోవువారికి పెన్నిధియగు ననుభవజ్ఞానమును సంపాదించెను. కేవల "మంత్రో" చ్చాట నలవలన నతడు తృప్తిపడడు; వానికి మానవ జీవితావసరము లకు సంబంధించిన సామాన్యకార్యములకు సరిపడు యర్థముండ

వలెను. పైగ నతని యభిప్రాయములో నవి విశ్వముకంతకు నన్వయింపవలెను; లేనియెడల నవి యెంతమాత్రము నిజము కావు. కనుక నహింస జీవితములో నాచరణ యోగ్యమైన సూత్రమను నతని వ్యాఖ్యానమునకు మన మాశ్చర్యపడ నవస రములేదు.

"ఇరుగు పొరుగుతో పరస్పర సంబంధములలో దార్జన్య రాహిత్యమును ప్రయోగింపక దానిని గొప్పవ్యవహారములలో నుపయోగింపగోరువాడు చాల పొరబడుచున్నాడు. ధర్మము వలెనే దార్జన్య రాహిత్యముకూడ మొదట తనతోనే ప్రారంభ ముకావలెను. వ్యక్తికి దార్జన్య రాహిత్యమున శిక్ష యవసర మైనచో జాతికిని మరింత యవసరము. ఒకడు తన స్వజనముతో దార్జన్య రాహిత్యముగను పైవారితో దార్జన్యముగను నుండ జాలడు. అట్లుండుచో నతడు తన వారిపట్లకూడ యదార్థ దార్జన్య రాహిత్యము నవలంబింపడని యర్థము; తరుచు ఆ దార్జన్య రాహిత్యము బాహ్యాపటాటోపము. నీవు ప్రతి ఘటనల నెదుర్కొనవలసిననాడే......నీ దార్జన్యరాహిత్యము పరీక్షింపబడును ...... సరసమైన వారిమధ్య జీవించునపుడు నీప్రవర్తన దార్జన్య రాహిత్యమైనదని నిర్వచింప వీలులేదు. పరస్పర సహనమే దార్జన్యరాహిత్యము. కాన దార్జన్య రాహి త్యమే జీవిత ధర్మమని విశ్వసించినవాడు నీవు దార్జన్యమును దార్జన్య రాహిత్యముతో నెదుర్కొనవలెను; ఈధర్మము వ్యక్తి

కన్వయించినట్లే జాతికిని అన్వయించును. శిక్ష యుండవలసినదే! ప్రారంభము లెప్పుడును చిన్నవిగనే యుండును. కాని విశ్వాస ముండినచో తక్కినవన్నియు సమకూరును."

తమ యధికారవాంఛచే ప్రపంచమతి యాప్యాయముగ చూచుకొను నుదారవిషయములను నాశముచేయసమకట్టిన నిరంకుశులకిట్టి యుపదేశమువట్టి పిచ్చితంతుగ కన్పట్టును! దౌర్జన్యమునకు, క్రౌర్యమునకుగురియైన వారికిని, ఆధునికవిజయము యొక్క నిర్దాక్షిణ్యతకును, దాహమునకును బలియగుచున్న వారికినికూడ నిదిపిచ్చిగతోచును. అయినను, ద్వేషము ప్రేమ చేజయింపబడును; మానవుడు తనవలెనే తన యిరుగు పొరుగును ప్రేమింపవలెను; మనమందరము నొకకుటుంబములోని వారమే యనిబోధించిన గాంధీజీయు, నతనియాధ్యాత్మిక కానుభూతు లును న్యాయమును వచించుటలేదా?

ఇతరులను " నాయకులు " అనిపిలుచుచుండ గాంధీజీని "మహాత్ముడు " అనియూరకపిలుచుటలేదు. " ఆత్మశక్తియసమానమైనది. ఆయుధశక్తులకంటెనది భిన్నమైనది. అది కేవల దుర్బలుల ఆయుధముకాదు. పశుశక్తి నుపయోగించువారు ఆత్మశక్తిప్రభావము నెరుగరు. సత్యాగ్రహికుండవలసిన ధైర్యము పశుశక్తి నుపయోగించు వానికుండదు. నిజమైనయోధు డెవడు? మృత్యువు నెప్పుడును స్నేహితునివలె నాలింగనముచేసి కొనువాడా లేక మరియొకడా? . . . మనస్సును వశపరచుకొను

టొక్కటియేచాలును. అదివశమయ్యెనా మానవుడుముక్తుడే ! ...అట్టివాని వీక్షణమేశత్రువులను మాడ్చివేయును." అని ముప్పదివత్సరముల క్రితమే దూరదృష్టితో వ్రాసిన పురుషుడు మహాత్ముడే. "ఒక్కసత్యాగ్రహి చివరవరకు నిలిచినను విజయ ముధ్రువమని నాకచంచల విశ్వాసముకలదు." అని యతడు నిస్సంకోచముగ చాటుటలో నాశ్చర్యమేమియులేదు.

కత్తినిఝుళిపించు నాయకులీరోజులలో మైక్రోఫోనుల ద్వారా ప్రపంచమున కాజ్ఞలను పంపుచున్నారు; వారు తమ యాజ్ఞలను బాంబు ప్రయోగములతోనో లేక విషవాయు ప్రయోగముతోనో మేళవింపచేయుదురు; ఇతరజాతులపై తమ విజయపరంపరలను గురించి ప్రలపించుచు స్వాతంత్ర్య స్మశాన వాటికలమీద విజయమత్తతతో నడిచెదరు; ఇక ప్రజలో! వారు వారిగర్వాతిరేకమున కుపకరణములు ; వారి దౌర్జన్యములకు లక్ష్యములు. మానవుని యాధ్యాత్మికశక్తులను జారవిడిచిన మనమెక్కడ ! శాంతి, ప్రేమ, సౌభ్రాతృత్వమను ప్రాచీనసందే శమునుతిరిగి పూరించుచున్న నేటి యీభారతాచార్యుడెక్కడ! ఎప్పటివలెనే నూతనయుగ సందేశము తిరిగి మనకు ప్రాచ్య ఖండమునుండియే వచ్చినది. వినవలెనను జ్ఞానము, నేర్వవలెనను బుద్ధిమనకున్నాదా? తానేదియో క్రొత్తగ కనిపెట్టినట్లతడు నటింపడు. "సత్యమునుగ్రహించిన ఋషితనచుట్టు ప్రజ్వలించిన దౌర్జన్యమునుండి దౌర్జన్యరాహిత్యమును కనుగొని 'దౌర్జన్య

మయదార్థము, దౌర్జన్యరాహిత్యము సత్యము" అనిచెప్పెను. నేఁను యువకజనము (ఒకపురుషాంతరము క్రిందటి వారివలెనే) మతము నవహేళనచేయుటయు నదిమానవాజ్ఞాన, బుద్ధిహీనతల 'ఛాందస' మని తిరస్కరించుటయు నాచారమయ్యెను. హిందూ దేశములోకూడ నీయసత్యవేదాంతమే చెలరేగి యనేకమంది స్త్రీపురుషులు "యీశిశువును పురిటినీళ్ళతోసహా త్రోసివేయ" ప్రయత్నించుచున్నారనుట కెట్టిసందియమునులేదు.

వారు తమ ప్రాచీనఋషుల ప్రవచనములను పునశ్చరణ చేసికొని ప్రాచీన విజ్ఞానములోని యదార్థభావమును తిరిగి కను గొనెదరుగాక! కానివారు భూతకాలజ్ఞానమునుండి నేర్చుకొన నిచ్చగింపరేని యధమము తమ యసమాన జాతీయనాయకుని ప్రమాణవాక్యములనైన పాటింతురుగాక! "మతము మనకు విజాతీయమైనదికాదు; అది మనలనుండినే పరిణామమునొంద వలెను; అది యెప్పుడును మనలోనేయుండును. కొంతమందిలో నదిబుద్ధిపూర్వకముగను కొంతమందిలో నబుద్ధిపూర్వకముగను నున్నను నదియెప్పుడు మనలోనేయుండును. మనలోనున్న యీ మతస్వభావమును మనము బాహ్యాపరికరముల వలనగాని యాంతరంగికముగ గాని పొందవచ్చును; దేనిని యుక్తముగ చేయవలెననినను శాశ్వతత్వమును సాధింపవలెననినను మనకిది యవసరము."

"అహింస" సత్యమునకు సారభూతమైనది; దార్జన్యారాహిత్యము మతములలో నుత్తమోత్తమమైనది అనియతడు మనకు చెప్పును. "శత్రువు అని నీచేభావింపబడు వాడెన్నడును మరువజాలనట్లు నీవు ప్రేమను (అహింసను) చిలుకుదువేని యతడదే విధమున నిన్ను ప్రేమింపక తప్పదు."

టాల్‌స్టాయి తరువాత "మానవజాతిని ప్రేమించువాని", నింకొకని నింత త్వరితముగ ప్రసాదించిన యుగమున జీవించుట మ యదృష్టము. ఋషులు, మునులు, ప్రవక్తలు, భక్తులు, వాతావరణము నెట్లు పునీతమొనర్చి యీ "యంధకార బంధుర మున" జ్ఞానమునెట్లు ప్రసరింప చేయుచున్నారు! మన యాత్మలను పరిశోధించుచు, మన దివ్యప్రకృతిని తిరిగి గ్రహింప చేయుచు, మన యుద్యోగ శక్తులను విస్తరింపచేయుటచే ధైర్యోపేతులమై మనమింకను అధిరోహించవలసిన శిఖరాగ్రముల కవలీలగ గొంపోవునట్లు యుగయుగముల మనకు సాయపడు నీయాధ్యాత్మిక "ప్రక్షాళకులు" లేనిచో మనమేమి చేయగలము?

ఆలివ్ ష్రీనరు అను నామె తన గద్యపద్యములలో నొక కథను చిత్రించెను; "సత్యదేవతయను పక్షి" నన్వేషించిన వాని సాహస కృత్యముల నామె వర్ణించెను. ఒకనాడా దేవత యతనికి ప్రత్యక్షమైనట్లు యతడామెను వెంబడించి యాపక్షినుండి జారిపడిన యొక యీకెను అక్కున జేర్చుకొని యొక పర్వతా

గ్రమున మృతుడై పడియున్నట్లు ఆమె వర్ణించెను. గాంధీజీ తన డెబ్బదియవ వత్సరమున మన కొసంగు సందేశమట్టి యీ కొనయే యగుగాక ! మనము చనిపోవునపుడు యీయీ కొనను హృదయమున జేర్చుకొని మన స్వంతము చేసికొనిననాడు మన మెంత ధన్యాత్ముల మగుదుమో కదా !

---

# భిక్షుకుని వేషములోనున్న రాజనీతి కోవిదుడు.

**సర్ అబ్దుల్ ఖాదర్**

కొన్ని వత్సరములక్రితము నేను వియన్నానగరము దర్శించి యొకనాటి మధ్యాహ్న భోజనమున కొరకు పెద్దహోటలు చేరుకొంటిని. ఆప్రదేశమంతయు జనాకీర్ణమైయుండెను. నాకచ్చటచోటు దొరకుటే దుర్ఘటమయ్యెను. ఇంతలో వడ్డించువాడొకడువచ్చి నాకేమి కావలసినదియు నడుగుటకు బదులు "గాంధీజీ దేశమునుండి వచ్చితిరా ?" యని ప్రశ్నించెను. "అవును నేను హిందూదేశమునుండి వచ్చితిని; నేను గాంధీజీని చూచి యతనితో కొద్దిసారులు మాత్రమే సంభాషించితిని" అంటిని. దీని కతడెంతయు సంతసించి "గాంధీజీని చూచినవాని

నొకనిని కలుసుకొంటినని నేనిప్పుడు చెప్పుకొనగలను" అని సగర్వముగ పలికెను.

గాంధీజీ పేరు చాలదూరము వి స్తరించెనని నే నెరుగుదును. కాని భారత దేశముతో సంబంధ మెంతమాత్రమును లేని యీ మారుమూల దేశములోని బికారుజనముకూడ నతనినిపూజించు చున్నారని నే నూహింపజాలక పోతిని.

దీనితో నా యాలోచనలు 1931 నాటికి వెనుకకు మరలెను. నే నపుడు లండనులో నుంటిని. మహాత్ముడు రెండవ రౌండు టేబిలు సమావేశమునకు వచ్చెను. అతడా సభకు వచ్చుట పొరపాటనియు, గౌరవభంగమనియు కొంతమంది భారతీయులు తలంచిరి. కాని లండనులో నతడిచ్చిన బహిరంగోపన్యాసములు తన దేశమునకు సంపూర్ణ రాజకీయ స్వాతంత్ర్యము కావలెనని చచ్చులేకుండ చాటి బుద్ధివంతులగు ఆంగ్ల ప్రజలను మెప్పించి యీ దేశములో ననుకూల వాతావరణమును కలిగించెను.

అతని వేషమును కొంతమంది విమర్శించిరి; కానిగాంధీజీ యట్టివిమర్శను లెక్కపెట్టువాడుకాడు. అతడా సభకు హాజరగుటలోగల ప్రాముఖ్యతలోను యతనివ్యక్తిత్వములోను అదియణగిపోయెను. అతని యంతరాత్మకు మంచిదనితోచిన విధానము నతడు నిర్ణయించుకొని యెవ రేమనినను దానిని లక్ష్యముసేయడు. కనుక నతడు ఇంగ్లండులో నున్నంతకాలము తాను వత్స

రములకొలది ధరించుచున్న వేషమునే వేసెను. మొలచుట్టునొక యంగవస్త్రము, నగ్నపాదములు, ఋతువునుబట్టి భుజముపై నొకఖద్దరు పచ్చడములేక కంబళి – ఇదియే యతనివర్తమాన వేషము. రౌండు టేబిలుసభలలోగాని, ఫ్రాన్సులోగాని మరెచ్చటగాని యతనివేషమిదియే! దీనిని వారించువారులేరు. రౌండు టేబిలుసభలకుపై వారిని రానీయరు. ఒక్కొక్కప్పుడు సెక్రటరీ స్థానములో కొద్దికాలమెవరినైనను ప్రత్యేకవిషయముగ నుంచవచ్చునని తెలిసికొని యొకనాడు నేనందు ప్రవేశించితిని. సేంకీ ప్రభువు అధ్యక్షుడు. అతని కుడివైపు భారతకార్యదర్శి సర్ సామ్యుయల్‌హోర్, పార్లమెంటరీ ప్రతినిధులుకలరు. ఎడమవైపుగాంధీజీ కగ్రస్థానమీయబడెను. తరువాత భారతప్రతినిధులుకలరు. సేంకీప్రభువు గాంధీజీ యెడల చూపిన గౌరవాతిశయములు గమనార్హములు.

బకింగుహాంసౌధ సోపానములు రత్నకంబళ ఛాయలనీనుచుండెను. భుజముపై ఠీవిగ శాలువగప్పి గాంధీజీ రాజదంపతుల నభినందించుటకా సోపానములపై చఱచఱనడచి పోవుచుండచూచి సాంప్రదాయము నతిక్రమించుట కతనికిగల స్వేచ్ఛకు నేనబ్బురపడితిని. ఆసౌధమట్టి దుస్తులుగల ప్రేక్షకుని యెప్పుడునుచూచి యుండలేదు. మరియొకని కెవ్వనికిని యట్టి స్వేచ్ఛ యొసంగబడునని నేనను కొనను.

ఇచ్చట రెండు ప్రశ్నలుదయించును. గాంధీజీ యిట్టి దుస్తుల నేల ధరించవలెను? సుస్థిరముగ స్థాపింపబడిన యాచారము నతిక్రమించుట కతనికట్టి యసాధారణాధికారము దేని వలన సంక్రమించెను ?

ఇంగ్లండులో బారిస్టరు పరీక్ష చదువు రోజులలో నతడు కేవలము దొరగారి వేషములో నుండెడివాడు. బారిస్టరై యిండియాకు తిరిగివచ్చి యొక కేసులో నతడు దక్షిణాఫ్రికా వెళ్ళి తదారభ్య యచ్చటనే స్థిరపడిపోయెను. అప్పుడే యతడు తన జీవితమున కొక గంభీర ప్రయోజనము నేర్పరచుకొనెను; అచ్చట స్థిరపడిన తన దేశస్థులకొరకెట్టి త్యాగములనైనను చేయ సమకట్టెను. వారి దుఃఖములు, కష్టపరంపరలు అతనిలో నొకమార్పు తెచ్చిపెట్టెను. దక్షిణాఫ్రికాగాథ యందరికిని తెలిసినదగుటచే నిచ్చట పునశ్చరణ యనవసరము. అతడు హిందూ దేశము తిరిగివచ్చి భారత స్వాతంత్ర్య పోరాటములో దిగుట తోడనే లాయరు ప్రాక్టీసు మానివేసి సాంఘిక, రాజకీయ సంస్కరణలకొరకు తన సర్వస్వము నర్పించెను. ఈ స్థితిలో నతడు తన జీవిత ప్రమాణమును తగ్గించుకొనెను. గాంధీజీ వేషము అతి బీదవాని వేషము. "త్యాగము ఉత్తమోత్తమమైన మతమని యతడు లండనులో విద్యార్థిగ నుండగనే గ్రహించెను" అని యతడు తన జీవితగాథలో వ్రాసెను. బాల్యమునాటి యాబీజమే నేడువృక్షమై ఫలదాయకమయ్యెను.

మొదటి ప్రశ్నయొక్క సమాధానములోనే కొంచెె మించు మించు రెండవ ప్రశ్నకును సమాధానము వచ్చుచున్నది. అతనికై యతని కేమియు నక్కరలేకపోవుటలోనే యతని బలముకలదు. అతని జీవితమున కష్టపరంపరలు, ఖయిదులు, దెబ్బలు, అవమానములు, విజయోత్సవములు, జై జై రావములు నొకటి తరువాత నొకటి వచ్చుచుండును. కాని యీ యన్నింటిలో "స్వార్థము" పదవి, హోదా, భృతియను సమస్యయతనికి లేనేలేదు. అతని జీవితములోని యీ విషయమే యతని శత్రుమిత్ర హృదయముల సమానముగ నాకర్షించెను.

మన దేశముయొక్క భవిష్యత్తునుగురించి నిర్మొగమాటముగ చర్చించుటకు గవర్నరులు, వైస్రాయిలు అతని నాహ్వానించుచుండురు. సంస్థానాధీశులతనితో సంప్రదించెదరు. మంత్రులతని సలహా తీసికొనెదరు. ప్రసిద్ధ భారతకవియగు సర్ మహమ్మదు ఇగ్బల్‌యొక్క ప్రవచన మితనిపట్ల నెంతయు నొప్పియుండును. "తిరిపెమునెత్తని భిక్షుకునిచూచిన రాజు హృదయము కంపించును." ఈ "తిరిపెమెత్తకపోవుట", స్వార్థమునకతీతుడగుట గాంధీజీ కద్భుతమైన పలుకబడిని ప్రసాదించెను.

రౌండు టేబిలు సమావేశ కాలమున నతడింగ్లండులో నున్నపుడు కింగ్సులీహాలులో నివసించుచు తీరిక దొరికినపుడెల్ల బీదలతో కాలము గడిపెడివాడు. వారితో నతడెల్లపుడును సరససల్లాపములాడుచు నొక విధమగు బంధుభావము ననుభ

వించెడివాడు. అతడిష్టపడినచో లండను మహానగరమున నేభవ్యహర్మ్యములోనో లేక సమస్త సదుపాయములునుగల యే మిత్రగృహముననో యుండగలడు. కాని యతడట్లుసేయక మ్యూరియల్ లెస్టరుకన్య యాహ్వానము నంగీకరించి కింగ్సులీ హాలులో విడిదిచేసెను. అప్పుడతని కీయబడినగది నేటికిని గాంధీజీ గదియని పిలువబడుచున్నది. గాంధీజీ యెచ్చటనున్నను, యెవరిమధ్యనున్నను ప్రేమను వెదజల్లగలడు. దక్షిణాఫ్రికాలో భారతీయుల హక్కులకొరకు పోరాడిన నాడతడొక భక్తకోటిని సమకూర్చుకొనెను. అందులో యూరపియనులుకూడ కలరు. తరువాత నతడు తనకర్మ క్షేత్రమును విశాలమగు భారతదేశముకు మార్చినపుడంతకంటె నుత్సాహపరులగు ననేకరెట్లమంది సేవకుల నాకర్షించెను. 1931 లో నతడు యింగ్లండు దర్శించి నపుడీసంఖ్య మరింత వృద్ధియయ్యెను. హిందూదేశము తిరిగి వచ్చిన తరువాత నతడు బంధింపబడినపుడు జయిలరులతనిని చూచి ముగ్ధులగుచుండిరి. జయిలులో నుండగ నతడొకసారి వ్యాధిగ్రస్తుడయ్యెను. ఆస్పత్రిదాదులతనికి సమస్తోపచారములను చేసిరి. వ్యాధితగ్గి యతడు తనవార్డును వీడిపోవునాడా దాదులు విచారకలుపిత నేత్రులై బొటబొట కన్నీరుకార్చిరి. ఆకారముచేగాక నాత్మప్రసన్నతచేతనే యతడంత మోహనుడగుట గమనింప దగినది. గాఢమైన భగవద్విశ్వాసము, మతాభినివేశము అనన్యప్రేమకు మూల కందములు.

అతని విశ్వాసమును తెలుపుఘట్టము లనేకములతని యాత్మకథలో పేర్కొనబడినవి. దానిక్రింది యుదాహరణము లుచాలును. "పూర్ణత్వముకొరకనంత ప్రయత్నములు సేయుట యేమానవధర్మము. దానిఫలితమునదియే చేకూర్చుకొనును. తక్కినదంతయు దైవాధీనము." మరియొకచోట నతడిట్లువ్రా సెను. అతనిజీవితారంభములోనే దక్షిణాఫ్రికాలో "అతనిలో నున్నమతావేశము చైతన్యవంతమగు శక్తియయ్యెను." అప్పటి నుండియు నాతత్వమే జీవితమంతట కానవగునని యతనిజీవిత మును పరిశీలించినవారు చెప్పుదురు.

దేశసేవలోను, మతసేవలోను, మానవసేవలోను జీవితమున డెబ్బదియేండ్లు గడిపినగాంధీజీ కసంఖ్యాకములగు పొగడ్తలు వచ్చును. అందులో చాలవరకతనితో కలిసి పనిచేసినవారు లేక నతనిని బాగుగనెరిగినవారు నుందురు. నాకతని పరిచయ మతిస్వల్పము. అతని నీతిని కార్యవిధానమును నేనంగీకరింపక పోయినను నతని యుదారప్రవర్తనమును, యావజ్జీవము భారత దేశమున కతడొనర్చిన సేవనుగుర్తించుటలో నేనెవరికినితీసిపోను. భారతప్రజానీకములోకలిగిన యద్భుతప్రబోధముయే.యితరజీవ పురుషునికంటె నతని పరిశ్రమవలనను పలుకుబడివలనను యెక్కు వగకలిగెనని చెప్పకతప్పదు. నేటినాస్తిక, విషయోపభోగ పూరిత ప్రపంచములో నాత్మశక్తి ప్రభావమునకత డుదాహ

రణము; కనుక నేయతడు అతనిప్రజలచే నొసంగబడిన 'మహాత్మ' అను బిరుదు కెంతయు తగియున్నాడు.

—*—

# గాంధిజీకి భారతదేశ ఋణము.

**బాబు రాజేంద్రప్రసాద్, యం. ఏ.**

గాంధీజీ భారతరాజకీయముల కపార సేవచేసెను. 1915 లో నతడు దక్షిణాఫ్రికానుండి భారత దేశమునకు తిరిగి వచ్చి నప్పటికి కాంగ్రెసు ముప్పదివత్సరముల ప్రాయముననుండెను. కాంగ్రెసువలన జాతీయప్రబోధము కొంతవరకుకలిగెను. కాని యది యింగ్లీషుచదువుకొనిన కొద్దిమంది మధ్యతరగతుల వారికే పోకెను. దానికి ప్రజలతో సంబంధములేదు. అతడు దానిని ప్రజలలో ప్రవేశపెట్టి ప్రజాయుక్యమముగ మార్చివేసెను. మహాత్మాగాంధీ యుద్యమము సర్వతోముఖమైనది. రాచకీయ ములకు పూర్తిగసంబంధించక పోయినను ప్రజానీకముయొక్క నిత్యజీవితమున కతిసన్నిహితమగు విషయముల నతడుచేపట్టెను. చాంపరాన్‌లోని వ్యవసాయకులు, కూలీలు నీలిమందు వ్యాపా రస్తుల లాభములకొరకొక శతాబ్దముకుపైగ నన్యాయమైన నిర్బంధపరతులతో నీలిమందు పైరుచేయవలసియుండెను. గాంధీజీ వారి పక్షమువహించి విజయపదమ్ముగ సత్యాగ్రహ

మును జరుపుటతోడనే కాంగ్రెసు ప్రజాసంస్థయయ్యెను. కైరా జిల్లాలో నక్రమముగ విధింపబడినభూమిపన్ను తగ్గింపుకొరకై జరుపబడిన సత్యాగ్రహముకూడ నాజిల్లాప్రజలను మేల్కొలిపెను. కాంగ్రెసు రాచకీయములు గవర్నరుల కార్యనిర్వాహక వర్గములో స్థానములను, దేశములోని పెద్ద యుద్యోగములలో నెక్కువభాగమును కోరుటతో తృప్తిపొందలేదు. అది ప్రజానీకముయొక్క కష్టనిష్టురములతో నైక్యమగుటయేగాక వానిని నివారించెను. 1917-18లలో ప్రారంభమైన యీయుద్యమములవంటివే మరికొన్నికలవు. ఈయన్నింటి లక్ష్యము నొకచిన్న వర్గములేక తరగతియొక్క లాభముకాక బహుజనలాభమని గుర్తింపవలెను. ఈనివారణకొరకొక్క బ్రిటిషుప్రయోజనములతోను, ప్రభుత్వముతోను గాక భారతప్రయోజనములతో గూడనంత తీవ్రముగనేపోరెను. ఫ్యాక్టరీలలోపనిచేయు కూలీల దుస్థితి గాంధీజీదృష్టి నాకర్షించెను; ప్రప్రథమముననే యతడు అహమ్మదాబాదుకూలీల దుస్థితినిచక్కబరచెను. నిమ్నజాతుల స్థితి హృదయ విదారకముగనుండుటచే నతడీక్రూర దురాచారముపై దండెత్తి దీనికొరకు తనప్రాణమునుకూడ నొడ్డెను. కాంగ్రెసు సంస్థకూడ దినదినాభివృద్ధిగాంచి యావద్భారతమునలముకొని నేడు లక్షలకొలది సభ్యులతో నలరారుచున్నది. కాంగ్రెసుయొక్క పలుకుబడి దానిసంఖ్యసూచించు దానికంటె నెక్కువగ విస్తరించెను.

అతడు భారత ప్రజలలో రాజకీయ ఆత్మాభిమానమును రగుల్కొలిపి వారికి మున్నెన్నడును లేని సంఘటనశక్తిని ప్రసాదించెను. ఇదియే గాంధీజీయొక్క యుత్కృష్ట సేవకాదు. భారత రాజకీయములకేకాక తప్తమానవలోకము కంతకు నతడొక యసమానాస్త్రమును ప్రసాదించెను. అతడ న్యాయములను, అక్రమములను నివారించుకొనుట కొక యుపాయమును కనిపెట్టెను. రవి యస్తమించని బ్రిటిషు సామ్రాజ్యముతో నాయుధములు లేకుండ పోరవచ్చునని యతడు మనకు బోధించెను; అతడు మనకును ప్రపంచమునకునుకూడ యుద్ధముకు మారుగ నొక నైతిక విధానమును చూపెను. అబద్ధములతోను, కుతంత్రములతోను దుష్టమయిన రాచకీయముల నతడత్యుచ్ఛమైన యాదర్శస్థితికి గొంపోయెను. రాచకీయములలోగూడ నతడు సత్యమునకు (దాని ఫలితము తాత్కాలికముగ నుపద్రవకరముగ కన్పించినను) అద్వితీయస్థానము నిచ్చెను. అతడు మనలోనున్న దుర్బలత్వములను, దోషములను మన శత్రువులనబడు వారియెదుట నిర్మొగమాటముగను, బుద్ధిపూర్వకముగను నొప్పుకొనునపుడు మిత్రులుకూడ డిల్లపోవుచుందురు. కాని మన దుర్బలత్వములను కప్పిపెట్టుకొనుటలోగాక వానిని తెలిసికొని యెదుర్కొనుటలోనే మనబలము కలదని యతడు చెప్పెను. తూచా తప్పకుండ దార్ఢ్య్న రాహిత్యము నవలంబించుట (దానిని కొంత సడలించుట లేక యుపే

క్షించుట తాత్కాలిక లాభముగ కాన్పించినను) సరళమైన నీతియేగాక బుద్ధివంతమైన నీతియని యనుభవము చాటుచున్నది. ఆతని బోధనలలోనున్న నైతిక, ఆధ్యాత్మిక ఆవేశమే ప్రజాహృదయము నాకర్షించెను. సర్వత్ర అంధకారమావరించియుండ మన దుఃఖ, దాస్యాంబుధినుండి మనలను తరింపచేయగల నావికు డతడొక్కడేయని వారు గ్రహించిరి. మనము పూర్తిగ నిర్వీర్యులమై యున్నపుడతడు సత్య, అహింసలద్వారా మనము మన నిజబలమును గుర్తించునట్లుచేసెను. ఇంతకు మానవుడెట్టి ఆయుధములతోను పుట్టలేదు. చివరకు పెద్దపులికున్న కోఱలుగాని, అడవియెనుముకున్న కొమ్ములుగాని యతనికిలేవు. అతడొక యాత్మతోను మనస్సుతోను పుట్టినాడు. అతడు తన రక్షణకొరకును, ఉన్నతి కొరకును నీబాహ్యపరికరములమీద నేల యాధారపడవలెను? మనము వానిపై నాధారపడునంతవరకుమృత్యువు, వినాశము తప్పదనిమహాత్ముడుమనకు బోధించెను. మనలోనున్న ఆత్మను ప్రేరేపించిననాడు జీవితము, స్వాతంత్ర్యము మన దేయగును. ఒకసారి ఆ యాత్మయుద్దీపితమైనచో నొకసారి బాహ్యపరికరములమీదను పరిస్థితులమీదను ఆధారపడుటపోయి ఆత్మవిశ్వాసము చేకూరినచో నీ ప్రపంచములో నేశక్తియు మనలను దాస్యమున నుంచజాలదు. భారతదేశము క్రమక్రమముగ (కాని నిశ్చయముగను స్థైర్యముగను)

నా యాత్మజ్ఞానమును పొందుచు దానికి తగిన యప్రతిహత శక్తిని సంపాదించుచున్నది. మహాత్మగాంధీ నాయకత్వము క్రింద భారతము చేపట్టిన సత్య, అహింసలను సరళ అసిధారా మార్గమును వీడకుండునట్లు భగవానుడనుగ్రహించును గాక! అదియే మహాత్ముడు భారత రాచకీయములకు ప్రసాదించిన మహత్తరవరము. అదియే భారత దేశము ప్రపంచ మోక్షమున కిడుకానుక !

—॰—

# భగవదున్మాది

## రెజినాల్డు రెయినాల్డ్సు (లండను)

భగవంతుడు తన భక్తులను వింతరూపమున ప్రపంచమున వెదజల్లి యిట్లనెను "కాలమును మించిన జ్ఞానమును బోధింపుడు; అష్టకష్టముల నెదుర్కొనుడు; పరివర్తన మార్గములను సృష్టిచేయుడు" అని 'భగవదున్మాదులు' అను తన పద్యములో హార్ల్సు అను నాతడు వ్రాసెను. దీనిని నేను భారత దేశముకు పోవుటకు కొద్దిమాసములముందు విశ్వభారతి క్వార్టర్లీ పత్రికలో (1929 లో) చదివితిని. ఆ పద్యము కంతపేరు ప్రతిష్ఠలు లేకపోయినను నేను చదివినదేదియు దీనివలె నాహృదయమున హత్తుకొనలేదు. దీనికి కారణ మా పద్యములోనున్న నిజగుణమే కాక నవి 'వేదవాక్కు' లగుటయే !

ఆ పద్యములో భగవంతుడు తనయందున్మాదులైనవారి కిట్లు బోధించును. "బధిరము వహించుము; ఎవరికిని భయపడకుడు; లౌక్యపద్ధతుల నెల్లప్పుడును వదలివేయుడు." వారిట్లు శిక్షింపబడి "అతి సుకుమారముగ పెరిగిన కోమలగాత్రులకా కలిదప్పులను కల్పించి నేడందరిచేతను శాపదగ్ధులై రేపందరి యాశీస్సులనందుకొందురు". తమ యన్వేషణలో వారు "మానవుల దూషణభూషణములను, చెవికింపగు స్తోత్రపాఠములను" ద్వేషింతురు. కానివారు "విశ్వాసోన్మాదులై" మానవనేత్రసీమల వెలుగొందచేయుచు తమకు ఋజుకార్య నిర్వహణశక్తినిచ్చు జ్ఞాన జ్యోతులతో ప్రకాశించుచుందురు. ఈపద్యమును కనుగొనిన కొద్దిరోజులకే నేను "మహాత్మగాంధి యనబడు మొుదటిరకపు బహిరంగోన్మాదిని" కలుసుకొంటిని. ఆ పద్యములో నన్నంత యెక్కువగ నాకర్షించి యుద్బోధపరచిన వర్ణన అన్ని వివరములలోను నితని కెంతయు తగియున్నట్లు నా కనతికాలములోనే ద్యోతకమయ్యెను. ఎవడెంత గట్టిగ వాదించినను గాంధీజీ 'లౌక్యుడు' అని నేనొప్పుకొనను. పదివత్సరముల క్రితము నా కతని పరిచయమైనది లగాయతు నేనతని మాటలను చేష్టలను అతి నిశితముగ విమర్శించుచుంటిని. నేను మహాత్ముడు ప్రమాదరహితుడని గ్రుడ్డిగ పూజించు కోటిలోనివాడనుకాను. అతడవతార పురుషుడనియు దేవదూతయనియు కూడ నేనంగీకరింపను. అతని గొప్పదనమతని రాజనీతిపైననే

యాధారపడినచో నది కొంఱగాకుండెడిదని నాయభిప్రాయము. అతనిని గ్రహించుట కితర ప్రమాణములు కావలెను.

గాంధీజీయొక్క సమగ్ర నిజప్రభావమును గుర్తించుటకు హిందూమతముయొక్క పుట్టుపూర్వోత్తరములు, వివిధసంస్కరణోద్యమచరిత్ర, దేశములోని వివిధసాంప్రదాయముల యభివృద్ధిమొదలగు గాథయావత్తు తెలియవలెను. కారణమేమన నియమబద్ధమైన మతము క్షీణించుచుండుట సహజము. దాని నాశమునుండియే నూతనచైతన్య బీజములు నిరంతరాయముగ నుద్భవిల్లుచుండును. వీనిలో నాత్మవస్తువు తేజరిల్లుచు పాతచెత్త ఖిలమైపోవుచుండును. ఎండురెబ్బలు, పండుటాకులురాలిపోవును. అమెరికాదేశ క్రైస్తవ 'పిడుగొకడు' మహాత్ముని శిష్యులలో నొకనిని ప్రశ్నించుచుండ నేనువింటిని. ఏపుస్తకప్రభావము మహాత్మునిపై నెక్కువగ కలదని యతనిప్రశ్న. "గీత" యని జవాబువచ్చెను. క్రొత్తటెస్టమెంటు, టాల్‌స్టాయి, రస్కిన్గ్రంథములు అతనికి కరతలామలకములే! కాని గాంధీజీ ముఖ్యముగ హైందవ సంస్కర్త.

అయినను అతడు కేవలమొక హైందవుడేకాడు! మహమ్మదీయులచేతను హిందువులచేతనుకూడ మొట్టమొదట ఋషిసత్తముడుగ కీర్తింపబడిన కబీరు అతని నిజనమూనా. అతడు హిందూ మహమ్మదీయయైక్యతను సాధించిన మహాప్రవక్త;

తాను మహమ్మదీయుఁడై ననుహిందూగురువైన రామానందుని శిష్యుఁడు. కబీరు సూక్తులను రవీంద్రనాథటాగూరు ఇంగ్లీషులో ననువదించెను. ఈయుభయులచారిత్రక సంబంధమునది తెల్లము చేయుచున్నది. "నీబుద్ధిసూక్ష్మతను కట్టిపెట్టుము. కేవలవాగాడంబరముచే నీవతనిని చేరజాలవు ... "శాస్త్రసాక్ష్యములతో నాత్మవంచకుఁడవు కాకుము... ప్రేమ దీనికంటె భిన్నమైనది; దీనిని నిజముగ నన్వేషించినవాని కిది లభ్యమగుచున్నది."

మతనాయకుఁడైన గాంధీజీబోధలలోని సార మీమూఁడు మాటలలోను నిమిడియున్నది. నేనిపుడతని నీమతదృష్టితోనే చర్చింపబూనితిని.

"గీత పూర్వాచార పరాయణతను సమర్థించునా?" అను వ్యాసమునొక వ్యాసకర్త గాంధీజీకిపంపించెను. మహాత్ముఁడు యరవాడ జయిలునుండి 1933 జనవరి 11వ తేదీని దానికీవిధము గజవాబుపంపెను. "నేను మీరెండు వ్యాసముల నతిజాగ్రతగ పఠించితిని. మీదిపండిత విధానము; నావట్టిదికాదు."

గీత పూర్వాచార పరాయణతను సమర్థించుట లేదని పండితుఁడును భగవదున్మాదియుకూడ నంగీకరించినట్లు వేరుగ చెప్పనక్కరలేదు. కాని గాంధీజీ తనదృక్పథమును "బుద్ధి" ద్వారాచేరలేదు.

"సత్యాన్వేషియొక్క సమరమతి కఠినమైనది; శ్రమ సంకులమైనది. అతని శపథము యోధుని శపథముకంటెను లేక

భర్తననుగమింపగోరు వితంతువుయొక్క శపథముకంటెనుకూడ కర్కశమైనది; యోధుడే కొద్దిగంటలకాలమో యుద్ధముచేయును. వితంతువుయొక్కపోరాటము మృత్యువుతో సమాప్తమగుచున్నది. కాని సత్యాన్వేషిపోరాటమహర్నిశము, ఆమరణాంతముజరుగుచునే యుండును." అను కబీరు వాక్యములు గాంధీజీకి చెల్లునని చెప్పవచ్చును.

"జీవించియుండగనే మీరు మీపాశములను ఛేదించుకొనజాలనిచో మరణమున మీకు మోక్షాశయెక్కడకలదు? ప్రాణి శరీరమును వీడిపోయినంత మాత్రముచే నాపరాత్పరునిచేరు నను కొనుటవట్టికల్ల. అతడిపుడుచిక్కెనా అప్పుడునుచిక్కును. ఇప్పుడుచిక్కడా మనకనవరతమృత్యుపురనివాసము తప్పదు." అని ప్రాణమరణములను గురించి కబీరు చెప్పినపుడు గాంధీజీయొక్క యాధ్యాత్మిక తత్వమేవిశదము చేయబడుచున్నది.

క్రైస్తవమతములోని కేథలికు, ప్రొటెస్టంటుసాంప్రదాయములకు తుల్యమైనట్టివియే చాలమతములలో కాననగును; ప్రతిసాంప్రదాయములోను కొన్నిదోషములు కొన్నిగుణములు కలవు. ప్రొటెస్టంటు సాంప్రదాయముయొక్క ఘనతయది ప్రసాదించిన పవిత్రపురుష సత్తములలోకలదు. ప్యూరిటను మతము (పవిత్రతనారాధించు మతము) లో సహింపరాని నిషేధములుతప్ప మరేవియు నీయుగమువారికి కానరావు. అది పుట్టుకలో దేనితో పోరవలసివచ్చెనో యనువిషయమును మర

చుటసులభము. అరుదెగులుచే బాధపడురోగికి త్యానువర్జింప వలసిన వస్తువులనుచెప్పి యతనిని కఠినపథ్యముతో నడిపించు వైద్యునివంటివాడే సరియైన ప్యూరిటను అని గ్రహింపవలెను.

ఎచ్చోట తలయెత్తినను గొప్పసంఘ సంస్కారోద్యమము, విప్లవోద్యమముయొక్క పవిత్ర చిహ్నములు కనబడక తప్పదు. తమ సర్వశక్తుల నొక్క విషయముమీదనే కేంద్రీకరింపవలసిన వారెన్నింటినొకట్టి పెట్టుట వారి శిక్షలో నొక భాగమగుచున్నది. కనుక నాధునిక భారతనాయకులు ప్యూరిటనులగుటయు వారి నాయకమణి కఠినతాపసియగుటయు నాశ్చర్యముకాదు. భారత ప్రజల నజ్ఞానాంధకారములోను, సోమరితనములోను, కులవిద్వేషములలోను, మూర్ఖ్యములోను ముంచుచున్న దాస్యశృంఖలములను, దోషులను ఛేదించని యెడల సామ్రాజ్యతత్వమును నిర్మూలింపబూను విప్లవమేదియు ముందుకు పోజాలదు. శ్రోత్రియ బృందముయొక్క అధికారమును, వారి "అస్పృశ్యత" వలన నంగీకరింపబడినదోషములను, స్త్రీలన్యూనస్థితిని, శిశువివాహములను, పారిశుధ్య నిర్లక్ష్యమును, వివాహములలోచేయు దూబరాఖర్చును, నల్లమందు సేవించుటను—ఒక్కమాటలో రాజకీయ మాంద్యమును తెచ్చిపెట్టిన సమస్త సాంఘిక అవినీతిని—యెదుర్కొనుటచేతనే గాంధీజీ రాజకీయ మోక్షమును ప్రసాదించు యుద్యమములను నడుప గలుగుచున్నాడు.

హైందవ శ్రోత్రియత్వమను ప్రధాన ప్రవాహము నెదు ర్కొనుటలో గాంధీజీకి తోడ్పడిన యనాదిసిద్ధమగు సాంప్రదాయము భారత దేశములో కలదని మనము గుర్తింపగలము.

గాంధీజీకి చాలకాలము పూర్వమే భారత దేశములో "భగవదున్మాదులు" కలరు. వంగ దేశములో నీ 'పిచ్చి' వారిలో మహమ్మదీయులు, హిందువులు ముఖ్యముగ తక్కువ తర గతులవారు కలరు. ఆధ్యాత్మికముగ వారు కబీరుకు సన్నిహితులు. వారు శాస్త్రప్రమాణములను, దేవాలయముల పవిత్రతను తిరస్కరించిరి. వానిని గురించి యీ క్రింది దోషములు చూపబడినవి." ఓప్రభో! మసీదులు దేవాలయములు నీమార్గమును కప్పివేయుచున్నవి. నీ పిలుపును నేను వినుచుందును. కాని గురువులు పురోహితులు నాకడ్డముగ 'చాట పెయ్యల' వలె నా మార్గమును నిరోధింతురు."

వారైచ్ఛిక దారిద్ర్యమును, ఆత్మగౌరవమును, ఆత్మజ్ఞానమును వరించిరి. "ఆంతరంగిక గురువే" "హృదయకుహరములోనున్న మానవుడే" వారి భగవంతుడు.

మా స్వల్పజ్ఞానముతో ననిర్వచనీయమైన శక్తిని గ్రహింపబూను నాకును యితరులకును ఒక 'పిచ్చి' వాడే యిట్టి హితవొసగెను.

"స్వర్ణకారకు డొకడారామమున కరుదెంచెను. అతని యొద్ద నొక యొరపిడిరాయికలదు. దానిమీదగీచి పద్మము నతడు విలువరింపగలడు."

స్వర్ణ కారకుని ప్రమాణముతో చూచినపుడు పద్మముకు మూల్యములేదు. భగవను న్మానులను మానవబుద్ధిచే పరీక్షించు మన మామూలు ప్రమాణములు నిరర్థకములు.

---

# గాంధీజీ కొక పాశ్చాత్యుని యభినందనములు

## రోమను రోలండు

ఎవని పౌరాణికగాథ 'కృతయుగ' స్థాపనమున సువర్ణాక్షరములతో లిఖింపబడునో యట్టి గాంధీజీ భారత జాతీయతను సృజించిన కేవల భారతవీరుడు మాత్రమేకాడు! అతడు తమ నిజశక్తిని, ఐకమత్య ప్రభావమును, స్వాతంత్ర్య స్థాపనాభీష్టమును భారత ప్రజలలో నుద్దీపంపజేసిన నిరంతర చైతన్య శక్తి మాత్రమేకాదు! విస్మరింపబడిన లేక పెడదారి త్రొక్కిన జీసను సందేశము నతడు యావత్పాశ్చాత్యలోకము కొరకు పునరుద్ధరించెను; మానవలోకములోని ఋషిపరంపరలో తన నామమును నా చంద్రార్కముగ స్థాపించుకొనినాడు; అతని తేజఃప్రభావము భూనభోంత రాళముల వెలుగొంద చేయుచున్నది.

ఇట్టి సాదృశ్య మత్యద్భుతమని యూరపుఖండవాసులు భావించు దినములలో నితడావిర్భవించెను. యూరపు నాలు

గేండ్ల రణరంగమునుండి 'బ్రతికిబట్ట కట్టెనోలేదో ! ఆయుద్ధ భీభత్సము, శిధిలములు, క్రోధద్వేషములు చల్లారనేలేదు! అవి మరింత ఘోరతరయుద్ధమున కంకురార్పణచేసినవి. తెన్ను మిన్నుకానని అంధకార బంధురమగు నిశీథము యూరపు నావరించెను; దుఃఖము సిరాశ దానిని ముంచివేసెను. ఆశా లేశముకూడ కాన్పించదాయెను ! ఇట్టి సమయమున కత్తిలేక కట్టలేక యొంటినిండ బట్టలేక, దౌర్జన్యము నెంతమాత్రము నెరుగక ప్రేమ, జ్ఞానములను శస్త్రములను బూనిన బడుగు దిగంబర గాంధీ విజయభేరి ప్రయోగించెను. దీనితో పాశ్చాత్య లోకము దద్దరిలెను; ఇది యచ్చట నిశ్శంకముగ సాంప్రదాయ సిద్ధముగ నంగీకరింపబడిన భావములకు, రాచకీయములకు సవాలు! ఆ నైరాశ్యాంధకారమున నిదియొక యాశాజ్యోతి! దీని నెవరును నమ్మజాలరైరి ! ఇట్టి యద్భుతవ్యక్తి యొకడు కలడని విశ్వసించుటకే కొంతకాలము పట్టెను. మహాత్ముని సందేశమును గ్రహించి పాశ్చాత్యలోకమునకు వెల్లడించిన వారిలో ప్రపథముడనగు నాకంటె నెక్కువగ దీని నెవరెరుగు దురు ?......కాని యీ భారత ఆధ్యాత్మిక గురువుయొక్క యునికి, దినాదినాభివృద్ధిగాంచు నిరంతరాయ కార్యకలాపము విశదమగుటతోడనే పాశ్చాత్యలోకమునుండి విశ్వాస, అభి నందనాదులు కురియనారంభించెను. చాలమంది కతడు జీసను యొక్క అపరావతారము. ఎట్టి నైతిక సూత్రముచేతను

నడుపబడక తనయాత్మ వినాశమునే తెచ్చిపెట్టుకొనిన కరిమ రహితమైన పాశ్చాత్యనాగరికతపై రోతగలిగిన స్వతంత్ర భావనాశక్తిగల కొందరికతడు రూసో, టాల్‌స్టాయిల యవ తారావతారము! వీరు నాగరికతలోనున్న దోషములను, మేడి పండు భ్రాంతిని నిరసించి ప్రకృతికి మరలవలెనని, పవిత్ర, సరళజీవితము నాస్వాదింపవలెనని ప్రజల నుద్బోధించిరి. ప్రభు త్వములతనిపట్ల నుపేక్ష, నిర్లక్ష్యము నటించెను. కాని ప్రజల కతడు సచివుడు, హితుడు, సోదరుడు. ఇచ్చట స్విడ్జరులండు లోని వినమ్ర, గ్రామ, పర్వతసీమవాసులలో నతడుద్బోధించిన పవిత్రప్రేమను నేను కండ్లార చూచితిని.

అతని ప్రేమ, జ్ఞానసందేశములు జీసను సందేశమువలె నసంఖ్యాకములగు సత్పురుషుల హృదంతరాళముల బ్రవే శించెను. కాని యుద్ధమును, వినాశమును ఆలింగనమొనర్చిన ప్రపంచముయొక్క విధివిధానమును మార్చివేయుట కతడంత టితో తృప్తిపడలేదు. దౌర్జన్య రాహిత్య సూత్రమును రాచ కీయముల కన్వయింపచేయుటకు ప్రస్తుత యూరపుయొక్క నైతిక వాతవరణముకు సుతరాముభిన్నమైన వాతావరణ మవసరము. దానికమితమైన, యేకగ్రీవమైన స్వార్థత్యాగము కావలెను. లక్షలకొలది ప్రజల రక్తస్రవంతులలో నీదులాడి ప్రపంచమున స్థావర మేర్పరచికొనిన నూతన డిక్టేటరు విధాన ముల క్రౌర్యము దినదినాభివృద్ధి నొందుచుండు స్థితిలోనిది

ప్రస్తుతము జయించుట యసంభవము. ప్రజానీకమింకను చిరకాల మష్టకష్టముల ననుభవించిన కాని యిట్టి త్యాగప్రభావము జయమొందజాలదు. గాంధీజీకున్న విశ్వాసమువంటి విశ్వాసబలముచే పునీతులు కానినాడు ప్రజల నుద్ధరించు వీరత్వముత్పన్నముకాదు. పాశ్చాత్యలోకమున ప్రజలలోను నాయకులలోనుగూడ నధిక సంఖ్యాకులలో నిట్టి భగవద్విశ్వాసము లోపించినది. క్రొత్త విశ్వాసములు (దేశీయములైనను విప్లవయుతములైనను) దౌర్జన్య వారసత్వముకలవి. తమ స్వేచ్ఛను, స్వాతంత్ర్యమును చివరకు జీవితములనుకూడ కులప్రభుత్వ, ఫ్యాసిస్టు ప్రభుత్వముల సంపుటియైన సామ్రాజ్య ప్రభుత్వముల భయంకర వదనములనుండి రక్షించుకొనుటయే యూరపుప్రజల సత్వరకార్యము. ప్రజలు రాజకీయ పరిత్యాగము చేసినచో శతాబ్దములకొలది మానవదాస్యమును తెచ్చిపెట్టుకొనిన వారగుదురు. కనుక మనము గాంధీజీ సూత్రము నెంతగౌరవించినను యిట్టి పరిస్థితులలో దానిని సమర్థింపజాలము.

ఆత్మశాంతి, ప్రేమతత్వము క్షుభితార్ణవ మధ్యమున నొకదీవిలో రక్షింపబడి యచంచలముగ వెలుగొందు నత్యంత పవిత్రనైతిక నాగరికతా పెన్నిధానము. ఇదియీప్రపంచమున మధ్యయుగ క్రైస్తవమఠముల యుత్కృష్టస్థానము నలంకరించు ననినాయభిప్రాయము. ఎంత పవిత్రవంతము దేదీప్యమానము నగుస్థానము! ప్రాచీన క్రైస్తవక్రమ స్థాపకాచార్యులగు,

బ్రూనో, బెర్నార్డు ఫ్రాన్సిసులవలె గాంధీజీ తత్వమీ విషమ కాలో ధ్వాతతరంగములమధ్య మానవజాతియనుభవించుచున్న యీయుగసంధిమధ్య మానవప్రేమను, సామరస్యమును రక్షించుగాత !

" 'భగవంతుని శాంతి' రాజ్యముచేయు సర్వమానవస్వర్గము కొరకు మనయల్పశక్తితో పనిచేయున్న శాస్త్ర, సాహిత్యాదికళోపాసకులమగు మనముకూడ (చర్చిమతాచార్యుల భాషలో) "మూడవ ఆశ్రమాధికారులము" అగుమనముకూడ రాబోవు మానవలోకాదర్శమును త్రికరణశుద్ధిగ గ్రహించుచున్న మనగురువు, సచివుడు, సోదరుడు అగు గాంధీజీకి జే జే లొనర్చెదముగాక !

---

# ఒక ఆంగ్లయువతి విశ్వాసము.

**మాడ్ రాయిడనుకన్య యం. ఏ. డి. డి.**

ఒకహిందువు నేటిప్రపంచములో నుత్తమోత్తమక్రైస్తవుడని క్రైస్తవులచేతనే భావింపబడుట చాలవింతయగు విషయము. గాంధీజీకృపచే నేను చూచుకొలది యతని సందేశములనుసరించికొలది యిది యదార్థమని నాకు మరింతగోచరించుచున్నది. నాదృష్టిలో జీసనుపరిపూర్ణుడు; అతనిపరిపూర్ణతయనస

మానమైనది. దీనిని గాంధీజీకూడ కాదనడని నేనెరుగుదును. కాని మహాత్మగాంధీవలె జీసను కతిసమీపములోనున్న వారె వరును నేడతని శిష్యులలో లేరనియే నేనుచెప్పబూనితిని.

నేను వారంవారము పఠించు హరిజనపత్రిక భగభగ మండుచు నోరార్చివేయు యెడారిభూమిలో నిర్మల సలిలపాన మువంటిది. "అధికారలాలసరాజ్యతంత్రము" నప్పుడునీతులను, తప్పుడు ప్రబోధములను గావించుచు నేడుయూరపులో శాంతి కొరకుపనిచేయు వారినికూడ పెడమార్గముపట్టించెను. "న్యాయ మునుబలవంతముగ గుంజవచ్చుననియు" దానివలన శాంతిచే కూరుననియు వారిపుడు తలంచుచున్నారు. పోలండు పతక మయిపోయిన తరువాత నోటినిండ గుడ్డలుకుక్కబడి చేతులు కాళ్లుబంధింపబడి యొక స్త్రీనేలమీదపడియుండ నొకయాయు ధభటుడు వివిధాస్త్రశస్త్రములను ధరించి "వార్సాపట్టణమంత యు శాంతియుతముగనున్నది" అను వ్రాతతో నామెను కాచు చున్నట్టి పరిహాసచిత్రమును వారుమరచినట్లు కాన్పించును. యుద్ధానంతరము రషియామీద సలుపబడిన దాడులవలన బోల్షివిక ప్రభుత్వమునకు మరింత స్థావర మేర్పడెననియు, జర్మనీ సిమర్దించుటవలన హిట్లరు సింహాసనా రూఢుడయ్యెననియు, "యుద్ధము నంతమొందించుటకు జరిపినయుద్ధము" జరిగిన యిరు వదియేండ్లలోనే వెనుకటి యుద్ధముకంటె ఘోరతరమైన యుద్ధ

మేఘములు మనలనావరించిన పనియు వారు విస్మరించినట్లు కాన్పించును.

హరిజనపత్రికలోని గాంధీజీ యమృతవాక్కుల నాస్వాదించునపుడీ యర్థశూన్యశబ్దాడంబరమును, చిత్తకాలుష్యమును తరించి సత్యమునందకుంఠిత విశ్వాసముచే ప్రేరేపింపబడుటచే పవిత్రీవంతములును, యుద్ధక్రౌర్యము నతిక్రమించిచూడగలుగుటచే నిర్మలములునునగు వాయువుల నాస్వాదింతుము.

గాంధీజీ 'యగ్రాహ్యుడు' అని యింగ్లీషు వారప్పుడపుడు నిందించుచుందురు. ఇది 'నింద' యనినేనంటిని. ఏలయన "అగ్రాహ్యత్వము" చెడ్డకావలసిన విధాయికత్వము లేకపోయినను యుచ్చటనది నిరసనపూర్వకముగనే ప్రయోగింపబడెను. అతడు నిజాయితీ లేనివాడని వారారోపింతురు.

మహాత్ముని యడుగు ప్రశ్నలను అతని సమాధానములను నేను మొదట హరిజనపత్రికలో నత్యంతఆతురతతో చదువుచుండెడిదానను. కాని నేనిపుడతడెట్టికష్టమైన ప్రశ్ననైనను విడుచువాడు కాడను సంతోషస్వాంతముతో చదువుచున్నాను. డాక్టరు మాంట్ కాగ్నె, సెరసోల్ యిత్యాదు లెవరేప్రశ్న వేసినను పరిపూర్ణవిశ్వాసము, నిజాయితీతో గూడిన సమాధానము వచ్చుచుండును.

రౌండు టేబిలు సమావేశమునకు గాంధీజీ యింగ్లండు వచ్చినపుడు ఐచ్ఛిక దారిద్ర్యమునుగురించి మాకుపన్యసించు

టకు గిల్డుహాసుకువచ్చెను. ఆ హాలు క్రిక్కిరిసిపోయి వందల కొలది ప్రజలు బయట నిలువ వలసి వచ్చెను. తాను చెప్ప దలచుకొనినది యూరక చెప్పుటయేకాక చేసి చూపించు వాని మాటలను మేమతి శ్రద్ధాళువులమైవింటిమి. చివరన నేక ప్రశ్నలు వేయబడెను. మహాత్ముడు బదులు చెప్పుటకు పూర్వ మొక్కొక్కప్పుడాగుచుండెను; మానవభాష ప్రకటను చేయ గల నిష్కర్షయుతమును పరిపూర్ణ సత్యయుతమునునగు సమా ధానము నిచ్చుటకే యతడాగుచుండెనని నే నెరుగుదును. "సర్వమును పరిత్యజించుట యనగా నొడలిమీదిబట్టను తీసి వేయుటవంటిదికాదు; అది నీ యెముకలమీది చర్మమునొలిచి వేయుట వంటిది" అని యతడనెను. "కాని 'ఓ గాంధీబాబా! నీవొక యంగవస్త్రమును ధరించితివి. నీకేమియు లేదని నీవెట్లు చెప్పగలవు ?' అని నన్ను మీరడుగవచ్చును. నా సమాధాన మేమన నాకొక శరీరమున్నంతకాలము నేను దానిని దేనితో నైన కప్పుకొనవలెను." కాని "మీలో నెవరైనను దీనిని తీసి వేసి కొనగోరుచో నాయభ్యంతరములేదు. నేను పోలీసువారికి రిపోర్టుచేయను" అని యతడు పకపక నవ్వుచు చెప్పెను.

దయామయులగు బ్రిటిషుప్రభుత్వమువారు మహాత్మునికి పోలీసుసిబ్బందీని సప్లయిచేసిరి. వారపుడు గిల్డుహాసులోనే యుండి యీసంభాషణనువిని పొట్టచెక్కలగునట్లు నవ్వ నారంభించిరి. వారికేకాదు! మాకందరకు నాయవస్థయేపట్టెను.

మహాత్ముడు హాస్యరసము నొలికించుచుండుటయు మనకు నవ్వుపుట్టించు విషయములే యతనికిని నవ్వుపుట్టించుచుండుటయు చాలామంచి యాంగ్లేయుల నానందపరవశులను చేయును. ఒక నాడతనిని నా కారుమీద తీసికొనిపోవు యదృష్టమునాకబ్బెను. త్రోవలో నతడు నాకుగల 'డి.డి.' బిరుదును గురించి ప్రశ్నించెను. అదిగ్లాస్గోయూనివర్సిటీ వారిచే నాకు సమర్పింపబడిన 'వేదాంత కేసరి' అనునట్టి పట్టాయని చెప్పితిని. "ఓహో! బ్రహ్మతత్వమంతయు నీకు తెలియునుకాబోలునే?" యని యతడుచల్లగా'నటించెను'

నాటి ప్రయాణ ప్రారంభోదంతముకూడ నాహృదయమున హత్తుకొనిపోయెను! మహాత్ముడు తనముందు కార్యక్రమముకు గొంపోవ నా కనుజ్ఞయిచ్చెను. కాని మేము గిల్డుహాసు నుండి బయటకు వచ్చుసరికి మానవ ప్రవాహము మమ్ముడ్డగించెను. నాకారు నాకు కన్పించలేదు. లండనులోనున్న కారులన్నియు నచ్చటనేయుండెను. ఏకారుకాకారే మహాత్ముని తీసికొనివెళ్లు భాగ్యముకొరకు పెనుగులాడుచు "పంజాబు మెయిలు వేగమున' నొకటితో నొకటి తలపడుచుండెను. నాడు చలివణకించు చుండెను; మంచు కురియుచుండెను. మహాత్ముడు కాపీనమాత్రుడు! అతని నాపకూడదని గుర్తించి "దగ్గరనున్న కారుమెక్కుడు. నా కారు కొరకు ఆగవద్దు" అని నేనంటిని. "నేను నీకారుకొఱకే వేచియుండెదను" అని యత

డనెను. దానితో నాకొక కిరీటమబ్బినట్లు నేనుబ్బిపోతిని! అప్పుడు "నిలువనీడలేదు! కాని సమస్తవస్తు చక్రవర్తి" అను జీససుయొక్క యొకభక్తుని వాక్యమొకటి నా జ్ఞప్తికివచ్చెను. గాంధీజీ కొక్క కారుకూడలేదు! కాని తమలో నొకదాని ననుగ్రహించునను నాశతో వందలకొలది కారులతనిచుట్టును పరిభ్రమించుచుండెను!

నేటి ప్రపంచమునకు మహాత్ముని దౌర్జన్య రహిత నిరాకరణమే శరణ్యము. డెబ్బదియేండ్ల నిరంతర క్లేశము, అనుభవము కలిగినమీదట నతడు దానిని విశ్వసించుటయే గాక నతని విశ్వాసము దినదినాభివృద్ధి యగుటలోనే భారత దేశముయొక్కయు ప్రపంచముయొక్కయు మోక్షముకలదు. యూరపులోని దౌర్జన్య, ద్వేషములచే నుక్కిరిబిక్కిరియైన నేను యీ విషయమై యతని నడుగు ప్రశ్నల నతియాతురతతో చదువుచుందును.

అన్నింటికంటె నెక్కువగ స్త్రీనైన నాకీ మహాత్ముని యందు నాన విశ్వాసము వర్ధిల్లెను. మానభంగముచేయు ప్రయత్నము జరిగినపుడు స్త్రీ యేమిచేయవలెను? అను ప్రశ్న వేయబడెను. మహాత్ముడు దీనికేమి సమాధానమునిచ్చును? అతడీ ప్రశ్నను విడిచివేయునా? నేను స్త్రీని కానుకనుక నామె తరపున సమాధానము నీయజాలననునా? ఆ మరణాంతము స్త్రీ దానిని ప్రతిఘటింపవలెననియు నితరమగు దౌర్జన్యము

నుపయోగింపరాదనియు నతడు బదులు చెప్పెను. స్త్రీలోకము తరఫున నేనతనికి వందనశతము లర్పించుచున్నాను. తనయిచ్ఛకు వ్యతిరేకముగ స్త్రీని "అవమానింపవచ్చును" కనుక "మానము" సందర్భములో స్త్రీస్థితి పురుషుని స్థితికంటె భిన్నమైనదను విశ్వవ్యాప్తమైన యతిసామాన్య హేయభావము నీసమాధాన మంత మొందించుచున్నది. నిజమేమన స్త్రీకాని పురుషుడు కాని యితరుల కార్యములవలన నెన్నడును అవమానింప బడ జాలరు. మనలను మనముమాత్రమే యవమానించుకొనగలము. "మృత్యువుకంటె నధమాధమమైన" విషయములు కలవు. మానభంగమందులో నొకటి. కాని యవమాన మితరుల చేతిలోగాని యితరుల యిచ్ఛలోగాని లేదు. అది మనయందే కలదు. గాంధీజీతప్ప యిట్టిసమాధానము నిచ్చుటకు మరెవ్వడు సాహసించెను? దానికి స్త్రీ ప్రపంచమంతయు నతనిని బహూకరించునుగాక!

ప్రపంచమును నతడు నమ్మించగలడా? పాశ్చాత్యలోకమున నతివ్యాప్తిచెందిన దౌర్జన్య విశ్వాసము తన దేశములోనే మహాత్ముననకున్న పలుకుబడిని పోగొట్టి దౌర్జన్యమును దౌర్జన్య మొక్కటియే జయింపగలదను విశ్వాసమును స్థాపించునని భావించుట కడు దుర్భరము. అదియొక్క భారతదేశమునకును, బ్రిటిషు సామ్రాజ్యమునకును మాత్రమేగాక యావత్ప్రపంచ మునకును అరిష్టమని చెప్పకతప్పదు. ఒక్క యూరపులోనే

కాదు! రెండు అమెరికాఖండములుగల పాశ్చాత్య దేశము లలోనేకాదు! జపాను, చీనా మొదలగు ప్రాచ్య దేశములలో కూడ దౌర్జన్యమునందు విశ్వాసము హెచ్చుచున్నది. భారత దేశము తన విశ్వాసమును నిలుపుకొనునా? సమర సంకులమైన ప్రపంచమున నది యొక్కటియే సత్యమును స్వీకరించి మనకు మార్గదర్శకత్వము వహించునా? అట్లు చేయుచో ప్రపంచము రక్షింప బడును. అట్లు కానిచో—? భారతజననీ! పరా జయము నొందకుము!

——

# యథార్థ నాకయత్వముయొక్క ఫలితములు

వైకౌంటు సామ్యుయల్ జి. సి. బి., బి. యి., డి. సి. యల్

అప్పుడప్పుడు గాంధీజీచేయు పనులు, చెప్పుమాటలు నాకు చీకాకు కలిగించుచుండును. అవి నాదృష్టి కన్యాయము గను వికటముగను కాన్పించును. అనేక విషయములలో నే నతనిని సమర్థింపజాలక నతని కెదురగుచుందును. అయినను నతడ సమానమైన శ్రద్ధాత్యాగములతో నతనికి తట్టిన మార్గముద్వారా జగత్కల్యాణముకొరకు అనవరతము పాటుపడు వాడని నేను చెప్పగలను.

ప్రపంచము తన యుత్కృష్టపురుషులను గుర్తించును గాక! తన యుత్కృష్టసేవకులపట్ల కృతజ్ఞతను చూపునుగాక! "గతించినవారికి పూలపాన్పు, బ్రతికియున్నవారికి బలుసు ముళ్లు" అను హేళన వాక్యముకలదు. కాని యర్హులైనపుడు సజీవులకుగూడ మనము సపర్యలను చేయుట న్యాయము.

గాంధీజీ తన చిరజీవితములో భారత దేశమునకును తద్వారా మానవలోకమునకును నపరిమితమగు సేవచేసెను. అతని సేవలో మూడు ముఖ్యముగ పేర్కొనదగినవి.

అతడు "అణగి మణగి యుండునట్టి ప్రాచ్య" లక్షణ ములుగల ప్రజలను కనుగొనెను. జయింపబడుట, పాలింప బడుట, వెనుకబడియుండుట, విద్యలేకయుండుట, మూర్ఖత్వము, దారిద్ర్యము—ఇవి యన్నియు నసంఖ్యాక భారత ప్రజానీకము యొక్క విధిలిఖితముగ స్వీకరింపబడెను. గతచరిత్రయు మెదు ర్కొనరాని ప్రస్తుత పరిస్థితులును దీనినే దోహదముచేసెను. దీనినంతను మార్చివేయుటకు గాంధీజీ సంకల్పించెను. అతని గుణగణములతని ప్రతిభను హెచ్చించెను. అతని యందా ధ్యాత్మికావేశము అపరిమిత లౌకిక వివేకము మేళవించెను. ఇట్టి సమ్మేళన మతియరుదుగ నుండును. ఇది ప్రజలలో చలన మును కలుగచేసి జయదుందుభులను మ్రోగింప సమర్థమైనది. అతడు వెన్నువిరిచి, కండ్లుపైకెత్తి, పరిస్థితులను నిర్భయముగ తేరిబారచూడవలెనని భారతీయుని యుద్బోధించెను. "జీవిత

ములో గతమునుమాత్రమే గ్రహింపగలము, కాని దానిని భవిష్యత్తున జీవింపవలెను." అని చెప్పబడును. గాంధీజీ తన ప్రజలు భూతచరిత్రననుసరించి దానితో మైమరువక నదిబోధించు పాఠములను నేర్చుకొన గోరెను; అతడు వారిని "ముందు చూపుతో జీవింప" గోరెను; ఈ సమగ్రజీవితములో నీపరిబల ప్రయత్నములో భారతస్త్రీలు పాల్గొనుట యావసరమని యతడు చాటెను.

ఇంగ్లీషువారు ఆత్మగౌరవము కలవారు. కనుకనే మన మితరుల యాత్మగౌరవమును ఆదరింతుము. బ్రిటిషు ప్రజలకు నేడు భారతీయులపట్ల మున్నెన్నడును లేని గౌరవ మేర్పడె ననుటకు సందియములేదు.

భారతరాష్ట్రములలో మానవలోకములోని యారవ వంతు ప్రజలున్నారు. ఈ మానవజాతిస్థితిని పెంపొందించుటకును, ఆత్మనుద్ధరించుటకును గాంధీజీవలె మరేవ్యక్తియు పని చేయలేదు. హిందూదేశము, ఇంగ్లాండుదేశము యావత్ప్రపంచముకూడ దీని కతనియెడల కృతజ్ఞత చూపవలసియున్నది.

ఈ యుద్యమము కొన్ని భయంకర నేరములవలనను దోషములవలనను కళంకితమైనది. కాని గాంధీజీ వీసికెన్నడును కారకుడుకాడు. అతని యాజ్ఞల నుల్లంఘించి యీపనులు చేయబడెను.

దార్జన్యరాహిత్యమును విధానముగను స్వాతంత్ర్యమును లక్ష్యముగను మేళవింపచేసి యపూర్వవిజయమును సాధించుటచే నతనిపేరు చిరస్థాయికాగలదు. యుక్తముకాదని ఘోషింపవలెను, వాదముచే నొప్పింపవలెను లేదా యవసరమునుబట్టి యాజ్ఞోల్లంఘనము చేయవలెనుకాని దార్జన్యము, రక్తపాతము, శత్రువునుచంపుట పనికిరాదని యతని సందేశము.

ఈనీతి భారత ప్రజాశీలమున కెంతయు తగియున్నది. దీనికి చాల స్వార్థత్యాగమవసరము; స్వార్థత్యాగమునకు భారతదేశము పుట్టినిల్లు. అది వారి న్యాయపరిజ్ఞానమునకు సరిపోవును. అది ముఖ్యముగ మతవిషయకమైన ప్రవర్తన. అది సఫలమయ్యెను. దార్జన్య రాహిత్యము, ప్రజానీకముయొక్క బ్రహ్మాండమైన ప్రయత్నములుకలసి దార్జన్యవిధానముకంటె త్వరితముగను, పూర్తిగను శత్రువును సాధింపగలుగును.

గాంధీజీ మూడవసేవ నిమ్నజాత్యుద్ధరణము; అతడు భారతరాజకీయములలో దానికగ్రస్థానమునిచ్చి దానిని విజయపథమున స్థాపింపగలిగెను.

అస్పృశ్యత భారతదేశ సాంఘిక, మతచరిత్రకు తీరని మచ్చయని నిజమైన భారతమిత్రులు యొప్పుకొనకతప్పదు. 'అన్నెముపున్నెము' యెరుగని కోట్లకొలది ప్రజలను గర్హించు మతము నేమనవలెను? అది వారిని మొదట పతితులనుచేసి మరెట్టి దోషమునకునుగాక నీ కారణమునకే వారి నణచి

వేయుచున్నది. యదార్థమైన మతమెప్పుడును మానవాత్మకు మోక్షమిప్పించి యుద్ధరింపవలెనేగాని దానినణచి వేయరాదు.

గాంధీజీ తన నిశిత నిర్వక్రదృష్టిచే దీనినంతను గ్రహించెను. అతని హృదయము తరుగుకొనిపోయెను. దుఃఖితస్థమైన యీ మానవకోటి నుద్ధరించుటకతడు భగీరథ ప్రయత్నములనుచేసి యీ భారత కళంకమును తొలగించి నాగరిక జాతులలో దాని కుచితస్థానమును సంపాదించెను.

డెబ్బది వత్సరముల చరిత్రలోకల యీ విజయములను సజీవుడైన మరేవ్యక్తి వర్ణింపగలడు? ఒక బ్రహ్మాండమైన జాతిని మేల్కొలుపుట; దానికాత్మగౌరవమును ప్రసాదించుట; దౌర్జన్య మక్కరలేకుండగనే మానవాత్మయొక్క బలముచేతనే ప్రజావ్యవహారములను చక్కబెట్టవచ్చునని వర్తమాన, భవిష్యల్లోకములకుచూపి యందు నాయకత్వము వహించుట; శతాబ్దములకొలది పతితులైయున్న కోటానుకోట్ల నుద్ధరించుటలో నాయకత్వము వహించుట—ఇట్టి వెన్నియో కలవు.

# రౌండు టేబిలు సభలవలన కలిగిన యభిప్రాయము

**వైకౌంటు శాంకీ యం. యె, డి. సి. యల్**

నేను గాంధీజీని 1931 సెప్టెంబరు 13 వ తేదీని మొదట సారి కలుసుకొంటిని. రౌండు టేబిలు సభలయొక్క ఫెడరలు కమిటీసభలలో కొన్ని నెలలు గంటలకొలది, రోజులకొలది మే మొకరిప్రక్క నొకరము కూర్చుంటిమి. అతి యాదుర్దాతో గూడిన కాలమున నొకని ప్రక్కన కూర్చొని క్లిష్టసమస్యలను చర్చించినమీదట మన మతనిని ప్రేమింపవలెను; లేదా గర్హింపవలెను. నన్ను గాంధీజీ తన మిత్రులలో లెక్కపెట్టుకొనవచ్చునని నాయాశయము.

అతడు యింగ్లండువచ్చినపుడు లండనులోని డార్చెస్టరు హోటలువద్ద నేనతని పరిచయమును పొందితిని. అతడు వచ్చుచున్న సంగతి తెలిసి యచ్చట వేలకొలది ప్రజలుచేరిరి. అతడు సఫేదు దుస్తులను ధరించినయొక వామనమూర్తి; కాని యతని నడక నిజగౌరవమును, పేరు ప్రతిష్ఠలను గుర్తించిన వాని నడకవలె నుండెను. అతని యాకృతి వింతగనుండెను. కాని యతని యాకర్ణాంత విశాలనేత్రములు నన్నెక్కువగ నాకర్షించెను. జ్యోతిర్మయములగు ఆ నేత్ర ద్వయమునుండి నీ వప్పుడప్పుడతనిభావములను గ్రహింపవచ్చును.

నేను ఆ కమిటీకి అధ్యక్షుడనుకనుక నతనితో పరిస్థితుల నొంటరిగ చర్చింపవలసియుండెను. అతడు తన యభిప్రాయము లను చచ్చులేకుండ తెలిపెను. భారతదేశముయొక్క నికృష్ట స్థితినిగురించి యతడు వాపోయెను. కాని బీదప్రజలను పీడించు చున్న అమిత ప్రభుత్వవ్యయమే యతని నెక్కువగ బాధించు చుండెను. అతని సంభాషణ యామూలాగ్రముగ బీదవారి ప్రసక్తియే! అతడు ముఖ్యముగ గ్రామములలో నివసించు వారి దౌర్భాగ్యమునుగురించి విలపించెను. యంత్ర పరిశ్రమను విధివిరామములేకుండ వృద్ధిచేయకూడదని యతడంగీకరించెను. అతని సత్యాగ్రహ విశ్వాసమును నా కెరిగించెను. దేశరక్షణకు అహింస, దౌర్జన్యరాహిత్యము చాలునని యతడు వాదించెను.

అట్టి చిరదర్శన భాగ్యమబ్బినమీదట నతనిని గురించి దృఢమైన యభిప్రాయము లేర్పడకుండుటెట్లు! అతడు మొదట నుండి చివరవరకు మతవిశ్వాసి.

టాల్‌స్టాయి వ్రాతలతని నాకర్షించినట్లు నాకు తోచెను. అతడు సాంఘిక దోషములకు నిరాడంబర జీవితమే శరణ్య మనును. అతడసమాన దేశభక్తుడు; స్వదేశగౌరవమును, కీర్తిని విస్తరింపచేయగోరువాడు. బీదలను, పీడితులను రక్షింప గోరువాడు. అతడొక గొప్ప రాజకీయ నాయకుడు. తన లక్ష్యమునందేకాక సాధనయందుగూడ నతనికి అచంచలమగు విశ్వాసముకలదు.

సెప్టెంబరు 14వ తేదీని లండనులోను సెంటుజేమ్సుకోటలో కమిటీయొక్క మొదటి సమావేశము జరిగెను. అది యతని మౌనదినము. మరునాడతడు మొట్టమొదటిసారి మాట్లాడెను. “గాంధీజీ నెమ్మదిగ, నిర్మొగమాటముగ నిమిషమునకు 57 మాటలచొప్పున మాట్లాడెను. అతడు సుమారొక గంటసేపు తడవుకొనకుండ మాట్లాడెను. అతడు రెండు చేతులను జోడించి మాట్లాడుటకు పూర్వము ప్రార్థించుచున్న వానివలెనుండెను. అతడు పాదుకలను తొడిగి, యంగవస్త్రమును ధరించి, పైనొక తెల్లనిశాలువ వంటిది కప్పికొని నాప్రక్కనే కూర్చొనెను.” అతడు హిందూదేశమునకు స్వాతంత్ర్యము కావలెననియు, ఆర్థిక, సైనికాధికారము కావలెననియుకోరెను. అతడాసభల యొక్కకాయిక, మానసికపరిశ్రమనెట్లు భరింపగలిగెనా యను నాశ్చర్యము నన్నువీడకుండెను. అతడు ‘శ్రీరామ మొదలుచిత్త గింపవలెను’ వరకు సభను వీడకుండును. ఒకలెక్క ప్రకారము కొన్నిరోజులలో 80,000 మాటలవరకు మాట్లాడినట్లు కాన్పించును. కాని సభముగిసిన తరువాతనే గాంధీజీయొక్క యదార్థమైనపని ప్రారంభమయ్యెడిది. ప్రాతస్సాయంకాలములయందు గంటల కొలదిసేపతడు వివిధవ్యక్తులతో వివిధవిషయములను గురించి సంభాషించును; వారిని తన మతమునకు త్రిప్పుకొన యత్నించును. అమాత్యశేఖరులు, డిక్టేటరులు తమయభిప్రాయములను ప్రజలపై చొప్పించుట కనేకమార్గములుకలవు. తన

స్వప్రయత్నములచేతను, సాదృశ్యముచేతను లక్షలకొలది ప్రజలను తన జీవితకాలములోనే తన యనుయాయులను చేసికొనిన వాడొక్క గాంధీజీతప్ప మఱియొకడు కానరాడు.

అప్పుడప్పు డతడొక యంతర్వాణిచే నడుపబడునట్లు కాన్పించును. ప్రపంచచరిత్రలో వివిధకాలములయందితర మహా వ్యక్తులకుకూడ నిట్టి యనుభవమే కలుగుచుండెను. సోక్రటీసు, సెంటుపాలులు యీగణములోనివారు. వారు పిచ్చివారని మతిభ్రమణకులోనైనను లేక నీప్రపంచమున కతీతమైన జ్ఞానమును కలిగియున్నను వారి సంపర్కముగల వారిపై యమోఘమైన పలుకుబడిని కలిగియుందురు. గాంధీజీ రాజఋషి. ఆతడెప్పుడును భారతదేశమునకును, బీదలకును తానుచేయగలిగిన సేవకొరకు తహతహలాడును.

గాంధీజీ యాదర్శము లత్యున్నతములైనవనుటకు సందియములేదు. కాని తన ప్రజలమీద నేగాక భారతదేశములో నున్న వివిధమత, కులకక్షులతో గూడిన వారందరిపైనను అధికారము, భాధ్యత గాంధీజీకే యిచ్చినచో నేమి సంభవించెడిదో యని నేనాశ్చర్యపడుచుందును. అట్టి స్థితిలో రాజకీయవేత్త మార్గములను, పద్ధతులను ఆలోచింపవలసియుండును. కాని ప్రవక్తలకీ మార్గములతోను, సాధనలతోను ప్రసక్తిలేదు. తుదకు ప్రవక్తలే రాజకీయవేత్తల నోడింతురు. గాంధీజీ

యీ లోకమునకు వచ్చిన నాటికంటె ప్రపంచమును సర్వతో ముఖాభివృద్ధి చెందించెనని సర్వులును అతని యవసానకాలమున యొప్పుకొందురని నా నిశ్చితాభిప్రాయము.

---

# ఒక గొప్ప హిందూమత ప్రవక్త

**డి. యస్ శర్మ యం. యె.**

హిమాలయ పర్వతములను, టాజ్‌మహాలును, మహాత్మ గాంధీనిచూచుటకు హిందూ దేశము వచ్చినట్లొక అమెరికాదేశ సంచారకుడొకసారి చెప్పెను. ఈ దేశములోనున్న మనము మహాత్మున కతిసమీపములో నుండుటచే నీమహావ్యక్తియొక్క నిజశక్తినిగాని మానవచరిత్రలో 'నాసత్యపరిశోధనలు' అని యతడు రచించినదాని ప్రాధాన్యతనుగాని గుర్తింపనేరము. తన సందేశము భారతదేశములోను భారత రాజకీయపరముగను చెప్పబడినను అది విశ్వమునకంతకును చెందునని గాంధీజీయే చాటెను. కాని మానవజాతినంతను ఉన్నతమైన నైతిక, ఆధ్యాత్మికస్థితికి తీసికొనిపోవ నడుముకట్టినవానికి రాజకీయములతి నికృష్టములు. మన యుగము వేలకొలది మైళ్లు, ఖండఖండాంతరములు, నదులు, సముద్రములు, భూఖండములు త్రుటిలో తరించు వాయు విజయములను గాంచినది. విమానమును నేడు

ప్రపంచజాతులన్నియు యుద్ధములందు శాంతిసమయములందు వాడుచుండుటచే చరిత్రలో నొకనూతన శకమారంభమైనది. కాని మహాత్ముడు కనిపెట్టిన సూత్రము మానవలోకమునకు విమానముకంటె నతిముఖ్యమైనది; భావిశతాబ్దముల భాగ్య భోగ్యముల నది యద్భుతముగ మార్చివేయగలదు. అతని 'సత్యాగ్రహము' ఆధ్యాత్మిక ఖేచరగమనమని గుర్తించెదరు గాక! దానిని సరిగ అర్థముచేసికొని 'తూ. నా' తప్పకుండ నాచరించినచో వ్యక్తులేకాక జాతులుకూడ మానవునిలోనున్న వ్యాఘ్ర, వానరత్వములను పోద్రోలి భగవంతుడని మనము పిలుచునట్టి యాధ్యాత్మిక పూర్ణత్వమును పొందగలవు. ఒక చిచ్చుబాంబులేక మరఫిరంగి యెదురైన నాడది యేమి చేయ గలదు? అని కొందరతని దార్జన్య రాహిత్యమును లేక 'ఆత్మశక్తిని' పరిహసింపవచ్చును. దీనివలన జీసను చరిత్ర వారి కర్థముకాలేదని స్పష్టమగుచున్నది. రైలు క్రొత్తగా కనిపెట్ట బడినపుడొక పార్లమెంటుసభ్యుడు దానినొక క్రోధోద్దీపితమగు గోవు డీకొనినచో నేమగును? అని ప్రశ్నించెనట! ఇది దానిని జ్ఞప్తికి తెచ్చుచున్నది. నూరేండ్లు లేదా వేయేండ్లు గతింప నిండు! ఏలయన మానవుడాధ్యాత్మిక రాజ్యమున నింకను ఒక శిశువు—అప్పటికి యిూనాడున్న ప్రస్తుత సైనిక నిరంకుశ త్వము, అట్టి భావములే కలవారు మట్టిలో కలిసిపోవుదురు. వారు నేడు ప్రోగుచేయుచున్న ఆయుధసామగ్రికిగూడ నాగ

తియేపట్టును. కాని యీబడుగు హిందువు కనిపెట్టిన యాధ్యాత్మికాస్త్రము మాత్రము యొక్కవోకుండనుండ విశ్వమంతయు దానిని స్వీకరించును. అట్టి యున్నతగతిని, కళ్యాణమార్గమును నిజముగ మానవున కర్హమగు మార్గమునుచూపి నందులకు ప్రపంచ జాతులన్నియు నతని నాశీర్వదించును. అప్పుడతడు దేవదూతయనియు నతని సందేశము బుద్ధుడు జీసను మహమ్మదుల సందేశమువలె నొకజాతికి, యొకదేశమునకు సంబంధించినదికాదనియు గుర్తింపబడును.

సజీవముగనున్న మతములలో హిందూమత మన్నిటికంటె పురాతనమైనది. దానికి నలుబది శతాబ్దముల యనవరతచరిత్రకలదు. అది యంతటితో నాగిపోలేదు. అదియెప్పుడును నూతనసందేశములను, నూతనధర్మములను, ప్రవక్తలను, అవతారములను ఆహ్వానయముచేయుచుండును. ఒక్కమాటలో చెప్పవలెనన్నదది సత్యమునింతోధికముగ గ్రహించుచునేయుండును. నేడదియొక యభ్యుదయ దశలోనున్నది. దానిచరిత్రకొకనూతనాధ్యాయము చేర్చబడెను. హిందూ ఆధ్యాత్మికత యొక్క యదార్థావతారమైన మహాత్ముడు దానిసనాతన సత్యములకు నూతనవ్యాఖ్యానములను చేయుచు నాధునిక ప్రపంచ పరిస్థితులకు వానిననువర్తింప చేయుచున్నాడు. అతని సత్యాగ్రహసందేశము హిందూమత ప్రధానసూత్రమైన అహింసను జాతీయ, అంతర్జాతీయసమస్యల కనువర్తింపచేయుటయే యని

యత డేవచించెను. మానవునిలోనున్న దివ్యత్వమును బహిర్గత ముచేయగల యీసూత్రమును వ్యాప్తిచేయుటకును అనుసరించుటకును ఒక హిందూదేశమునకు తప్ప మరే దేశమునకును తగిన మత సంస్కారములేదు. 'ఏకంసత్ విప్రబహుధా వదంతి' అను హిందూసూత్రమునే యతడురాజకీయ పరిభాషలో దార్ఢ్యస్వరహితముగ జయించు స్వరాజ్యము, సర్వమత సహానత్వము, అన్నిజాతులకు సమానహక్కులు, అధికారములు అనిభాషించెను. అతడుద్యమించిన యస్పృశ్యత నివారణ, ఆధునిక కులపద్ధతులలోని యక్రమములను తొలగద్రోసి వర్ణాశ్రమ ధర్మతత్వమును ప్రాచీన పవిత్రతతో నుద్ధరించుటకే యతడు సంకల్పించెనని గుర్తింపవలెను. అదియే ప్రపంచములోనుత్కృష్టమైన కమ్యూనిజము అని యతని యభిప్రాయము. భారతగ్రామములలో రాటములను చేతిమగ్గములను పునఃప్రతిష్ఠించుట, మద్యపానమును నిషేధించుట భారతనాగరిక లక్షణములను జ్ఞప్తికి తెచ్చుటయే! వీనిని అన్నివిధముల రక్షింపక తప్పదు. పైగా నన్నిసాంఘిక రాజకీయసమస్యలను మతదృష్టితోచూచుట, ప్రతిజీవితరంగమున సత్యఅహింసలను శాసించుట, నిత్య జీవిత వివరములలోకూడ సర్వమానవ ఆధ్యాత్మిక మైక్యతను గుర్తించుట యుత్కృష్ట హిందూమత లక్షణములే యని గ్రహింపవలెను. ప్రతియింద్రియమును భ్రమింపచేయగల సమస్త పరికరములతోగూడిన యీయాధునిక ప్రపంచమున నతడుతన

శుష్కోపవాసములచేతను, కఠినవ్రతములచేతను, వైరాగ్యజీవితముచేతను తాపసకర్మలచేతను ప్రాచీనభారత బ్రహ్మచర్యాదర్శములను సమర్థించెను. ఈవిధముగ నతడు బోధలచేతను తనసాదృశ్యముచేతను భూతచరిత్రకర్త్వమైన భావిభారతమతమునకు మార్గమునుచూపినాడు. ఈమతము నుద్ధరించిన మహాపురుషులలో నితడొక్కడనుట కెట్టి సందియమును లేదు. అతని యుపన్యాసములు, రచనలు హిందూమతగ్రంథములలో నొకయంగమగునని చెప్పకతప్పదు.

—౯—

# మహనీయుడగు ‘బుడుత’ మహాత్ముడు.

## క్లేర్ షెరిడనుకన్య.

మహామహుడగు ‘బుడుత’ మహాత్ముని కండ్లార దర్శించని వాడతని నిజమాహాత్మ్యమును గుర్తించుట దుస్సాధ్యము. ఇంగ్లండులో ముద్రాలయము లతనిని బుద్ధిపూర్వకముగ నపార్థముచేయును. అతనికే న్యాయమైన యవకాశముల నిచ్చినచో నతనిపేరు డిక్టేటరులపేరులవలె మారుమ్రోగెడిది. భయజనకము, అట్టహాసపూరితమునగు యుపన్యాసమొక నియమిత దినమున నియమితకాలమున సప్తసముద్రములమీదుగ వినవచ్చునని లోకములను ‘చెవులురిక్కింప’ చేయుటకంటె మహాత్ముని

దివ్యసత్యములను లోకమాలకించునట్లు చేయుటెంతయద్భుత ముగనుండునో కదాయని నేననిశము తలచుచుందును. అవి యెంతప్రబోధజనకముగ నెంతజ్ఞాన దాయకముగనుండును! స్పష్ట మైన సమాధానములు, ఆదర్శప్రాయములగు అభిప్రాయము లు; ద్వేషము కలికముకైనను లేకపోవుట, దౌర్జన్యముచే జడి పింపకపోవుట - ఇక నేమికావలెను?

"గాంధీ మనలనతిజోరుగ ద్వేషించునా?" యని లండను డెర్బీప్రభువు నన్నడిగినపుడు నాకు కలిగిన యాశ్చర్యమింకను కండ్లకు కట్టినట్లుండును. గాంధీవ్యక్తిగతముగగాని సామాజిక ముగగాని ద్వేషింప గలడనుకొనుట యతని ప్రకృతిని సుత రామున్గ్రహింపజాలక పోవుటయే యనివేరుగ చెప్పనక్కర లేదు.

రౌండుటేబిలు సభలనాడు నేనతనిని "అతిసమీపము" నుండి చూడగలిగితిని. నేనతని యాకృతిని తీసికొనుటకు సరో జినీదేవి యతని నొప్పించెను.

కాని యదియంత సులభవిషయము కాకపోయెను. అతడు పోజుయివ్వడు. దీనికి వినయము, తీరికలేకపోవుట, కళ యందంత శ్రద్ధలేకపోవుట విడివిడిగగాని మొత్తముమీద నన్ని యుకలసికాని కారణముకావచ్చును. నేను 1920 లో క్రెమ్లిను లోని కర్మాగారమును దర్శించినపుడు లెనినుమహాశయుడుకూడ నాపై నిట్టిషరతులనే విధించెను. ఈయిద్దరకు నొకచిత్రమగు

పోలికకలదు. ధార్జన్యపరియోజనమును గురించి వారికి భేదాభి ప్రాయములున్నను యిద్దరును తీవ్రమైన యాదర్శపురుషులు.

నేను ప్రథమములో మహాత్ముని కలుసుకొని నపుడు లెనినువలెనే యతడును "నేనుపోజుచేయజాలను. నాపనిలో నన్ను మగ్నుడనై యుండనిమ్ము. నీశక్తివంచన లేకుండపనిచేసి కొనుము" అనియనెను. గాంధీజీ నేలమీదకూర్చొని వడుకు చుండెను. లెనిను తనఆఫీసుకుర్చీలో చదువుకొనుచు కూర్చొ నెను.

ఈరెండు సందర్భములలోను నేను అవ్యక్తమగు నిరాకరణనుగుర్తించితిని. కాని యది రెండింట యన్యోన్యమిత్రత్వముగనే పరిణమించెను. ఒకనాడు గాంధీజీ సరిగా లెనినుమాటల లోనే, లెనినుయొక్క వ్యంగ్యమందస్మితముతోనే "అయితే నీవు విన్స్టనుచర్చిల్ యొక్క దగ్గరబంధువురాలవా?" అని యడిగెను. సరిగా వెనుకటి పరిహాసవాక్యమే! విన్స్టనుయొక్క బంధువురాలు అతనిబద్ధవిరోధితో సోదరభావము నెరపుటా? ఇంకను గాంధీజీ యిట్లనెను. "నన్నుచూచుట కతడు తిరస్కరించుసను సంగతి నీవెరుంగుదువు. కాని నిన్నుచూచుటకు నేనెంతయా నందించితినో నీవతనితో చెప్పవా? నేను చెప్పితినని చెప్పుము." సరిగా లెనినుకూడ యీవిధముగనే యనెను.

నేను వారి తలలను పూర్తిచేసి "యెట్లున్నది?" అని ప్రశ్నించినపుడిద్దరును ఒక మోస్తరుగనే "నాకు తెలియదు.

నా ముఖమునుగురించి నేనే నిశ్చయింపజాలను. కళసంగతి నాకేమియు తెలియదు. కాని నీవు చక్కగా పనిచేసితివి" అనిరి.

వీరిద్దరిలో ప్రపంచమున నెవరి ప్రభావము హెచ్చుగా నుండునాయని నాలో నేను తలపోయి చుందును. రష్యాకు సంబంధించినంతవరకు లెనిను ఒక కాచమంజూషములో నుంచ దగిన శరీరముకంటె నెక్కువకాదని నాకు తోచును. కాని యిట్టితీర్పు చెప్పుట కింకను సమయమాసన్నముకాలేదు.

గాంధీజీ యింకను కార్యకలాపమును వీడలేదు. అతని కృషి ఫలింప నారంభించుచున్నది. ఈ యిద్దరును అవి నాశ మగు సందేశమునే ప్రపంచమునకు ప్రసాదించిరని నా విశ్వా సము; త్రొక్కివేయబడిన వారికి గర్హింపబడినవారికి వారి సందే శము ప్రాణదానము సేయును; వారిది పతితులను తిరిగి తలయెత్తి ప్రపంచములో తమ స్థానమును గుర్తింప సమర్థులనుచేయు సందేశము. గాంధీజీ సందేశములో దాని కత్యున్నతస్థాయి కల్పించు ఆధ్యాత్మిక ప్రభావముకలదు. లెనిను యుద్యమము కొరకు చనిపోయినవారు వీరులు; గాంధీజీపేర చనిపోయిన వారు వీరులేగాక నాత్మబలిదానముచేసిన వారగుదురు.

అమెరికా శిల్పకారుడగు డేవిడ్సను నేను మాయను భవములనుగురించి ముచ్చటించుకొంటిమి. అతడు మన యుగము నాటి మహామహులలో చాలమంది శిల్పములను తయారు చేసెను. వారియొక్క సమావేశములు ఆశాభంగ కరములని

మే ముభయులము అంగీకరించితిమి. గుర్తింపబడునట్టి పొన్న కర్రలు, బిళ్లడ ఫేదాపులు, దోచుకొనబడిన ప్రాసాదరంగ స్థలములు మొదలగు 'ముస్తాబు' లేనిచో వారిలో నొక్కడును అందగించడు. కాని గాంధీజీ వీరికతీతుడు. తన "ఖద్దరు" తో కప్పబడి, నగ్నపాదవిలాసుడైన యా నిరాడంబరమూర్తి యత్యాకర్షణీయమైనవాడని వేరుగ చెప్పనక్కరలేదు. అతని ప్రసన్నతచేతను, అతడు నాలో రేకెత్తించిన పూజ్యభావము చేతను నేనతనిని వీడిపోవునపుడు ఆర్యభావముతో నతని కరద్వంద్వమును ముద్దువెట్టుకొంటిని. అప్పుడతడు తనప్రేమను వెలిబుచ్చి "స్నేహితుల నెన్నడును మరచువాడనుకాను" అని చెప్పెను.

నాప్రాతబల్లమీద నర్థపద్మాసనస్థుడై వడుకుచుండు నతని చిన్నవిగ్రహమొకటియుండును. నిజముగ నతడు వడుకుటలో మగ్నుడై క్రిందకు చూచుచుండును. కాని నామట్టుకతడు నిశితధ్యాననిష్ఠలో మగ్నుడైన బుద్ధుడు. అతని చెక్కుచెదరని ప్రశాంతతనుండి బయల్వెడలు జగన్మంగళకరములగు భావము ప్రసారమును నేను పసిగట్టితిని.

లండనులోనున్నపు డతనిచుట్టు నొకచిన్న ప్రపంచము మూగుచుండెడిది. అదిచిన్నదియైనను ప్రాతినిధ్య విశేషముచే మిన్నదిగనే యుండెను.

నిత్యము ప్రాతఃకాలము పదిలగాయితు పన్నెండుగంటలవర కతడు సలహాకోరిన వారికి సలహా యిచ్చుచుండును. అతడు వారిని సోదరప్రేమతోను, అపరిమిత సహనముతోను, ఆహ్వాయము చేయును. కాని తనవడుకుటకు మాత్రమెవ్వనిని అడ్డుపెట్టనీయడు. అతడొక్కసారి మాత్రమే యొకప్రేక్షకుడు వచ్చినప్పుడు లేచి నిలువబడెను. చక్రవర్తివచ్చినను అతడు లేచి నిలువబడునని నేను విశ్వసింపను. కానిచేతనొక పుస్తకముబూని యింగ్లండు చర్చికి సంబంధించిన పీఠాధిపతి వచ్చినపు డతడు నిలబడెను. "శ్రేష్టమైన క్రైస్తవులమగుటకు మేమేమిచేయవలెను?" అనువిషయమును గురించి యాపుస్తకములో వ్రాయమని యతడు గాంధీజీని బ్రతిమాలెను.

అతడు కాలహరణము చేయువానిని మూర్ఖప్రశ్నలను వేయువానిని నెమ్మదిగ పంపివేయుచుండుట నాకాశ్చర్యమును కలిగించెను. చేదస్తుడైన దక్షిణాఫ్రికా పరిచయస్తు నొకనిని యతడట్లే చేసెను.

తరువాత నొకయచ్చమైన యింగ్లీషుదొరగారు వచ్చిరి. వారినతడతి మిత్రత్వముతో నాహ్వానముచేసెను. కాని వారి సంభాషణ వాతావరణమును, ఇంగ్లండుయొక్క పచ్చదనమును మించి పైకిపోలేదు. ఆప్రేక్షకుడు జయిలులో గాంధీజీకి శస్త్రచికిత్సచేసి బ్రతికించిన డాక్టరు.

తరువాత నొక ఫ్రెంచిదేశపు లేడీవకీలు వచ్చెను. "ఫ్రెంచిదేశ మింకను తన యుద్ధతత్వమును కాపాడుకొను చున్నదా ?" యని మహాత్ముడు ప్రశ్నించినపుడామె "గాంధీజీ! మేము యుద్ధముకు కాలుదువ్వలేదు; మమ్ము మేము రక్షించుకొంటిమి." అని చాటెను; దానికి మహాత్ముడు మందహాసము చేసి యూరకొనెను.

తరువాత వామపక్షముకు చెందిన యొక "వారపత్రిక" యొక్క సంపాదకుడు వచ్చెను. అతడు నేనడుగదలచిన ప్రశ్నల నన్నింటిని యడిగివేసెను. ఆ సంపాదకుడతి నిశితమైన వాదమును చేసెను. గాంధీజీ ప్రతిప్రశ్నకు తృప్తికరమైన సమాధానము నిచ్చెను.

అతడు వెళ్లినతరువాత పాల్‌రోబ్సనుయొక్క భార్య యతని పాదములపైవ్రాలి యమెరికాలోని నీగ్రో సమస్యను గురించి ప్రశ్నించెను. దానిని గురించి మహాత్ముడదివరకు యోచించి యుండలేదు. అయినను ఆమె దానికి సంబంధించిన లెక్కలను చూపెను. "ఎప్పుడో యొకప్పుడు నీగ్రోలు విజృంభింతురని మీరు తలచెదరా ?" యనెను. గాంధీజీ యట్లు తలంపుడు. ఆమె యంతటితో విడువక "మేము వారిలో లీనమై పోవుదుమా?" యనెను. "కావచ్చును." "అయితే" "అప్పుడు నీగ్రోసమస్యయే యుండదు."

అకస్మాత్తుగ నొక జర్మను స్త్రీ యనాహూయముగ వచ్చెను. ఆమె గాంధీజీని బాగుగ నెరిగియుండుటచే లాంఛనములను పాటింపనక్కరలేనట్లు కాన్పించెను. అతడు వడుకుట నాపివేసి తన హస్తము నామెకొరకు చాపెను. ఆమె తన రెండు చేతులతో దానినందుకొని యొక పవిత్రస్మారక వస్తువును రక్షించుకొనునట్లు పట్టుకొనెను.

"నీవు తిరిగి జర్మనీ వెళ్లిపోవుచున్నవా?" యని యతడామెనడిగెను. ఆమె శిరమువంచి, సమాధాన మీయజాలక, పెదవులు వణకుచుండ బొటబొట కన్నీళ్లు కార్వజొచ్చెను.

" శెలవు— "

ఆమె యొక యడుగు వెనుకకు వేసి, చేతులనింకను చాపి యుంచి యతని నానందపరవశమున తదేకదృష్టితో చూచుచు వేడికన్నీటిధారతో నంతర్థానమయ్యెను.

ఇంతలో ఆగాఖానువద్దనుండి యొక పగిడీవాలా రాయబారి వచ్చెను. "అతి ముఖ్యమైనది; మధ్యవర్తిత్వమునకు మీరంగీకరింతురని ఆగాఖాను ఆశించుచున్నాడు—"

అప్పుడొక హిందూవిద్యార్థి తన యమెరికాదేశపు భార్యను అతనికి చూపించెను. గాంధీజీ యామె నొకసారి వీక్షించి " నీ భార్యను నీతో హిందూదేశమునకు తీసికొని వెళ్లెదవా ?" యని యావిద్యార్థినడిగెను. అంగీకారపూర్వముగ నతడిచ్చిన సమాధానము సంశయాస్పదముగ నుండెను.

నీవు ప్రాతఃకాలప్రార్థనకు రానిచ్ఛగింతువేని రాత్రి కింగ్సులీ హాలులో గడుపుటకు మిత్రులచే నేర్పాటుచేయింతును. కాని మేము బీదవారమగుటచే కప్పుకొనుటకు నీకంబళ్ళను నీవే తెచ్చుకొనవలెను.''

కింగ్సులీహాలు ఫ్యాక్టరీ కార్మికుల కొరకేర్పర్చబడిన సౌభాగ్యమందిరము. దీనికొరకు లెస్టరుకన్య తన జీవితమును భాగ్యభోగ్యములనుధారవోసెను. లెస్టరుకన్యకకును, ఆమెపనికిని ధన్యవాదము లొసంగుటకే మహాత్ముడు అధికారరీత్యా యింగ్లండును దర్శించినపుడు కింగ్సులీహాలు ఆతిథ్యమునంగీకరించెను.

దట్టముగామంచు పట్టివణకించుచున్న యొకనాటిరాత్రి నేనచ్చటకువెళ్ళితిని. నాకొక తెల్లనిచిన్నగది యివ్వబడెను. దానికొక డాబామీదనుండి మార్గముకలదు. తెల్లని మేలిముసుగుతో మీరాబాయి పిట్టగోడకుజేరబడి యొకయోగినివలెనుండెను. ఆమెనన్ను మూడుగంటలకు పూర్వము మేల్కొలిపెదనని వాగ్దానముచేసెను. ఆరాత్రిని నేనెన్నటికిని మరువజాలను. వింతయగు నొకయనిర్వచనీయ సౌందర్యమును నేననుభవించితిని. ఒకచర్మపుకోటు కప్పుకొని నిద్రకళ్ళతో నేను మీరాబాయితో మహాత్ముని గదికివెళ్ళితిని. అదియొక తెల్లని చిన్నగది. అతడు నేలమీద నొకచాపపై తన "ఖద్దరు" కప్పుకొనికూర్చొనెను.

ఆమె సిగ్గరితనములేక నుల్లాసముగ నాత్మవిశ్వాసముతో నిండి యుండెను. "మహాత్మా! మీరు అమెరికాయెప్పుడు వచ్చెదరు?"

" ఇప్పుడుకాదు..."

"అక్కడ ప్రతివాడు మీకొరకు పరితపించుచున్నాడు." మహాత్మునికండ్లు దీపింప "నన్నచట నొకవస్తు ప్రదర్శనశాలలో భద్రపరచెదరని నాస్నేహితులు చెప్పుచున్నారు. (అందరును ఫక్కున నవ్విరి.)

అప్పుడు గాంధీజీ జీవితరచయితయగు దీనబంధు ఆండ్రూసు వారాంతవిషయములను చర్చింపవచ్చెను. తెగినపోచ నులతుకుచు గాంధీజీ "అవును అవును" అనియొప్పుకొనెను.

"బాపూ! యీసాయింత్రము 15గురు ఆంగ్లికను బిషపులుయిచ్చు స్వాగతమును మరువవద్దు. లండను బిషపుప్రత్యేకము మిమ్ముకలుసుకొనుటకు 7 గంటలకు వచ్చును."

గాంధీజీ పైకిచూచి "యేడుగంటల ప్రార్థనసంగతి?" ఆండ్రూసు దానినికొంచెము ముందుకుగాని వెనుకకుగాని నెట్టవలెనని సూచించెను. "త్రోవలో కారులోనే దానిని జరుపుదము" అని గాంధీజీ నిశ్చయించెను.

సాయంకాలపు ప్రార్థనకొకసారి నాకవకాశమీయబడెను! నేను దానిని గురించి మహాత్మునకు ధన్యవాదము లొసంగినపుడతడిట్లనెను. "దాని కందరును రావచ్చును. కాని

అతని హిందూకార్యదర్శి మాత్రో జేరెను. దీపము తగ్గింపబడెను; తెరచియున్న గుమ్మముద్వారా నీలిరంగు పొగ మంచు కమ్ముచుండెను. ఇద్దరు హిందువులు ఒక యాంగ్లఋషి శ్లోకములను పాడిరి. నేను కలగనుచున్నట్లు భావించితిని. అయిదుగంటలకు పూర్వము మీరాబాయి నన్ను తిరిగి లేపెను; అప్పుడు మహాత్ముడు షికారుచేయు సమయము. అతనిని మాట్లాడించుట కది మంచిసమయమని ప్రసిద్ధి.

మరియొక శీతోష్ణస్థితిగలప్రదేశములో నిట్టి జీవితము సుఖ ప్రదముగ నుండవచ్చును. కాని లండనుపట్టణ రాజకీయ, వర్తక కార్యకలాపములతో మహాత్ముడు తన మతవిషయిక సన్యాస తత్వము నెట్లు నిర్వహించుకొనగలుగుచున్నది నాయాధ్యా త్మిక శిక్షణము మాత్రమే విశదము చేయగలదు. కాని యప్పు డెట్టి శిక్షణములేని నేను నిద్రలేక మంచుచేతను చలిచేతను భౌతికముగను, మానసికముగను, ఆధ్యాత్మికముగను చేష్టలు దక్కినదాననైతిని. అతనిప్రాతఃకాల నడకనువెంబడించిన ఫలి తము నాకు దక్కలేదు. వెంబడించుటయని నేను బుద్ధిపూర్వక ముగ నుపయోగించితిని. ఏలయన మహాత్ముడు తన 'ఖద్దరును' కప్పుకొని రంయిమని పోవుచుండ మేమతనికొరకు పరుగెత్త వలసి వచ్చెను. పాపము! మా వెనుక నోగర్చుకొనుచు నుర గలు గ్రక్కుకొనుచు నతనిని వాడుటకో లేక కనిపెట్టుటకో నియ మింపబడిన యిద్దరు డిటెక్టివు పోలీసుల యవస్థ యా పరమాత్మ

నీకే యెరుక ! గాంధీజీ కామార్గము తెలియును. అదియొక కాలువవంచనుండెను. అతడామార్గమున కండ్లుమూసికొనినడచి పోగలడు. ఆ కాలువ కంటికి కన్పించకపోయినను మిల్లులోనుండి వచ్చునీటివలె ప్రవాహముయొక్క చప్పుడువినపడును. ఇద్దరుకలసి నడచుటకు మాత్రమే యవకాశముకలదు. మీరాబాయి నన్ను ముందుకు త్రోసి "ఇది నీకు మంచి తరుణము..." అనెను. మేము మతమును గురించి మాట్లాడినట్లు జ్ఞాపకము. సత్యమును, శ్రద్ధను ఆరాధించువారికి ద్వేష, అసూయలను విడిచినవారికి ప్రపంచమంతయు నొకే కుటుంబము. కాని గాంధీజీ నిజముగ నితరులతో మాటలతో మాట్లాడవలసిన యవసరములేదు. అతని పరిసరములనుండినంత మాత్రముననే మనము బుద్ధిపూర్వకముగనున్నతస్థాయికి పోగలము. అతని ప్రక్కనుండి మౌనముగ ధ్యానముచేసిన కళ్యాణము చేకూరును.

ఏడేండ్లు గతించి భావోద్రేకము చల్లారి జ్ఞప్తి కలవలె నుండ నేడు గాంధీజీని కలిసిన తరువాత నాలో నొక మార్పు కలిగెనని నేను చెప్పవలసియున్నది. నా జీవిత మొక వన్నె జీవనార్హమయ్యెను. నా జ్ఞాననేత్రము విడివడెను.

---

# గాంధీజీ రాజకీయ విధానము.

జె. సి. స్మట్సు యం. ఎ. యల్. యల్. డి. డి. సి. యల్.

పురుషాంతరము క్రితముగాంధీజీ యెదిరినైననేను శాస్త్రోక్తమైన డెబ్బదియేండ్లు నిండిన గాంధీజీకి నాధన్యవాదముల నర్పించుటన్యాయము. అతడింకను అనేక వత్సరముల ప్రపంచ సేవచేతను, ఆత్మశాంతిచేతను తనరారునుగాక! అతని మహోత్కృష్ట ప్రజాసేవనుగుర్తించి, యతని యుదారగుణగానము సేయు రచయితలతో చేరుటకు నేను పరమానంద భరితుడనగుచున్నాను. అట్టిపురుషులు మనలనందరను మనసామాన్య వ్యర్థ జీవితములనుండి తరింపచేసి కళ్యాణము సేయ విసువుచెందరాదని మనల నుద్బోధింతురు. దక్షిణాఫ్రికా యూనియనుచరిత్రలోని మాసంగ్రామఘట్టమును మహాత్ముడే చెప్పియున్నాడు; అది యందరకును తెలిసినదే. అప్పుడుకూడ నేనెవ్వని నెక్కువగ గౌరవించితినో యట్టివాని యెదిరినగుట నావిధికృతము. ఆచిన్న రంగమున జరిగినపోరులో గాంధీజీశీలములోని కొన్నిగుణములు బహిర్గతమయ్యెను. అవియే తరువాత విశాలభారతరంగము మీాద మరింత ప్రస్ఫుటమయ్యెను. తానుచేపట్టిన యుద్యమముల లోనతడెంతలీనమైనను పరిస్థితుల వెనుకనున్న మానవులను మరువడనియు, తనచిత్తస్వాస్థ్యమును పోగొట్టుకొనడనియు, ద్వేషమునకు తావీయడనియు నెట్టి విషమస్థితిలోనైనను తన

మార్ధవమైన హాస్యమును వీడదనియు విదితమయ్యెను. అప్పుడును యిప్పుడును అతని విధానమునకు, తత్త్వమునకును యీకాలపు నిర్దాక్షిణ్య, పశుసాంప్రదాయమునకు హస్తిమశకాంతరము కలదు. అప్పటి యతని కార్యకలాపములు నాకు ప్రాణకంటకముగనుండెడివని యొప్పుకొనకతప్పదు. నేనుతదితరదక్షిణాఫ్రికానాయకులతో పాటు బోయరుయుద్ధానంతరము మిగిలిని వలసలనొక నూతనజాతిగ నిర్మింపబూనుకొంటిని. అది యసామాన్యమైనపని; నాప్రతినిమేషమును నేను దానికే వినియోగించుచుంటిని. ఇట్టి తరుణములో గాంధీజీయొక విషమసమస్యనులేవదీసెను.

ట్రాన్సువాలులో భారతకూలీలను నిరోధించుటకు ప్రయత్నములు జరుపబడెను. చెరుకుతోటలలో పనిచేయుటకు వచ్చిన భారతకూలీల కంట్రాక్టు పూర్తియగుటతోడనే బలవంతముగ హిందూదేశముగెంటి వేయుటకు నేటాలులో వారిపై పన్ను విధింపబడెను. గాంధీజీ యీసమస్యనుచేబట్టెను. అతడొక నూతనయుద్ధశాస్త్రమును కనిపెట్టెను. బుద్ధిపూర్వకముగ చట్టము నుల్లంఘించు వేలకొలది సాత్త్వికనిరోధకుల నతడు తయారుచేసెను. రెండు రాష్ట్రములలోను గొప్ప గందరగోళములుబయలు దేరెను.

చట్టవిరుద్ధమగు పనులుచేసినందులకు వేలకొలది భారతీయులు బంధింపబడిరి. గాంధీజీకికూడ జయిలులో కొద్దికాలము

విశ్రాంతి దొరికెను. అతనిమట్టు కతని యేర్పాటుల ప్రకార మంతయు చక్కగనే జరుగుచుండెను. చట్టమును క్రమమును రక్షింపవలసిన నాగతి యకటా వికటముగ నుండెను. ప్రజా బలమే మాత్రమును లేని చట్టమును నిర్వహింపవలసిన యప కీర్తి నాపాలయ్యెను. చివరకాచట్టము రద్దుచేయబడినపుడు యవమానము, తలవంపులు నావయ్యెను. అతడు విజయభేరి మ్రోగించెను. ఇంతేకాక నతని వ్యక్తిత్వముకూడ విశద మయ్యెను. అతని కార్యకలాపములలో నొకవింతయగు వ్యక్తి గత బాంధవ్యముండి తీరును. జయిలులో నతడొక జతపాదుక లను తయారుచేసి బయటకువచ్చిన తరువాత నాకు కానుకగ నిచ్చెను. అట్టి మహనీయుని పాదుకలలో నిలుచుట కనర్హుడ నైన నేను అనేక వేసవులలో వానిని తొడుగుకొంటిని. దక్షి ణాఫ్రికాలోని మా పోరాటములను మేమట్టితత్వముతోనే సాగించితిమి. ద్వేషము వ్యక్తిగత దురభిమానము సుతరాము లేవు; మానవతత్వము మా కన్నుసన్నల నెన్నడును మెలగు చునే యుండెను. పోరాటము ముగియుటతోడనే యుభయ తారకమగు శాంతి యేర్పడుటకు తగిన వాతావరణముండెను. మేమిరువురము చేసికొనిన సంధిని పార్లమెంటు అంగీకరించెను. గాంధీజీ దక్షిణాఫ్రికావిడిచి భారతదేశమున కేగి నవీన భారత చరిత్రలో కనివిని యెరుగని విధమున తన తత్వమును, వ్యక్తి త్వమును ప్రజానీకమున చొప్పించెను. ఈ రంగమునందంతట

నతడు దక్షిణాఫ్రికాలో నేర్చుకొనిన పద్ధతులనే చాలవరకు ప్రయోగించెను.

చాలవరకుకాని పూర్తిగకాదు; ఏలయన నతడు తన పాతసాత్త్విక నిరోధపద్ధతితోపాటు (దీనికే సహాయనిరాకరణము అను నామాంతర మీయబడెను) హిందూదేశములో మరియొక పటుతరాస్త్రమును ప్రయోగించెను; ఇది తాను ప్రాయోపవేశముచేసి తద్వారా సంస్కారమును తెచ్చు విధానము. మా యదృష్టవశమున దక్షిణాఫ్రికాలో నీ పద్ధతిలేదు. హిందూదేశములో నిది యద్భుతముగ పనిచేసి యితరత్రి అతనికి చేకూరని విజయమును, ఉన్నతిని ప్రసాదించెను.

ఈ నూతన విధానమును (రాజకీయ పోరాటములో నిది క్రొత్తది) శ్రద్ధగ పరికింపదగును. గ్రేటు బ్రిటనులో ప్రభుత్వముయొక్క తప్పును చూపుటకు వ్యతిరేకపక్ష నాయకుడు ప్రాయోపవేశము చేయుటను నేనూహింపజాలను. ఇది ప్రజాస్వామికమునకును, పాశ్చాత్య నాగరికతకును సరిపడని పద్ధతి. దీనిని జాగ్రత్తగ శోధింపదగుననియే నా యభిప్రాయము.

భారత దేశ భావములకును, ఆచరణలకును నిది కేవలము నూతనముకాదు. ఋణస్థుడు ఋణము తీర్చనిచో ఋణదాత తాను పస్తుండి యతని నొత్తిడిచేయుట భారత దేశమున సర్వాంగీకృతయాచారము. పాశ్చాత్య దేశములలో ఋణగ్రస్తుని బంధించి యొత్తిడిచేతురు. గాంధీజీ యీ భారత విధానమునే

తీసికొనెను. అతడు ప్రభుత్వపువారి గుమ్మముమీద లేక తాను మంచిమార్గమునకు త్రిప్పదలచుకొనిన (సంఘములో నెదురుతిరిగినట్టి) యొకతరగతివారి వాకిట ధర్నాకూర్చొని యవసరమైనచో ప్రాణత్యాగము చేయును. ఋణదాతవలెనే యతడును వాదోపవాదములు చేయుటచేగాక నాంతరంగికముగ నుండు భయము, సిగ్గు, పశ్చాత్తాపము, సానుభూతి, మానవ కారుణ్యము మొదలగు భావోద్రేకములను రేకెత్తించును; ఇవి మొత్తములై వాదములకంటె, బుజ్జగింపులకంటె నమోఘముగ పనిచేయును. ఋణదాత — వ్యతిరేక ప్రభుత్వము లేక తరగతి— యీభావప్రకోపముచేత నైతికముగ తబ్బిబ్బయి చివరకు పరాజయము నొందును. ఈ రోజులలో విరివిగ జరుపబడుచున్న ప్రచారక పద్ధతులకిది కొన్నివిధముల పోలియున్నది. ఇవిప్రజామనమును హేతువుచేతగాక భావోద్రేకముచేత (అనేక భావములు హేతువిరుద్ధములే) రెచ్చగొట్టును. నేడు పాశ్చాత్య ప్రపంచములో ప్రచారక విధానము ప్రజాభిప్రాయమును పాడుచేసి విషప్రాయము చేయుచున్నట్లే యీ నూతనశాస్త్రము కూడ విపరీతపుంతలకు దారితీయవచ్చుననుకొనుట కవకాశము కలదు; లక్ష్యములు మంచివైనను చెడ్డవైనను విధానము మాత్రముపద్రవకరమైనది. అది హేతువును, వ్యక్తిగత బాధ్యలను కూలద్రోయుచున్నది. మానవ ప్రకృతియొక్క తుది

కోట యనదగు వ్యక్తియొక్క యాంతరంగికము నది 'మనో ద్వాసము' చేయుచున్నది.

కాని పాశ్చాత్య పరిచారకపద్ధతికిని గాంధీజీ పద్ధతికిని ప్రధానభేద మొకటికలదు. అతడు తన బాధచేతనే జాతిని మేల్కొలుప యత్నించును. ఈ విధానము త్యాగసూత్రము మీదను యితరులకొరకు తాననుభవించు బాధ వారి భావములను పవిత్రీకరించునను సూత్రముమీదను ఆధారపడియున్నది.

గాంధీజీ తన నూతన సంస్కార విధానము నీపటుతర యాత్మసమర్పణ సూత్రముపై నిర్మించెను. తాను చేపట్టిన యుద్యమముపట్ల నితరుల యభిమానాదరణములను పొందుట కతడే బాధపడును. బుజ్జగింపులు, హేతువాదము మొదలగు సామాన్య రాజనైతిక పద్ధతులు విఫలమైనపుడతడీ ప్రాచీన భారత సాంప్రదాయిక పద్ధతి నవలంబించును. ఈ విధానమును రాజకీయవేత్తలు పర్యాలోచన చేయవలెనని నాయభిప్రాయము. రాజకీయముల కిది గాంధీజీయొక్క ప్రత్యేక కానుక.

మరియొక భావముతో నేను దీనిని పూర్తిచేసెదను. చాలమంది, యతనిని మనఃపూర్వకముగ మెచ్చుకొనువారిలో కూడ కొంతమంది, యతని భావములలో కొన్నింటి నంగీకరింపరు; అతని పద్ధతులుకూడ కొన్ని వారికి నచ్చవు. అతని పద్ధతు లతనికే చెల్లును. ఇతర మహనీయుల పద్ధతులవలెనే యతనివిని సామాన్య ప్రమాణముల కతీతమైనవి. కాని యత

నితో మన మెన్నిసారులు భేదించినను అతని విశ్వాసమును, స్వార్థ రాహిత్యమును, అన్నింటికంటె ప్రప్రధానమైన యతని విశ్వమానవత్వమును మన మెన్నడును మరువజాలము. అన్ని తరగతుల యెడల, నన్ని జాతులయెడల, ముఖ్యముగ దీనుల యెడల నతడొక గొప్పయుదార పురుషునివలె నెల్లపుడును సానుభూతితో పనిచేయును. అతని దృష్టి యఖండమైనది.

ఒక వంక యూరపు ఛిన్నాభిన్నమై ముక్కముక్కలగు చుండ ఆసియా స్థైర్యముగ ముందుకు వచ్చుచుండుట వింత విషయము. నేడు ప్రపంచరంగములో నిద్దరు ఆసియాఖండ నివాసులు—గాంధీజీ, షియాంగు కేషేక్‌లు మహాపురుషులని చెప్పదగును. ఇద్దరును కోట్లకొలది ప్రజల నుదార మార్గముల నడుపుచు పాశ్చాత్యులచే స్వీకరింపబడినను యిప్పుడు శ్రీగాభక్తులతో నాచరింపబడని క్రైస్తవాదర్శ గమ్యముకు గొంపోవు చున్నారు.

---

# మహాకవి ప్రవచనము

## రవీంద్రనాథ్ టాగూరు.

రాజకీయ రంగములో నప్పుడప్పుడు సామాన్య మానవుల కతీతమగు బుద్ధివైశద్యముగల చరిత్ర నిర్మాత లుద్భవించు

చుందురు. వారు మానవ ప్రకృతిలోనున్న దురాశ, భయము, దంభము మొదలగు దుర్బలత్వములను కొల్లగొట్టునట్టి యొక యధికారాస్త్రమును బూనెదరు. తరచు ఆశక్తి నిర్దాక్షిణ్యముగ కర్రచేబూని పనిచేయించునట్టి పశుశక్తి. మహాత్ముఁడు భారత స్వాతంత్ర్యపథమును చూపినపుడతని చేతిలో నధికార బలమేమియులేదు; మొట్టికాయలు మొట్టి బలవంతపరచు శక్తి లేదు. ఆ వ్యక్తినుండి బయల్వెడలు నధికారము సరస సంగీత సౌందర్యాదుల యధికారమువలె ననిర్వచనీయమైనది.

ఐచ్ఛికమైన యాత్మార్పణమునది ద్యోతకముచేయును గనుక ప్రజలు దానికి జోహారు లొనర్తురు. ఆకారణముచేతనే మనప్రజలు పరస్పర విరుద్ధ విషయములను త్రికమకచేయు బుద్ధి పాటవము నతనినుండి యాశింపరు. అతని శీలముద్వారా స్ఫటిక ధావళ్య, నిరాడంబరత్వములతో వెలుగొందు సత్యమునే వారు చూఁజగోందురు. అతని రంగము భౌతికమగు రాజకీయ రంగమేయైనను ఋషుల శీలము కెనయగు నతనిశీలమునకు ప్రజలు ముగ్ధులగుదురు. ఋషుల యాధ్యాత్మిక జ్ఞానము మానవుని వివిధరంగముల నిమిడ్చుకొని వాని కతీతమగుచు నతిలోక సనాతన జ్ఞానపెన్నిధినుండివచ్చు జ్యోతిని లోకమారయు నట్లు చేయును.

---

# సత్యాగ్రహ పథము

**శ్రీమతి సోఫియా వాడియా.**

గాంధీజీ కార్యశూరత్వముగల ఋషి. అతని జీవిత వేదాంతము, రాజకీయ ప్రణాళిక వేలకొలది ప్రజల నుద్బోధితుల నొనర్చెను; కోట్లకొలది ప్రజలను నిర్ఘాంతపరచెను. ఆత్మ జీవితమునుగురించిన యతని వేదాంతమును వివేకవంతుడెవడైనను అర్థము చేసికొనగలడు. దాని సూత్రములను నిశ్చయబుద్ధిగల భక్తుడు ఆచరింపగలడు. కాని గాంధీజీ యతి ప్రాచీనభూత భారతముయొక్క సహజ పరిణామమనియు, నిజమునకు దాని వర్తమాన చరిత్రను సృజించిన శక్తులయొక్క యపరావతారమనియు గ్రహించనంతవరకతని రాజకీయ ప్రణాళిక అర్థము కాజాలదు.

వర్తమాన భారతము ఇరాను, యీజిప్టులవలె ప్రాచీనభూమిమీది నూతన నాగరికతకాదు. ఇరువదియవ శతాబ్దములోని భారత ప్రబోధ జీవప్రవాహము శత శతాబ్దములుగ భారతదేశములో స్థిరముగ ప్రవహించుచున్న నిరంతరాయ వాహినియేయని గుర్తింతురుగాక! హిందూదేశములోని ప్రాచీన శిథిలములుగూడ నితరములవలె గాక (ఒక్క చీనాలోతప్ప) నవ్యభావములను, నవ్యమూల్యములను కలిగియుండును. ఈజిప్టులోని పిరమిడులుదానియొక్క గతకీర్తినిమాత్రమే తెలుపగలవు.

మన మోహన్‌జోడరో అట్లుకాదు. అదియొక ప్రాచీన చిహ్నముకాక భారతచైతన్యయుత విజ్ఞానములో నొక యవయవము.

నేటి భారతము నవీనయిరాను, నవీన యీజిప్టులవంటిది కాదు. అది పాతమనుష్యులే నవనాగరికులక్రింద మారిపోయిన నవీన జపానువంటిదికూడ కాదు. హిందూదేశములో మహానగరములలో మాత్రమే నవనాగరికత కాన్పించును. కాని అక్కడకూడ నది యసంపూర్తి విషయమే. ఆంగ్లభాష నభ్యశించినవారికీ నాగరికతపోకెను. గాంధీజీ వ్రాతలును, చేతలును దానినరికట్టుచున్నను యీ జాడ్యము పెరుగుచున్నట్లే కాన్పించును. అతని పలుకుబడిపోయి యతని రాజకీయ పద్ధతులు తుప్పుపట్టినపుడు మాత్రమే నవనాగరిక హిందూదేశము తల యెత్తును; అది హిందూదేశము బుద్ధుని సిద్ధాంతములను త్రోసివేసిన దానికంటెకూడ హిందూదేశమునకును ప్రపంచమునకును నెక్కువ యుపద్రవకరమగును. ఆబుద్ధ తిరస్కారము చెడ్డది, యుపద్రవకరమైనదియైనను భారతాభ్యుదయమును, ప్రపంచమున కది చేయగల యపారసేవను వారించినను భారత విజ్ఞానమునే చంపివేయలేదు.

గాంధీజీ జీవితము కార్యకలాపములు పరిణతి పొందుచున్న, యసంపూర్తియైన, భారత చారిత్రకాధ్యాయము అను దృష్టిలో నన్వయించుట చాల యవసరము. మన భారతచరిత్ర ముఖ్యముగ నాధ్యాత్మిక వ్యక్తుల నిర్మాణము. అట్టి వ్యక్తు

లలో మూర్తీభవించి, వారిచే బోధింపబడిన యాధ్యాత్మిక విజ్ఞానమూలములనుండియే సరస సాహిత్య, కళాసంపన్నములగు మహాసామ్రాజ్యములు సహజముగ నుద్భవిల్లెను. అశోక చక్రవర్తి సామ్రాజ్యము, అజంతాకళలు నొక మహావృక్షము యొక్క యొక శాఖాఫలితములు; గౌతమబుద్ధుడేయాశాఖ. ఆ చెట్టుయొక్క శాఖల సంఖ్యాకములు. దాని ప్రమాను గత బుద్ధుల (వైదిక ఋషులు, గాయకులుసహా) యభేద్య విజ్ఞాన ప్రతినిధి. దానిమూలములు పౌరాణిక గాథలలో శకద్వీపము, శ్వేతద్వీపము అని వర్ణింపబడిన మరింత ప్రాచీన భూమిలో పాతుకొని పోయినవి. గాంధీజీ లక్షలకొలది వత్సరములనుండి వచ్చు వివరములుగల భారత చరిత్రయొక్క యిరువదియవ శతాబ్దపు తెరమీది కేంద్రచిత్రము.

మన చరిత్రలో ప్రధాన పాత్రలను వహించిన యాధ్యాత్మిక వ్యక్తులెప్పుడును సిద్ధపురుషులే! వారు తమసర్వేంద్రియములను శిక్షించి సిద్ధులైన మహాత్ములు. కరచరణాదులు బుద్ధి హృదయము యెంత యెక్కువ సమన్వయమునొందిన నంత మాహాత్మ్యము! వారు తమ మాతృభూమిని బాహ్యసంపదచే గాక నాంతరంగిక మైశ్వర్యముచే సేవించిరి. అవసరమైనపుడు వారు రామునివలె రాజ్యభారమును వహించిరి. మరియొక యుగములో రాకుమారుడైన సిద్ధార్థుడు రాజ్యత్యాగముచేసి భిక్షాపాత్రను చేబూనెను. ఈయిద్దరును సిద్ధపురుషులే! కవులు,

ఋషులు, మునులు, గాయకులు—బాహ్యరూపములలో భిన్నులుగనుండి వివిధ పరిసరములలో సేవచేసిన వారిట్టి వారెందరో కలరు. కాని వారందరు నాత్మప్రబోధమునొందిన వారు; తథాగత జ్యోతిచే ప్రకాశించు నిండుహృదయులు. వారిని భారత చరిత్ర కారులనుటకంటె ప్రపంచ చరిత్రచే సృష్టింపబడిన వ్యక్తులనుట యుక్తము; అనగా కర్మభూమి, భారతవర్షము అని పిలువబడు ప్రదేశములోని యాత్మప్రభావముచే నుత్పన్నమైనవారు. వారందరును భారత దేశముయొక్క నిజప్రకృతిని నిజధనమును, ఆధ్యాత్మికన్యాయమును, క్రమమును (ఇవియన్నియు 'ధర్మము' అను పదములో నిమిడియున్నవి) రక్షించుటచేతనే మానవ లోకమును సేవించిరి. ఇట్టి భావన పిచ్చిగను చారిత్రకముగ నర్థరహితముగను కాన్పించవచ్చును. భూత భారతప్రజలలో చారిత్రక జ్ఞానము లుప్తమని పాశ్చాత్యపండిత ప్రకాండుల దురభిప్రాయము. వారి కెక్కువ పరిచితమైన చారిత్రక భావమునే వారన్వేషింతురు. పాశ్చాత్యవిజ్ఞానము చరిత్ర నెట్లర్థము చేసికొని వ్యాఖ్యానముచేయునో గాంధీజీయే యీక్రింది విధముగ వర్ణించియున్నాడు.

"ఎట్టి యొడిదుడుకులు లేని ప్రేమలేక ఆత్మశక్తియొక్క చక్కని కార్యకలాపమున కడ్డమువచ్చు ప్రతియడ్డంకియొక్క గాథయే చరిత్ర......ఆత్మశక్తి సహజమైనది కనుక చరిత్ర కెక్కదు."

ఈ 'యప్రాచ్య' దృష్టిలో మన పురాణగాధలు చరిత్రలుకావు. అవి యెక్కువగ నాత్మికలాపమునకు సంబంధించినవి. అవి ప్రాపంచిక విషయములకుగాక నైతికశక్తులకును, ఆదర్శములకును ప్రాధాన్యతనిచ్చును. ఈ దృష్టిలో పురాణములు చరిత్రయే యగుచున్నవి.

పాశ్చాత్య చారిత్రకుని బాధవంటి బాధయే మన యాధునిక రాజకీయవేత్త (ఆంగ్లేయుడు లేక పాశ్చాత్య మానసపుత్రుడు) కూడ పడుచుండును. గాంధీజీకి రాజకీయ పరిజ్ఞానములేదని యతని యూహ. ఈయాధునిక రాజకీయవాయసదృష్టికి రాజకీయముల కొకటే యర్థముతప్ప మరియొక యర్థములేదు. దశరథుని సచివుడైన వసిష్టునివంటి బ్రాహ్మణ ఋషులుత్తమోత్తమశ్రేణికి చెందిన రాజకీయవేత్తలు. కాని పాశ్చాత్య పార్లమెంటులలో ప్రవేశించుట కాకోటిలోని వారికిపుడొక వోటుకూడరాదు.

గాంధీజీ నొక 'యాత్మ'వలె చూచినపుడే యతనిలోని యసందర్భములు, అసాధ్యములు అని పిలువబడునవి యర్థముకాగలవు; అతడు హృదయమును బుద్ధిని మేళవింపచేయుచు; నిజాంతరాత్మ కెన్నడును భిన్నముగ ప్రవర్తింపడు; సమస్త సంభవములను ప్రాపంచికదృష్టితో చూడక తనపట్ల నిజాత్మను గ్రహింపచేయు సోపానములుగను నితరులపట్ల నాత్మసేవగను చూచునని మనము గ్రహించినపుడే యవిమనకర్థమగును. అతని

వేదాంతము నతడాచరించును. అతని సిద్ధాంతముల ప్రకారము జీవించును. కనుకనే అతడు ప్రాపంచిక విషయములకు, సౌఖ్యములకు దాసులై మానసిక యరాచకమునకు నైతిక పతనము నకుతావిచ్చువారి కగ్రాహ్యుడుగ నుండును.

గాంధీజీ రాజకీయవేత్తయు దివ్యజ్ఞానియుకాక నాధ్యాత్మిక సంస్కర్తయనియు భారతతత్వము లేక ఆర్యధర్మముయొక్క అపరావతారమనియు నతడీ విధముగ వర్తమానచారిత్రకాధ్యాయమును రచియించుచున్నాడనియు గ్రహించిననాడతని వివిధ కార్యకలాపముల నర్థము చేసికొనగలము.

ప్రపంచమునకు గాంధీజీ భారత రాజకీయనాయకుడుగ ద్యోతకమగుచున్నాడు. అతడు ఋషియనియు, మతపురుషుడనియునుకూడ ప్రజలు భావించుచుందురు. కాని యతనిమతమునకు ప్రధానస్థానమీయబడుటలేదు. బ్రిటిషువారును, అతని దేశస్థులలో చాలమందియు నతడు కేవల మొక దేశభక్తిగల రాజకీయవేత్త యనుకొనుటచే నతని స్టేటుమెంటులను సరిగ నర్థము చేసికొనరు. "నీతిలేని రాజకీయములు త్యాజ్యములు" అను నతని సూత్రముయొక్క ప్రాధాన్యతను వారు గమనింపరు. "నా దేశభక్తి నా మతమునకు సేవకురాలు" అని యతడు వక్కాణించునపుడు నేటి ప్రపంచ యరాచకమునకు మూల కారణమైన దేశభక్తి, జాతీయతయను వానికతడు నూతనశోభను నూతన మూల్యమును ప్రసాదించుచున్నాడు. ఎవని కపకారము

చేసినను మతవిరుద్ధమే! కనుక నతడు భారతదేశశత్రువు కపకారము చేయనొల్లడు.

కాబట్టి గాంధీజీ యాంతరంగిక మత మెద్దియో శోధించుట యవసరము. తాను హిందువునని యతడు చెప్పుకొనును. కాని హిందూమతములోని విశ్వబోధనలతని హృదయము నెక్కువగ చూరగొనినంతవరకే యతడు హిందువు. అతడిట్లు వచించును.

"ధర్మము అనగా విశాలార్థముగలమతము హిందూ, యిస్లాము, క్రైస్తవాది మతములను తనలో నిమిడ్చుకొనుచు వానినన్నింటిని మించినదై యుండును. నీవు దానిని 'సత్యము' అని గుర్తింపవచ్చును; అనగా నదియవసరమగు కేవల నిజాయితీ కాదు. సర్వాంతర్యామియై, నామరూప వినాశముల కవతల నుండు చైతన్యాత్మికమైన 'సత్యము'. నాకుమతము ప్రాణప్రదమైనది. హిందూదేశము మతభ్రష్టమైపోవుచున్నదనియే నా మొట్టమొదటివిన్నపము. ఇట్లనుటలో హిందూమహమ్మదీయ జొరాస్ట్రుమతములు నాదృష్టిలోలేవు. ఈయన్ని మతములకును మూలమైన మతము నేనేనారాధించుచున్నాను. మనము భగవంతునికి దూరులమగుచున్నాము."

"సర్వాంతర్యామియగు యనిర్వచనీయమైన యద్భుతశక్తి"యే భగవంతుడని గాంధీజీ భాషించును. "నాపరిసరములలోనున్న సమస్తము ననుక్షణము మారుచు ననుక్షణము

నశించుచుండ నీయన్ని మార్పులకును మూలమై మారకుండు నట్టి చైతన్యశక్తి యొకటి కలదు. అది యీ యన్నింటిని సమీకరణముచేసి సృష్టిస్థితిలయములు కావించి పునః సృష్టి చేయగల చైతన్యశక్తి; లేక తత్వము; అదియే భగవంతుడు." ఆభగవంతుడు సచ్చిదానంద త్రిమూర్త్యాత్మకమైనవాడు.

"'సత్య' అను పదము 'సత్' అనగా నుండునదియనుధాతువు నుండి వచ్చినది. 'సత్యము' తప్ప వేరేదియుయదార్థముగ నుండు నది కాదు... సత్యము యెచ్చట నుండునో యచ్చట జ్ఞానము, అకలంకమైన జ్ఞానము కలదు... జ్ఞానమెచ్చట కలదో యచ్చట ఆనందమెప్పుడును యుండును."

"ప్రతివానిలోను "భగవంతుడున్నాడు. "ప్రతివాడును భగవంతుని ప్రతిమయే" కనుక మనలో ప్రతివానిలోను సచ్చిదానందములు కలవు. కాని యవి మాయ, అజ్ఞానము అను దానిచే కప్పబడి కొంతవరకే యావిష్కృతమగును. ఆంతరంగికముగనున్న యాదివ్యత్వశక్తిచేతనే మనముజీవింపనేర్వవలెను. భారతీయులు భగవంతునికి దూరులగుచున్నారని గాంధీజీ చెప్పుటలో వారు తమలోనున్న దివ్యశక్తి ద్వారా జీవింప యత్నించుటలేదని యతని భావము. "మానవుడు పశువుకంటె నధికుడు." "అతడు నేరవేర్చవలసిన దివ్యధర్మమొకటికలదు." "మనము ప్రాపంచికములనే యెరుగుదుముకాని మనలోనున్న స్వర్గధామము నెరుగము."

మానవుని యొక్క యుత్తమధర్మమెద్ది? శాశ్వతానందము నొసగు యుక్తపరిజ్ఞానము ద్వారముననే సత్యమును కనుగొనుట. "సత్యమును పూర్తిగ గ్రహించుట యనగా మనలను మనము తెలిసికొనుట, మన పరమావధిని గ్రహించుట; పూర్ణత్వము నొందుట."

కాని మానవునకు నికృష్టమైన పశుస్వభావమును కలదు. కనుక మానవుని భౌతికశరీరముమీద నపరిపూర్ణత ముద్రింపబడియున్నది. కాబట్టి బాహ్యముననున్న యపరిపూర్ణతతో పాటు నిగూఢముగనున్న పూర్ణత్వమునుగూడ గ్రహించుటమన ప్రథమ కర్తవ్యము. మన ద్వంద్వప్రకృతిని ఆసురీ దైవీసంపత్తులను గుర్తించి మనము చేయవలసిన కర్తవ్యమును గురించి గాంధీజీ యిట్లు చెప్పును. "నాయపరిపూర్ణతను నేనతి విషాదముతో గుర్తించితిని. అదియే నాకున్న బలము. ఏలయన మానవుడు తన నిజలోపములను గుర్తించుటతియరుదు." మన 'యిదమిద్ధమను' లోపములను మనము గ్రహింపము కనుకనే మనలోనున్న దివ్యశక్తిని మనము కానజాలము. మన లోపములను గ్రహించినపుడు మనము వాని నెదుర్కొనుటయెట్లు? వాని నోడించుటెట్లు? అను సమస్య బయలుదేరును. ఈ సమస్యనుండి ఆత్మ, ఆత్మశక్తియను సమస్య బయల్వెడలును. ఈ లోపములను జయించుటవలన "జీవితము అమరత్వము నొందును."

మన లోపములను జయించి పూర్ణత్వమును పొందు శాస్త్రమును గాంధీజీ ఈ క్రిందివిధముగ వివరించెను. "మన యందరిలోను నిగూఢముగనున్న బుద్ధిపూర్వకమైన దౌర్జన్య రాహిత్యమును వృద్ధిపొందించుడు." ఇందులోనున్న భావార్థ మును గ్రహింపుడు. నిగూఢముగ నున్నదానిని మనము ప్రయత్నపూర్వకముగ బహిర్గతము చేయవలెను. ఈ ప్రయ త్నమునుచేయుటెట్లు?

"మానవజాతి కర్హ్వమైన యొక దివ్యధర్మమే యున్న యెడల నది యహింసయే యని గుర్తింతురుగాక! సర్వత్ర హింసయే తాండవించుచున్నను మానవుడు తన హృదంతరాళ మును బ్రవేశించి యహింసయే తన ధర్మమని యీహింసాత్మక ప్రపంచమునకు చాటవలెను. అతడుదాని నాచరించునంతవరకే తన జాతి కలంకారమగును. కనుక మానవుని ప్రకృతి యహింస కాని హింసకాదు. ఏలయన గాంధీజీ యనుభవమునుబట్టి తాను దేహముకాక నాత్మననియు, తన దేహము నాత్మగ్రహణము కొరకే వినియోగించవలెననియు నతని పరమవిశ్వాసము."

కాని యీవిశ్వాసము స్థిరముగ నుండవలెను. మనము మనయంతరంగమునకు మరలునపుడు మనలో మంచిచెడ్డలు రెండును పెనవేసికొని యుండును. మానవుని నిజాంతరాత్మ ఆంతరంగిక తత్వముయొక్క యొకలక్షణమేయైనను అదిచాలదు. "అందరి యంతరాత్మ యొకటికాదని" గాంధీజీ యుక్తముగ

వచించెను. అయినచో మానవుని యంతరాత్మను నడపుజ్యోతి యేది? పూర్ణుడైన యొకమతగురువా? వేదగ్రంథములా? గాంధీజీ యొకచోట బీజాంకురముల వలె నిట్లురచించెను.

"ప్రమాదరహితమైన ప్రబోధముకాని, జ్యోతికాని నాకులేదు. మానవ మాత్రుడెవడును ప్రమాద రహితుడు కాజాలడు; ప్రబోధముకూడ నొక్క-ద్వంద్వాతీతునకే కలుగ గలదు. ఒకసందర్భమునందు ద్వంద్వాతీతుడై ప్రవర్తించెనని నిర్ధారించు టెవనికిని సుసాధ్యముకాదు. కనుక ప్రమాదరహితుడనని చెప్పుకొనుట యెల్లప్పుడు నుపద్రవకరమైనవిషయము. అనగా మన కెట్టిమార్గదర్శకత్వములేదని నాభావముకాదు. ప్రపంచ ఋషిసత్తములయొక్క సమష్టియనుభవములు మన కందుబాటులోకలవు. అవిసర్వకాలములయందు నుండునవియే. ఇంతకును ప్రధాన సత్యములనేకములు లేనేలేవు. 'సత్య' మొక్కటియే ప్రధానసత్యము; అదియే యహింస; కించిజ్ఞులైన మానవులు పరిపూర్ణమైన సత్యప్రేమల నెన్నడును పూర్తిగ గ్రహింపజాలరు. కానిమనలను నడుపుటకు తగినంతగ మన మెరుగుదుము. మనముదానిని వర్తింపజేయుటలో నొక్కొక్క-పుడు దారుణముగకూడ పొరపడవచ్చును. కానిమానవుడు తన్నుతాను పాలించుకొనగలడు. స్వపరిపాలనలో తప్పుచేయుట కేగాక చేసినదానిని వెంటనే దిద్దుకొనుశక్తి కూడ నిమిడి యున్నది."

గాంధీజీ తప్పులుచేసెనా? అందరును చేతురు. కాని తప్పులు చేయుటలోనున్న విశేషమెచ్చటనున్నది? అందరును తప్పులుచేసెడివారేకాని తమతప్పులను గుర్తించు వారెందరు కలరు? వానినియొప్పుకొను ధైర్యమెందరికుండును? తనతప్పులను బహిరంగముగ నొప్పుకొనుట గాంధీజీయొక్క పవిత్రత కొక చిహ్నము. తనయను యాయులదోషములను, తనకుటుంబమును లేక, రాజకీయపక్షములోని వారిదుర్బలత్వములను నిర్భయముగ చాటుటమరియొకటి. తనతోడిమతస్తుల మతభ్రష్టతను గురించి వారికెరుకపరచుట కతడు భయపడడు. "నాసత్యపరిశోధనలు" అనుతనకథలో తనరక్తములోనున్న యాసురశక్తులను బహిరంగముగ లిఖించినవాడు శక్తివంతమైన సామ్రాజ్యప్రభుత్వమును 'సైతాను' ప్రభుత్వమనుట కేలభయపడవలెను?

స్వపరిపాలనయన నతనియభిప్రాయమెద్దియో యతని పై బీజాక్షరములలో సూచింపబడెను. తనసుతానే పాలించుకొన గలవాడుత్తమోత్తమసంస్కర్త. గాంధీజీ వేదాంతమునకిదియే మూలసూత్రము. ఆర్థిక, రాజకీయ, సాంఘిక, మతసంస్కారములు వ్యక్తిసంస్కారముయొక్క ఫలితములు. అన్నిటికంటె స్థూలమగు నార్థికసంస్కారమును గురించి యతడిట్లు వ్రాసెను. "భారతఆర్థిక స్వాతంత్ర్యమనగా నాదృష్టిలో బుద్ధిపూర్వకమైన స్వప్రయత్నముద్వారా సిద్ధించు ప్రతిస్త్రీపురుషుని యొక్కయు, ప్రతివ్యక్తియొక్కయు నార్థికోన్నతి."

ఈ బుద్ధిపూర్వక ప్రయత్నములో మానవునకు తన సంఘీయులతో గల సంబంధమిమిడి యున్నది. ఈయార్థిక సమస్యయొక్క జాతీయస్వరూప మద్భుతముగ చిత్రింపబడెను.

"భూమియంతయు గోపాలునిది. కనుక దానికొక మేరయెచ్చటకలదు? మానవుడే యామేరనుసృష్టించెను. కనుక నతడేదానిని తీసివేయగలడు. అనిబోధించిన మనపూర్వులు నిజమైన సామ్యవాదమును మనకందజేసిరి. గోపాలుడనగా గొల్లవాడని శబ్దార్థము. దానికి భగవంతుడనికూడ నర్థము కలదు. ఆధునికభాషలో దానికే ప్రభుత్వము ప్రజలుఅని యర్థము. నేడుభూమి ప్రజలదికాదనుట నిర్వివాదాంశము. కాని యాదోషమీ సందేశములోలేదు. అదియాప్రకారము జీవింపని మనయందే కలదు."

వ్యక్తికిని తానుజీవించు సంఘమునకునుగల సంబంధము కుటుంబసంబంధము వంటిది. "కుటుంబములకొక చట్టమును జాతులకు వేరొకచట్టమును కలవనుకొనుట కెట్టికారణము కాన్పించదు." కనుక ప్రజాహిత కలాపములకొక యతిప్రధానమైన సూత్రము విధింపబడెను. "ప్రతిబహిరంగ సత్యాగ్రహ సందర్భమున సరిగనట్టిదేయగు కుటుంబవిషయము నూహించుకొనవలెను. అనగా వ్యక్తి ప్రపంచ మంతయు తనకుటుంబమే యని భావించుకొనవలెను. అప్పుడాదర్శ గృహస్థు దొంగలు దుర్మార్గులు మొదలగు వారినెట్లాద రించవలెను? నిరంకుశులను

విద్వేషులను ఆర్యజాతులెట్లెదుర్కొనవలెను? "దౌర్జన్య మిసుమంతయులేని విప్లవమును లేవదీయుటయే" దీనికిమార్గము. వ్యక్తి లేక జాతి పొగరుబోతుల యథేచ్ఛా విహారములకు తలయొగ్గవలసినదేనా? ఈప్రశ్నకు సమాధాన మిచ్చుటలోనే మహాత్ముడు మానవలోకము కంతకును సేవచేసెను; ఇంకను చేయుచున్నాడు. ఎట్లు?

ఈసందర్భములో నసంఖ్యాకములగు పరిస్థితులుదయించుచుండును. కుటుంబ సంబంధములలోకూడ నొక్కొక్క పరిస్థితికి తగిన సత్యాగ్రహశాస్త్ర ప్రయోగజ్ఞానముండవలెను. ఇదియంత సుగమమైన విషయము కాదని యేకొద్దిపాటి యనుభవ మున్నవాడైనను గ్రహింపగలడు. సత్యాగ్రహ సిద్ధాంతము ప్రకారము జీవించి వృద్ధిపొంద నిశ్చయించిన జాతి యొక్క ధర్మమతికష్టము. దక్షిణాఫ్రికాలోను, భారతదేశములోను నుదయించిన సమస్యల నెదుర్కొనుటలో గాంధీజీచెడుగును మంచితోను దుర్మార్గమును ప్రేమతోను నెదుర్కొను శాస్త్రమును వృద్ధిపరచుచుండెను. మనమెరిగినయతని ప్రజాహిత కార్యములలోనేగాక వ్యక్తిగతజీవితములోకూడ మహాత్ముడు నిత్యకలాపములలో సత్యాగ్రహచక్రమును త్రిప్పువిధానమును చూపుచుండెను; అతనిరాటచక్రమీ చక్రముయొక్క భౌతిక రూపమే!

వర్తమానయుగ విజ్ఞానము సత్యాగ్రహమును, అహింసను ఆదరింపదు, ఆదరింపజాలదు. కాని యాధునిక విజ్ఞానము వ్యర్థమగుట విధిలిఖితము. మననాగరికత పదికాలములపాటు మన్నవలెనని కోరుసంస్కర్తలు దానిపాతపద్ధతులకు జీవనవిధానములకు చాలవరకు స్వస్తిచెప్పవలసి యున్నది. అట్టివారేమి చేయవలెను?

సత్యాగ్రహశాస్త్ర సిద్ధాంత భాగమును తెలిసికొని, దానిని స్పష్టముగ హృద్గతముచేసికొని దానికితగిన శిక్షనుబడయవలెను. ఈప్రపంచమున ముఖ్యముగ వ్యక్తులలోనే కామక్రోధలోభములను మూడుదుష్టశక్తులు కలవు. నేడివిప్రపంచములో తాండవించుటకీ ప్రపంచమును పంచుకొనిన జాతులలో నివి వృద్ధిచెందుటయే కారణము. ఇవిప్రతిజాతిలోను వర్గవిభేదములను కులవిభేదములను కల్పించి నరకమును సృష్టించుచున్నవి. కాని దీనినిజమూలములు వ్యక్తులలోనేకలవు. వారినీశక్తులు కలగద్రొక్కుచు వారియాత్మశాంతిని పోగొట్టుచు, మనస్సును చీకాకుపరచుచు మానవలోకములోని యితరసభ్యులందరిపై తమహృదయములను కరడుగట్టించి భీభత్సము చేయుచున్నంతకాలమాత్మశాంతి చేకూరజాలదు.

ధైర్యమే ప్రతినిజసత్యాగ్రహియొక్క ప్రధానగుణమని గుర్తించెదరుగాక! మనము దానిని మనజంతు స్వభావము నెదుర్కొనుటకేగాక మోహామేజ్ఞానమని భ్రాంతిపడునట్టియు,

లోభమే జీవితపోరాటమున వృద్ధిపొందుటకవసరమగు శక్తియ నియు, నేరూపముననైనను శత్రువుపై క్రోధశక్తిని ప్రయోగించి పోటీలో గెలుపొందవలెననియు తలంపబడు మోహజాలమును కూడ నిదియెదుర్కొనవలెను. విశ్వాత్మయే మనయంతరంగ మునమన్నయాత్మ; ఈయాత్మైక్య సంధానమువలన నుద్భవించు ధైర్యమే మనకన్ని సందర్భములలోను మేరుసమానము.

సత్యాగ్రహము పిరికిపందల మార్గముకాదు. ఈవిషయ మునతడు ఘంటాపథముగ చాటిచెప్పినపుడు పాశ్చాత్యులు గాభరాపడిరి. అతడిట్లువచించెను. "తనయవమానమును పిరికిపంద వలెచూచుచు సహించుటకంటె భారతదేశ మాయుధములను చేబూని మానరక్షణము చేసికొనవలెననియే నాకోరిక" "అహింసద్వారా మనప్రాణ, మాన విత్తములను, దేవతాయ తనములను రక్షించుకొనజాలనిచో మనముమానవులమే యైన యెడల సధమము భుజశక్తిచేతనైనను వానిని రక్షించుకొన వలెను."

కొంతకాలముక్రింద కొంతమంది చీనాప్రేక్షకులకుజవాబు చెప్పుచు జపాను చీనాదేశములో ఁగుమతి చేయుచున్న దుర్మార్గమును చీనాజాతి అహింసద్వారాఎదుర్కొనుసమయము మించిపోయినదని గాంధీజీ సూచించెను. శాంతిసైన్యమొక్క రోజులో తయారగునదికాదు. ఆసైనికులు జ్యేష్టాదేవిసాంప్ర దాయమైన మారణాస్త్రములను చేపట్టునంత సుగమముగ

దుర్మార్గమును ప్రతిఘటించు నుదారకళను నేర్వజాలరు. చీనాలో నహింసాపద్ధతి వ్యక్తులకే విడిచివేయబడెను. యథార్థదివ్యశాస్త్రమైన సత్యాగ్రహమును తగినంతమంది నేర్చుకొనినచో సమయమువచ్చినపుడు (అదియెప్పుడైనను రావచ్చును) వారు చీనాయొక్క యాత్మను రక్షింపగలరు. ఒకజాతియొక్క విజ్ఞానము ఆప్రజలయొక్క హృదయమందును, ఆత్మయందును వర్తించును... జపాను యిష్టము లేనివారిచేత సన్నిలతో విషమును మ్రింగింపజాలదు."

మహాత్ముడా ప్రేక్షకునితో నతని ప్రజలకిట్లు చెప్పగోరెను. "జపానువారు మనయాత్మను కశ్మలమొనరింపజాలరు. చీనాయొక్కయాత్మ భంగపడినచో నదిజపానువల్ల కానేరదు." ఈసత్యమే ప్రతిజాతికి వర్తించును. కాని 'శాంతిసైన్యమును' త్వరితముగ నిర్మించి తమవ్యవహారములను యింగ్లండువలెదిద్దుకొనగల జాతులుకలవు. ఇవియితరప్రజలను రక్షించుటకు సాధనములు కావచ్చును. ఇంగ్లండుయొక్క యాయుధసైన్యనిర్మాణవిధాన మితరదేశములకు వరవడియైనచో నదిసత్యాగ్రహవిధానము నాచరణకు తెచ్చిన నాడితరులుకూడ దానినేలయనుసరింపరు? ఇంగ్లండు "సరళమైన దివ్యాంశజీవితమునుండి బయల్వెడలు శాంతిపథమును తలదాల్చునుగాత!"

———

# హిందూముస్లిము లైక్యతకొఱకు గాంధీజీ యుపవాసము.

## రెవరెండుఫాస్ వెస్టుకాట్ యం. యె., యల్. యల్. డి.

మోహనదాసు జీవితమును, కృషినిగురించి నామెచ్చి కోలును వ్రాయగోరినపుడతడు 1924 సెప్టెంబరులో బూనిన త్రివారోపవాసదీక్షకు కారణమును తత్ఫలితములను వివరించుట కంటె నేనెక్కువ వ్రాయజాలనని భావించితిని.

కొంతవరకు శ్రద్ధానందస్వామి ఢిల్లీప్రాంతములలో లేవదీసిన శుద్ధియుద్యమ (నవముస్లిములలో) ఫలితముగ నాసంవత్సర వసంత గ్రీష్మఋతువులలో హిందూముస్లిము తగాయిదా లుపద్రవకరముగ చెలరేగెను. ఈకులకలహము గాంధీజీకి దుర్భరమయ్యెను. గతముప్పది సంవత్సరములనుండి యీయుభయులయైక్యత యతనిప్రధానాంశముగ నుండెనని యతడు పదే పదే చెప్పియుండెను. ఒకటితరువాత నొకటిగ నీకలహములు నిరంతరాయముగ సాగుచుండుటచే నతడు సెప్టెంబరు 17 వ తేదీని యేకవింశతి దినోపవాసమును నిశ్చయించి దానినిగురించి యొకప్రకట చేసెను. "నాతపస్సు అబుద్ధిపూర్వకముగ గావింపబడిన పాపములకు క్షమార్పణగోరు నొకభగ్నహృదయుని భగవత్ప్రార్థన." అతడీవిధముగ హైందవులతో నైక్యమై

వారిపాపములకు బాధ్యతహించెను. "ఒకరిమతము నొకరు దూషించుకొనుట, జవాబుదారీలేని స్టేటుమెంటులను చేయుట, అబద్ధములాడుట, నిరపరాధుల తలలను పగులగొట్టుట, గుడులను మసీదులను పగులగొట్టుట భాగవదాపచారము." ఉపవాసము చేయవలదని స్నేహితు లెంతవారించినను వినక నతడు రాముని యుదాహరణమును చూపెను. సెప్టెంబరు 18వ తేదీని యుపవాసము ప్రారంభమయ్యెను.

హకీము అజ్మల్ ఖాన్, మహమ్మదాలీ, శ్రద్ధానందస్వామి ప్రభృతులు హిందువులు, ముసల్మానులు, యూరపియనులు మొదలగు నన్ని రాజకీయకక్షులవారికి ఢిల్లీలో జరుపబోవు శాంతి సభలోపాల్గొనవలెనను నాహ్వానములను పంపిరి. ఉభయసంఘముల నాయకులతోసహా సుమారు మూడువందలమంది యా సభలోపాల్గొనిరి. గాంధీజీ తన స్నేహితులతో నిట్లు చెప్పెను. "నేను చనిపోవుట కీయుపవాసమును బూనుటలేదు. దేశసేవ భగవత్సేవచేయుటకొరకు మరింత శ్రేష్టముగను పవిత్రవంతముగను జీవించుటకే నేనాశించుచున్నాను. కనుక విషమస్థితి యేర్పడినచో (నామానవదృష్టిని బట్టి యట్టిదేమియు సంభవింపదు) మృత్యువా లేక నాహారమును తీసికొనుట యా యను సమస్యయేవచ్చిన యెడల నేను తప్పకుండ నుపవాసమునుమాని వేసెదను." చివరకు సభ 26వ తేదీని సంగం థియేటరులో ప్రారంభమయ్యెను. ఆపెద్దసమావేశము స్టేజిముందరనున్న

బహిరంగపరిదేశములో జరిగెను. శిలువపైనున్న జీససుయొక్క చిత్రమొక దింపుడు తెరమీద చిత్రింపబడెను. స్టేజికొక ప్రక్కన గాంధీజీయొక్క పటము వ్రేలాడకట్టబడెను. ఆహ్వానసంఘాధ్యక్షు డైనమహమ్మదాలీ వచ్చినవారికి స్వాగతమిచ్చి సభాప్రయో జనమునుగూర్చి క్లుప్తముగ చెప్పెను. దానియుద్దేశ్యము కొద్దిపరి మితికలది. కులకలహముల కార్థిక రాజకీయ కారణములుకూడ కలవని గ్రహింబడినను మతకారణములను చర్చించుట కేయది యేర్పడెను. సభాధ్యక్షుడుగ పండితమోతీలాలు యేకగ్రీవముగ నెన్నుకొనబడెను. ప్రారంభోపన్యాసములైన తరువాత 80మంది కలయొక "విషయ నిర్ధారకసభ" నది యేర్పాటుచేసికొనెను. ఈసభవారే యొకచిన్నకమిటీవారిచే తయారుచేయబడిన చిత్తు తీర్మానములను పరిచూచుకొనవలెను. సభ పారంభముకాక పూర్వము గాంధీజీయొక సందేశమునుపంపెను. హృదయముల కలయికయే కావలెననియు ప్రతివాడును తానుగుర్తించిన సత్య మునే వెలిబుచ్చవలెననియు నతడు హెచ్చరించెను; ఇతరుల దేవతాయతనములను పడగొట్టుటే సత్యమని వారికితోచినను అతడు వారి నిజాయితీని గౌరవించును. కాని యట్టిసందర్భము లలో నీదురదృష్టదేశమునకు శాంతియుండజాలదని మాత్ర మతడు చెప్పగలడు.

మతవిషయములో పరిపూర్ణయంతరాత్మ స్వాతంత్ర్య ముండవలెననియు, దేవాలయాదులను నాశముచేయుట గర్హ్య

మనియు, అంతరాత్మప్రేరణచే తనమతమును మార్చుకొనిన వానిని బాధించరాదనియు నొకతీర్మానము సభ్యుఁడు ప్రతిపాదింప నేకగ్రీవముగ నామోదింపబడెను.

తీర్మానములనుచేసినంత మాత్రముచే హిందూముస్లిముల యైకమత్యము చేకూరదనియు హృదయసంస్కారముండవలెననియు సభాప్రారంభమునకు పూర్వ మన్నిపక్షములనుండియు హెచ్చరికలువచ్చెను. చర్చలప్రారంభదినములను తిలకించినచో నీసంస్కారము క్రమముగ నెరవేరినట్లే నాకు కాన్పించెను. చిన్న కమిటీ తయారుచేసిన తీర్మానములను మేము విషయనిర్ధారక సభలో చర్చించునపుడు ద్వేషము భావోద్రేకము లేకయుండెను; వీనికి గట్టియనుమానములుగూడ తోడ్పడెను. సద్భావప్రకటనములపట్ల విశ్వాసముశూన్యమయ్యెను. ఉదారహృదయముతో చేయబడిన సూచన ప్రతిఫలాపేక్షయూ చేయబడినట్లు లెక్క! కానియైదురోజులు గతించిన తరువాత తత్వముమారెను. మౌలానా అబుల్ కలాంఅజదు బ్రహ్మాండమైన యుపన్యాసమునిచ్చెను. ఆవ క్తృత్వము, యుదారత ముక్తకంఠములతో కీర్తింపబడెను. "దీనికి తమకేమిప్రతిఫలము ముట్టును?" అనియొకడు పృచ్ఛింపగా సభలోనన్నిమూలలనుండియు నతనిపై క్రోధానలము వెలిగ్రక్కబడెను. లాభసాటిబేరము నాశించుప్రాతతత్వము పోయిసహనము కొత్తగాతలయెత్తెను. మతభేదములు, ఆచారభేదములు న్యాయమైనవనియు గౌరవింపదగినవనియు భావింప

బడనారంభించెను. మొదటచర్చలలో నుపన్యాసకులు తమతమ హక్కులకొరకే వాదించుచుండిరి. కాని తరువాత తమబాధ్యతలు, తద్వారా నెరవేర్పవలసిన ధర్మములు గుర్తింపబడెను. ఉపవాసము ప్రారంభమైన 11వరోజున కొంత యాముర్దాకలిగెను. చర్చలు జరుగుచుండగా ఆండ్రూసు నాకుఅర్జెంటువార్త పంపెను. త్రోవలో నేను డాక్టరు అబ్దుల్ రహమానును పిల్చుకొనివెళ్లుట ధర్మమనిభావించితిని. అతడాసాయింత్రముమరికొన్ని పరిక్షలుచేయ వాగ్దానముచేసెను. దీనివలన సభ కొంతనిలిచిపోయెను. ఈగడువులో గాంధీజీ తనసాయంకాలప్రార్థన సమయముననన్ను, ఆండ్రూసును తనకుప్రియమైన యాక్రిందిక్రైస్తవ గేయమునుపాడగోరెను. "జ్యోతీ ! కరుణామయీ! అంధకార బంధురమునుండి నన్నుముందుకు గొంపొమ్ము! ఈనిశీథమును చిమ్మచీకటు లలముకొనెను. నాగేహమింకను సుదూరమున నున్నది. నాకు తెన్నుచూపుము! తడబడునాపాదములను స్థిరము చేయుము. నేనుదూరస్థమైన దేశమునుచూడ గోరుటలేదు. నాకొక్క యడుగుచూపిన చాలును."

ఆగదిలోని సన్ననిదీపఛాయక్రింద తనప్రక్కమీదనొరిగి యున్న యాకృశీభూతాంగుని దృశ్యము హృదయవిదారకముగ నుండెను. ఇంతలో మాకు చిత్తస్వాస్థ్యమును చేకూర్చునట్టి డాక్టరుల యభిప్రాయములు తెలుపబడెను. చెడ్డలక్షణములన్నియుమాయమయ్యెను; మాభయము తీరిపోయెను.

సభాఫలితముల నన్నిపక్షములవారును కొనియాడిరి. కాని హిందూముస్లిము లైక్యతను సాధించుటకు కొంతకాలము పట్టునని సర్వత్ర యంగీకరింప బడెను. ఈయభిప్రాయమునే 'ఐకమత్యదినమున' (అక్టోబరు 8వ తేదీ) వెలువడిన కలకత్తాలోని స్టేట్సుమనుపత్రికలో నొకవిఖ్యాతరచయితయిట్లు వెలువరించెను. "సరళమైనట్టియు పటుతర మైనట్టియు రాజకీయవాదనలు పూర్తిగభగ్నమైనచోట గాంధీజీ యుపవాసమువలన బయల్వెడలిన మతావేశము దిగ్విజయము నొందెను. కాని యింతకంటె కష్టతరమగు నన్యోన్య సహనమును ప్రజాసామాన్యమున కుపదేశింప వలసియున్నది". తరువాత సంభవించిన రాజకీయపరిస్థితులవలన నాధర్మము నెరవేరుట కష్టమయ్యెను. శాంతి యుండవలెనన్న ప్రతివాని హృదయపీఠికయందు భగవంతుని స్థాపించవలెను. అదియే మహాత్ముని యుపవాసలక్ష్యము. మానవుల సాంగ్రామిక సంకల్పము లీవిధముగనొక్క భగవానుని మహాసంకల్పముచేతనే నిరోధింప బడగలవు.

## మహాత్మా

**ఆనంద కె. కుమారస్వామి యం. యె., డి. యస్. సి.**

"మహాత్మా" శబ్దమెక్కువగ దుర్వినియోగము చేయబడెను. కాని దానికి యదార్థమైన భావార్థములును విశేషచరిత్రయు కలవు. భారతతత్వశాస్త్రములోని యనేకసాంకేతిక శబ్దము

లవలె దీనికిని యస్పష్టమగు లేక నూహాజన్యములగు ననేకార్థ ములు కల్పింపబడెను. కొంతవరకు దీనికి కారణమే మన సాంప్ర దాయిక వేదాంతము సామాన్యముగ మనకు తెలియక పోవుటచే మనము ఆత్మను, అనాత్మను సత్తును, అసత్తును వేరు చేయజాలకున్నారము. ఇంతేకాక మనదాంభిక "వ్యక్తిత్వముకు" లేక నామరూపములకు ప్రమాదవశమున పదునారణాల విలు వను ప్రసాదించుచు నవ్యక్త తత్వముయొక్క ప్రభావమును చూరగొనక "ధిషణత్వమును" ఆరాధింతుము. అనగా దివ్య మానవునిమాత్రమే చూతుము. ఇట్టి "పూర్వాభిప్రాయము లతో నున్న మనకు "మహాత్మా" యనుటతోడనే "గొప్ప మానవుడు" "గొప్పయాత్మ" యనుభావములే తోచును. కాని మానవస్థితినిదాటి "యాత్మస్థుడైనవాడు" అనువిషయము తట్టదు.

భౌద్ధసూత్రములలో (A. .1 249) "మహాత్మా" "అల్పాత్మా" యను భేదములు సూచింపబడెను. మరియొక చోట నీమాన "వాత్మలు" "కళ్యాణాత్మలు" "పాపాత్మలు" అనివివరింపబడెను. 'ఈమునిపి' 'రామేశము' 'వెంకటేశము' అని పిలువబడు కించిదాత్మ భౌతిక మానసిక విభాగములతో చేయ బడిన సమ్మేళనము. కనుక మరికొన్ని చోట్లనిది 'అనాత్మ' యని నిర్వచింపబడెను. అనగా నాత్మేతరము, "నాయాత్మ కానిది" యని యనేకచోట్ల నిర్ధారింపబడెను. ఈకించిదాత్మ

మార్గము అల్పమైనది, దుఃఖభాజనమైనది. అది "ప్రమాణము లోను, శీల, జ్ఞాన, బుద్ధి, సంపత్తులలోను పరిణితిని పొందనిది." ఈకించిదాత్మ సర్వత్ర కారణబద్ధమైనది; దానిసర్వసంకల్పము లును క్రియలును అనాదిగ వచ్చుచుండు "పూర్వజన్మ" కృత కర్మలచేతను, సంకల్పములచేతను నిశ్చయింప బడును. "మన" మెవరమో అదేయగుదుము గాని మనము కోరునప్పుడును కోరి నట్లును కాజాలము. శరీరము ఆధివ్యాధి జరామరణ భూయిష్టమై దానికాలము వచ్చినపుడు పూర్తిగా బుగ్గియైపోవును. ఇకమన రెండవ విశేషాత్మ 'మహాత్మా' అనిర్వచ నీయమైనది; కించిదాత్మను బంధించునట్టి పరిమితిని దెల్పు నిర్వచనములను 'నేతినేతి' యని తోసివేయుట కంటె దీనికివేరు నిర్వచనము లేదు. కనుక మన మొదటి మూలము ప్రకారము మానవుడు ("మహాత్మా" యనగా, పరిణితి పొందిన కాయ, శీల' చిత్త, ప్రజ్ఞ, అపరిక్త మహాత్మా, అప్రమాణవాన్) యనిభావింప బడగలడు. ఈభేదమంతయు పశువునకును పురుషునకును మధ్య గలభేదము; 'ఆత్మను' తెలిసికొనక నిహపరములందు యిచ్ఛా మాత్రి చైతన్యము లేనివారికిని యాత్మజ్ఞులై యిహపరము లందు యిచ్ఛామాత్రచైతన్యము కలవారికిని మధ్యగలభేదము! కాన్ఫ్యూషియస్ ప్రకారము "రాజఋషికిని" "అల్పమానవు నకును" మధ్యగలభేదము. సెంటుబెర్నార్డు యొక్క "ప్రోప్రి యం" "ఎస్సీ" ల మధ్యగల భేదము. ఈరెండు "జీవితములు"

జాన్ XII 25 లోని (పశు, మన) యను రెండు "జీవితములు". "తనజీవితమును ప్రేమించువాఁడు దానిని పోగొట్టుకొనవలెను." "నాశిష్యుఁడు" కాఁగోరువాఁడు పోగొట్టుకొనవలసిన "జీవిత" మీ రెండింటిలో నొకటి (ల్యూక్ XIV 26). సెంటుపాల్ యొక్క 'అహం' "నేనుజీవించుచున్నాను; కాని 'నేను' కాదు". (గాల్ ii 20) "నాకొరకు తనజీవితము నెవరు పోగొట్టుకొనెదరో" (ల్యూకు IX 24) అను దానిలోనున్న 'అహమే' మన "తత్వ శాస్త్రము" లోని "మానవాత్మ". 'ఆత్మను' కనుగొనుట యనగా మన మొక వ్యక్తిగనుండుట చాలించుటయే!

'మహాత్మా' లోని 'మహా' కు గొప్ప, శ్రేష్టమైన యని యర్థము. 'ఆత్మ' యన గ్రీకుభాషలోని 'న్యూమ' వలె ముఖ్యముగ "తత్వము"; మనశ్శరీరములకు వేరైనది. కాని యాత్మ యీ మానవునికి సంభవించు యితర "సీరాగారనివిష్టపాంథుల" కంటె వేరైన నిజతత్వము కనుక 'వెంకటేశము' 'రామేశము' అను దాని తాత్కాలిక నామరూపములును గుణగణాదులును బింబప్రతిబింబ న్యాయముననుసరించి మన యుద్దేశ్యానుసారము శారీరక, మానసిక, ఆధ్యాత్మిక "స్వార్థము" అను దాని రెండవ ప్రయోజనముగ నేర్పడుచున్నది. "నిన్ను నీవు తెలిసికొనుము" అను సాంప్రదాయికాదేశముయొక్క మూలభావ మిచ్చుటనే ద్యోతకమగుచున్నది. ఏలయన "మనమెవరమో" మనము మరచిపోతిమి. "వెంకయ్య, పుల్లయ్య" అని యనిపించుకొని

"నిన్ను నీవు యెరుగనిచో ప్రపంచమును వీడిపొమ్ము" అను గేయరత్నములోని వాక్యములచే వర్తించువారమై మనము మునిగిపోవుచున్నాము. "నీవెవరవు?" అను ప్రశ్నకీయబడు సమాధానమే మన మోక్షకవాట కీలకము. ఉపనిషత్తులలోని "తత్త్వమసి" యను సమాధానము నీయగలవారికే "స్వాగతము! మదాత్మా! సుస్వాగతము" అని యాహ్వానమీయబడును. తన వ్యక్తిగత నామమునుగాని యింటిపేరునుగాని చెప్పుకొనువానికి ప్రవేశముండదు. అన్యత్వము పూర్తిగా నశించినగాని దివ్యత్వము సిద్ధింపదు.

మహాత్మాశబ్దము భగవన్నామము; తననుండి పూర్తిగ మోక్షము నొందినవానిచే మాత్రమే తెలియబడగల స్థితి యొక్క పేరు. ఇవి రెండును ఒకటియే లేక నేకమైన యనేకము; భేదములేని విభేదము. 'మహాత్మా' యనగా పుట్టుకలేని గొప్పయాత్మ (మహాన్, అజ ఆత్మా బు IV 4.41: ఆత్మా మహాన్ Kw, 111. 10) సూర్యులలో సూర్యుడు (M W 11V.11.6) 'అస్తి' యను దాని యాధ్యాత్మికసారము (R.V.I.115.1). పరమాత్మయొక్కడే సాక్షి, తెలియువాడు తెలివి. సమీపస్థుడు, దూరస్థుడు, సన్నిహితుడు, సర్వాంతర్యామి. అతనిని గ్రహించుట యనగా మన సంసార జంజాటమునంతను విడిచిపెట్టి 'హృత్సన్నివిష్టుల'మగుట. హిందూ, బౌద్ధమతములు పూర్ణత్వము నిచ్చటనే, యిప్పుడే పొందవచ్చునని ధృవపరచు

చున్నవి. ఇది యెంతయు యుక్తము. పూర్ణస్థితికి కాలముతో సంబంధములేదు. 'తత్త్వమసి' లోని వర్తమానకాల మతి ముఖ్యమైనది. సత్యముకు కాలముతో నిమిత్తములేదు కాని దానిని తెలిసికొనుటకు కాలమవసరము. అది గ్రహింపబడినచో "జీవాత్మ"లకును పరమాత్మకును కిరణములకును వాని మూలమైన తేజోనిధికినిగల సంబంధమేయుండును. ఇచ్ఛామాత్రముచే నవి దానినుండి బయటకువచ్చుచు తిరిగి దానిని చేరుచుండును. తేజస్సులకెల్ల తేజస్సగుదానిలో నొక కిరణమగుట దివ్యత్వము నొందుటయే! ఏలయన సూర్యకిరణములు దాని సంభవములే. మానవుని మహాత్మాయను నపుడు జీవన్ముక్తుడని భావము; (బౌద్ధుల దృష్టధర్మవిముక్త) అది యిచ్చటకాక పోయినమరియొక జీవితములోనైనకావచ్చును. భగవద్గీత VIII 15 లో నీశబ్ద మీయర్థములో నే ప్రయోగింపబడెను. "నన్ను పొందిన యీ మహాత్ములకు పునర్జన్మలేదు. వారీ యశాశ్వత దుష్టసంసార చక్రమునతిరిగిపరిభ్రమింపరు. వారుపరిణితినొందిరి." భగవద్గీత IX, 13.

మహాత్మా నస్తుమాంపార్థ దైవీంప్రకృతి మాశ్రితాః॥
భజంత్య నన్య మనసోజ్ఞాత్వా భూతాది మవ్యయం॥

మహాత్మా-పదముకు చారిత్రకముగ నర్థముచెప్పుటయే యీ వ్యాసముయొక్క యుద్దేశ్యము. బహుశః "ఋషి" యను సామాన్యార్థములో నీపేరు గాంధీజీ కందరి సమ్మతిమీద

నీయబడెను. స్వార్థపరుడై యుండకపోవుటకంటె సర్వోత్తమమైన స్వార్థమే లేకపోవుట యను నొక యర్థములోనిది యతనికి యుక్తముగ వర్తించును. కాని దాని సంపూర్ణార్థములో నీశబ్దము నేవ్యక్తికిని వర్తింపచేయువిషయమిచ్చుట చర్చనీయము కాదు. అది యెప్పుడును భగవంతునికిని యతనికిని మధ్యనుండ వలసిన రహస్యము.

---

# ఆత్మవిజయము

## తెలీన్ షావీ (స్విట్జర్‌లాండు)

భౌతిక జీవితమును ప్రేమించువాడను గాఢమైన హేతువాదినియగు నేను మహాత్మునివంటి యసామాన్య పురుషుని చూచినపుడు కలుగు భావములను వ్యక్తపరచుట సుసాధ్యమైన పనికాదు. మనమధ్య ప్రకాశించు యీ పురుషుని యునికికి 'యాంపామాషీ,' యర్థము చెప్పివేయజూచుటవలను పడదు. సంతగోల జీవితమయమైన యీ ప్రపంచము యీవ్యక్తియొక్క యాకర్షణనుత్రోసి వేయజాలదనుటస్పష్టము. ఏదినపత్రికలో నైననుసరే యతనిచిత్రమును చూచినంతమాత్రముచేతనే మా మూలువర్తక బేరసారములతో నిండియుండు పుటనుండి పరమ జ్ఞానదృష్టితో తొంగిచూచు నతని దృష్టివలన మన స్వాభావిక

యాత్మజాడ్యముపలాయనమగును. చీనా దేశములో కొన్ని చోట్ల స్వేతదివాంధములున్నట్లు వింటిని. జీవితములోని గుఢాతిగూఢ రహస్యములనుచూరగల నేత్రద్వంద్వము తమయుదారసదాచార సంపత్తిచే ప్రాచ్య పాశ్చాత్యులలోకూడ కానజాలని పరికృతి మధురి మను తెలుపు శ్రవణపుటములుగల యీ యసామాన్య వ్యక్తి యొక్క ఫొటోలు ఆ వింతజంతువుల ముఖములకంటె తక్కువ వింతగ కాన్పించవు. మన యుగములోనే యితరవ్యక్తియు ప్రేమ శక్తి నింతకంటె జయప్రదముగ పరిద ర్శించినవాడులేడు. ఆప్రేమ ధనకనక వస్తువాహనములమీది ప్రేమకాదు. అది మన పశుసాంప్రదాయమునకు విరుద్ధమైన హిందూ క్రైస్తవాది ఋషిసాంప్రదాయకమైన యాదర్శ ప్రేమ.

గాంధీజీ ఆత్మకథను చదువునపుడు శరీరము నాత్మ యెట్లు జయింపగలదో విశదమగును. "ఆత్మ సౌందర్యమును, ప్రాభవమును" సాధించుటకే తానెప్పుడును యత్నించుచుండి నట్లతడొకచోట చెప్పియుండెను. అతని ధర్మసందేహాము లతి సూక్ష్మమైనవి. ఈ పవిత్ర శిరమును నిరంతరము ప్రవేశించు చుండు నైతిక సూత్రములు స్వైరాహార విహారులకు వింతగ కాన్పించును. ఆవుపాలు త్రాగకూడదని గాంధీజీవ్రతము. కాని యతడొక గుక్కెడు మేకపాలు త్రాగుటతోడనే యివికూడ నతని వ్రతములోనివేమోయను ధర్మసందేహాము బయలు

దేరును. ఒకదూడ కుదరని వ్యాధిచే బాధపడుచుండ దాని యెడల కలుగు ననుకంపచే నతడు దానిని చంపివేయుట యుక్తముకాదా? రైతులచేలను నాశనముచేయు కోతులను "నరవానరకుంజరాః" అను మన జాతివానిని దౌర్జన్యములేకుండ వారించుటెట్లు? ఈ సూక్ష్మ సమస్యలన్నియు హిందూ 'గోపూజ' కు సంబంధించినవేయని గ్రహించవలెను. గాంధీజీ దృష్టిలో దీనికతి విశాలార్థముగలదు. పిపీలికాదిసూక్ష్మజీవులు లగాయతు వేనిని చంపగూడదనియు వాని కాశ్రయమిచ్చి రక్షింపవలెననియు నది మానవజాతియొక్క మతధర్మమనియు నతనిభావము. గాంధీజీ నైతికజ్ఞానమతికఠినమైనదైనను అతినిశ్చయమైనది. జంతువులనుకోసి పరీక్షించు పాశ్చాత్య శాస్త్రపద్ధతి లోని యవినీతిని గర్హించునంత తీవ్రముగ నితడు దేనిని ఖండించి యుండడు.

"ఈసుభగాత్మావతరణము" పాశ్చాత్యులచే తరచు పొందిన యనాదరణమునకు పాశ్చాత్యలోక మాచండాలురకును తలవాల్చక తప్పదు. తిట్లు, అవమానములు, తర్జన భర్జనలు, దెబ్బలు, బూట్సుకాళ్ల తాపులు-ఒకసారి డర్బనులోని శ్వేతముఖమూకలచే రక్తము పిండివేయబడుట-ఇక నేమి కావలెను! ఇన్ని చేసినను అతనిముఖము జేవురింపదు; ద్వేషలేశమైనను యంకురింపదు; 'రుధిరముబ్బదు'; చలింపని మనస్సుతో నతడు తన దివ్యభావములను వెదజల్లుచునే యుండును. ఈ యర్భక

శరీరము, యీ యస్థిపంజరాగారము యిట్టి యమోఘాత్మ నెట్లు ధరింప గలిగెను? ఈగడబిడ ప్రపంచముయొక్క దూషణ భూషణ తిరస్కారము లతనిని బాధింపవు. అతని యాత్మగౌరవ మత్యమోఘమైనదికనుక నదియెట్టి శారీరకాపచారములవలనను చెక్కుచెదరజాలదు. వీధులలో నీడ్వబడుచు, క్రిక్కిరిసి యున్న రైలునుండి క్రిందకు త్రోయబడుచు, ప్రవాసకూలీలయొక్క యమేధ్యమును తుడుచుచు, తనదగ్గర బంధువులైనట్లు "అస్పృశ్యులను" సేవించుచు అతని యవక్ర సరళత, సౌజన్యత యుక్కుదక్క యుండును. మనచర్చిలకు సంబంధించినట్టియు సంబంధిచనట్టియు నాదర్శపురుషులకుండు నాధ్యాత్మికాడంబరములతో నతనిని జతచేయుట సాధ్యముకాదు. మేఘమువలె నతని ప్రజ్ఞ యతిస్వతంత్రమైనది. సత్యవాక్కును వినినచో నతడు తనభావమును లేక నాచారమును తృటిలో మార్చుకొనగలడు. అతనియున్నత భావములకు నున్నత సిద్ధాంతములకు తోడు అనుభవపూర్వకమైన సద్బుద్ధి యతనియందు మూర్తీభవించెను. ఇదియు జీవితములో నేకోశమందును స్వార్థములేకపోవుటయు నక్రమమును, ప్రజాపీడను నెదిర్చిపోరిన యతని వివిధ పోరాటములలో నాతని కజేయశక్తిని ప్రసాదించెను. వడుకు నేర్పరితనముగల యతని శ్యామలకరకమలమొక మంత్రదండమును ప్రయోగించుచున్నదా యనునట్లత డెందు పోయినను సర్వము నతని వశమైపోవుచుండును.

జీససుయొక్క రహస్యము కెచ్చటనైన ప్రత్యక్ష సాక్ష్యమున్నచో దానినీ హిందూఋషియే ప్రదర్శించినాడని చెప్పవలెను. మనపాశ్చాత్య విశ్వాసముయొక్క నీతులను, దివ్యవిషయములకు సంబంధించిన సృజనలను స్వీకరింపగల యకలంకయోజనపరుడైనను పైకారణముచేతనే జీససుయొక్క వాక్యముల నతడు తరచు యుచ్చరించు చుండును. "జీసను తనమృత్యువుద్వారా, తనరక్తముద్వారా ప్రపంచముయొక్క పాపములనుపోగొట్టెనను విషయము నక్షరశః నాబుద్ధివిశ్వవింప జాలదు. ఆలంకారికముగ దానిలో కొంతనిజముండ వచ్చును." క్రైస్తవాదర్శమైన స్వార్థత్యాగ మతని నెక్కువగ నాకర్షించెను. జీసను పర్వతాగ్రమునుండి యిచ్చినసందేశము (దాని వివిధ భావార్థములతో) అతని నెక్కువగ నాకర్షించెను. నీట్జీయొకసారి యిట్లనెను "ఇంతవరకొక్కడే క్రైస్తవుడుండెను. అతడు శిలువపై మరణించెను." పాపమావెర్రివేదాంతి యీ రెండవ గురువుయొక్క జీవితవిధానమును చూచువరకు జీవించియుండినచో తన సూక్తిని మార్చుకొని యుండెడివాడు.

జూలూతిరుగుబాటు అనిపిలువబడిన క్షుమార్గముకాని "మానవవేట" లో క్షతగాత్రులను, వ్యాధిగ్రస్తులను గాంధీజీ యత్యుదారతతోను భక్తితాత్పర్యములతోను సేవించెను. ఆయాఫ్రికను హింటర్లండులోని "నిర్జనారణ్యములలో" తిరుగాడునపుడతడు బ్రహ్మచర్య వ్రతమును స్వీకరింప నిశ్చయించెను.

"భగవంతుని మిత్రుడు కాగోరువాడే కాకిగనుండవలెను" అను మహాత్ముని విశ్వాసమువంటి విశ్వాసముతోడనే కదా జీససు తనకుటుంబమును విడిచిపెట్టెను? "మనకాలిక్రిందనున్న ధూళి కంటెకూడ మనమధములమని భావించినపుడే భగవంతుడు మనకు సహాయము చేయును. దుర్బలులకు, అసహాయులకు మాత్రమే దివ్యసహాయము చేకూరగలదు." అనునతని సాహసోక్తినాలింపుడు.

ఈప్రపంచమున మనమానవవిధిని నిర్మించు శక్తులను దూరదృష్టితో కనుగొనుటకష్టము. బహుశః "అలంకారికముగ చెప్పవలెనన్న" పాపరహితులు, పాపభీతికలవారునగు యీ యిద్దరువీరులు "రసాతలముననున్న పురాణసర్పము" యొక్క వంకరలను దిద్దగల రహస్యమును కనిపెట్టి యుండవచ్చును. కృతయుగములోవలె వారిచిత్ర ప్రవర్తనయొక్క సాధుసందేశములచేతనే యీప్రపంచమున నానందము తిరిగి స్థాపింపబడగలిగినయెడల నింతవరకు వక్రఃపంథత్రొక్కిన మనదుఃఖమానవజాతిధన్యతనొంద గలదు. భయంకరమైన ప్లేగుజాడ్యపీడితులను సేవించుటకు తనతోకూడవత్తురాయని యడుగ "మీరెచ్చటకు పోయినను సరే మిమ్ముకూడ మేమనుసరింతుము" అని బదులు చెప్పిన గాంధీజీయొక్క నలుగురు భారత గుమాస్తాల కథనము రాతిగుండెలనుకూడ ద్రవింపచేయగలదు. గాంధీజీయొక్క సాధుప్రబోధము అమృతసరులో జనరల్ డయరుచే గావింప

బడిన దురంతఘాతుక సంఘట్టనల కాంగ్లేయులమైన మనలో హృదయ పరితాపమును, ఆవేదనను కలిగింప గలిగినచో మన మాతృదేశమున కతడపారసేవ చేసినవాడగును; ప్రపంచమును భయము పాలింపజాలదనియు రక్తప్రవాహముల గావించు ఖడ్గవిజయముకంటె నుత్కృష్టమగు నొకశక్తికలదనియు నతడు తిరిగి రుజువుచేసిన వాడగును. "దౌర్జన్య పిపాసులగువారి పశుబలప్రదర్శనము వలన మన యాంగ్లజాతి పేరుప్రతిష్ఠలు బుగ్గిపాలగుటను మనమెట్లు సహింపగలము? యంత్రముల యందలి విశ్వాసము, ధనకనక వస్తువాహనము లందలి మోహము, అధికార వ్యామోహము, జీవితము యొక్క యల్పమైన నికృష్టప్రయోజనముల ననాలోచితముగ నంగీకరించుట-జపతపధ్యానాది నిష్ఠలనెరుగని విజ్ఞానము; మనలను పరివేష్టించు సమస్తములోనుండు సౌందర్యమునంతను రసవిహీనమైన నిర్జీవవ్యాపారములోనికిదింపువిజ్ఞానము-పాశ్చాత్యనాగరికతలోనున్న యిట్టిమూర్ఖత్వమును గాంధీజీ తన త్రినేత్రుని నేత్రములవంటికండ్లతో పరికింపగలడు.

1922 లో చౌరీ చౌరాలో నతిలజ్జాన్వితమగు ప్రజాదౌర్జన్యము జరిగెను. గాంధీజీ వెంటనే తన శాసనోల్లంఘనోద్యమము నాపుచేసి తన్నపై కఠిన యుపవాసమును విధించుకొనెను. ఈప్రవర్తన మొక్క మహాత్మునకే చెల్లును. 'పియర్సు ప్లోమన్' అను పదునాలుగవ శతాబ్దములోని యొకచిన్న మత

రాజకీయగ్రంథములో నొకవాక్యముకలదు. అదిమన సాహిత్యములో నత్యంత రమణీయమైనదని నేనుచిరకాలము నుండి భావించుచుందును. దానిని యీనాయసమగ్రవ్యాఖ్యాంతమున జేర్చుట యెంతయు యుక్తమని నాయభిప్రాయము. "తరుశాఖాగ్రముల తేలియాడు పత్రములెరుగ సంతటి సులలితముగ 'భారరహితముగ' సున్నితముగ నిర్లేపముగ నీప్రేమమానవ రక్తమాంస రూపమును వహించెను."

---

# గాంధీజీకి జేజేలు

**ఆర్నాల్డు జ్వీగ్**

మనము యుద్ధమునుండి బ్రతికి బయట పడుటతోడనే ప్రపంచము గాలి మేడలను కట్ట నారంభించెను. రక్తపిపాస, రక్తమును త్రాగవలెననెడు యున్మాదము, దౌర్జన్యము యంతమగునని భావించితిమి. ప్రజావ్యవహారములను చక్కబెట్టుటకు ఆత్మప్రభావమున కింతకంటె యదనులేనట్లు కాన్పించెను. ప్రపంచ మెక్కువ యోగ్యతను, సహనమును, న్యాయమును. మానవత్వమును వహించునని యనుకొంటిమి. అధమమతి నాగరిక ప్రాంతమైన మధ్యయూరపు అనగా జర్మనీ, జెకోస్లోవేకియా, ఆస్ట్రియా, పోలండు దేశములలోని యనవరత క్లేశముల

కిదియే ఫలితమని యనుకొంటిమి. అట్టి యపరిమిత రక్తప్రవాహాముకు మూల్యముగ రష్యాలోవలె సంపూర్ణ సాంఘిక పరివర్తనము కలుగనిచో నథమము, దౌర్జన్యయుగముపోయి సుహృద్భావ మేర్పడుననుకొంటిమి.

ఈ సమయమున గాంధీజీ నక్షత్రము ప్రకాశింప నారంభించెను. దౌర్జన్య రాహిత్యతత్వము సాధ్యమగునని యతడు రుజువుచేసెను. మానవసంఘమును తన యుపదేశానుసారము దిద్దగలశక్తి యతనికున్నట్లు కాన్పించెను. నిజమున కతని సందేశము ప్రాచీన క్రైస్తవ సూత్రములను పురస్కరించుకొని జార్మయమైన రష్యాలో టాల్‌స్టాయి, క్రోపాట్కిను రాకుమారులదివరకు నిర్మించిన పునాదులపై నాధారపడెను. జర్మనీలోకూడ నట్టివిశ్వాసములు కలవారుండిరి. కర్టుఈస్నర్, గస్టావ్ లాండర్, కారల్ వాన్ ఒసీట్ జ్కీ, ఎరిల్ మ్యూషాం, థియొడర్ లెస్సింగ్ మొదలగువారీ పంథలోనివారే! గాంధీజీ హిందూదేశములో జయమొందినపుడు వారు జర్మనీలో విఫలులగుదురా ?

ఈ యుద్యమముయొక్క ఫలితమిపుడు మనకు తెలిసెను. మనము భక్తి పురఃసరముగ పైన పేర్కొనిన దౌర్జన్య ప్రతికక్షులైన వారందరు దౌర్జన్యమునకు గురియై నేడు స్వర్గము నలంకరించుచున్నారు. అయినను వారిని చంపిన యీహంతకులు గౌరవకీర్తుల ననుభవించుట చోద్యము! అపరిపక్వ యాధ్యాత్మికతకు వాసి గాంచినచోట నేడు దౌర్జన్యము, దౌర్జన్యారాధనసింహా

సనము నధిష్ఠించినవి. ప్రకృతిని, ప్రకృతి సిద్ధమైన విషయములను దురవగాహము చేసికొని జీవిత పోరాటమనునట్టి యొక పాశవిక భావమునే పురస్కరించుకొని 'నోరున్న వానిదే రాజ్యమ'ను శాస్త్రమును సృష్టించి నూతన ఛెంగీజ్ ఖాను 'పిరమిడు' లొక దానిపై నొకటి పేర్చబడుచున్నవి.

దౌర్జన్యారాధకుల సిద్ధాంతములు తప్పనియు, ప్రకృతిని ననుసరించిన వారి వ్యాఖ్యానము ప్రమాద భూయిష్టమనియు చూపుటకు మనమిచ్చట నాధునిక జీవశాస్త్రమును దేవురింప నక్కరలేదు. గాంధీజీ హిందూ దేశములో పుట్టి జీవించుచున్నందులకును, అతడు మధ్య యూరపియనులతో గాక నింగ్లీషు వారితోనే వ్యవహరించవలసి వచ్చినందులకును మాత్రమే నేడతనిని మన మభినందించుచున్నాము. ఏలయన నేడచ్చట పరిపాలన చేయుచున్న మృగావళి యతని మానవత్వమును మన్నింపజాలదు. మనమో! అధమము విచార కలుషితమై యనభిలషణీయమైన కృతజ్ఞతతోనైన నతనిని వీక్షింపగలము: ఇరువది వత్సరముల క్రిందట నతని నావరించిన తేజము మన నూతనయుగ ప్రభాతమని భావించితిమి; అది ప్రపంచయుద్ధముతో నంతమై దాని ననుసరించిన (మన మెన్నడును యూహింపజాలని) క్రూర యుగ సంధ్యాకాలము కాదాయని నేడు మన మాశ్చర్యచకితుల మగుచున్నాము. యూదుల ప్రవక్తలును, క్రైస్తవ మతాచార్యుడును పుట్టి సంచరించిన చోటులలో గూడ నేడు భయమే

రాజ్యపాలన చేయుచున్నది; దుర్బలులును, నిరాయుధులును మృత్యుదేవతలకు బలివేయబడుచున్నారు; పశుత్వమే యచ్చటి రాజనీతిశాస్త్రము; నేడు చీనా స్పెయిను దేశములలో 'గొప్ప ప్రభుత్వము' లని చెప్పబడువానిచే సహింపబడుచున్న నిరపరాధ ప్రజాహననకాండయే మధ్యధరా సముద్రదేశములకును సంభవింపనున్నదని చెప్పవచ్చును. బహుశః అబిసీనియాలోని యిటాలియను వైమానికుల నావహించిన బాంబుమోతల కేవలానందమే పదునెనిమిది, పందొమ్మిది శతాబ్దములలో సృష్టింపబడి యూరపులో నొక వెలుగు వెలిగిన నాగరికత నంతను యావహించినట్లు కాన్పించును. మనకు తెలియదు. కాని మన బలమునంతను మాటలలోనే ప్రదర్శించు మనము, దౌర్జన్యము నవలంబింప నక్కరలేకుండ జీవితములను గడపిన మనము, సముద్రతరంగములమీదుగ మహాత్మునకు మన యభివందనముల నర్పించుచు మన ప్రమాదములను ధృవపరచినందులకును తనమూర్తి ద్వారమునను, తన జీవితము ద్వారమునను మన యుగమును పరిపూర్ణత నొందించినందుల కతనికి జోహారు లర్పించుచున్నాము. మన ప్రమాదములు ! ఇరువదియవ శతాబ్దపు యూరపు అట్టి పరమపవిత్ర సిద్ధాంతముల ననుకరింప సమర్థమైనట్లు, హిందూదేశము సృష్టించినట్టి మహావ్యక్తుల నుత్పన్నముచేయగలట్లు ! ప్రపంచ చరిత్రను గమనించినయెడల డిక్టేటరులయొక్కయు వారి దుండగీడు సేనాపతుల

యొక్కయు, వారికి దాసానుదాసులగు బానిస సైన్యము యొక్కయు విజయ సందేశముల ననుసరించుటకంటె నాగరికత యొక్క ప్రమాదముల ననుసరించుటయే మేలు. కాని సప్తసతి వర్షప్రాయుడైన గాంధీజీ మానవజాతి యుత్పన్నముచేసిన నుత్తమోత్తమ సైన్యముచేతనే మనగలుగుచున్నట్లు భావించు చున్నాడు. అతడు తన జీవితములో ప్రారంభముచేసిన దానిని పూరింప విసువు చెందడు. ఇక మా భవిష్యత్వము విషయమై యతడు శంకింప నవసరములేదు.





# ప[illegible]లారు గ్రంథమండలి, తణుకు.

రాజపోషకులు:

శ్రీ శ్రీ వి[illegible]దేవవర్మ మహారాజులుంగారు, జయపూరు.

,, చింతలపాటి బాపిరాజుగారు, నిండ్రకొలను.

,, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, మద్రాసు.

,, నడింపల్లి సుబ్బరాజుగారు, కోడూరుపాడు.

,, యర్రమిల్లి నారాయణమూర్తిగారు, నర్సాపురం.

పోషకులు:

,, బెజవాడ రామచంద్రారెడ్డిగారు, బుచ్చిరెడ్డిపాలెం.

,, దేవులపల్లి సోమయ్యగారు, ఆకిరిపల్లి.

,, అద్దేపల్లి సత్యనారాయణమూర్తిగారు, పాలకొల్లు.

,, జవ్వాది లక్ష్మయ్యగారు, పెనుగొండ.

,, [illegible]ట్టుముక్కల సుబ్బరాజుగారు, మంచిలి.

,, నడింపల్లి రాజంరాజుగారు, శేలంగి.

,, భూపతిరాజు సుబ్బరాజుగారు, వేండ్ర.

,, వడ్డి వెంకటస్వామిగారు, దొడ్డిపట్ల.

,, చాడ నారాయణమూర్తిగారు, తొండంగి.

,, చాడ మంగయ్య సోదరులు, తొండంగి.

,, తుమ్మలపల్లి వీరభద్రరావుగారు, పిప్పర.

,, డాక్టరు తేతలి సత్యనారాయణగారు, తాడేపల్లిగూడెం.

,, కళ్ళ చిట్టిఅబ్బాయినాయుడుగారు, పూళ్ళ.

,, వాజపేయాజుల వెంకటేశ్వర్లుగారు, రాజమండ్రి.

# పల్లెటూరు గ్రంథమండలి.

## తణుకు, పశ్చిమ గోదావరి



| | |
|---|---|
| గాంధీజీ సూక్తులు. | 0—3—[illegible] |
| రామతీర్థస్వామి బ్రహ్మజ్ఞానోద్బోధనలు Vol I & II. | 1—0—0 |
| మహారాణి ఝాన్సీలక్ష్మిభాయి. | 0—10—0 |
| మానవధర్మములు. | 0—6—0 |
| జాతీయ ఋణములు. | 0—6—0 |
| జవహర్లాలు ఆత్మకథ. | 3—0—0 |
| బార్డోలీ విజయము. | 1—0—0 |
| ఆర్యుల ఆదర్శము. | 0—[illegible]—0 |
| భారతస్వాతంత్ర్య యుద్ధము. | 0—6—0 |
| గాంధీజీ డెబ్బదియవ జన్మదిన ప్రచురణము | 2—0—0 |

 వర్తకులకు కమీషను యివ్వబడును.

తణుకు రాయల ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.